

# నాటికలు

## పాత్రలు

రైతు పల్లెటూరి ఆసామి
అతని భార్య
అతని కొడుకు
అతనికూతురు

కోమటి
షావుకారు
వెట్టివాడు

## స్థలం

రైతు ఇంటి చావిడి

## కాలం

వర్తమానం



# పైపంట

ఎదురుగావున్న పడమటింటి ద్వారంపక్కగా కూర్చున్న రైతు భార్య – వయస్సు 35 ప్రాంతం – బియ్యపు చేట ముందు పెట్టుకుని, బెడ్డల్ని ఏరివేస్తూ వుంటుంది.

కుడివైపునున్న సింహద్వారం దగ్గరిగా కూర్చుని రైతు కొడుకు – ఈడు పద్ధెనిమిదో, పంధొమ్మిదో – గోగునారతో ఎడ్ల తలతాడు పేనుతూ వుంటాడు.

గుడ్డల దండెంతో, మంచాలతో, గడంచితో, బుట్టలు, తట్టలు, నార, తాళ్లు మొదలైన వాటితో చావిడి చిక్కురొక్కురుగా వుంటుంది. రైతు – ఇంచుమించు నలభై సంవత్సరాల వయస్సు – మట్టకొల్చుకుంటూ, తలవాకిలిగుండా వస్తాడు. నీర్కావి ధోవతి, నీర్కావి ఉత్తరీయం, చొక్కాగాని, బనియనుగాని లేదు. చంకలో కోలుపుకర్ర, కాళ్ళకు కిర్రు చెప్పులు.

తండ్రి ఈ వేషానికి కొడుకు వేషం భిన్నం. అతడివి నీర్కావి బట్టలు కావు. వొట్టి వొంటితో లేడు; ఒక ఆఘారం వేసుకున్నాడు. ఇక, రైతుభార్య పాతచీరకట్టుకున్నది. ముక్కున పుడకలు, ముఖాన కుంకుమబొట్టు, మెడలో మంగళసూత్రం ఇవే ఆమె ఆభరణాలు.

కొడుకు. [తండ్రి ప్రవేశించినంతనే]. ధర మిచ్చేశావటేం ?

రైతు. ఆఁ.

[ఒక మంచం వాల్చుకు కూర్చుంటాడు.

కొడుకు, ఏకాడికి ?

రైతు. కానిదక్కువ పదణాలు.

కొడుకు. మరీ అంత తక్కువ కెందు కొదిలేశావేం అయ్యా ? పేటలో పన్నెండణాల పైచిలుకు పడుతున్నదట.

భార్య. మనకి మంచీ సెబ్బరా లేదుగా ! వాళ్లు ఏకాడి కడిగితే ఆకాడికి పారబోసి రావడమే !

రైతు. చాల్లే, అఘోరించావ్ ! ఎక్కడా అప్పైనా పుట్టకపోతే, నన్నేం చెయ్యమంటావ్ ?

భార్య. పేటకు తోలుకుపోయి అమ్ముకురాగూడదూ ?

రైతు. అమ్ముకొచ్చేదాకా మునసబు ఆగొద్దూ ? ఈ పూట కిస్తీ కట్టకపోతే, గొడ్లని జప్తుచేయిస్తాట్ట.

కొడుకు. రెండు కిస్తీలు కట్టనే కట్టాంగా. అయ్యా ! మరొకటేగా బకాయి ?

తండ్రి. ఏమైనా మరి ఆగడటరా ! తెస్తావా, ఛస్తావా అవి ఎట్టాళ్లవి ఉరికిస్తున్నాడు. సందేశకి జమాబందీ పూర్తికావాలట.

భార్య. అయితే, శిస్తుకు సరిపడ రెండు, మూడు బస్తా లమ్మి మిగతావి అట్టే పెట్టక పోయావూ ?

రైతు. రెండు, మూడు బస్తాలకోసం, నీ యింటి కెవరొచ్చి కాటా కడతాడు ? పైగా, మన మమ్మే పుట్ల కిన్నిమాట్లు బేరాలుకూడానా ?

భార్య. సరే, నీ యిష్టమొచ్చినట్టు చేసుకో - నాకు దేనికి ?

వెట్టివాడు [బయటినుంచి]. దొరోయ్. మునసబుగారు కూకేసుకు రమ్మన్నాడు.

రైతు. ఉఁ. వొస్తున్నా. నువ్వు పోరా!

వెట్టివాడు. నిలుచున్నపాళాన రమ్మన్నాడు. మరి ఊరుకోడాని కీల్లేదట.

కొడుకు. ఊరుకోకపోతే, ఉరెట్టుకోమను.

భార్య. ఆరి వీడి జిమ్మడ, కొంపమీదికి యములాళ్ళని తగిలి నట్టు తగులుతున్నాడు.

రైతు. పదరా, పద! నీ యెనకాలే వొస్తున్నానని చెప్పు.

వెట్టివాడు [వెళ్ళిపోతూ]. ఆ అయ్య నన్ను కోంపడతాడు, వేగిరా, దొరోయ్!

కొడుకు. ఈ మునసబు కరణాలు ఏం సవారిచేసినా, మనంటి పేదా బిక్కీమీదే. అదే మోతుబరు ఆసాముల నైతే, ఇట్టా దూకుడుచేస్తాడూ ?

భార్య. వాళ్ళదగ్గిర వీళ్ళ అంకిలి నొక్కుకు పోతుంది. నిరుడు మానానికి నిరుడుకూడా, వీళ్ల పీకమీద కూర్చుండబట్టేగా అయినకాడికి తెగనమ్ముకున్నాం. తీరా మనం అమ్ముకున్న నెలకి బస్తాకి రూపాయి పెరిగింది.

కొడుకు. ఒక్కరూపాయి ఖర్మమేమిటేఁ అమ్మా ? కార్తీకమాన మొచ్చేసరి కింకా ధర పలికింది కాదటే!

రైతు. ఇంతకి మన కమిషన్‌దారు బాగుపడే గీతుంది. నిరుడు నిల్వ దోసిన మూడువేల బస్తామీద అయి దారువేలు కళ్ళ జూచాడు. అందుకని, ఈ యేడు మరీ తెగబడి కొంటున్నాడు.

భార్య. ఎన్ని వేలు పోసుకోండే వాడిపెళ్లాం మెడ నిండుగుండా అన్ని నగలు చేయించి పెట్టుకుంటే ?

కొడుకు. వాణ్ణి చూసి, మన షావుకారు కూడా వడ్లబేరం ప్రారంభించాడే, అయ్యా !

రైతు. బానేసురా ! ఇందాక మనకి కబురెట్టాడు. వాడి లెక్కైతే అసలే అంతులేదు, తొమ్మిదడ్లకాడికి తనకి కొలవాలట.

కొడుకు. వాడి పుణ్యమాయిరి ! పనిమిదడ్లకాడికే అడిగాడుకాదు.

భార్య. ఆరి వాడి పిరుసు పగల ! పోసుకుంటున్న వడ్లు చాలవు కాబోలు ! ఒక మేడకు మరొక మేడ కట్టాలని చూస్తున్నట్టున్నాడు.

రైతు. పర్లేరా, అబ్బాయ్ ! నాకు కాస్త బద్ధకంగా వుందిగాని నువ్వెళ్ళి కిస్తీ కట్టిరారా ! [బొడ్డునుంచి డబ్బులీస్తూ] 'ఒక యాభై పద్దరా' అని కమిషన్‌దారు నడిగితే, 'లేవే' అని, ఒక యిరవై మాత్రం బయానాగా యిచ్చాడు. ఇది కిస్తీకే సరిపోతుంది.

కొడుకు. [తండ్రి అందించిన పైకాన్ని తీసుకుంటూ] ఇంకా ఎంత కట్టాలేమేఁ, అయ్యా ?

రైతు. పదిహేను రూపాయల చిల్లరటరా !

కొడుకు. ఇంకా అంత దేనికేఁ ?

తండ్రి. ఏవో సెస్సులట; జమాబందీ మామూళ్ళట.

భార్య. వాళ్ళ పాడె, వాళ్ల పిండాకూడు !

కొడుకు. మనకేం సాయితా చేస్తున్నారేమిటి ? మనం మామూళ్ళివ్వడానికి.

రైతు. సర్కారు ముడుపైనా తప్పుతుందేమో గాని, మామూళ్ళ ముడుపు తప్పుతుందట్రా? పల్లపీధివాళ్లు మా మూళ్లివ్వ లేదనేగా, మునసబు కరణా లేకమై చురక తగిలించారు? వాళ్ళ చేతి కడ్డేమిటి? వాళ్ళది వాళ్ళకి ముట్టజెప్పకపోతే, గండి సాగో, గిండిసాగో అని పరపర రాసేస్తారు.

భార్య. ఆ మునసబు కేమి పోయేకాలమోగాని, మొన్న వుత్తి పున్యానికి సుబ్బమ్మత్త గేదల్ని బందెలదొడ్డికి తోలించాడు.

కొడుకు. ఎవరైనా మన మొంగిన కొద్దీ, మరీ వొంగదీస్తారు. మామూళ్ళూ గీమూళ్ళూ మన మివ్వొద్దే, అయ్యా!

రైతు. వాళ్లతో మన మెక్కడ గెలవగలంరా? మన కెందు కొచ్చినపేచీలు గాని, ఆ మామూలేదో తగలేశేరా.

భార్య. చేశే రా - వాళ్ల దెవసమేమో చేశే రా!

రైతు [దణ్ణెంపైనుంచి పైపంచె తీసుకుని, మునసబు కచ్చేరీకి బయల్దేరిన కొడుకుతో]. వొస్తూ, కోమటింటి కెళ్లి, ఒక కానీ పుగాకు తేరా, అబ్బాయ్! కాస్త చూసి తే, బొత్తిగా నాసిరక మిస్తున్నాడు. నిలిచి కాలడమే లేదు.

కొడుకు. సరే నయ్యా.

[వెళ్లి పోతాడు.

భార్య. పొద్దున్నేగా ఒక కానీది తెచ్చావ్! మళ్లీ అప్పుడే కావాలీ? మన పుగాక్కి చాలడంలేదు ఎంత డబ్బైనా!

రైతు. నువ్వెప్పుడూ నా పుగాక్కి పడి ఏడుస్తూనే వుంటావ్. ఇవ్వాళ కొత్తేమున్నది లే?

భార్య. సర్లే. ఏది ఎలా తగలబడితే నాకుదేనికిగాని, నా కట్టుకోకలు చిరిగిపోయాయి. ఒక జత కొనకపోతే, ఇఖ జరగదు.

కూతురు [పడమటింటిలోనుంచి వస్తూ] బియ్యం పెడదం కానే లేదటేఁ అమ్మా?

భార్య. ఆఁ, వొస్తున్నా.

కూతురు [చావడిలోకి వచ్చి]. ఎసరు కాగిపోతోందేఁ అమ్మా!

భార్య. నామాట చెవి నట్టించుకున్నావా? ఇఖ అరువు పెట్టుకుందామన్నా, ఆగేలా లేవు. ఒక జత కోకలు...

రైతు. చెము డింకా రాలేదు.

భార్య. సరే, తేబోకు. మసిపూసుకు తిరుగుతాలే.

[బియ్యపు చేట పుచ్చుకు విసురుగా లేచి వెళ్ళిపోతుంది.

కూతురు. అయ్యా!

రైతు. ఏమమ్మా?

కూతురు. నిరుడు నువ్వు....

రైతు. ఆఁ, నిరుడు నేను....

కూతురు. నీకు గ్యాపకం లేదటే?

రైతు [చిరునవ్వు నవ్వుతూ]. ఏమి టది?

కూతురు. పైపంట నాటికి నల్లబూసల గొలుసు చేయించిపెడతా ననలేదటే?

రైతు. అయితే, ఇప్పుడు చేయించమంటా వన్నమాట.

కూతురు. నువ్వే అన్నావుగా, అమ్మాఁ?— పైపంట నాటికి చేయించి పెడతానని.

రైతు [నవ్వుతూ]. మరి అన్నాక తప్పుతుందీ? అలాగే చేయిస్తాలే.

కూతురు. వెంకట్రావమ్మపిన్నిగారి కోడలు చేయించుకుంది నానా వుందే, అయ్యాఁ! మోస్తరు తెమ్మంటావా?

రైతు. తెద్దువుగాని లేం. తొందరేమిటి?

కూతురు. అన లొకసారి చూడవే, ఎలావుందో? నవర్సు మీద అయిదు చిన్నాలు పడిందట. కమలాచారి చేశాడు. మనం కూడా ఆ కంసాలిబత్తుడికే యిద్దామే. అయ్యా! నేను వెంకట్రావమ్మ పిన్నిగారింటి కెళ్లి రానటే?

రైతు. మంచిదమ్మా.

[కూతురు వెళ్ళబోతూ వుంటే భార్య వస్తుంది.

భార్య. ఇప్పుడు వాళ్లింటికి దేనికే?

కూతురు. మోస్తరికి వాళ్ల కోడలు నల్లబూసల గొలుసు తెస్తానే. మా అయ్య నాకు చేయించి పెడతానంటున్నాడు.

[వెడుతుంది.

భార్య. ఆ చేయించుకునేది నిరుడు చేయించుకున్నా బాగుండేది. నిరుడు బంగారం ఇంత మండిపోవడంలేదు. సరిగాని నా కోకలు

రైతు. చెప్పినమాటే ఎన్నిసార్లు చెప్తావ్? తెస్తాలే, తెస్తా.

భార్య. ఆ నాయుడమ్మకొట్లోవి నా కొద్దు. అవి మూడు రోజులైనా నిలవడం లేదు. పోసుకునే డబ్బూ పోసుకుని, వార్ని వలలాంటి గుడ్డల్ని అంటగడుతున్నాడు. వేరే ఎక్కడైనా కొనుక్కురా.

రైతు వేరే కొనడానికి డబ్బేదీ?

భార్య. అంతేలే! నాకాడి కొచ్చేసరికి నీకు డబ్బే వుండదు.

రైతు. అది కాదే! సర్దవలసిన బాకీలన్నీ సర్దాక, మరేం మిగుల్తుంది? ఆ నాయుడమ్మ కిప్పుడు అమాంబాపతు ముప్పై

దావా యివ్వాలి. ఆ బాకీ తీర్చి మళ్లీ వాడి దగ్గిరే చెప్పిస్తుంటే పైపంటదావా అగుతాడు.

భార్య. దొరికాడులే, మన కొత్త నాయుడమ్మ, ఎక్కడలేని ధర లేసుకుని కొట్టుచీకుల గుడ్డ లంటగట్టడానికి. వాడి దిమ్మరద! మరి, వాడి కెలా దక్కుతుందో, ఏమో ?

కోమటి [ప్రవేశిస్తూ]. ఎవర్ని పిన్నీ, శాపనార్థాలు పెడుతున్నావ్ ?

భార్య. ఆఁ, ఎవర్నీ లేదు. ఎవర్ని అంటే ఏమి చూసుకుంటాను ?

కోమటి [రైతుతో] ఎక్కడి బాకీ లక్కడ నిలిచిపోయాయే, బాబాయ్! మూడు రోజుల్నుంచీ ఎక్కే గడప, దిగే గడపే గాని - రాసురాలు - ఎక్కడ ఏగాణైనా వసూలైతే ఒట్టు. ఊరుమీద అమాంబాపతు రెండు వేలెట్టి - నా మొఖం - నే నిఖ యాపారం సేసినట్టే!

రైతు. ఆఁ, రెండు మూడు వేలు నీ కొక లెఖ్ఖా ? పత్రమా ?

కోమటి. నా యింట్లో సొమ్మంతే. బాబాయ్! ఎప్పటి కప్పుడు ఫిరాయింపు సెయ్యందే అక్కడ నా మొగు డూరుకుంటా డంటే ? మొన్న సరుకేసు కొద్దా మనెళ్లితే, నానా మాట లన్నాడు. ను వ్విప్పు డిస్తే, ఊరికే యిచ్చినట్టు. లెక్కేమైనా యిస్తావటే బాబాయ్ ?

రైతు. పెద్దపెద్ద పద్దులు వసూల్చేసినా, చేసి నందం. ముందు వాటిని. .

కోమటి. బాబ్బాబు, నువ్వలా అంటే కాదు. చిల్లర కావాలచ్చి మన్నారు. కొంత కాకపోతే, కొంతైనా వసూల్చేసి సరుకేసుకు

రాకపోతే, యాపారం బొబ్బుంటుంది. కొట్లో - రామ రామ - ఉప్పుంటే చింతపండు లేదు; చింతపండుంటే ఉప్పు లేదు. ఏ వొట్టుపెడితే ఆ వొట్టు. చెయ్యిరగ గొట్టుకున్నట్టుగావుందంటే నమ్మ.

భార్య. ఇంతకీ ఎం తివ్వా లేమిటి ?

కోమటి [పద్దుపుస్తకం చూస్తూ]. ఆఁ: వెరసి ఇరవైమూడు రూపాయల పన్నెండణాల కానీ అయిందే, పిన్నీ.

భార్య. అంత యెచ్చు మేమి మందబెట్టుకున్నాం ?

రైతు. నెల రోజులనా దొకసారి లెఖ్ఖ జూస్తే, పదిహేనేగా యివ్వదేలాం ?

కోమటి. నేనగాప్ వేస్తున్నానటే, బాబాయ్ ? పద్దు పుస్తకం తేనే తెచ్చాగా. కావాలంటే, నువ్వే బేరీ చేసి చూసుకో.

రైతు. నాకు చదువొస్తే, కానీకి మరొక కానీ నువ్వెలా రాసు కుంటావులే !

కోమటి. ఆరి నీయిల్లు బంగారంగాను ! ఎంతమాటన్నావేఁ బాబాయ్. ఆవకాయ పట్టుకోడాని కని మొన్నేగాదటే, మా పిన్ని రెండు వీసెల మంచినూనె, వీసెడు మిరపగాయలు వగైరా తెప్పించు కుంది? వీసె రెండుంబావలా చొప్పున రెండు వీసెల మంచి నూనె....

రైతు. రెండుం బావలా వేసుకున్నావ్? పేటలో రెండు రూపా యలకాడి కిస్తుంటే !

కోమటి. ఆఁ, అక్కడైనా, రెండుం బేడా అమ్ముతున్నారే, బాబాయ్.

భార్య. మరి ఆకాడికే మా కెందు చెప్పేవా!

కోమటి. ఆకాడి కిస్తే నాకెలా గిడుతుందే పిన్నీ? కిరాయిలు పెట్టాలయ్యె; పన్నీలు కట్టాలయ్యె. పాటా గీటా పోటుంచాలె. నాకు పీసె కొంక రానీ. అద్దరా మిగిస్తే, అక్కడి కవి పెద్దలాభాలే!

భార్య. పోసుకో! ఇంకా పోసుకో!

కోమటి. ఆఁ, ఆ మాటేమున్నదే పిన్నీ! ఏనాటియ్యాల జమా ఖర్చు రాస్తితే పెట్టి మిగుల్తాది. ఏదైనా రైతు రైతే. మంట్లో మానెడు, ఇంట్లో పుట్టెడు.

కోమటి [రైతుతో]. ఏం, బాబాయ్, మరినన్ను పంపించమంటే?

రైతు. ఇంతకు ముందే ఆ గింజలేవో చేసి ఇచ్చాచ్చా! లేపో, మాపోగాని పైకం చేతి కందదు. అందగానే, పపో, పపో జమ కడతాలే.

కోమటి. బాబ్బాబు! దీన్లో మళ్లీ కాస్త బకాయి పెట్టాను. బాకీ చుక్తా చేసెయ్. కావాలంటే మళ్లీ వాడుకోవచ్చు. నీకు ఎప్పుడైనా నేను అడ్డుచెప్పానటే, బాబాయ్?

రైతు. మంచో, చెడ్డో, ఆ యిప్పైమూడు రూపాయలిస్తా గాని, బాకీకి శ్రీరామ చుట్టు.

కోమటి. నాకైనా కాస్త గుటక దిగొద్దటే, బాబాయ్? ఆ పైచిల్లర డబ్బులే నాకు మిగిలేది.

రైతు. అయితే, దమ్మిడీలతోసహా గోళ్లూడగొట్టి పుచ్చుకుంటా నంటావ్!

కోమటి. నీ మా టెందుకు కాదనాలిగాని, ఆ పైకానీ తోసెయ్యవే, బాబాయ్.

భార్య [కోమటితో]. ఉఁ! మహాలావ్ చేశావులే ఎలాగైతేనేం మాకొక ముష్టికానీ రాయితీ! [రైతుతో] లెక్కాడొక్కా తిన్నగా చూపించి మరీయివ్వు! ఎంతంటే అంతా యిస్తాననక! మరి నే పోవాలి, వణ్ణమేమైపోయిందో.

కోమటి. కావాలంటే, నీ యిష్టమొచ్చినవాళ్ళచేత పద్దు చూపించుకునే యివ్వవే, బాబాయ్! ఇందులో తవా చేమున్నది? మరి నన్ను వెళ్ళి రమ్మంటావా?

రైతు. ఊఁ.

కోమటి [వెళ్ళిపోతూ]. నామాట మర్చిపోబోకేఁ, బాబాయ్! పోనీ, నన్నే రమ్మంటే, మళ్ళీ రేపు.

రైతు. మళ్ళీ నువ్వు దేనికిలే? నేనే వొస్తా.

కోమటి. సర్లేవేఁ బాబాయ్! [తలవాకిలివైపుకు చేరేసరికి? ఎదురుగా వస్తున్న షాహుకారును చూచి] కోమటి నెదురొచ్చానయ్యా, నీకు కోటి లాభాలు.

షాహుకారు. ఆఁ! అన్ని లాభాలుగానే వున్నాయ్!

కోమటి. నీకేం తక్షువయ్యా? ఊరుమొత్తంమీద పెద్దషాహుకారువు. ఇంట్లో లచ్మి మూలుగుతున్నది. [రైతుతో] మరి నే నెళ్ళొస్తానే, బాబాయ్! మర్చిపోబోకేఁ, నామాట.

[వెళ్ళిపోతాడు.

రైతు. రావయ్యా, రా, కూర్చో.

షాహుకారు. ఆఁ! కూర్చోడానికి రాలేదులే.

రైతు. ఏఁ? ఇలా దారి తప్పొచ్చావ్?

షాహుకారు. వాడికే బేరం ఫైసల్ చేశావటగా ?

రైతు. మరి ఏం చెయ్యమంటావయ్యా? ఒక పక్కని వాడు కాని తక్కువ పదణాలకి అడుగుతున్నాడయ్యె. చూస్తూ, చూస్తూ నీకు తొమ్మిదణాలకే ఎలా పొదిరిపెట్టమంటావ్?–నువ్వే చెప్పు?

షాహుకారు. వాడు బస్తాకి 170 పౌనులు ఖచ్చితంగా తూసుకుంటాడు. ముక్కానీ పెచ్చిస్తున్నాడని నువ్వు ఎగిరి గంతేశావే గాని, నాలుగు పౌనులు ఎక్కువ తూసుకుంటాడని పొరజూసుకున్నావ్ ?

రైతు. ఏమో, ఆ మాయమర్మాలన్నీ నా కేం తెలుసు ?

షాహుకారు. సర్లే! నువ్వు ఎవరికి వేసేమిచ్చుకుంటే నాకు దేనికిగాని, నా నోటుబాకీ నాకు పూర్తిగా తీర్మానం చేసెయ్యి.

భార్య [పడమటింటిలోనుంచి వస్తూ షాహుకారుతో]. ఏం మన్నయ్యా! అంత కోపం చేసుకుంటున్నావ్?

షాహుకారు. కోపం లేదు; తాపం లేదు! నా కిప్పుడు పైకం అవసరంగా కావాలి.

రైతు. అంతా ఒఖ్ఖదఫా తెమ్మంటే, నే నెక్కడ తెస్తానయ్యా?

షాహుకారు. ఏం ? మీ కమిషన్‌దా రున్నాడుగా ?

భార్య. ఈసారికి అయిందేదో అయిపోయిందిలే, అన్నయ్యా! పైపంట నీకే తోల్తాంలే.

షాహుకారు. నాకేమీ తోలొద్దులే. నా బాకీ అసలుఫాయిదాలు నాకు పారెయ్యండి.

భార్య. మరీ అంత నిక్కచ్చి చేస్తావేమిటేం, అన్నయ్యా ?

షాహుకారు. మీరు చెయ్యలా నిక్కచ్చి బేరం ?

రైతు. అయితే, నువ్వు ముందే వొప్పుకో లేదటయ్యా, ఏటికి యాభై కాడికి చెల్లుబెట్టుకుంటానని ?

భార్య. నిరుడు, ముందటేడు పంటమున్కోగానే, అత్తార బత్తంగా నీకు దబ్బు తెచ్చివ్వలేదటేం అన్నయ్యా ? మిగతాది కూడా నింపాదిగా తీర్చుకుంటాం ! ఈ భాగ్యానికి మేము ఊ రొదిలిపెట్టి పారిపోతామటే !

షాహుకారు. [కాకగా] ఈ వాయిదాలు, గీయిదాలు నా కిఖ పనికి రావ్. నన్ను మీరు ఖాతిరీ చెయ్యనప్పుదు, నాకు మీ లావేమిటి?

రైతు. ఏం ఏ యేటి వొడ్డీ ఆ యేదే పుచ్చుకుంటున్నా నొప్పేనా ?

షాహుకారు. నీ వొడ్డీ డబ్బుల కెవ్వడు వాసిలేడు. రేపీపాటికి దస్తు తెస్తేనే తెచ్చావ్. లేకపోతే దావా పడేస్తా. తర్వాత నీ యిష్టం.

రైతు. కోర్టు కెక్కించాలని అంత ముచ్చటగా వుంటే యెక్కించ వయ్యా !

షాహుకారు. ఒక్క కోర్టుగాదు: ఏటి కేడు పధ్నాలుగు కోర్టులూ తిప్పి, నీఅంతు కనుక్కోక పోతానూ? నీకు ఏ కమిషన్ దారు అడ్డుపడతాడో చూస్తానుగా !

[విసురుగా వెళ్ళిపోతాడు. ఒక క్షణంపాటు రైతు, భార్య నిశ్చేష్టులై వుంటారు.

భార్య. ఆరి పీడిసిరి మండ ! ఎట్టాగైతేనేం పెట్టా డప్పు !

రైతు. త నడిగినకాడికి గింజలు పారబొయ్యలేదని వీడి కెంత గుర్రొచ్చింది ! ఈ రెండు మూడేళ్ళనుంచీ, వీడి కేం

పనొచ్చినా మనం హాజరుగా నిలబడ్తామనే విశ్వాసమైనా వుందేమో చూడు ?

భార్య. వాడి దెవసం చేశారులే! మొన్న మాసూలులో పాడిగొడ్డుకుడ్డా తోలికెళ్లి సప్పులు లొక్కించుకో లేదూ ? మాయదారిసొమ్ము యిరగడై పోతుంది గాని, వాడి డబ్బు వాడి మొఖాన గిరగిర తిప్పికొట్టు. ఇం కెంత తివ్వాలి ? మహా అయితే నూట యాభయ్యేగా ?

రైతు. కాదే! వాడి మదతపడ్డీలతో చేసి, రెండువందలదాకా దేకుతుంది, పంటమ్మిన దంతా వాడిమొహాన పెడితే, మిగతా చిల్లర మల్లర బాకీల మాటేమిటి ?

భార్య. ఊఁ! అంతగా అయితే, పిల్లదాని చేరిగాజులు కుదవపెట్టు కుందాంలే.

రైతు. దాని కింకొక వస్తువేదైనా ఏర్పరచడం లేకపోగా, అవి కూడా కుదవబెట్టుకుని మొండిచేయిస్తే ఎలా నిలబెడతామే ?

భార్య. ఆఁ, ఇబ్బం దొచ్చినప్పుడు మరేం చేస్తా మేమిటి ? ఇప్పుడు అడ్డం వేసుకుని, అది అత్తారింటి కెళ్ళేనాటికి వాడిపిం చివ్వొచ్చు.

రైతు. సరే, ఏదో ఒకదారి చూద్దాంలే. వాడిది తాసుపాము పగ. మొత్తంబాకీ చెల్లుబెట్టకబోతే, వాడు కోర్టు కీడవక మానడు.

కొడుకు [ప్రవేశిస్తూ]. ఏమిటయ్యా ? కోర్టేమిటి ?

భార్య. వాడి యెలుగు మంద! వా డడిగిన కాడికి గింజ లివ్వ లేదని మొత్తం నోటుబాకీ యిప్పుడే కక్కమంటున్నాడురా

రైతు. రే పీపాటి కివ్వకపోతే దావా పడేస్తాట్ట.

భార్య. మువ్వ తిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాట్ట!

కొడుకు. ఎంత హాజం!

రైతు. డబ్బునుబట్టే హాజం.

భార్య. నడమంత్రంగా ఈనా డొచ్చాయిలే వీడికి నాలుగు డబ్బులు. చెడి బతకబట్టే కిందూమీదూ కానడంలేదు.

కొడుకు. మరి ఇప్పుడేం చేస్తావే, అయ్యా?

రైతు. తల తాకట్టు పెట్టయినా వాడి బాకీ తీర్మానం చెయ్యాల్సిందేరా. కసిపట్టాడు. వా డిఖ నిలవడు.

కొడుకు. వీడ వొచుల్తుంది. వాడిది వాడికి పారెయ్యవే. మనకి ఎలాగైతే తనే రెండు, మూడొందలు అప్పెట్టాగదా అని పెద్ద పాలేరులా నన్ను పనిలో నిలబెట్టుకుంటున్నాడు. ఊడిగం చెయ్యడానికి వీడు మనకి ఉచ్చితార్ధంగా యిచ్చా దేమిటి? అంత కంత పుచ్చుకోడూ?

[కోపంకొద్దీ భుజంమీగున్న పైపంచెను విసిరి నేలకు కొడతాడు. దాని కొరగున మూట కట్టివున్న మువ్వలు గణగణ మోగుతాయి.

భార్య. మువ్వ లెక్కడివిరా?

కొడుకు. కంచర లింగయ్యొచ్చి, నడీధిలో దేరావేశాడే అమ్మా. సీతన్న కొనుక్కుంటుంటే నేనూ మన యెడ్లకని సరదా పడ్డానే. ఇఖ, ఇప్పు డేం చేస్తాం? వాప సిచ్చొస్తా.

[మువ్వల మూట అందుకుంటాడు.

రైతు. ఉంచుకోరా, అబ్బాయ్! డబ్బు పైపంటనాటి కివ్వొచ్చులే.

కొడుకు. ఆఁ! వాడికి రొఖ్ఖం కావాలటే. పైయేటికే కొనుక్కుంటాడే. ఇప్పు డొచ్చిన తొంద రేమిటి ?

[వెళ్ళబోతాడు

రైతు. శిస్తు కట్టావట్రా ?

కొడుకు. ఆఁ! మర్చేపోయా ? ఇదుగో రసీదూ, మిగతా డబ్బాను.

[రైతుకు చీటీని అందిస్తాడు.

భార్య. ఎంత కట్టుకున్నారురా ?

కొడుకు. అణా తక్కువ పదహారు.

రైతు. అంతదాకా దేకించారటరా ?

కొడుకు. 'ఆహాఁ! పట్టాకి రూపాయికొడికి ఈ యేడు బెమ్మా బందీ మామూలు వసూలు చేస్తున్నారట! తిన్నకొద్దీ వాళ్ళకీ ఆక లెక్కువౌతున్నది!

భార్య. తిననీ ? ఇంకా తిననీ! ఇలా పీక్కు తిన్నవాళ్ళు ముందుకు రారులే!

కొడుకు [కదిలి వెడుతూ]. మరి నే వెళ్ళొస్తా నమ్మా!

రైతు. ఆ కంచర లింగయ్య్య ఆగడట్రా ? పైపంటనాటికి....

కొడుకు. ఊహుఁ! వాడు నిలవడు!

[వెళ్ళిపోతాడు.

భార్య. పిచ్చి తండ్రి! మూడేళ్ళనుంచి మువ్వలు మువ్వలని ముచ్చట పడుతుంటే, ఈనాటికైనా ఒకదారి లేకపోయె! తప్పుకోవడం, పూడ్చుకోవడం—ఇదే సరిపోతున్నది.

రైతు. ఆ దేవుడు చల్లటి చూపుచూస్తే పైపంటతో మన చిక్కు లన్నీ తీరిపోతాయి లేవే!

భార్య. దేవుడికేం! వాడు చల్లటిచూపే చూస్తున్నాడు. మనుషులే పీక్కు తింటున్నారు!

రైతు. ఆఁ! మంచిరోజు ఎప్పటికైనా కనబడక పోతుందటే! అన్నట్టు, అబ్బాయి పుగాకు తేనేలేదు, మర్చిపోయాడుకామాలు.

భార్య. తేకపోతే, ఇప్పు డేమీ ముంచుకు పోలేదులే!

రైతు. నీదంతా మఱ్ఱతనం గాని, నే నడిగేది రోజుకు కానీ పుగాకే కాదటే?

భార్య. ఆ కానీ లేకేగా ఈ తిప్పలన్నీ! కానీ పెడితే ఇంత కూరో నారో రాదూ? పూట పూటా పచ్చడి మెతుకుల ఖర్మం దేనికి?

రైతు. సర్లే! రేపటినుంచీ మానేస్తాను లేవే!

భార్య. మానాలని నీకు లేనప్పుడు నాకోసం మానెయ్యడం దేనికిలే!

రైతు. అదేమైనాగాని, ఇఖ చుట్ట ముట్టనుగా!

భార్య [చిరునవ్వుతో]. ఆఁ! ఈ మురిపె మెన్ని రోజులులే! కూడైనా లేకపోతే నువ్వుంటావు గాని, చుట్టముక్క లేకపోతే....

కూతురు [నల్లపూసలగొలుసుతో హుటాహుటిగా ప్రవేశిస్తూ]. చూడవేం! అయ్యా! ఎంత నదరుగా వుందో!

రైతు. ఔనమ్మా! బాగానే వుంది.

కూతురు. ఈ బిళ్ళ చూడవే! కొట్టొస్తున్నట్టుగా లేదూ?

రైతు. ఔనమ్మా!

కూతురు. అయితే, నాకు తెల్లరాళ్ళొద్దు: ఎఱ్ఱ రాళ్లు కావాలి.

భార్య. ఏ రాళ్లైనా, ఇప్పుడు వచ్చేదమ్మా?

కూతురు. ఊఁ! నువ్వు చెప్పొచ్చావ్‌లే మాటావ్. నాకు గొలుసొద్దుగాని నీకు కోకలు కావాలేఁ?

భార్య. ఈ యేటికి నా కేమి కోకలు కావాలా! ఆ పాడుగుడ్డలే గతి.

రైతు [కూతురితో]. ఇంత వెఱ్ఱిదానివలె వున్నావేమమ్మా! నీకు లేకుండా మీ అమ్మ తనకే కావాలంటుందా! నామాట విను. పైపంటనాటికి....

కూతురు. అయితే, ఇందాక నే నడిగితే....

రైతు. కాను! ఈ పంటలోనే చేయిస్తా నన్నాగాని, షావుకారు తొందరచేస్తున్నాడు—వాడి బాకీ నిలవదాని కీల్లేదట.

భార్య. అది తీర్చినా ఇంకా లేవా తలమోపి దప్పులు?

కూతురు [రైతుతో]. అయితే, నాకు ఆశ ఎందుకు పెట్టా వేమిటి?

రైతు. నాకుమాత్ర మేం తెలుసునమ్మా. వా డిప్పుడు గొంతు మీద కూర్చుంటాడని? మా తల్లివి కామా? నామాట విను! తప్పకుండా పైపంటలో నీకు....

కూతురు. నా కే మొద్దులే!

భార్య. దారి లేనప్పుడు మరి ఆయనమాత్ర మేం చేస్తాడేఁ?

కూతురు. వాళ్ళంద రిప్పుడు నన్ను నవ్వుతారు. గొలుసు చేయించుకుంటున్నా నని—సిగ్గుచేటు—మోస్తరుకూడా తెచ్చా.

రైతు. లేదమ్మా! సత్తె ప్రమాణంగా నీకు పైపంటలో....

కూతురు. ఆఁ! అన్నీ చేయిస్తావులే. నిరుడు మానానికి నిరుడిలాగే అనలా ?

[కోపంగా చర చర పడమటింటిలోకి వెళ్ళిపోతుంది.

రైతు. పిచ్చిసన్నాసి! గంపెడాస పెట్టుకున్నదేమో చెడ కోవమొచ్చింది. ఏమైనాగాని పైపంటనాటికి దానిముద్దు తీర్చాలి.

భార్య [నిట్టూరుస్తూ]. పైపంట పైపంట ..పైపంట.... ఎక్కడి పైపంట ? కళ్ళన్నీ దానిమీద పెట్టుకోవడమే **గాని**, అది నోటిదాకా వొస్తేనా ? కాకులు, గద్దలు తన్నుకుపోయినట్టు చేతిలోదాన్ని చేతిలోనుంచే తన్నుకుపోతారయ్యో ! పండించేవరకే పంట మనది.

రైతు. ఏమైనా, లేదనుకోగూడదే ! రోగంరొష్టూ లేకుండా రెక్కాడుతూ వుంటే, బండిని ఎట్టాగో దొర్లించుకు పోలేక పోతామూ ?

[రైతు ఈమాటలు అంటుండగా "(రెండు)కైనా వుంచి నావూ (బం)ధి ఖా నా లో" అని పాడుకుంటూ తలవాకిలిలోకి ఒక హరిదాసు బిచ్చానికి వస్తాడు.

భార్య. చెయ్యి ఊరికేలేదు. పో! పో!

రైతు. దేహీ అంటూ వాకిట్లో కొచ్చినవాడిని కసిరికొట్టగూడదే ! ఏదీ ! లే ! బద్ధకించబోకు. నాలుగు గింజ లేసిరా !

భార్య. వాడి కేం తీపరం ? మొద్దులావున్నాడు. కూలీనాలీ చేసుకోలేడూ ? అడుక్కోవడం దేనికి ?

రైతు. వాడి ఖర్మ పది. దానికి మనమేం చేస్తాంగాని, గుప్పెడు బియ్యంపెట్టి పంపించు.

భార్య. డబ్బాసోలెను పేడ కమ్ముతున్నారు. వచ్చినవాళ్ళకల్లా గుప్పెడుకాడికి పెడితే, రోజుకు మానెడైనా చాలవ్.

రైతు. నోటితో లేదనడం దేనికి?—చేత్తో లేదను. ఈ కాస్తకే మనకు దరిద్రం రాదులే; పొట్టకు ఉన్నది మిగలదు; నలుగురికి పెట్టిందే మిగిలేది. నామాట విను, లే; [హరిదాసుతో] ఆగవోయ్; ఆగు; వొస్తున్నారు.

[ఒక మూలుగు మూలిగి భార్య లేస్తుండగా

— తెర]



## పాత్రలు

| | |
|---|---|
| లక్ష్మయ్య : | పల్లెటూరి రైతు |
| మాణిక్యమ్మ : | అతని భార్య |
| కృష్ణమూర్తి : | అతని కుమారుడు |
| కమల : | అతని కుమార్తె |
| డాక్టర్ | |
| బండివాడు | |

## స్థలం

లక్ష్మయ్యగారి యింటిదావిడి

## కాలం

వర్తమానం



# ప్రారబ్ధం

లక్ష్మయ్య యింటిచావిడి. కుడివైపున సింహద్వారం; ఎడమవైపున దొడ్డిగుమ్మం. ఎదుటిగోడమధ్యలో ఒక అలమర. దానికి కుడిపక్కని పడమటింటికి ద్వారం; ఎడమపక్క పడమటింటిలోకి ద్వారం.

గోడలకు శ్రీరాముడు, గోపాలకృష్ణుడు, తిరుపతి వెంకటేశ్వర్లు, లంకాదహనం మొదలైన పటాలు. ఒక పటంపైన దాని మేకుకే తగిలించి ఒక విసనకర్ర వేలాడుతూ వుంటుంది.

చావిడిలో ఒక మూల గడంచి; దానిమీద తవుడు, ఊలవల బస్తాలు.

తెరలేచేసరికి లక్ష్మయ్య చావిడిమధ్య కూర్చుని వుంటాడు. అతని వయస్సు నలభైఅయిదు పైన, యాభై లోపు. అయిదడుగుల రెండంగుళాల యెత్తు. స్థూలకాయుడు కాదుగాని, పొట్టినిబట్టి గుమ్మటంలా కనబడతాడు. చిన్న బొర్ర. జులపాలజుట్టు; వెనకముడి. క్షురకర్మకు శుభముహూర్తం ఒకపట్టాన కుదరదు గనక, సామాన్యంగా మాసిన గడ్డంతోనే వుంటాడు. నీర్కావి ధోవతికట్టి, పైన తడి అంగవస్త్రం వేసుకుని వుంటాడు.

తెర లేచేసరికి అతడు పంగనామాలు పెట్టుకోవడం పూర్తిచేస్తూ వుంటాడు. అతనిముందు బొట్టుపెట్టె; నీళ్లచెంబు. బొట్టుపెట్టెచుట్టూ అద్దం, నామకడ్డి, తిరుచూర్ణంకాయ, బొట్టుకనికి వగైరా.

లక్ష్మయ్య [కళ్లుమూసుకుని చేతుల్ని జోడించి]. పరమాత్మా! పరమపావనా! పరమకల్యాణ గుణాభరణా! పాపహరణా! పుండరీకవరదా! భక్తవత్సలా! భవబంధవిమోచనా! పుండరీకనయనా! భుజగేంద్రశయనా! కరుణాకరా! కామితార్థప్రదా! నందకుమారా! నవనీతచోరా! ఇందిరారమణా! ఇభరాజగమనా! సుందరాకారా! మందరోద్ధారా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆదిమధ్యాంతరహితా! అప్రమేయా! ఆనందరూపా! అనాథరక్షకా! కవిలోకరంజనా! కాళింగగర్వభంజనా! సదానందా! సచ్చిదానందా! ముకుందా! గోవిందా! గజరాజవరదా! గరుడధ్వజా! దానవమర్దనా! జనార్దనా! ధర్మవర్ధనా! దీనజనశరణ్యా!

[మాణిక్యమ్మ గదిగుమ్మంలోకి వస్తుంది. ఆమె వయస్సు నలభైప్రాంతాల. అన్నపూర్ణ [illegible] ఇల్లాలు. కష్టమొచ్చినా, సుఖమొచ్చినా [illegible].

మహాలక్ష్మమ్మ [గదిగుమ్మంలో నుంచి]. ఇంకా మీ జపతపాలు కానేలేదండీ?

లక్ష్మయ్య [వినిపించుకోకుండా]. గోవర్ధనోద్ధారణా! గోపికావస్త్రాపహరణా! మునిజనవందితా! ముచికుందవందితా! ముక్తిప్రదాయకా! మురళీగానవినోదా! కనకమయవసనా! కంసవిధ్వంసనా! రాధామనోహరా! రాకేందువదనా! నీలమేఘశ్యామా! నిర్మలనామా!

మాణిక్యమ్మ [గదిగుమ్మంలో నుంచే]. మీకు పుణ్యముంటుంది! ఇవ్వాళైనా కాస్త తొరగా తెముల్దురూ!

లక్ష్మయ్య [బిగ్గరిగా]. సర్వేశ్వరా! సర్వతోముఖా! సర్వలోక పూజితా! సత్యసంకల్పా! సత్యపరాయణా! సత్యజనకా! సత్యనిలయా! సత్యాశ్రయా! సత్యనేత్రా! సత్యసంధా! సుజన ప్రియా! శాంతస్వభావా!

మాణిక్యమ్మ [గుమ్మందాటివచ్చి]. ఏమండీ! మిమ్మల్నే!

లక్ష్మయ్య. [మరింత బిగ్గరిగా] అర్జునసఖా! అభిమానరహితా! పాండవపక్షా! ద్రౌపదీ మానసంరక్షకా! దేవకీనందనా! యశోదా నందవర్ధనా! అనంతా! అచ్యుతా! అవాఙ్మానసగోచరా! అమోఘశాసనా! నరకాంతకా!

మాణిక్యమ్మ [రెండడుగులు ముందుకువచ్చి]. అబ్బబ్బ! ఇక్కడ దీని ప్రాణంమీది కొస్తున్నా, మీ గోడు మీదే గదా!

లక్ష్మయ్య [కోపం సూచిస్తూ]. పరమేశ్వరా! నిర్గుణా! నిష్కళంకా! నిరుపద్రవా! నిరంజనా! నిరింద్రియా! నిర్వికల్పా! నిరాకారా! నిర్వికారా! పరమపురుషా!

మాణిక్యమ్మ [మరింత దగ్గరికొచ్చి]. మీకు చెముడేమైనా వొచ్చిందా?

లక్ష్మయ్య [పొలికేకలు వేస్తున్నట్టు]. పరంజ్యోతిస్వరూపా! పరంధామా! పురుషోత్తమా! పుణ్యస్వరూపా! పుణ్యనిలయా! పుణ్యభావనా! దేవదేవోత్తమా! దేవతాసార్వభౌమా!

మాణిక్యమ్మ [నెత్తికొట్టుకుంటూ]. నాఖర్మిది!

లక్ష్మయ్య. స్వయంప్రకాశా! పరతత్వదీపా! పరిపూర్ణా! జ్ఞాన ప్రదా! యోగీశ్వరేశ్వరా! కుచేలవరదా! గుప్తవర్తనా! విశ్వ

నేత్రా! విమలచరిత్రా! హరేప్రష్ట! హరేకృష్ణ! పాహిమాం. పాహిమాం! పాహి! [ముమ్మారు నమస్కరించిన పిమ్మట కళ్లతెరచి] ఎందు కలా గొడ్డులా అరుస్తున్నావ్?

మాణిక్యమ్మ. గొడ్డులా అరిస్తేనే? కాకిలా గోలపెడితేనే? ఎంతంతు మీరు మానారు గనుకనా? ఇలా ఒకసారొచ్చి అమ్మాయిని చూడండి. మరీ హైరానపడుతున్నది.

లక్ష్మయ్య. ఇవ్వాళ అమావాస్యకదూ! మరెలా వుంటుంది? శేషాచార్యులుగారిచ్చిన మాత్రవెయ్యాలా?

మాణిక్యమ్మ. ఏం మాత్రో - నా పిండాకూడు! అదేసిన నాడినుంచీ ఎగశ్వాస ఎక్కువైంది. కా ళ్ళెళ్ళి, ఆ డాక్టర్‌గారినైనా పిల్చుకొద్దురూ?

లక్ష్మయ్య నడమంత్రంగా మెరిశాడులే. మన కొక డాక్టరు! మామానాడు ఈ డాక్టర్లే వైద్యాలు చేశారేమిటి?

మాణిక్యమ్మ. ఎద్దేమంటే చెద్దేం. మనకి మొండిట్టుంచీ వున్నదేగా, యిది!

లక్ష్మయ్య. చాల్లే! ఇక కట్టిపెట్టు.

మాణిక్యమ్మ. అంతే లెండి! ఏనాడు మీరు నామాట సాగనిచ్చారు గనక, ఈనాడు సాగనిస్తారు? ఇక, అద్దాలొస్తే వాటైనా . .

లక్ష్మయ్య [అద్దాన్ని అంగవస్త్రంతో తుడిచి దొడ్లుపెట్టిలో పెడుతూ]. వా డొచ్చి రోగాన్ని గిల్లేస్తా డేమిటి? ఎవరొచ్చినా చేసే దేమీ లేదు. ఎవరి ప్రారబ్ధాన్ని ఎవరు తప్పిస్తారు?

మాణిక్యమ్మ. ఎప్పటికప్పుడు ఈ మెట్ట వేదాంతమే నా కొంప తీస్తున్నది.

[విసురుగా గదిలోకి దాటిపోతుంది.

లక్ష్మయ్య [వెనకనుంచి]. చాల్లే నోరుముయ్ ! [బొట్టుపెట్టిని సర్దడం పూర్తిచేసిన తర్వాత] కమలం ! [క్షణంఆగి బిగ్గరిగా] కమలం [మరొక క్షణం ఆగి, మరింత బిగ్గరిగా] కమలం !!

మాణిక్యమ్మ [గది వాకిట్లోకి వచ్చి]. దేనికండీ ఆ అరుపులు ? అది పెరట్లో కెళ్ళింది కామాలు ! ఏం కావాలి ?

లక్ష్మయ్య [కోపంగా]. ఏమీ వొద్దులే.

మాణిక్యమ్మ. మీకు పున్నెముంటుంది ! అరుపులు పాలించండి. ఇక్కడిది తుళ్ళి పడుతున్నది.

[మాణిక్యమ్మ గదిలోకి వెడుతుంది. లక్ష్మయ్య బొట్టె పెట్టిని అలమరలో పెట్టి వెనక్కి తిరుగుతుండగా కృష్ణమూర్తి వస్తాడు. వయస్సు 25 సంవత్సరాలు. ఆకారంలో తండ్రిని, స్వభావంలో తల్లిని పోలినవాడు. బి. ఏ. ప్యాసై, బస్తీలో ఉద్యోగం చేస్తున్నాడు. సైను పంచి; కాలరు షర్టు! డబల్ బ్రెస్టుకోటు.

కృష్ణమూర్తి. నాన్నా ! అమ్మాయి కెలా వుంది ?

లక్ష్మయ్య. పోసీ రేపేనా రాకపోయావట్రా ? చూస్తూ చూస్తూ అమావాశ్యపూ టొచ్చావ్ !

కృష్ణమూర్తి. అమ్మాయి కెలా వుంది, నాన్నా ?

లక్ష్మయ్య. అమావాశ్య కదూ ? కొంచెం బరువుగానే వుంది.

మాణిక్యమ్మ [గదిలోనుంచి వచ్చి]. ఏం చెప్పనురా బాబూ !— దాని మాట ? ఆఁ ! ఆఁ ! అన్న నోటికి యిసుగేలేదు. యమ కెర యెళ్ళబోస్తున్నది.

కృష్ణమూర్తి [తన సూట్‌కేస్, హోల్డాల్ లోపలికి తెచ్చిపెట్టిన

బండివాడికి వాడుగ యిచ్చి పంపివేస్తూ]. మరి, డాక్టర్‌గా రేమన్నారు?

మాణిక్యమ్మ. అసలు ఆయన్ని పిల్చుకొస్తేగా?

కృష్ణమూర్తి. లక్షణంగానే వుంది. అయితే వైద్య మెవరు?

లక్ష్మయ్య. శేషాచార్యులుగారు మందు వాడుతున్నారు లేరా! ఆయన హస్తవాసి మంచిది.

కృష్ణమూర్తి. వాకిట్లో డాక్టరుంటే ఈ కూరగాయ వైద్యాలు దేనికి? సరిగాని, జానకి ఎక్కడమ్మా?

మాణిక్యమ్మ. ఇదిగోరా, బాబూ! ఈ గదిలో.

[మాణిక్యమ్మ గదిలోకి దారి తీస్తుంది. కృష్ణమూర్తి అనుసరిస్తాడు. బొట్టు పెట్టుకోడానికి ఉపయోగించిన నీళ్ళ చెంబును లక్ష్మయ్య అందుకోబోతూవుండగా కమల వస్తుంది. ఆ పిల్ల చురుకైనది. ప్రతివిషయాన్నీ ఇట్టే గ్రహించగలదు. కాని, తేలికగా బయట పడదు. అన్న అంటేనూ, అక్క అంటేనూ చాలా ప్రేమ. బాల్యం పూర్తిగా వెళ్ళని, యౌవనం పూర్తిగారాని వయస్సు. తనకంటె పెద్దవాళ్ళతో ఎక్కువ చనువుగానూ వుండ లేదు; పూర్తిగా హైదొలగీ వుండలేగు.

కమల. నన్ను కేకేసినట్టున్నావ్, నాన్నా!

లక్ష్మయ్య. ఔనమ్మా!

కమల. దేనికి?

లక్ష్మయ్య. ఆఁ! మరేమీ లేదులే .....అన్నయ్య వొచ్చాడమ్మా!

కమల. ఏడీ?

లక్ష్మయ్య. అదుగో! అక్కయ్యదగ్గి రున్నాడు.

కమల. వొదినకూడా వొచ్చిందా ?

లక్ష్మయ్య. లేదమ్మా !

కమల. ఏమో ?

లక్ష్మయ్య. రానూపోనూ రైలుఖర్చుల దండగ. వొదినకూడా ఎందు కిప్పుడు ?

కమల. వొదిన్ని చూచి చాలా రోజులైంది. వెంటపెట్టుకొస్తావేమో ననుకున్నా. పోనీ, దేబీనైనా తీసుకొచ్చావా ?

లక్ష్మయ్య. ఆఁ ! అది వాళ్ళమ్మ నొదిలి వుంటుందా, పెమతుందా ! సరేగాని, కాస్త ఈ బొట్టునీళ్ళు తులసికోటలో పోసిరా !

[చెంబు అందిస్తాడు. దాన్ని తీసుకొని కమల వెళ్తుంది.

కృష్ణమూర్తి [ముఖం చిట్లిస్తూ చావిడికొచ్చి వచ్చి]. అదేమిటమ్మా! ఆ గది అంత చెడ్డకంపు కొడుతున్నది !

మాణిక్యమ్మ [వెనకనే వొస్తూ]. అక్కడికీ పుప్పొప్పులా సాంబ్రాణిపొగేస్తూనే వున్నారా, బాబూ !

కృష్ణమూర్తి. దాన్ని చీకటికొట్టులా చెయ్యకపోతే, కాస్త గాలీ వెలుతురూ రానివ్వరాదటమ్మా ?

మాణిక్యమ్మ. మంటల జ్వొరంతో వున్నదానికి చల్లటిగాలి తగిల్తే శీతలం కమ్మకు రాదట్రా !

కృష్ణమూర్తి. సరేగాని, అమ్మాయి పడకపెట్టి ఎన్నిరోజులైంది ?

[అన్నయ్యను చూచి పలకరించాలనే అపేక్షతో కమల వచ్చి పడమటింటి గుమ్మంలో నిలబడుతుంది.

మాణిక్యమ్మ. రేపటికి సరిగా వారం, మూసిన కన్ను తెరవకుండా

పడున్నదాన్ని నాల్గురోజులనాడు జట్కాబండిలో ఎక్కించి, మీ బావ తగిలేశాడురా, బాబూ !

కృష్ణమూర్తి. వాడు మనిషా ? పశువా ?

లక్ష్మయ్య. వాడినని లాభమేమిటిలే ? అది మన ప్రారబ్ధం.

మాణిక్యమ్మ. దిక్కూ మొక్కూ లేకుండా ఎర్రటి ఎండని పడొచ్చిందేమో, రోగం నెత్తికెక్కి పోయిందిరా, బాబూ! ఇప్పుడు దానికి మన స్మారకమే లేదు. మాతల్లి మాలోకంలో వుంది.

లక్ష్మయ్య. ఇంతకూ పెద్దమ్మారొచ్చి నెత్తిని కూర్చుందిరా !

కృష్ణమూర్తి. జానకి పిచ్చిమాట లాడుతున్నది, ఎప్పటినుంచేమమ్మా ?

[తనను అన్నయ్య గమనించకపోవడాన్ని చూచి, ముఖం కొంచెం చిన్నబుచ్చుకొని, కమల లోపలికి వెళ్ళిపోతుంది.

మాణిక్యమ్మ. మొన్నటి నుంచీరా, బాబూ ! అదేమిటోగాని "నేనీ నింద మొయ్యలే" నంటూ ఒక్కటే పాట. కొట్టుకుని కొట్టుకుని కాసేపు కన్నుమూసినా ఇదే కలవరింత! ఏమి గాలో దూలోనని అక్కడికీ దిగదుడుపులూ, అవీ తీయిస్తూనే వున్నా. ఏడుకొండల వాడికి ముడుపుకూడా కట్టా. "ఈ గండం గడిపి, వొడ్డుని పడేశావంటే నీకొండకొచ్చి, నిలువు దోపిడిస్తాం, వెంకటేశ్వర్లు తండ్రీ !" అని దణ్ణంపెట్టుకున్నా. మరి, ఆ స్వామిదయ ఎలా వుందో !

కృష్ణమూర్తి. ఇంత ఉధృతంగావుందని ఆ వుత్తరంలో రాస్తే నిన్నే ఆఫీసుకు సెలవుపెట్టి వచ్చేవాణ్ణిగా !

లక్ష్మయ్య. నువ్వు ఆదుర్దా పడతావని రాయలేదమ్మ. ఇంతేగా దాని రోజులు బాగా లేవు. ఎంత రాసిపెట్టి వుందో, అంతా అనుభవించి తీరాలి.

మాణిక్యమ్మ. డాక్టరుగార్ని పిలుచుకురమ్మని నేను మొత్తుకుంటూ వుంటే మీనాన్న ఈ మెట్టవేదాంతమే....

లక్ష్మయ్య. అదుగో! ఆ మాట అనొద్దనే నీనోట గడ్డిపెట్టేది.

మాణిక్యమ్మ [కొడుకుతో]. చూశావా! బాబూ! ఇదీవరస! నేను అటు దాని బాధ చూడలేక, ఇటు ఈయన మాటలు పడలేక ఛస్తున్నానంటే నమ్మ.

కృష్ణమూర్తి. సర్లే! అమ్మా! నే వెళ్ళి డాక్టర్‌గార్ని పిలుచుకొస్తాగాని, నువ్వు ఆ గది కిటికీలు కాస్త తీసి, సాంబ్రాణి పొగ వెయ్యి.

లక్ష్మయ్య. శేషాచార్యులుగారు తక్కువవాడట్రా? ఆయన తండ్రి వైద్యుడు; తాత వైద్యుడు; ముత్తాత వైద్యుడు; వాళ్ళది వైద్యులవంశం. వాళ్ళ యింటవున్న లేహ్యాలు, గుళికలు, రసభస్మాదులు సామాన్యమైనవట్రా? ఈమధ్య నాకు కాళ్ళుచీప్పుడితే, ఆయనిచ్చిన కూష్మాండలేహ్యం వెంటనే జవాబిచ్చింది.

కృష్ణమూర్తి. ఒకసారి డాక్టరుగార్ని పిలుచుకొచ్చి చూపించడం ఎందుకైనా మంచిదికాదూ, నాన్నా?

లక్ష్మయ్య. ఆఁ! మరేమీ లేదట్రా! అసలు దాన్ది నిక్కాకవొళ్ళు. దానిమీద పైత్యం ప్రకోపించిందట. డాక్టర్లొచ్చిన కాడినుంచీ సూదులనీ, సీసాలనీ ఎంత తతంగం చేస్తారు! ఎంత డబ్బు గుంజుతారు! పిలుచుకురాగానే సరేనా? ఇంతకూ రోగమైనా దాని రోజొచ్చినప్పుడు తిరుగుతుంది గాని....

మాణిక్యమ్మ. మళ్ళీ మొదలు.

లక్ష్మయ్య. ఏమిటది ?

మాణిక్యమ్మ. నానోట చెప్పించడం దేనికి ? మీకు తెలవదూ ?

లక్ష్మయ్య. అదుగో! ఆకూత కుయ్యేద్దనే నీకు బుద్ధిచెప్పేది.

మాణిక్యమ్మ. చూశావట్రా! ఇప్పుడు నే నేమన్నాను? సర్లే—ఇది నాకు రోజూ వుండే భాగోతమేగాని, నువ్వెళ్ళి డాక్టరుగార్ని పిలుచుకురా! ఇక్కడున్నట్టుగా రావాలిరా, బాబూ!

కృష్ణమూర్తి. మంచి దమ్మా!

[వెడతాడు.

లక్ష్మయ్య [గింజుకుంటూ]. మనం దొరలమా ? దొరసానులమా ? ఇంగ్లీషు వైద్యాలు మనకి దేనికి ? అసలు ఆ పాడుమందులు మనకి పట్టివ్వవ్. [క్షణమాగి] ఇంతకూ పిదప కాల మొచ్చి పడింది. మన మందులూ, మన వైద్యాలూ, మన ఆచారాలూ, మన కట్టుబాట్లూ—ఏవీ పనికిరావడం లేదు. [గోడనున్న విసన కర్ర తీసి విసురుకుంటూ] పెద్ద లన్నారుగా "కొత్తొక వింత, పాతొక రోత" అని. మంచీ చెడ్డా ఆలోచనే లేదు. కొత్త కనబడ్తే చాలు-వేలంవెర్రిగా ఎగబడ్డమే! మన మతం, మన ఆచారాలు, మన సాంప్రదాయాలు ఇప్పుడు పుట్టాయా?—భూమి పుట్టినప్పుడే పుట్టాయిగాని!

[లక్ష్మయ్య ఈ మాటలు అంటూవుండగా మాణిక్యమ్మ ముక్కూ మూతీ విరిచి గదిలోకివెళ్ళి, కిటికీ తలుపులు తెరిచి, మళ్ళీ చావిడిలోకి వస్తుంది.

మాణిక్యమ్మ [పడమటింటి గుమ్మందగ్గిరికి వెళ్ళి]. కమలం! కాస్త నుప్పుతేవే!

లక్ష్మమ్మ [ఇంకా గుణుస్తూ]. అయినా, మనిషికిరాక మాను కొస్తుందా? రాత బాగుండక రోగం రొష్టూ వొస్తే పూర్వం రెండు లంఖణాలు కట్టించేవారు. దాంతో ఎంత జబ్బయినా ఎగిరిపోయేది. ఇప్పు డేముంది? ముక్కున పడిశం పట్టినా, డాక్టర్లు గీక్టర్లు కట్టకట్టుకు రావాల్సిందే! అంతకంత గుంజడానికి వాళ్ళసలు రోగాన్ని ఎక్కుదోస్తారు.

["సి పెట్టవేదాంతం మండిపోను" అన్నట్టుగా మాణి క్యమ్మ చాటుగా మెటికలు విరుస్తుంది.

లక్ష్మయ్య. ఆయువు గట్టిదైతే మునిగే తెప్పైనా తేల్తుంది. ఇక ఆయువు మూడినప్పుడు, ఎవ రాపగలరు? మాయలో పడి, మందులనీ, మాకులనీ మన దేవులాటేగాని, లలాటలిఖితం తప్పదు.

[విసనకర్ర మళ్ళీ పటంమేకుకు తగిలించి, అలమరలో నుంచి నల్లమందు డబ్బీ తీసి, మాత్ర కట్టుకుంటూ వుంటాడు.

కమల [గరిటితో నిప్పుతెచ్చి]. ఇదుగోనమ్మా! నుప్పు!

మాణిక్యమ్మ. ఇలా తే, తల్లీ! [నిప్పుగరిట అందుకుని] ఇంకా నీవంట తెమల్లేదమ్మా?

కమల. అన్న య్యొచ్చాడుకదూ-ఇంకొక కూర చేస్తున్నానమ్మా!

మాణిక్యమ్మ. బండెడుచాకిరి పైనపడి, ఇప్పటికే హూనంహూన మౌతున్నావ్. నువ్వి చెయ్యలేదని మీ అన్నయ్య అనుకుం టాడా? దేని కమ్మా, ఇప్పుడు కూరలూ నారలూ?

కమల. ఆఁ! మరేమీ లేదే! వంకాయవేపు దేస్తున్నా. చిటికలో అయిపోయింది.

[మాణిక్యమ్మ గదిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య [కమలతో]. నాకు నల్లమందు వేళ మించిపోతున్నది. రెండు మెతుకులు వొడ్డిస్తావమ్మా?

కమల. అలాగే, నాన్నా! కాళ్ళు కడుక్కురా!

[కమల పడమటింటిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య [నల్లమందు డబ్బీని అలమరలో పెట్టి, కట్టినమాత్ర వేసుకుని]. హరేకృష్ణ! హరేకృష్ణ! పాహిమాం! పాహిమాం! పాహి!

[పడమటింటిలోకి వెళ్ళబోతాడు.

మాణిక్యమ్మ. [గదిలోనుంచి వచ్చి] కాస్త ఆగుదురూ! భోజనానికి అంత తొందరేమిటి? [వీధివాకిలివైపు చూచి] అదుగో! డాక్టరుగా రొస్తున్నారు.

[గదిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య. ఉహూఁ! తయారవుతున్నాడూ? [కృష్ణమూర్తి వెంట డాక్టర్ చావిడిలోకి రాగానే] నమస్కారం, డాక్టరుగారూ!

డాక్టర్. నమస్కారం!

లక్ష్మయ్య. దయచెయ్యండయ్యా! దయచెయ్యండి.

[గదిలోకి దారితీస్తాడు. డాక్టరు, కృష్ణమూర్తి గదిలోకి వెడతారు. చావిడి ఒక క్షణం ఖాళీగా ఉంటుంది. తర్వాత కృష్ణమూర్తి చావిడిలోకి తిరిగి వస్తాడు.

కృష్ణమూర్తి [పడమటింటి వాకిట్లో నిలబడి]. కమలా! గ్లాసుతో కాసిని నీళ్ళు తీసుకురా! [క్షణం ఆగి] త్వరగా రా!

కమల [లోపలనుంచి]. వొచ్చే! అన్నయ్యా! వొచ్చే!

కృష్ణమూర్తి. [ఇంకొకక్షణం తర్వాత, కొంచెం విసుగ్గా] త్వరగా తెమ్మని నీక్కాదూ....

[అతని మాట పూర్తికాకముందే కమల నీళ్ళగ్లాసుతో వస్తుంది. దాన్ని అందుకుని కృష్ణమూర్తి గదిలోకి వెడతాడు. కమల గదివాకిట్లోకి వెళ్ళి, వోరగా నిలబడి లోపలికి చూస్తూ వుంటుంది.

కృష్ణమూర్తి [గదివాకిట్లోకి వచ్చి కమలతో]. డాక్టరుగారు చేతులు కడుక్కోడానికి దొడ్డిగుమ్మంలో చెంబుతో నీళ్ళు. సబ్బుపెట్టీ పెట్టవమ్మా! తువాలుకూడా తే!

కమల [వెడుతూ]. అలాగే నన్నయ్యా!

[కృష్ణమూర్తి తిరిగి గదిలోకి వెడతాడు. కమల దొడ్డి గుమ్మంలో నీళ్లు పెట్టి, వెనక్కి వస్తూవుండగా, గదిలోంచి డాక్టర్ బయటికి వస్తాడు. అతడిని చూడగానే ఆపిల్ల చప్పున పడమటింటిలోకి తప్పుకుంటుంది. డాక్టర్ వెనకాలే లక్ష్మయ్య, కృష్ణమూర్తికూడా చావిడిలోకి వస్తారు.

లక్ష్మయ్య. అయ్యా! ఇలా దయచెయ్యండి.

[డాక్టర్ వెంటరాగా పెరటిలోకి దారితీస్తాడు.

కమల [పడమటింటి గుమ్మంలోకి వచ్చి]. అన్నయ్యా! ఇదుగో తువాలు.

[కృష్ణమూర్తి దాన్ని అందుకుని. చేతులు కడుక్కొని వస్తున్న డాక్టరుకి అందిస్తాడు.

లక్ష్మయ్య [డాక్టర్ చేతులు తుడుచుకోగానే]. ఇలా యిప్పించ డయ్యా !

[తువాలు అందుకుంటాడు.

డాక్టర్. నా బ్యాగ్ ...

[గదివైపుకు ఒక అడుగువేస్తాడు.

లక్ష్మయ్య. అయ్యా! తమ రుండండి - మేం తెస్తాంలెండి! [కృష్ణమూర్తితో] అరే అబ్బాయ్! డాక్టరుగారి చేతిసంచి అందుకోరా.

[కృష్ణమూర్తి గదిలోనుంచి మెడిసిన్ ఛెస్ట్ తెచ్చి డాక్టర్‌కు అందిస్తాడు. ఈ లోపున లక్ష్మయ్య డాక్టర్‌తో మాట్లాడుతూ వుంటాడు.

లక్ష్మయ్య. అయ్యా! అమ్మాయి కేమీ ఫరవాలేదు గదండీ? [డాక్టర్ జవాబుచెప్పడు.] ఇవ్వాళ పొద్దున శేషాచార్యులుగా రొచ్చి చెయ్యి చూచెళ్ళారు. నాడి కొంచెం దూకుడుగా వుంది గాని, భయ మేమీ లేదన్నారు. ఇవ్వాళ అమావాస్యగదండీ! ఏమైనా దాని విసు రింతో అంతో ...

డాక్టర్. [తను కదిలి, తనను అనుసరించబోతున్న లక్ష్మయ్యతో] లక్ష్మయ్యగారూ! మీరు దిగబడండి. మందుకు కృష్ణమూర్తిగా రొస్తారు లెండి.

లక్ష్మయ్య. అయ్యా! చిత్తం! చిత్తం! దయవుంచండి.

[దణ్ణంపెట్టి లక్ష్మయ్య వెనక్కు తగ్గుతాడు. డాక్టర్, కృష్ణమూర్తి వెడతారు.

లక్ష్మయ్య [డాక్టర్ గడప దాటినంతనే]. రావడమైంది; పోవడ మైంది. కాసేపు కూర్చోడం, మంచీ చెడ్డా మాట్లాడడం—

ఏమీ లేదు. పలుకే బంగారం! ఈ భాగ్యానికే డాక్టర్లూ గీక్టర్లూ అని పడి ఛస్తారు.

కమల [పడమటింటి గుమ్మంలోంచి]. నాన్నా! మరి, అన్నని కొస్తావా?

లక్ష్మయ్య. [వినిపించుకోకుండా] శేషాచార్యులుగారొస్తే. ఇష్ట సుఖాలు మాట్టాడుతూ పక్కాగంట కూర్చుంటారు. ఆయన మాట, ఆయన మర్యాద,—ఈ రాలుగాయలు వొంటి కాలిమీద తపస్సుచేస్తే మాత్ర మొస్తాయా?

కమల. నిన్నే, నాన్నా! అన్న మొడ్డించమంటావా?

లక్ష్మయ్య. మించినవేళ మించనే మించింది—అన్నయ్యని రానీ. మళ్ళీ ఇన్నిసార్లు దేనికి?—కలిసే భోంచేస్తాం.

మాణిక్యమ్మ. [గదిలోనుంచి వచ్చి] ఇంకా వాడి స్నానంపానం కాలేదు. వాడికోసం మీరు కనిపెట్టుకు కూచోడం దేనికి? మీకు పెట్టి, చిన్నమ్మాయికూడా రెండు మెతుకులు తింటుంది. మిట్ట మజ్జాన్నందాకా అది మాడ్డందేనికి?

కమల. అఁ! నా కేం తొందర? అన్నయ్యని రావివ్వవే!

మాణిక్యమ్మ. మందు తేవాలి కదమ్మా! ఆలిసిమౌతుందేమో?

లక్ష్మయ్య. రంగునీళ్ళే కదూ సీసాలో పోసివ్వడానికి! ఏమంత ఆలస్యమౌతుంది?

మాణిక్యమ్మ. చాల్లెండి! ఎవరైనా వింటే నవ్వివోతారు.

లక్ష్మయ్య. నే నీ యిల్లుకట్టి పాతికేళ్ళయింది. ఎన్నడైనా డాక్టరు నా గడపతొక్కాడా? ఇవ్వాళ నువ్వూ, నీ కొడుకూ చేరి, వాణ్ణి

వెంటబెట్టుకొచ్చారు. డాక్టరు అడుగుపెట్టిన కొంప ఏది ముందు కొచ్చింది ?

మాణిక్యమ్మ. ఆపదొచ్చినపుడు కూడా అణాపైసల లెఖ్ఖలేనా ? అది బతికి బయటపడితే, నా కదే పదివేలు. వెధవ డబ్బు— డబ్బేంచేసును.

లక్ష్మయ్య. కానివ్వండి, కానివ్వండి ! చిప్పపుచ్చుకుని అడుక్కు— తిందురుగాని లెండి! చూడగా మీకది రాసిపెట్టినట్టే వుంది. ఎవరిగీత నెవరు తప్పిస్తారు ?

మాణిక్యమ్మ. మళ్ళీ మొదలు.

లక్ష్మయ్య. ఏమిటది ?

మాణిక్యమ్మ. ఏమిటా ? నా పిండాకూడు.

కృష్ణమూర్తి. [వీధిగుమ్మంగుండా వచ్చి] ఏమిటమ్మా, అది ?

మాణిక్యమ్మ. మందు తెచ్చావా, బాబూ ?

కృష్ణమూర్తి. ఆఁ !

లక్ష్మయ్య. డాక్టరుగా రేమన్నారురా ?

కృష్ణమూర్తి [కోపంగా లక్ష్మయ్యతో]. ఆఁ ! ఏమంటారు ? [అనునయిస్తూ మాణిక్యమ్మతో] సరిగాని, ఏమిటమ్మా, నీ అవతారం ! ముందు నువ్వు పడకపెట్టేలా వున్నావ్. వెళ్ళి స్నానమైనా చేసిరా. నేను అమ్మాయిని చూస్తూవుంటా.

మాణిక్యమ్మ. ఆఁ ! నాకేమి తీపరంలేరా ?

కమల. నిన్నటినుంచీ అమ్మ నోట్లో నీళ్ళయినా పోసుకో లేదన్నయ్యా !

కృష్ణమూర్తి. ఏమిటమ్మా అది! నువ్వు మూలబడితే, ఇక జానకి ఆలనా పాలనా ఎవరు కనుక్కుంటారు?

మాణిక్యమ్మ. ఏంచెప్పనురా, బాబూ! నా మతి మతిలో లేదు. సరే! ఆ మందిలా తే! కాస్త తాగించెడతా.

కృష్ణమూర్తి. ఇదుగో నమ్మా! ఈ గీతవరకు గాజు గ్లాసులో పోసివ్వు. ఇవిగో! ఇవి పొట్లాలు. అరుకిచ్చిన అరగంటకొక పొట్లం చొప్పున నీళ్ళతో వెయ్యాలి.

[కృష్ణమూర్తి చేతిలోనుంచి మందుసీసాను, పొట్లాలను తీసుకుని మాణిక్యమ్మ గదిలోకి వెళుతుంది.

లక్ష్మయ్య [రెండు మూడుసార్లు పొడిదగ్గు దగ్గి]. డాక్టరేమి చెప్పాడేమిరా?

కృష్ణమూర్తి. కాస్త నిదానించండి - మనవిచేస్తాగా?

మాణిక్యమ్మ. [గదిలోనుంచివస్తూ] మందైనా తిన్నగా వాగలేదురా, బాబూ: సగానికి సగం కిందేపోయింది.

కృష్ణమూర్తి. ఫరవాలేదులే. నువ్వు వెళ్ళమ్మా!

మాణిక్యమ్మ. దాన్ని ఒక కంట కనిపెట్టి చూస్తూవుండరా, బాబూ!

[పడమటింటి గుమ్మంగుండా లోపలికి వెళుతుంది.]

కృష్ణమూర్తి. [బెదిరిన లేడివలె చూస్తూ నిలుచున్న కమలతో] కమలా! అమ్మకు నీలూ పాలూ చూడరాదూ!

[కమల వెళ్ళిపోతుంది.

లక్ష్మయ్య. ఏమన్నారేమిరా మీ డాక్టరుగారు?

కృష్ణమూర్తి. ఏమన్నారా? రోగం ముదిరిపోయిం దన్నారు! మరి ఆశ లేదన్నారు!

లక్ష్మయ్య. ఆఁ ! డబ్బు గుంజడానికి వాళ్లు అలాగే అంటారులే!

కృష్ణమూర్తి. పాడు డబ్బుముఖం చూచుకునే దాని ప్రాణంమీదికి తెచ్చావ్.

లక్ష్మయ్య. డబ్బు డబ్బంటారు - డబ్బు విరజిమ్మితే పోయే ప్రాణాలు నిలుస్తాయటరా? మొన్న మన చంద్రయ్య పెళ్ళాన్ని పట్నం తీసుకెళ్ళి అయివారొందలు వ్రయంచేశాడు. మది అది బతకలేదే? సర్లే - ఇంతకూ ఏమని తేల్చాదురా, మీ డాక్టరు?

కృష్ణమూర్తి. ఏమని తేల్చాడా? అది టైఫాయిడ్ జ్వరమట. డబుల్ నిమోనియాతో ఊపిరితిత్తులు రెండూ చెడిపోయినవట. ముందే ఆయన్ని పిలుచుకొస్తే, ఇంత ముంచుకొచ్చేది కాదు. నువ్వే చేతులారా దాని బ్రతుకు బుగ్గిచేశావ్!

లక్ష్మయ్య. ఆఁ! ఒకరు చేసిం దేముంది? భూంమీద దానికి నూకలు నిండాయేమో?

కృష్ణమూర్తి. చాల్ చాలు! ఈ వెర్రిమొర్రి వేదాంతంతోనే జానకి గొంతుకోశావ్! దాని వొళ్ళంతా పుచ్చిపోయింది. ఎందుకో తెలుసా?

లక్ష్మయ్య. ఆఁ! అది పైత్య ప్రకోపమటరా?

కృష్ణమూర్తి. దానికి కాదు; మనకు!

లక్ష్మయ్య. అయితే, అది ఏమి టంటావ్.

కృష్ణమూర్తి. ఏమిటా? నీ మేనల్లుడు అచ్చోసిన ఆబోతని నీకు తెలియదూ? వాడి వొళ్లంతా కుళ్ళిందని నీకు తెలియదూ? నేను ఆనాడే అన్నా - ఈ పాడు సంబంధం మనకు వద్దు మొర్రో అని! నామాట విన్నావా? తోబుట్టు వొచ్చి అడుగు

తున్నదనీ, తక్కువ కట్నంతో సరిపుచ్చ వచ్చుననీ బంగారం వంటి పిల్లని ఆ పోకిరీ వెధవకిచ్చి ముడిపెట్టావ్.

లక్ష్మయ్య. చిన్నతనంలో అల్లరి చిల్లరగా తిరిగిన వాళ్ళైనా, ఒక ఇంటివాళ్ళైన తర్వాత లక్షణంగా బ్రతకరట్రా? నారాయణ రావైనా అంతే ననుకున్నా. ఇంతకూ, ఇది మనపిల్ల పూర్వ జన్మ కర్మానుభవం.

కృష్ణమూర్తి. మనచేతులతో మనం గొంతు కొయ్యడం; అది వాళ్ల పూర్వజన్మ కర్మానుభవ మనడం. ఎంత చక్కని సూత్రం కనిపెట్టారు! వాడు చదువు సంధ్యలు లేనివాడని నీకు తెలుసు. గుణం లేనివాడని కూడా నీకు తెలుసు. అయినా, వాడి ఆస్తిని చూచి, వాడికి పిల్లనిచ్చి కడితే, ఆ తప్పు నీది కాదూ?

లక్ష్మయ్య. ఆఁ! ఎవరి గీతలో ఎలావుంటే అలా జరుగుతుంది. మనం కేవలం నిమిత్తమాత్రులం.

కృష్ణమూర్తి. చేతులారా చేసినపనికి చింతించేది పోయి, "దాని గీత", "దాని ఖర్మం" అనడానికి నీకు నోరెలా వస్తు న్నది నాన్నా? వివాహ మనుకున్నతర్వాత జానకిముఖంలో ఎన్నడైనా కళా కాంతీ చూచావా? ఈ అయిదారేళ్లనుంచీ అది చేసింది సంసారమా? నరకంలో నివాసం కదూ?

లక్ష్మయ్య. ఆఁ! కలిగినవాడి కిస్తే, సుఖపడుతుందనుకొన్నా గాని, ఇలా జరుగుతుందని నే నేమైనా కలగన్నానట్రా? ఇంతకూ అది తిన బుట్టలేదు.

కృష్ణమూర్తి. సుఖపెట్టగోరిన వాడివైతే దాన్ని వాడికిచ్చి కట్టే వాడివా? పోనీ, కట్టింతర్వాత, వాడి కట్నాన్ని వాడికి

పారెయ్యక, కుప్పలు జప్తుచేయించుకొనే వాడివా? వాడు మన జానకిని మరింత వేపుకుతినడానికీ, "ఇంకొక పెళ్లి చేసుకుంటా!" అంటూ దాన్ని రాచి రంపాన పెట్టడానికీ నువ్వే కారణం కాదూ?

లక్ష్మయ్య. అంతా బ్రహ్మలిఖితం గాని, అదంటే నాకు పగటరా?

కృష్ణమూర్తి. ఆఁ! నేను వాడిమాట మర్చేపోయా! మన పాపాలన్నీ అంటగట్టడానికి వాడొక డున్నాడు! మంచి జరిగితే, అది మనప్రజ్ఞ; చెడు జరిగితే అది బ్రహ్మరాత.

మాణిక్యమ్మ [స్నానంచేసి, ఉతికినమడత కట్టుకుని, జుట్టు వేలుముడి వేసుకుంటూ, చావడిలోకి రాబోతూ]. బాబూ! అమ్మాయికెలా వుందిరా?

కృష్ణమూర్తి. కొంచెం తగ్గే వున్నట్టున్నదమ్మా?

మాణిక్యమ్మ. నువ్వెళ్ళి స్నానంచెయ్యి. బాబూ! నేను దాన్ని చూస్తూవుంటా!

కృష్ణమూర్తి. చేస్తాలే, అమ్మా! అంత తొందరేమిటి?

మాణిక్యమ్మ. పొద్దెక్కిపోలేదట్రా! నీకోసం మీ నాన్న, కమలం కనిపెట్టుకు కూర్చున్నారు.

కృష్ణమూర్తి. నాకోసం కనిపెట్టుకు కూర్చోవడం దేనికి? ముందు నీ భోజనం కానివ్వు, నాన్నా! నేను తర్వాత చేస్తాలే.

మాణిక్యమ్మ. దూరాభారం ప్రయాణం! నిన్నెప్పుడు భోంచేశావో, ఏమో? స్నానంచేసి, కాస్త ఎంగిలి పడరా బాబూ!

కృష్ణమూర్తి. ఆఁ! సర్లే, అమ్మా!

మాణిక్యమ్మ. ప్రాణం కడదుతుందేమోరా, బాబూ!

[ఈమాట అంటూ గదిలోకి వెడుతుంది.

లక్ష్మయ్య [అరనిమిషం తర్వాత, ముందు పొడిదగ్గు దగ్గి]. ఏమోరా? డాక్టరు మాటంటే, నాకింత నమ్మకం....

కృష్ణమూర్తి. నీ కొక నమస్కారం. ఆ ప్రస్తావన తేవొద్దు. నాన్నా! అమ్మ వింటే గుండెపగిలి చస్తుంది.

లక్ష్మయ్య. సర్లే! కానున్నది కాకమానదు. [కళ్లుమూసుకుని] హారేకృష్ణ! హారేకృష్ణ! పాహిమాం! పాహిమాం! పాహి!

కమల [పడమటింటిలో నుంచి వచ్చి]. అన్నయ్యా! నీకు నీళ్ళు తోడనా?

కృష్ణమూర్తి. కొంచెం ఆగు - తోడుదువుగానిలే!

కమల. ఆలస్య మున్నదంటే. పోనీ వేన్నీళ్ళు పెడతా నన్నయ్యా!

కృష్ణమూర్తి. ఎందుకమ్మా? ఈ ఎండలో వేడినీళ్ళు.

కమల. వేన్నీళ్ళ స్నానంచేస్తే. ప్రయాణం బడలిక తీరుతుం దన్నయ్యా!

కృష్ణమూర్తి. అక్కే వొద్దు! చన్నీళ్ళే చాలు.

కమల. అన్నయ్యకు ఆలస్య మున్నదట. పోనీ, నువ్వైనా భోజనానికిరా, నాన్నా!

లక్ష్మయ్య. వేళ మించిపోయి, ఆకలి చచ్చిపోయిందమ్మా! ఇక ఎప్పుడైతే నేమిటి? నేనూ తర్వాతే భోంచేస్తాలే!

[నీరసంగా కమల పడమటింటిలోకి వెళ్ళిపోతుంది.

లక్ష్మయ్య. [కృష్ణమూర్తితో] ఏదీ - ఇలా దగ్గిరికిరా! [కృష్ణమూర్తి దగ్గిరికి వస్తాడు.] ఈ డాక్టర్లని నమ్మేం దెవరుగాని, ఆ శేషాచార్యులుగార్ని పిలుచుకొచ్చి....

కృష్ణమూర్తి. చాలు! ఆయ వింతవరకు చేసిన వైద్యం చాల్లే!

లక్ష్మయ్య. అది కాదురా! ఆయన్ని మళ్ళీ ఒకసారి.....

["అయ్యో! నాతల్లీ!" అని గదిలో మాణిక్యమ్మ ఏడ్పు గుర్తుకుంటున్న చప్పుడు.

లక్ష్మయ్య. } ఒకేసారిగా {ఏమిటే, అది?
కృష్ణమూర్తి. } {ఏమిటమ్మా!

మాణిక్యమ్మ [గదిలోనుంచి వస్తూ]. అయ్యో నాతల్లీ! అయ్యో మా అమ్మా!

లక్ష్మయ్య. } ఒకేసారిగా {ఏమే, ఏమిటి?
కృష్ణమూర్తి. } {ఏమమ్మా! ఏమమ్మా!!

మాణిక్యమ్మ. [ఈ ప్రశ్నలకు జవాబు చెప్పకుండా, నెత్తీ నోరూ కొట్టుకుంటూ] ఇక నే బతికి దేనికి? చచ్చిదేనికి? ఆ పాడు దేవుడు నన్నెత్తుకు పోరాదూ!

[మాణిక్యమ్మ ఇలా విలపిస్తూవుండగా లక్ష్మయ్య, కృష్ణమూర్తి, గదిలోకి వెడతారు.

మాణిక్యమ్మ. అయ్యో! అయ్యో! నే నేం పాపంచేశాను! నే నేం పాపంచేశాను. అయ్యో నాతల్లీ! అయ్యో మా అమ్మా!

లక్ష్మయ్య. [గదిలోనుంచి కోపంగావచ్చి] నీకేమైనా పోయేకాలమొచ్చిందా? దేనికే అలా ఏడుస్తావ్?

మాణిక్యమ్మ. దేనికా? నా శ్రాద్ధానికి?

లక్ష్మయ్య. సర్లే - నీ వెధవ వేషా లిక కట్టిపెట్టు. ఇందాకటి కంటె ఇప్పు డది తేటగావుంటే ఈ ఏడ్పు లేమిటి? పెడబొబ్బ లేమిటి? కొంపకు కీడు చుట్టుకోడానికా?

మాణిక్యమ్మ. మా తల్లిగొంతు నువ్వే కోశావ్. మా అమ్మని నువ్వే గంగలో దించావ్. నీ మెట్టవేదాంతం మండిపోను!

లక్ష్మయ్య. ఛీ! నోరుమూయ్! ఎవరి కర్మకు ఎవరు కర్తలు!

కృష్ణమూర్తి. [గదిలోనుంచి వచ్చి] ఏమిటమ్మా, ఇది! ఏమైందేమో నని నా గుండె బేజారైంది.

మాణిక్యమ్మ. ఏమని, చెప్పనురా, బాబూ! నా తల్లికి ఎంత కష్ట మొచ్చింది! ఎంత కష్టమొచ్చింది! అయ్యో! అయ్యో!!

కృష్ణమూర్తి. అసలు విషయ మేమిటమ్మా!

మాణిక్యమ్మ. "ఈ నింద మొయ్యలేను! ఈ నింద మొయ్య లేను!!" అంటూ మా అమ్మ ఆవజాస పలవరిస్తూ వుంటే నే నేమిటో అనుకున్నా. ఆ మాట వద్దాకే అది మంచమెక్కిందో కామోసు!

కృష్ణమూర్తి. ఏమిటమ్మా, నీ గొడవ? మాటేమిటి? నిందేమిటి?

మాణిక్యమ్మ. నా నోటితో నే నెలా చెప్పనురా, బాబూ? మీ బావ - అయ్యో! అయ్యో! - దాన్ని పట్టుకుని, నువ్వే - అవ్వ! - ఎక్కడ సంపాయించావో - వాడిదగ్గిరికే పో అన్నాట్ట!

కృష్ణమూర్తి. ఆఁ! గాడిద! లుచ్ఛా!

లక్ష్మయ్య. అరి అప్రాచ్యుడా!

కృష్ణమూర్తి. [పళ్లునూరుతూ] ఆ వెధవని నిలువునా చీల్చాలి.

మాణిక్యమ్మ. అయ్యో! అయ్యో!

లక్ష్మయ్య. [ముక్కుపై వేలువేసుకుని] ఔరా! ఎంత పాపాని కొడిగట్టాడు. [వెంటనే తిరిగి తన మెట్టవేదాంతం ధోరణిలోకి మారిపోయి] సరే - వాడి పాపాన వాడే పోతాడులే!

కృష్ణమూర్తి. [వెటకారంగా] వాడి పాపాన వాడేపోతాడూ?

లక్ష్మయ్య. అంతేమరి! పాపంచేసినవాడు ఈ జన్మలో కాకపోతే మరోజన్మలోనైనా అంతకంత అనుభవిస్తాడు.

కృష్ణమూర్తి. ఇంకో జన్మ! ఎవరు చూచొచ్చారు?

లక్ష్మయ్య. ఇవి పెద్దవిషయాలు - ఈ ధర్మసూక్ష్మలు తెలియవు లేరా! కర్మనుబట్టే జన్మ వుంటుంది. పూర్వజన్మలో చేసిన కర్మనుబట్టి ఈ జన్మ. ఈ జన్మలో....

మాణిక్యమ్మ. నీ మెట్టవేదాంతం మండిందిలే! అయ్యో! అయ్యో!! నా తల్లి నెంత మాటన్నాడు.

కృష్ణమూర్తి. ఆ వెధవని కంటబడనీ - పాతేస్తాను.

మాణిక్యమ్మ. వాడు వొట్టి వెధవేలేరా, బాబూ! కాని, మన పిల్లనిచ్చి చేసింతర్వాత, ఏమనుకుంటే, ఏం లాభం? మన బిడ్డ ముఖం చూసైనా వాడి కడుపూ కాళ్ళూ పట్టుకుని....

కృష్ణమూర్తి. ఛీ! ఛీ! ఆ బద్మాష్ పేరైనా ఇఖ నావద్ద తలవొద్దు.

మాణిక్యమ్మ. కాదు, బాబూ! కాదు. నా మాటిను. మనం కోసివేసుకుందా మనుకున్నా, తెగే సంబంధ మటరా, ఇది? వాణ్ణి ఎలాగైనా బతిమలాడి ..

కృష్ణమూర్తి. వాణ్ణా? బ్రతిమలాడ్డమా? ఆ పశువునే? చాల్లే అమ్మా!

మాణిక్యమ్మ. వాణ్ణి చూడందే మనపిల్ల మనకి దక్కదురా! నా తల్లి గుండెల్లో పెద్దరాయి పడింది. వాడు రావాలట. దాని కంట బడాలట. నీ తప్పేమీ లేదనాలట. నీకు పున్నెముంటుంది - వాడి దగ్గిరికెళ్ళి....

కృష్ణమూర్తి. అదేమైనా సరే - నే వెళ్ళను.

లక్ష్మయ్య. మన అవసరంరా, మరి! తప్పుతుందా?

కృష్ణమూర్తి. అవసరమని గాడిదకాళ్ళు పట్టుకుంటామా?

లక్ష్మయ్య. మనం పట్టుకోవడం ఒక లెఖ్ఖా? ఆనాడు సాక్షాత్తు శ్రీవసుదేవుడే పట్టుకున్నాడు.

కృష్ణమూర్తి. అయిలే. నే నంతటి మహాపురుషుణ్ణి కాను. నాకు చీమూ నెత్తురూ వుంది; మానాభిమానా లున్నాయి.

["అన్నయ్యా!" అంటూ పడమటింటిలోనుంచి కమల వస్తుంది. చావిడిలోవున్న ముగ్గురి వాలకాన్ని గమనించి, తెల్లబోయి, గుమ్మంలోనే ఆగిపోతుంది.

మాణిక్యమ్మ. మంచో, చెడ్డో వాడికిచ్చి కట్టింతర్వాత దానికి మరి వాడే దిక్కు. దాని ముఖమైనా చూసి యెళ్ళరా, బాబూ!

కృష్ణమూర్తి. నీదంతా వెర్రిగాని, ఇంతవరకు పడని సుఖం ఇక వాడితో మన జానకి ఏం పడుతుందమ్మా? బుద్ధిలేని ఆ వెధవవి వృధాగా దేవిరించడం దేనికి?

లక్ష్మయ్య. గుడ్డివాడైనా, కుంటివాడైనా, చివరికి కుష్ఠువాడైనా ఆడదానికి భర్తే దైవం.

కృష్ణమూర్తి. కాదు, దెయ్యం!

మాణిక్యమ్మ. నామాటిను, బాబూ? లేకపోతే మన పిల్ల మనకి దక్కదు.

కృష్ణమూర్తి. అదేమైనా గాని, నే వెళ్ళనమ్మా!

లక్ష్మయ్య. అయితే! మరి నాకు తప్పుతుందా, నే వెడతాలే!

కృష్ణమూర్తి. నువ్వైనా వెళ్ళడానికి వీల్లేదు నాన్నా!

మాణిక్యమ్మ. అదేమిటిరా, బాబూ! పోనీ ఆయనైనా ఎళ్ళి రానియ్యి.

కృష్ణమూర్తి. వీల్లేదమ్మా !

మాణిక్యమ్మ. ఆఁ ! వాడి మాటల కేం లెంగి ? మీ రున్నవారున్నట్టుగా బయల్దేరండి.

కృష్ణమూర్తి. వొద్దు, నాన్నా ! వెళ్ళొద్దు !

మాణిక్యమ్మ. నువ్వు పసివాడివి. నీకు తెలవదురా బాబూ. నామాటివిను.

లక్ష్మయ్య [బింకంగా]. ఇందాకటినుంచి తమాయించుకు చూస్తున్నా! గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్టు, ఏమిటిరా మాకు నీ అదుపాజ్ఞలు ? సమయాన్నిబట్టి సర్దుకు పోవాలిగాని, నీలిగితే పనులౌతాయా ?

కృష్ణమూర్తి. అయితే, వాణ్ణి పిలుచుకొచ్చి, నెత్తిన పెట్టుకు పూజించండి. నా దారిని నే పోతా !

మాణిక్యమ్మ. నన్ను నట్టేట ముంచిపోతావా ? వొద్దురా, బాబూ ! ఎళ్ళొద్దు !

కృష్ణమూర్తి. లేదమ్మా ! నే నీ పాడుకొంపలో ఇంకొక క్షణమైనా వుండలేను !

మాణిక్యమ్మ [దారికి అడ్డంగా వెళ్ళి]. నువ్వెళ్ళితే నన్ను చంపుకున్నట్టేరా బాబూ !

[కళ్లు చెమ్మగిలగా కమల చీరచెంగుతో తుడుచుకుంటుంది.

లక్ష్మయ్య. పోయేవాణ్ణి పోనివ్వరాదటే ! ఎవర్ని బెదిరిస్తాడు, ఈ గుడ్డి బెదిరింపుల్తో.

[ఈమాటకు కృష్ణమూర్తికి మరింత కోపం రాగా, మాణిక్యమ్మను తప్పించుకుని వీధిగుమ్మంవైపు రెండడుగులు వేస్తాడు.

మాణిక్యమ్మ. } ఒకేసారిగా { అయ్యో! అయ్యో! బాబూ!
కమల. } { అన్నయ్యా! అన్నయ్యా!

[కృష్ణమూర్తి ఆగిపోయి కమలవైపు చూస్తాడు.

కమల. న న్నేంచేసి పోతా వన్నయ్యా?

కృష్ణమూర్తి. నీమాట మర్చేపోయానమ్మా! ని న్నిక్కడ విడిచి వెళ్ళితే, అక్కయ్య గొంతుకోసినట్టు నీ గొంతూ కోస్తారు. నావెంటరా పోదాం!

[కమల కళ్ళను గిర్రున నీళ్లు తిరుగుతాయి. గుక్క సప్పగించి చూస్తూ జవాబు చెప్పదు.

కృష్ణమూర్తి. నీకు అశుభం తెలియదమ్మా! వీళ్ల కిరాతకులు. నీ అన్నకు కాదూ? నామాట విను రా; వెళదాం!

కమల [గాద్గదికంగా]. మనం వెళ్ళిపోతే, మరి అక్కయ్యో?

కృష్ణమూర్తి [మనిషి చప్పున తగ్గిపోయి]. ఔనమ్మా! పిచ్చి కోపంలో నేను దానిమాటే మర్చిపోయా! [నిట్టూరుస్తూ] ఔను; దాన్ని ఈస్థితిలో విడిచి మన మెక్కడికి పోతాం?

మాణిక్యమ్మ. పోనీలేరా దాని ముఖమైనాచూసి ఆగిపోయావ్. నా కదే పదివేలు. వొంటరిగా రొమ్ముమీద నే నీ కుంపటి మొయ్య గలనట్రా?

కృష్ణమూర్తి. సర్లే. అమ్మా! [చేతిగడియారాన్ని చూచి] అరుకిచ్చి అరగంటైంది. మరి పొట్లం వెయ్యొద్దూ?

మాణిక్యమ్మ. [పెద్దదిగా నిట్టూర్చి] నాకు కాళ్ళూ చేతులూ ఆడ్డం లేదు. నువ్వే కాస్త వెయ్యిరా, బాబూ!

[కృష్ణమూర్తి గదిలోకి వెడతాడు.

మాణిక్యమ్మ [లక్ష్మయ్యతో]. ఇంకా మీరు చూస్తారు దేనికి? ఎళ్ళిరండి.

లక్ష్మయ్య. రెండుఝాము లైంది. వేళకానివేళ. ఇప్పు డేమిటి? చల్లబడినాక వెడతాలే.

మాణిక్యమ్మ. ఎంతదూర మండీ! రెండు కోసులైనా నిండాలేదు. నామాటవిని, నిలుచున్న పాళంగా ఎళ్ళిరండి.

లక్ష్మయ్య. సర్లేవే! రెండు మెతుకులైనా తిననీ! ఇంతలో ఏమీ మున్చుకుపోదు. కమలం! నాకు వొడ్డించవమ్మా!

కమల [ఇంకా తడి ఆరని కన్నీళ్ళను తుడుచుకుంటూ]. రా, నాన్నా!

మాణిక్యమ్మ. భోజనాని కేమొచ్చె. రోజూచేసే భోజనమే! ముందు యెళ్ళిరద్దురూ! ఆలిసిమైతే ఎక్కడేమి కొంప మునుగు తుందోనని నా గుండెలు కొట్టుకుంటున్నాయ్.

లక్ష్మయ్య. ఎందుకే? పాడుభయం! శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదు.

మాణిక్యమ్మ. అబ్బ! ఎళ్ళి రద్దురూ!

లక్ష్మయ్య. సరే - తగలబడు! [విసురుగా రెండడుగులు వేస్తాడు]

కృష్ణమూర్తి [పొంగి పొరలివస్తున్న దుఃఖాన్ని అతి కష్టంమీద ఆపుకుంటూ గదిలోనుంచి వచ్చి]. నాన్నా! [లక్ష్మయ్య వెనక్కి తిరిగి చూస్తాడు] నువ్వింక వెళ్ళనక్ఖరలేదులే!

[అర్థం తెలియక మాణిక్యమ్మ, కమల వెర్రివాళ్ళవలె చూస్తుంటారు.

**లక్ష్మయ్య.** సరే - ఏం చేస్తాం ? ప్రారబ్ధం !

[అవడానికి, నోరురాని భయసంశయాలతో మాణిక్యమ్మ, కమల వెఱ్ఱివాళ్ళవలె కృష్ణమూర్తితర్వాత లక్ష్మయ్యనూ, లక్ష్మయ్యతర్వాత కృష్ణమూర్తిని ప్రశ్నార్థకంగా మాస్తూవుండగా—

తెర]



## పాత్రలు

చదువుకున్న భర్త

చదువురాని భార్య

[గమనిక : ఇతివృత్తం, పాత్రలు, మొదలైన సమస్త విషయా లలో ఇది స్వతంత్ర రచన. కేవలం టెక్నిక్ మాత్రం స్వీడిష్ రచయిత ఆగస్ట్ స్ట్రిండ్‌బర్గ్‌కు అనుసరణ. ఇద్దరు పాత్రలనే ప్రవేశ పెట్టడం, వారిలో ఒకరిచేతనే మాట్లాడించి, రెండవవారిని మౌనంగా వుంచడం—ఈ పద్ధతిని "ది స్ట్రేంజర్" అనే నాటికలో స్ట్రిండ్‌బర్గ్ వినియోగించాడు. ఈపద్ధతిమాత్రం "దాంపత్యం"లో అనుసరించబడింది.]



# దాంపత్యం

(ఆది వారి యింటిముందు వసారా. రాత్రి తొమ్మిదిన్నర ప్రాంతం. పడక కుర్చీలో పడుకుని భర్త పత్రిక చదువు కుంటూ వుంటాడు. తమలపాకుల్ని తీసుకుని భార్య వస్తుంది.

భార్య. ఏమండీ! ఈపూటకూడా తిన్నగా భోజనమే చెయ్యలేదు. విస్తరి ఇలా అలా కెలికి లేచొచ్చేశారు. చూడగా వొండు కోవడం నాకోసంలానే వుంది అంత కంతకు చిక్కి సగమై పోతున్నారు. ఇలాచేస్తే ఎలా చెప్పండి?

[కుర్చీ దగ్గిరగా కూర్చుని తమలపాకుల ఈనల్ని తీస్తూవుంటుంది.

భార్య. పోనీ, మీకు హితవైన కూరలేవో మీరుతెచ్చుకుంటే నే నొండిపెట్టనన్నానా? కాని, ససేమిరా మార్కెట్టుకు వెళ్ళ నంటారు. పనిమనిషిని పంపిస్తే, అది సగం తిని సగం తెస్తుంది. అబ్బబ్బ! అది వొట్టి దొంగముండ! ఇంటికాడికి మంచికూర లేమీ రావడమే లేదు. ఎవడు తెచ్చినా వంకా యలూ, బెండకాయలూ తెస్తున్నాడు. అవైనా అన్నీ సచ్చులూ, పుచ్చులూ. వాటినీ మండబెడుతున్నారు. ఇఖ నేనేం చచ్చేది, మీరే చెప్పండి?

[తమలపాకులకు సున్నం రాస్తూవుంటుంది.

భార్య. అన్నంమానేసి పాడు కాఫీహోటల్‌లో పాడుకాఫీ తాగుతూ వుంటారు. దాంతో ఏం కడుపునిండుతుంది? ఏ వచ్చడి మెతుకులు తిన్నా అన్నం అన్నమే! మాతాత ముప్పొద్దులా తవ్వెడుబియ్యం అన్నం పెట్టించుకుని, చిక్కటి మజ్జిగ పోసుకుని, జుర్రున జుర్రతాడు. ఎనభైయేళ్ళొచ్చినా ఇంకా రాయిలా వున్నాడు. కంటి చూపైనా తగ్గలేదు.

[సోడాశెక్కా భర్తకు అందిస్తుంది.

భార్య. అబ్బ! చదవొచ్చు పెద్దురూ! పొద్దున్నే పోతారు; పొద్దో యొస్తారు. "ఇదిగో వొస్తారు; అదుగో వొస్తారు" అంటూ ఎదురు చూసిచూసి, నాకళ్ళు కాయలు కాసిపోతున్నాయ్. ఆఫీసు అయిదు గంటలకే అయిపోయినా, ఎనిమిది తొమ్మిది గంటలదాకా ఏంచేస్తారో, ఏమో! అసలు గడపదాటాక మీకు యింటిమాటే జ్ఞాపకానికిరాదు లెండి! ఇవ్వాళమట్టుకు యివ్వాళ "నాన్నొస్తాడు, మిఠాయితెస్తా" డంటూ పెద్దపిల్ల దారి కాసికాసి, మీ రొచ్చేముందే చిటుక్కున నిద్దరోయింది. చంటిదికూడా "నాన! నాన!" అంటూ - పాపం! - కలవ రించింది. దాని కివ్వాళ వొళ్లు కాస్త వెచ్చగావుందండీ! నిద్రలో - వెర్రితల్లి - ఉల్కి పడుతున్నది కూడా! దీపాలెట్ట గానే గుప్పెడు మిరపకాయలు దిష్టితీసి, పొయ్యిలో పోస్తే గొట్టు రాలేదు బిడ్డమీద ఏ పీడాకారిముండ కళ్ళుపడ్డాయో ఏమో!

[భార్య అందించిన తమలపాకుల మడుపు అందుకుని, భర్త పత్రికలో మరింతగా దాక్కుంటాడు.

భార్య. ఎప్పుడూ పత్రిక చదువుతూ కూర్చుంటే. కళ్ళకి జబ్బు కూడా. బయట పిండారబోసినట్టు ఎన్నెల కాస్తున్నది. చల్లటి గాలేస్తున్నదికూడా. వాకిట్లో కుర్చీవేసుకుని హాయిగా కూర్చోరాదటండీ! ఇవ్వాళ ఎన్నెల్ని చూసి పెద్దపిల్ల ఎంత సంబరపడిందనుకున్నారు! "చందమామ రావె!" అంటూ మీరు దాని కెప్పుడో పాటచెప్పారట. దాన్ని చెప్పమని నన్ను తెగ వేధించింది! [ఒకక్షణం ఆగి]....పాలు చల్లారిపోతున్నాయి. తోడేసొస్తా. [లేచివెళ్ళుతూ] ఈ పూట మరీ పత్తెపుమెతుకులు తిన్నట్టు తిన్నారు. కాసిని పాలయినా తాగరాదటండీ! [జవాబు కోసం అన్నట్టు ఒక్కక్షణం ఆగి] ఏం! తెమ్మంటా రటండీ?

[వద్దని భర్త తల వూపుతాడు. భార్య లోపలికి వెళ్ళుతుంది. పత్రికను ఒకపక్కకి పారవేసి, పడక కుర్చీలోనుంచి లేచి, పక్కనే టేబిల్‌పై పడివున్న పుస్తకాన్ని తెచ్చుకుని, దాన్ని చదువుతూ మళ్ళీ కుర్చీలో జేరగిలపడతాడు.

భార్య [లోపలినుంచి వచ్చి]. పత్రిక అయిందనుకుంటే పుస్తకం మొదలెట్టారటండీ? అదేమి పాపమోగాని నాతో ఒక్కమాటైనా మాటాడరు. ఇంటికొచ్చిన కాడినుంచీ చదువు, చదువు— అంతూ పంతూలేని చదువు. నే నేమైనా అంటే, "అదుగో! నాచదువు చెడగొడుతున్నా!" వంటారు. అదే, స్నేహితులెవరైనా వొస్తే, చదువేమౌతుందో తెలవదు. ఊరు మాటు మణిగేదాకా వాళ్ళతో నవ్వుతూ కేరుతూ కూర్చుంటారు. నాతో మాట మాట్లాడ్డమంటేనే మీకు....

[భర్త చటుక్కున పుస్తకాన్నిమూసి "ఈ సోది వినక తప్పదు-నా ఖర్మమిది" అన్నట్టు ముఖం పెడతాడు.

భార్య [దైన్యంగా]. ఇప్పుడు నే నేమన్నానంటే మీకంత విసుగు దలకు! పిచ్చిదాన్ని గనక, ఎప్పుడు సాయంత్రమౌతుందా, ఎప్పుడు మీరొస్తారా అని గంటలు లెక్కెట్టుకుంటూ కూచుంటాను. కాళ్ళ అలికిడైతేచాలు మీరేమోనని ఆలకిస్తాను. గేటుతీసిన చప్పుడైతేచాలు మీరేమోనని ఎదురుచూస్తాను. దానికి చూడబోతే, రెండున్నరేళ్ళు నిండావున్నాయో లేదో గాని, ఆ అల్లరికాన "అమ్మా! నాన్నొస్తున్నాడే!" అని చీటికి మాటికీ పరిగెత్తుకొస్తూ వుంటుంది. ఉత్తిదే అని తెలిసికూడా వుండబట్టలేక వాకిట్లోకి దబదబా లేచొస్తాను. కాని, నాతో మాట్లాడితేనే నోటి ముత్యాలన్నీ రాలిపోతా యనుకుంటారు మీరు!

[ఏదో జవాబు చెప్పబోయినట్టు భర్త నోరు విప్పబోతాడు.

భార్య. మీరు ఏమి అనబోతున్నారో నాకు తెలుసు లెండి. "నీతో ఏం విషయాలు మాట్లాడమంటావ్? వండడం, వార్చడం తప్పితే నీ కే మొచ్చు? చీరలు, నగలు తప్పితే నీ కేం కావాలి?" అనే గదూ? మా అమ్మా, నాన్నా నాకు చదువు చెప్పించారు కాదు. నా ఖర్మ మది. "ఏం! ఇప్పుడు మాత్రమే! నే చెబుతా—చదువుకోరాదా?" అంటారు. "పోనీ, మీకంత ముచ్చటగావుంటే, చెప్పం" డని కూర్చుంటే, ఏకాస్త తపొచ్చినా, చెడ్డ విసుక్కుంటారుగదా! "అబ్బబ్బ! ఎంత తల బద్దలుగొట్టుకున్నా, నీకేమీ అర్థంకాదు. పొర్రి మట్టిబుర్ర" అంటూ చిందులు తొక్కుతారు! ఔను! నాది మట్టిబుర్రే! లేకపోతే, మీకింత లోకు వెందుకౌతాను. "హిట్లర్‌కి పెళ్ళి పెటా

కులు లేవుగదా? మరి, వాడి సిరీ సంపత్తీ చూసి, ఎవతి మురుసుకోను?" అన్నానని ఆపూటంతా ఒక్కటే నవ్వు...

[భర్త చిరునవ్వునవ్వుతాడు.

భార్య. "ఏమండీ! కాశ్రమేడ్ అంటూ చాలామంది పేరుముందు వుంటుంది గదా? కాశ్రమేడు ఇంటిపేరువాళ్లు అంత తామర తంపరగా వున్నారటండీ?" అని ఒకనా డడిగినందుకు......

[భర్త విరగబడి నవ్వుతాడు.

భార్య. ఊఁ! చాల్లెద్దురూ! మీలా అందరూ చదువుకున్నవాళ్ళే వుంటారా? నిజానికి - నాబొంద! - ఇంకా నా కేం చదువు? అప్పుడే ఒకరికిద్దరు బిడ్డలయ్యారు. ఇటు నేను ఇంటిపనే చేసుకోనా? అటు వాళ్ళనే సర్దుకోనా? పగటిపూట ఇలా కాస్త కన్ను మూసే ప్రాప్తిలేదు. బద్ధకించి ఎప్పుడైనా కాస్సేపు నడుం వాలిస్తే, పిల్లలిద్దరూ పీకి పాకాన పెడతారు. మరీ నెల రోజుల్నుంచి చంటిపిల్ల రాత్రిపూటైనా కంటిమీద కునుకు పడ నివ్వడంలేదు. పాలు చాలక "కుయ్యో, మొర్రో" అంటూ తెల్లవార్లూ అది ఒఖటే గోల! వొట్టిరొమ్ము దాని నోట్లోపెట్టి పడుకుంటే, దవళ్ళు పీక్కు పోవడమేగాని దాని కడుపు నిండుతుందా, పెడుతుందా?

[తలనొప్పి వచ్చినట్టు భర్త కణతలు నొక్కుకుంటాడు.

భార్య. అంతేలెండి! నేనన్నా, నామాటలన్నా మీకు తలనొప్పి. మీకు పుస్తకాలు కావాలి; పత్రికలు కావాలి. దేశం సంగతులతో, ప్రపంచంసంగతులతో మీకు పొద్దుపోతుంది. నాకు నా యిల్లే దేశం; నా పిల్లలే ప్రపంచం....పెళ్ళయిన తర్వాత

ఒక్క ఏడాదిపాటు నాతో ఏమి తిన్నగా వున్నారో ! ఆ తర్వాత - నే నేం పాపం చేసుకున్నానోగాని - నా పొడైనా మీకు గిట్టడం లేదు. పిచ్చిదాన్ని గనక, మీరెంత తోసేస్తున్నా, మిమ్మల్నే పూసుకు తిరుగుతాను. మీరు సంతోషంగా ఒక్కమాట మాటాడితే, అదే పండగ గనుకుంటాను. కాని, నేను ఎదురుగా వస్తేనే మీకు చిరచిరలు, బురబురలు !

[పడకకుర్చీలోనుంచి భర్త చరాలున లేచి, పచారు ప్రారంభిస్తాడు.

భార్య. అయ్యో ! కూర్చోండి - పాపం ! - కూర్చోండి. నామూలాన మీకు లేనిపోని కాళ్ళ తిప్పటకూడా దేనికిలెండి :... చదువురానిదాన్నని మీకు మొదటే తెలుసుగా ! తెలిసికూడా నన్నెందుకు చేసుకున్నారు ? ఆ కిరస్తానీదాన్నే కట్టుకోక పోయారూ?...కీసరబాసర మాట్లాడుతూ దాంతో హాయిగా...

[భర్త "హుం!" అని హుంకరించి, పళ్ళు నూరతాడు.

భార్య [తెగించినట్టు]. జడిపించినంతకాలం జడిపించారు - ఇంకేమి జడిపిస్తారులెండి. ఇది ఏనాటి ఈతమో ! లేకపోతే, అది ఇప్పు డీవూరు బదిలీ ఎందుకు చేయించుకుంటుంది? "నాతోపాటు చదువుకుంది. ఇస్కూళ్ళ ఇనస్పెక్టరమ్మ" అంటూ దానికి నాచేత అడ్డమైన వూడిగం చేయించారు. కాఫీలు, ఫలహారాలు, భోజనాలు - ఓం! ఏం చేయించలేదు!.... దాని కాళ్ళు పట్టించడం ఒక్కటే మినహా. నల్లగా - కొరివిలా - కోతిముండ ! ముట్టుకుంటే చేతికి ఎక్కడ మసి అవుతుందో అన్నట్టుగా వుంటుంది. మరి, దాని అందంముందు నాఅందం పట్టడంలేదు కాబోలు ! ముఖానికి ఇంత బూడిద

కొట్టుకుని, కాళ్ళకి బూడ్సులేసుకుని, టిక్కుటక్కుమంటూ అదొచ్చి, [వెక్కిరింతగా] "అలో" అనేసరికి ముఖం చేటంత అవుతుంది. ఇక దాంతో ఒఖ్ఖటే పకపకలు, వికవికలు! ఆయింటినుంచి ఈయింటికి, ఈయింటినుంచి ఆయింటికి నడిచే పుస్తకాలు పుస్తకాలుకావు; పత్రికలు పత్రికలుకావు. వాటితో పాటు వుత్తరాలుకూడా నడుస్తున్నాయేమో ఎవరికి తెలుసు? ఇంతకాడి కొచ్చాక ఇంకా చాటుదేనికి? నెరీదిగానే ఆ పోరిని తెచ్చి ఇంట్లో పెట్టుకోరాదూ?

[కోపంపట్టక భర్త నేలని తన్నుతాడు.

భార్య. నేలని తన్నడం దేనికి! మీకు కాలు నొప్పికూడా! నన్నే తన్నండి. తన్ని తగిలేస్తే, మీకు పీడ విరగడై పోతుంది. [ఈసడింపుగా] పాపం దాన్ని కష్టాలమారి బ్రతుకట. ఎంత పెద్ద ఉద్యోగం చేస్తున్నా ఎంత పెద్దజీతం తెచ్చుకుంటున్నా దానికి సుఖమే లేదట. తన ఉద్యోగానికీ, సంపాదనకీ ఆశప డొచ్చేవాళ్ళని చూస్తే దానికి అసహ్యమట. ఇక, దాని ఫాయావాళ్ళెవ్వరూ దాన్ని పలిచిరారట. పాపం! అదంచే ఎంత జాలి! పోనీ, మీరే ఆ సింగిని కట్టుకోరాదూ?

[భర్త కొట్టడానికి చెయ్యెత్తబోయి, మళ్ళీ అంతలో నే దించేసుకుంటాడు.

భార్య [ఇంకా విరగబడి]. ఇంతకాలంనుంచి దిగమింగి వూరుకున్నా! అదేమైనగాని, ఇక వూరుకోను! అది వుండటమో, నేనుండటమో ఇవ్వాళ తేలిపోవాలి. మీకు వొండిపెట్టడానికి నేను కావాలేం? మీకు పిల్లల్ని కనడానికి నేను కావాలేం? మీతో

మాట మాట్లాడ్డానికి మాత్రం నేను పనికిరాను! ఎంత చదువు రాని మొద్దునైతే మాత్రం మీకు వూడిగంచేస్తూ మూలపడి వుండాలని ఎక్కడున్న దేమిటి? పొట్టకూటికి నేనేమీ వాచిలేను. కావాలంటే ఇంత ముద్ద పెట్టడానికి నాకు అమ్మా బాబూ వున్నారు. "ఆయనమనస్సు విరిగిపోయాక—ఛీ!— ఇంకా నే నిక్కడ దేనికి?" అని ఆ పాడుముండ ఈ వూరొచ్చిన మూడునెల్లనుంచీ నే ననుకోని రోజులేదు. కాని, పిల్లలు తగ లాటమైపోయారు. వాళ్ళని వొదిలిపెట్టి వెళ్ళలేక...

[పడక కుర్చీమీది తువ్వాలు తీసి పైన వేసుకుని భర్త వీధిలోకి దారితీస్తాడు.

భార్య. దాని దగ్గిరకేనా, ప్రయాణం? వెళ్ళండి; వెళ్ళండి. నా కాపరం తియ్యడానికే అదిక్కడికి తగలబడింది.

[వీధితలుపు గుభేలునవేసి భర్త వెళ్ళిపోతాడు.

భార్య. మాయదారి ముండ! నా ప్రాణానికి అదెక్కడినుంచి దాప రించిందో? దాని బొందపడ! దానింట్లో పీనుగెళ్ళ! [ఒక క్షణం ఆగి] దానికొంపకే వెళ్లుండాలి. లేకపోతే, ఇంత రాత్రి కాడ ఇంకెక్కడికి వెడతారు? ఆఫీసు అయ్యాక అక్కడే కూర్చొనొస్తూవుండాలి. లేకపోతే, రోజూ ఎనిమిది, తొమ్మిది గంటలదాకా ఏమి పనులుంటాయ్! దిక్కుమాలిన ముండ! సిగ్గుమాలినకుంక! దానికి బుద్ధిలేకపోతే ఈయనకైనా ఇదుం డొద్దూ? [వీధితలుపు తీసి, వీధివంక తేరిపారజూచివచ్చి] దాని కొంప పడమరవీధిలో వుంటే, ఇలా తూర్పుకి వెళ్ళారు దేనికో? ఆఁ! అదొక వేషం!....రెండుబజార్లు చుట్టివెళ్ళి, దానితలుపు కొడతారు. ఈసరికి అస లటు తిరిగే వుండాలి.మాయదారిముండ!

పండంటి నా కాపరానికి చిచ్చుపెట్టడానికే అదిప్పుడు.... [చప్పున ఏదో జ్ఞాపకానికి వచ్చినట్టు] అఁ! అన్నట్టు. ఇస్కూళ్ల తణిఖీకి అది సర్కూ చెళ్ళిందనీ, ఇంతలో మళ్ళీ రాదనీ విన్న దాని బంట్రోతు చెప్పిపోయాడుగా! [తప్పుచేసినదానివలె నోరు నొక్కుకుంటూ] అయ్యో! ఎంత పాపిష్టిదాన్ని! ఉత్తపుణ్యానికి నోటికొచ్చిన కూతలన్నీ కూసి ఇంత రాత్రికాడ ఆయన్ని బయటికి తగిలేశాను. మబ్బు పట్టుకొస్తున్నది. కొంపతీసి చినుకూడా పడుతుందేమో! తడిస్తే, ఆయనికి ఇట్టే జలుబు చేసుకొస్తుంది! నే నిప్పు డేం చెయ్యను? అయ్యో! నే నిప్పుడేం చెయ్యను? నిరు డొకసారి ఏదో మాటామాటా వొచ్చి, ఇట్టాగే తెల్లవార్లూ వీధులెంట తిరిగి తిరిగి, తెల్లవారేసరికి పుస్తెడు జలుబుతో, జ్వరంతో యింటి కొచ్చారు! అప్పుడు వారంరోజులకిగాని ఆయన కోలుకోలేదు. పాపిష్టిదాన్ని! ఇప్పుడాయన కేమి తెచ్చిపెట్టడాని కింత రాద్ధాంతం చేశానో గదా! [నెత్తీ నోరూ కొట్టుకుంటూ] నా ఖొందపడ! నే నెంత పాపిష్టిదాన్ని! అయ్యో! అయ్యో!!

తెర]



## పా త్ర లు:

రామయ్య · ఒక పల్లెటూరి గృహస్థు
మహాలక్ష్మమ్మ అతని భార్య
వెంకట్రావు: అతని కుమారుడు
సీతాపతి: అతని వేలువిడిచినబావమరిది

## స్థ లం:

రామయ్యగారి ఇంటి చావిడి

## కా లం:

వ ర్త మా నం



# శకునపక్షి

పల్లెటూరి ఆసామి ఇంటిచావిడి. కుడివైపున సింహద్వారం. ఎడమవైపున పెరటిలోకి ద్వారం. ఈ రెండు ద్వారాలకు ఒక్కొక్క పార్శ్వంలో ఒక్కొక్క కిటికీ. ఎదురుగా మరి రెండు ద్వారాలు· మొదటిది పడకగదిలోకి, రెండవది పడమటింటిలోకి. ఈ రెండు ద్వారాలమధ్య పసుపు కుంకుమలతో ఇనపపెట్టి. దానిపైన గోడకు ఆన్చి, ధనలక్ష్మిపటం. దానికి ముద్దబంతి పూలదండ. వీధితల గోడమూలకూ, పడకగది ద్వారానికీ మధ్యగా ఒక పెద్ద బీరువా. చావిడిమధ్య ఒక పడకకుర్చీ; దానిచెంత ఒక బెంచీ.

రామయ్య పడకకుర్చీలో కూర్చుని, బెంచీపైవున్న దస్త్రంలో నుంచి దస్తావేజుల్ని తీసి, పేజీల్ని తిరగవేస్తూవుంటాడు. అతడు యాభయ్యోపడిలో పడినవాడు. కురచగా, బొద్దుగా, గుమ్మటాన్ని పోలినవాడు. గండుముఖం, గుండ్రని పెద్దకళ్లు. నుదురుకూడా పెద్దదే. అంట కత్తిరించిన క్రాపు. మీసం గడ్డాలు లేవు. కొంచెం బొంగురుగొంతు. మాటతీరులో "వ్యవహర్తను సుమీ!" అనే భేషజం కనబడుతూ వుంటుంది. నీర్కావిధోవతి కట్టి, తెల్లలాల్చీ వేసుకున్నాడు.

మహాలక్ష్మమ్మ చావిడిలోనే ఒకపక్కగా కూర్చుని, కందిపప్పు చేట ముందు పెట్టుకుని, రాళ్లు ఏరివేస్తూ వుంటుంది. వయస్సు

నలభై ప్రాంతం. అభం శుభం ఎరగని పల్లెటూరి ఇల్లాలు. ముక్కుపైకి జారిన కళ్లజోడును సరిగాతోసి, కొత్త దస్తావేజును అందుకోబోతూ, "కాసిని మంచినీళ్లు తేవే!" అని రామయ్య అంటాడు. పప్పుచేట గాదిడిలోనే వదిలిపెట్టి, మహాలక్ష్మమ్మ పడమటింటి గుమ్మంగుండా లోపలికి వెడుతుంది.

ఇంతలో సీతాపతి వస్తాడు. వయస్సు నలభైలోపు. పొడుగ్గా, కొయ్యలాంటి శరీరంతో, తాటిచెట్టంటివాడు. సంస్కారం లేని పొత్తుక్రాపు; మాసిన గడ్డం; రొయ్యమీసం. పైకి వెర్రి బాగులవాడివలె కనబడినా, ఎత్తులలో నక్కను మించినవాడు. నీర్కావి ధోవతి కట్టి, నీర్కావి బనియన్ వేసుకున్నాడు. భుజంపై తుండుగుడ్డ, చేతిలో వెదురుకర్ర.

రామయ్య [అలికిడి కాకుండా ప్రవేశించిన సీతాపతిని చూచినంతనే]. ఏం సీతాపతీ! ఇలా వొచ్చావ్ ?

సీతాపతి. ఆఁ! ఏమీ లేదు, రామయ్యబావా! వూరికేనే.

రామయ్య. నువ్వూరికే రావేఁ!

సీతాపతి. నీ కొకరి అంటూ సొంటూ గిట్టదు. "నన్ను ముట్టుకోకు నామాలకాకి" అంటావ్. మరి, అందరం అలా వుండగలమా ?

రామయ్య. సర్లే! ఇంతకూ నువ్వొచ్చిన పనేమిటో చెప్పు. దాపరికం దేనికి ?

సీతాపతి. "చల్లకొచ్చి ముంత దాస్తున్నా"ననే! నీ దంతా చోద్యం రామయ్య బావా!

రామయ్య. నువ్వు వెయ్యి చెప్పు; లక్ష చెప్పు. వూరికేనే వొచ్చావంటే నేను నమ్మలేను.

సీతాపతి [నవ్వుతూ, బెంచీపై కూర్చుంటూ] "లాభంలేని సెట్టి వరదను పోడంటావ్" అంతేనా? ఇఖ, ఒక చుట్టం, పక్కం, రావడం, పోవడం, మంచీ చెడ్డా, ఏమీ లేదన్నమాటే!

రామయ్య. మాటలు నేర్చావులే! ఇంతకూ ఏమిటీ సంగతి?

సీతాపతి. ఆఁ! మరేమీ లేదు. మా లక్షమ్మకు సుస్తీచేసిందని విని, వుండబట్టలేక చూచిపోదామనొచ్చా! నువ్వు నన్నెంత పరాయి వాణ్ణిగా చూసినా, అది నాకు వేలువిడిచిన చెల్లెలు. [పడమటింటి గుమ్మంగుండా మంచినీళ్ళ గ్లాసుతో మహాలక్ష్మమ్మ వస్తుంది.] నీమాటే అంటున్నానమ్మా! నీకు నూరేళ్ళాయిస్సు. ఏమమ్మా! కొంచె మేమో సుస్తీ చేసిందట.

మహాలక్ష్మమ్మ. ఔనన్నయ్యా! అసలే కొనఊపిరిదాన్ని. ఈగాడు పులికి మరీ ప్రాణం బేజారై పోతున్నది.

[ఈ మాటల్ని అంటూ, భర్తకు మంచినీళ్ళు అందించి, తను వెళ్లి పప్పు చేటదగ్గిర తిరిగి కూర్చుంటుంది.

సీతాపతి. కాదూ, మరి? "రోహిణీ కార్తెలో రోళ్లు బద్ద లౌతా" యని ఊరికే అన్నారూ? ఈ యేడు మరీ నిప్పుల్ని చెరుగుతున్నది. ఈ పడమటి గాడ్పులికి మా పిల్లలు అవిటిల్లి పోతున్నారు. చల్లబొట్టు కూడా లేదేమో, ఎండి వొరుగై పోతున్నారంటే నమ్మ.

[వంగి కొసిని కందిపప్పు తీసి నోట్లో వేసుకుంటాడు.

మహాలక్ష్మమ్మ. మీ కిప్పుడు పాడిలేదేమే, అన్నయ్యా?

సీతాపతి. లేదమ్మా! నల్లపడ్డ యెండిపోయింది; పెద్దగేదేమో యెత్తడి పోయింధి; బోడావుపాలు దూడకే చాలడంలేదు.

"పాడిలేని యిల్లు పాతాళలోకం."దిక్కుసీక్కైనా లేక నానాశెరా పడుతున్నాం.

మహాలక్ష్మమ్మ. పోనీ, యెక్కడైనా కానీ పెరుగు వాడిక పెట్టు కోకపోయారా, అన్నయ్యా ?

సీతాపతి. ఏమో నమ్మా! "అమ్మబోతే అడివి: కొనబోతే కొరివి." కానీ పెరుగన్న పేరేగాని, యిల్లు గడుస్తుందా, పెరుతుందా ? అయితే, అమ్మాయ్! మీ పాలెంపడ్డ ఈవిందట గదూ ?

మహాలక్ష్మమ్మ. ఈనింది. కాని, ఏం లాభం ? విన్నదూడ నిడుస్తూ వుంటే, ఆ పాడుముండ - చెరువుగట్టు శేషమ్మ - కన్ను పడింది. దాంతో ఇఖ ఒఖ్ఖజీరైనా రాలిస్తే వొట్టు.

సీతాపతి. ఆ మాయదారిముండ యెక్కడ దాపురించిందమ్మా! "నరుడికంట నల్లరాయి పగుల్తుంది." పాటిమీది సాయిబును పిలిపించి దిష్టితాడు వేయించక పోయావా ?

మహాలక్ష్మమ్మ. మా చిన్నపాలేర్ని పోయిరమ్మంటే, ఆ వెధవ తలాయించాడు.

సీతాపతి. "తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు." ఈ పిదప కాలంలో పాలేళ్ళు తిన్నగా మాటకూడా వింటారుగా! రేపు ఆదివారంకదూ ? నే నెళ్ళి ఆ సాయబును పిలుచు కొస్తాలే! ఇబ్బందో, సబ్బందో నువ్వు రోజూ కాసిని మజ్జిగనీళ్ళు పంపించకపోతే మేం బతకడం కష్టం.

రామయ్య [అప్పటివరకు పడకకుర్చీలో వాలి, దస్తావేజుల్ని చూచు కుంటున్నవాడు చప్పున నిటారుగా కూర్చుని]. అదీ వరస! నేను ముందే అన్నాగా ? ఏదో పని పడకపోతే నువ్వురాకే!

సీతాపతి. వినవమ్మా బావగారి మాటలు: "అయినవాళ్ళకు ఆకుల్లోను, కానివాళ్లకు కంచాల్లోను". మొన్న రివిన్యూఇనిస్పెక్టర్‌గా రొస్తే, రెండువీసెలనెయ్యి సమర్పయామీ చేశాడు. కాని, కాసిని కుండ కడిగిననీళ్ళు నే నడిగితే, ఎన్ని చదువుతున్నాడో !

రామయ్య. నాకు తెలుసులే నీ సంగతి ! కాలికేస్తే మెడకి, మెడకేస్తే కాలికి. ఇంతకీ మాటలు నేర్చావ్. మజ్జిగకోస మొచ్చినవాడివి ముందే ఆమాట చెప్పరాదూ ? పరామర్శ, గిరామర్శ అంటూ ఈ నాటకమంతా దేనికి ?

సీతాపతి. వెనకటి కెవడో "కడుపులో లేంది కావిలించుకుంటే వొస్తుందా ?" అన్నాట్ట. నీకు నావాళ్లన్నమాటే లేనప్పుడు నే నెందుకోస మొచ్చినా, ఏదో బాముకోడాని కొచ్చినట్టే వుంటుంది. అసలు నీ చెల్లెలుకూడా "మా వొదినకు సుస్తీగా వుందట. చూచొద్దా" మంటూ బయల్దేరింది. కాని, "పొద్దు పోయింది లేవే. ఇప్పుడే మొస్తావ్-" అని నేనొక్కణ్ణే చక్కావొచ్చా.

మహాలక్ష్మమ్మ. బానన్నయ్యా! పొద్దుపోయింది. [భర్తతో] ఏమండీ ! అబ్బాయి ఇంకా భోజనానికి రాలేదు. పొద్దున్నెప్పుడో రెండు మెతుకులు తినెళ్లాడు. భాండాగారంలో వున్నాడేమో కాస్త కేకేసి రండి.

రామయ్య. వాడేమి చిన్నవాడా? చితకవాడా? వాడికి ఆకలైతే వాడే వొస్తాడు. సంసారంసంగతి సుతరామూ పట్టించుకోకుండా వాడు బలాదూర్ తిరుగుతూవుంటే, వాడెవక నేను పరుగు లెత్తలేను.

సీతాపతి. "సముద్రం ఈదవచ్చుగాని. సంసారం ఈదరాదు." ఈ కాలపు నాగమ్మల కేం తెలుస్తాయ్. సంసారంలోని సాధక బాధకాలు? అన్నదమ్ముల్లో పంచుకున్నది నాలు గెకరాల కొండ్ర. దాన్ని నీ ప్రయోజకత్వంవల్ల నలభై యెకరాల కండ్రిక చేశావ్.

రామయ్య [పొగడ్తకు లోలోపల సంతోషిస్తూ, పైకిమాత్రం]. ఆఁ! మన ప్రయోజకత్వ మేమున్నదిలే!

సీతాపతి [మహాలక్ష్మమ్మ దగ్గరికి జరిగి, చేటలోనుంచి మరి కాసిని కందిపప్పు తీసుకుని నోటిలో వేసుకుంటూ]. నీ ప్రయోజకత్వం కాకపోతే మరేమిటి, రామయ్య బావా? పట్టిందల్లా బంగారం చేస్తావ్. వ్యవహారాన్ని నడిపించడంలో కొమ్ములు తిరిగిన ప్లీడరైనా నీ తర్వాతే! నువ్వు గనక అన్ని కోర్టులూ తిరిగి, ఆ వారసత్వం వ్యాజ్యంలో నెగ్గు కొచ్చావ్‌గాని, మరొకడై తేనా పేడకడిలా చతికిలబడేవాడు కాదూ?

రామయ్య. నువ్వైనా సామాన్యుడివా? ఐదుగురు ఆడపిల్లల్ని విరగడచేశావ్; అప్పూసప్పూ లేకుండా గుట్టుగా సంసారం చేస్తున్నావ్.

సీతాపతి. ఆఁ! నామాటే చెప్పాలి! "వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తులాభారం తూగితే. కరెడ్ల కామమ్మ వంకాయలభారం తూగిం" దట. నీకంటె నాలుగెకరా లెక్కువే పంచుకున్నా. కాని, "నానాటికి తీసికట్టు నాగంబొట్టు" అన్నట్టుగా వుంది. చివరికి పుగాకు పాయకైనా తికానా లేదు. ఏదీ, రామయ్య బావా! ఒక పుగాకు పాయ ఇలా పారెయ్!

రామయ్య. ఇస్తాలే - కాస్త ఆగు [భార్యతో]. అయితే, ఏమే! పదమటిపొలం క్రయదస్తావేజు కనబడదే?

మహాలక్ష్మమ్మ. ఏమో, నాకేం తెలుసు, నేను వాటిజోలికి సొంటికి పోతాను గనకనా!

రామయ్య [చావిడిలోని బీరువాను వేలితో చూపిస్తూ]. ఈ బీరువాలో పెట్టిన జ్ఞాపకం. ఎంత గాలించినా ఆయిపులేదు. గదిలో వుందేమో మరి?

మహాలక్ష్మమ్మ. ఎక్కడ పెట్టుకున్నారో, ఏమో మీకే తెలియాలి. గది అలమారలోనే పెట్టుకున్నారో, కావిడిపెట్టిలోనే పెట్టుకున్నారో, పందిరిమంచం తలపెట్టిలోనే దాచుకున్నారో! మీ కాగితాల కిల్లంతా ఖాల్లంలేదు.

రామయ్య. చాల్లే - ఇక కట్టిపెట్టు! ఆ కాగితాల విలవ నీ కేం తెలుసు. కొంపమ విలబెట్టినా, కూల్చినా - అది ఆ కాగితాలకే చెల్లు!

[ఈ మాటలు అంటూనే పడకగదిలోకి వెడతాడు.

సీతాపతి - మా బావయ్యకు కాగితా లుంటే చాలు - కడుపు నిండుతుంది [చారెడుపప్పు తీసుకుంటూ]. సరిగాని, అమ్మాయ్! కాస్త మాట దక్కిస్తావుగా?

మహాలక్ష్మమ్మ. మజ్జిగమాటేనా? నువ్వింత యిదిగా అడుగుతూ వుంటే కాదనగలనా, అన్నయ్యా?

సీతాపతి. కాదన్నమాట నీనోట రావడమే! "కన్నుచూసి కాటిక; పిర్రచూసి పీట" వ్యవహారం కాదు నీది. కలవారైనా, లేనివారైనా, చుట్టపక్కాలంధర్నీ ఒక్కమాదిరిగా చూసుకుంటావ్.

నువ్వు అడుగుపెట్టిన వేళావిశేషం వల్లనే ఈ యింటి కింత అయిశ్వర్య మబ్బింది.

మహాలక్ష్మమ్మ. ఆఁ! నాదేమున్నదిలే! అది మా అబ్బాయి అదృష్టం. వాడు కడుపున పడ్డాకే మాకు కలిసొచ్చింది.

సీతాపతి. ఔనమ్మా! "బిడ్డపుట్టినవేళ; గొడ్డు వచ్చినవేళ" అన్నారు. వాడి దసలు సిరిగలముఖం. వాడి తెలివి, వాడి చదువు, వాడి నెమ్మది, వాడి మాట, వాడి మర్యాద - వాడికి వాడే తగు!

మహాలక్ష్మమ్మ. ఔనన్నయ్యా! ఊళ్ళో వాళ్ళందరు వాణ్ణి నెత్తి నెట్టుకుంటారు. కాని, మీ బావయ్యకుమాత్రం వాడిపొడయినా గిట్టదు. అది మరి వాడి ఖర్మమో, నా ఖర్మమో!

సీతాపతి. ఆఁ! మా బావయ్య మాటలకేమిలే? వాటిని నువ్వు పట్టించుకో వద్దమ్మా! మన వెంకట్రావుకే? విశేషంలాంటి వాడు. "తల్లికి తగినబిడ్డ; ఇంటికి తగిన పందిరి" అన్నారు. వాడి వన్నీ అచ్చంగా నీ పోలికలే! కట్టుకున్న పెళ్ళాం మంచి తనం మా బావయ్యకు తెలిసింది గనకనా, కన్నకొడుకు మంచితనం తెలియడానికి? పెద్ద లన్నారు గమా, "చూడగా, చూడగా గుర్రం గాడిదైం" దని.

మహాలక్ష్మమ్మ. నువ్వు నిజం పలుకుతావన్నయ్యా! వాడికి వడసారం యిరవై యేళ్ళయినా లేవు. అభంశుభం యెరగని వాడు. ఇప్పణ్ణుంచి వాణ్ణి సంసారం తీర్చి దిద్దమంటాడు మీ బావ.

సీతాపతి [ఇంకొక చారెడు కందిపప్పు చల్లగా అందుకుంటూ]. తనలా అందరూ నమలకుండా మింగా లంటాడు. ఇప్పు

దేమంత పట్టించుకోకుండా తిరిగినా, నాలుగేళ్లు పైబడితే, అంతా వాడే దిద్దుకు పోడూ? "తుళ్ళేయెద్దే గోనె మోసేది."

మహాలక్ష్మమ్మ. ఇప్పుడైనా ఏదో మీటింగులు, గీటింగులైతే వెళ్ళడంతప్ప, వాడైనా ఏమీ అల్లరి చిల్లరిగా తిరగడంలేదు.

సీతాపతి. అల్లరి చిల్లరిగా తిరగడానికి వాడు అజ్ఞానటమ్మా? చిన్నతనంనుంచీ చక్కగా చదువుకున్నవాడు. మాదేభ్యాన్ని చూడు! మూడేళ్ళనుంచీ ఇంకా మూడోక్లాసులోనే మిటక రిస్తున్నాడు. "అన్నం చొరవేగాని అక్షరం చొరవలేదు." ఆ! అమ్మాయ్! అన్నమంటే గ్యాపకమొచ్చింది. ఈ మండు టెండాకాలంలో కూరానారా లేక ఏమి యిబ్బంది పడుతున్నా మనుకున్నావ్!

మహాలక్ష్మమ్మ. ఔ నన్నయ్యా! అందరికీ చెడ్డ యిబ్బందిగానే వుంది.

సీతాపతి. నిజమేనమ్మా! ఇంతో అంతో అందరికీ యిబ్బందిగానే వుంది. కాని, మాకు మరీనీ, ముతకసామెత చెబుతారు చూచావ్: "మొగుడు లేకపోతే అప్ప మొగుడు; కూర లేకపోతే పప్పుకూర" - అలావుంది మా పని. సాంబారు కారం, మామిడికాయ పచ్చడీ పూటపూట యెదానవేసి కొట్టు కుంటున్నాం. నోరు చవి చచ్చిపోయిందంటే నమ్మ. సరిగాని, అమ్మాయ్! మాబావ వామిదొడ్డిలో కందాపెండలం పండించా డటగా? నీకు పుణ్యముంటుంది - మాకింత పంపిద్దూ!

మహాలక్ష్మమ్మ. దానికేమి భాగ్యంలే, అన్నయ్యా! రేపో మాపో పంపిస్తాలే.

సీతాపతి. తోడబుట్టిందైనా అంతమాట మా మంగినోట వొచ్చింది కాదు. "మాటలు శేటలు మాయింటను, మాపటిభోజనం మీ యింటను" అంటుం దది. సరిగాని అమ్మాయ్! నే నెళ్లి మన నెంక్రట్రావుని కూకేసిరానా ?

రామయ్య [దస్తావేజుతో చావిడిలోకి తిరిగివస్తూ]. వొద్దులే! వాడి కేం తీపరమా ? వాడి కడుపు కాల్తే వాడే వొస్తాడు.

మహాలక్ష్మమ్మ. మీదంతా అడివిగోల! కాస్త వెళ్ళి పిలవనిద్దురూ! వాడికోసం నేను కనిపెట్టుకు కూర్చున్నా.

రామయ్య [తిరిగి పడకకుర్చీలో కూర్చుంటూ]. వాడు పెత్తనాలు చేస్తుంటే, వాడికోసం నువ్వాగరడం దేనికి? నువ్వెళ్ళి భోంచెయ్యి.

మహాలక్ష్మమ్మ. నా కేమొచ్చె ? భోంచేస్తాలెండి.

రామయ్య. వాడికోసం కనిపెట్టుకు కూర్చుంటూ, వేళకూ, పాళకూ తిండి తినకపోతేనే ఈకాడికొచ్చాప్, నువ్వు మూలబడితే ఇంటి చాకిరి నీ సవితి ఎవ తొచ్చి చేస్తుంది ?

మహాలక్ష్మమ్మ [కోపంగా, చేట పుచ్చుకు లేచి]. చాల్లెద్దురూ! ఎవరైనా వింటే నవ్విపోతారు. మంచీ చెడ్డా లేదు. నోటి కెంతొస్తే అంతా అంటారు.

[పడమటింటిలోకి వెళ్ళిపోతుంది.

సీతాపతి. [ఒకక్షణం తర్వాత] ఏదీ, రామయ్య బావా! పుగాకు పాయ.

రామయ్య [రొండినుంచి పుగాకు వుండతీసి, ఒకపాయ అందిస్తాడు. తనకోసం ఒకపాయ తీసుకుని, వుండను మళ్ళీ రొండిని

పెడుతూ]. కుర్రవాడు పెరిగొచ్చాడు గదా, ఇఖ చిన్నపనికీ పెద్దపనికీ ఆదుకుని నా కష్టాలు ..

సీతాపతి [పుగాకు పాయితీస్తూ]. ఆఁ! నీ కష్టాలు నీవేగాని వాడి కేం తెలుస్తాయ్? "మోసేవాడికే తెలుసు కావిడి బరువు."

రామయ్య. నేనైనా ఒఖ్ఖసారిగా వాణ్ణి బరువంతా యెత్తుకో మనడం లేదు. ఇప్పటినుంచీ కాస్త కాడికిందికొస్తే మంచిదని మొత్తుకుంటున్నా.

సీతాపతి. అదీ నిజమే! "మొక్కై వంగనిదీ, మానై వొంగుతుందా?" పొలంపని చేతనైనా, కాకపోయినా ఇప్పట్నుంచీ ఏదో కాస్త కలుగజేసుకుంటూ వుండాలి మరి.

రామయ్య. పొలంపని చేతకాకపోతే పాయె. కరణం లెఖ్ఖలూ, కోర్టు దస్తావేజులూ అయినా చూసుకోరాదూ? బి. య్యే. వరకు మిణికినవాడికి ఆమాత్రమైనా చేతకాదూ?

సీతాపతి. "చదువుకున్నవాడికంటె చాకలివాడు మేలు." ఏమిటో ఈకాలం చదువులు. బియ్యే, గియ్యే సతికా మంటారుగాని, చివరికి చూడబోతే నోటుమీద వసూలెయ్యడమైనా చేతకాదు.

రామయ్య. ఏం చదువులో చట్టుబండలు! మొన్న ప్లీడరుగారి దగ్గరికెళ్ళి వ్యాజ్యం వాయిదా వేయించుకు రారా అంటే తెడ్డేమిరా కదిలాడు కాదు.

సీతాపతి. "మాటలు కోటలు దాటతాయి; కాలు గడప దాటదు."

రామయ్య. అబ్బే! అదీ లేదు. ఇంటి పనికైతే మొండిగాని, ఊళ్ళో పనికైతే యెగిరి గంతేస్తాడు. అడ్డమైనపనికీ, అడ్డమైన

వాడితో, అడ్డమైనచోటికీ తిరిగి, కొంపకేమి చేటుతెస్తాడో నని బెంగపడి చస్తున్నా.

సీతాపతి. నిజమే, రామయ్య బావా! "పోరాని చోట్లకు పోతే, రారాని మాటలు రాకమానవు". లక్షణంగా అనుభవిస్తూ, ఇంటి పట్టున కూర్చోక ఇవన్నీ మనవాడి కెందుకో? "కాలిదితీసి, నెత్తికి రాసుకోవడ" మంటారు దీన్నే.

రామయ్య. అబ్బబ్బబ్బే! ఇంటిపట్టున కూర్చుంటే యెలా? అయితే, మరి సభ లెవరు తీరుస్తారు? ఉపన్యాసా లెవ రిస్తారు?

సీతాపతి. "పగటి మాటలు పనికిచేటు; రాత్రి మాటలు నిద్రచేటు." ఎందుకొచ్చినట్టు ఈ సభలూ, గిభలూ. [రామయ్య తుమ్ముతాడు] చూచావ్, నామాట నిజం. "తుమ్ము తమ్ముడై చెబుతుంది" సరిగాని, రామయ్య బావా! నా ఆకుమడి అంటనే లేదు. పదిపోగుల ఆకు తక్కువపడితే, నువ్వు కాస్త మాట దక్కించాలి సుమీ!

రామయ్య. తడుపందక మా ఆకుమడీ అంతంతమాత్రంగానే వుంది. మీ తమ్ముడు లక్ష్మయ్య నడగరాదూ? ఎకరం మడి పోశాడట.

సీతాపతి. "నంబీ! నంబీ! నాపెళ్ళి కేమి సాయం చేస్తావంటే, నే నెదురు రాకపోవడమే సాయమన్నా" డట. అబ్బే! వాడి నడిగితే మాట పోతుంది. కాస్త రాలిస్తే నువ్వే రాల్చాలి.

రామయ్య. సరే! వీలునుబట్టి చూస్తాలే!....ఏమైనా పొలంపనీ, ఇంటిపనీ, కోర్టుపనీ - అన్నీ నేనే చూసుకోవాలి. వా డేమీ పట్టించుకోడుగదా? ఇటు వ్యవసాయానికీ, అటు ఉద్యోగా

నికీ కాకుండా చెడిపోయాడు. తాలూకా సభలనీ, జిల్లా సభలనీ చీటికీ మాటికీ బస్సెక్కి బస్తీలకు పరిగెత్తడం ప్రారంభిం చాడు కూడా.

[తనకోసం రామయ్య తీసి పెట్టుకున్న పుగాకు పాయ కుర్చీపక్కకు జారిపడుతుంది. అతడు దాన్ని గమనించడు.

సీతాపతి. [రామయ్యదగ్గరికి జరిగి, జారిపడిన పుగాకుపాయను కాజేస్తూ] "చెబితే సిగ్గు, దాస్తే దుఃఖం." వాడున్నాడే - వాడు, రామయ్యబావా! - కొత్తపేట కోటయ్యగారి రెండో వాడు - వాడి పేరేదో యేడ్చింది - ఆ వెధవ జతపట్టి నీ కొడుకు ముఖ్యంగా చెడిపోతున్నాడు. "మింగబోతే మెతుకు లేదు ; మీసాలకు సంపెంగనూనె" అన్నట్టు వాడి సీటు, వాడి గోటు నువ్వెప్పుడైనా చూశావా ?

రామయ్య. వాడా ? వాడిపేరు గుర్నాధం కాదూ ?

సీతాపతి. ఆఁ ! వాడే ! "కన్నెల పోయెనోయి కనకలింగమా అంటే, చేసుకున్న ఖర్మమోయి శంభులింగమా" అన్నాట్ట, ఆ వొంటికంటివెధవ జతపట్టి మనవాడు మరీ చెడిపోతున్నాడు.

రామయ్య. మన కొక అంటా, సొంటా ? వాడితో వీడికి జతేమిటో ?

సీతాపతి. అంటూ, సొంటూ కాకపోవడమేమిటి ? "వాడితండ్రీ, వీడితండ్రీ సయానా మగవాళ్లు" కాదూ ?

రామయ్య. అన్నట్టు వా డీమధ్య కొంపా గోడూ తెగనమ్ముకున్నా డట. వాడితో....

సీతాపతి. కొంపాగోడూ లేకపోతే మాత్రమే? పొద్దస్తమానం చేతిలో సంపాక టుంటుందిగా? "ఇల్లు కాలింది జంగమయ్యా అంటే, నా జోలే, కప్పెరా నావద్దే వున్నవన్నా"ట్ట.

రామయ్య. ఆ గుర్నాధం వాడూ పొంగుం లేని సన్నాసి. సఫలనీ, సంఘాలనీ రెండు మూడుదఫాలు జెయిలుకూ్కడా వెళ్ళాడుగా! వాడికేం? వాడెన్ని వేషాలైనా వేస్తాడు.

సీతాపతి. ఔను. "కోటివిద్యలు కూటికొరకే."

రామయ్య. వాడితో సమానంగా తిరిగితే, ఇఖ మావాడు ముంచు కొచ్చినట్టే! చూడగా నా బ్రతుకంతా బుగ్గయిపోయేలా వుంది. వాడికోసం కాకపోతే, ఈ దేవులాటంతా నాకు దేనికి?

సీతాపతి. ఎవరైనా రేపన్న రోజున్నదని కానాలి. "పాక లేనివాడు పోక చెయ్యడు." పోనీ, మంచో చెడ్డో తనకోసం తను ఖర్చు పెట్టుకుంటున్నాడు సరే! కాని, వాడికోసంకూడా నీకొడుకు. .

[వెంకట్రావు ప్రవేశిస్తాడు. ఇరవైయేళ్ళ వయస్సు. ఆకారంలో తల్లిపోలికల కంటె తండ్రి పోలికలే అధికం. విద్య, విజ్ఞానం తొలుకాడుతున్న ముఖం. కపటాన్ని సహించలేని ప్రవృత్తి. ఖద్దరుధోవతి కట్టుకుని, రౌండ్ కాలర్ అఘారం వేసుకున్నాడు.

వెంకట్రావు. సీతాపతి మామయ్యా! నా ప్రశంస చేస్తున్నావేమిటి?

సీతాపతి. అఁ! ఏంలేదురా, బాబూ!

వెంకట్రావు. ఏమీ లేకపోవడమేమిటి? ఇప్పుడే ఏమిటో అంటున్నావుగా?

సీతాపతి. అబ్బే! మరేమీ లేదు. నువ్వింకా అన్నానికి రాలేదని మీ అమ్మంటే మా వెంట మాటొచ్చింది.

వెంకట్రావు. ఏమైనా నావూసు నీకు దేనికి ?

సీతాపతి. "దూడా బర్రే వుండగా గుంజ అరిచిం" దన్నట్టు నీవూసు నాకు దేనికిరా, బాబూ! ఇంత పొద్దుపోయింది, ఇంకా అన్నానికి రాలేదని మీ అమ్మంటే....

మహాలక్ష్మమ్మ [పడమటింటిలోనుంచివచ్చి]. ఔనురా, నాయనా! ఇంతపొద్దోయేదాకా వుండకపోతే, వేళకొచ్చి రెండుమెతుకులు తిని పోరాదూ ?

వెంకట్రావు. ఏమంత పొద్దుపోయిందమ్మా ?—నీదంతా చోద్యం గాని !

రామయ్య. ఉహుఁ! పొద్దు పోనేలేదు. మరి కాసేపు పెత్తనాలు మిణికిరా!

మహాలక్ష్మమ్మ. సర్లే మీ రూరుకుందురూ! వాడింటి కొచ్చేసరికి చిందులు తొక్కుతారు. [కొడుకుతో] రా, నాయనా! నువ్వు రా! కాళ్లు కడుక్కో! అన్నం వొడ్డిస్తా!

[మహాలక్ష్మమ్మ పడమటింటిలోకి వెడుతుంది; వెంకట్రావు అనుసరిస్తాడు.

రామయ్య. చూశావా, వాడి వాలకం! నిజానికి దాని అలుసు చూసుకునే వాడింత నెత్తికెక్కాడు. పనిపాటలు లేకపోయినా, వేళకి భోజనం చెయ్యడానికైనా తీరుబాటు కావడంలేదు.

సీతాపతి. "కుక్కకు పనీ లేదు! తీరుబాటూ లేదు" అని వెనకటికి నీలాటి పెద్దవాడెవడో సామెత చెప్పలేదూ, రామయ్య బావా ?

వెంకట్రావు. [పడమటింటిలోనుంచి చరాలున వచ్చి] ఏమి టది? పిచ్చిపిచ్చిగా వాగుతున్నావ్!

సీతాపతి. "మనుష్యు లుండరుగాని, మాటలుంటా" యన్నారు. కాస్త పెద్దంతరం, చిన్నంతరం చూసి మాట్లాడరా బాబూ!

వెంకట్రావు. "మంచి మనిషికొక మాట; మంచి గొడ్డుకొక దెబ్బ" అనికూడా అన్నారు. మా గడప తొక్కొద్దని నీ కిదివరకొకసారి చెప్పలేదూ? మళ్ళీ ఎందుకొచ్చావ్?

సీతాపతి. "మాటకు మాట తెగులు; నీటికి నాచు తెగులు." నీతో నాకు మాట లెందుకులే?

వెంకట్రావు. నీ సామెతలు, గీమెతలు కట్టిపెట్టు. ఆ వప్పులు నాదగ్గిర రుడకవ్. జాగ్రత్తగా మసులుకోకపోతే...

రామయ్య. సర్లే ఇఖ ఆగు! సంతోషించాం!

సీతాపతి. కాగే కాగే పాలు, రామయ్య బావా! "పిల్లకాకి కేమి తెలుసు వుండేలు దెబ్బ."

వెంకట్రావు. చాల్లే నోరుముయ్!

రామయ్య [కోపంతో గద్దిస్తూ]. ఆఁ!

మహాలక్ష్మమ్మ [కేక విని లోపలినుంచి అడుగులో వచ్చి]. నాకు వొక్కగాను వొక్క కొడుకు. వాడింటి కొచ్చేసరికి ఏదో ఒఖ రభస ప్రారంభం!

సీతాపతి. "ఒక కన్ను కన్నూ కాదు; ఒకకొడుకు కొడుకూ కాదు."

రామయ్య. } ఒకే { ఛా ఛా! ఏమి టది! అశుభం మాట!
మహాలక్ష్మమ్మ } సారిగా { ఛీ ఛీ! ఏమి టది! వంకరకూత!

సీతాపతి. "పడ్డవారు చెడ్డవారు కాదు." సరే, అనడనండి. "వోరిస్తే వోరుగల్లే పట్టణమౌతుంది."

రామయ్య [తమాయించుకుని]. అంటే నీకు కోపంగాని, నువ్వన్న మాటేమిటి, సీతాపతీ?

వెంకట్రావు. "శుభం పలకరా మంకెన్నా అంటే, పెళ్ళికూతురు ముండే దన్నాడట." ఈ సామెత నీకు రా దేమిటి, సీతాపతి మామయ్యా!

సీతాపతి [దీన్ని వినిపించుకోకుండా]. ఏదో నోరు జారిందిలే, రామయ్య బావా!

వెంకట్రావు [విడిచిపెట్టకుండా]. కాని, సీతాపతి మామయ్యా! "కాలు జారితే తీసుకోగలంగాని, నోరు జారితే తీసుకో గలమా?"

సీతాపతి [దీన్నికూడా విననట్టే]. రామయ్యబావా! "బ్రహ్మకైనా పుండు రిమ్మతెగు" అన్నారు. నే నన్నది పొరపాటే. నువ్వు దాన్ని మనస్సులో పెట్టుకోవద్దు. మరి నే వెళ్లొస్తాగాని, నారు మాట మర్చిపోబోకు సుమీ.

రామయ్య. అబ్బే! వీల్లేదు సీతాపతీ! మాది మాకే చాలదు.

సీతాపతి. "దంచినమ్మకు బొక్కిందే కూలన్నారు." సర్లే! ఇంకొక పుగాకుతునకైనా ఇలా పారెయ్యి.

రామయ్య. ఇందాక చెయ్యిజారింది చాల్లే.

సీతాపతి. నాకు తెలుసుగా నీ సంగతి: "ఎక్కడైనా బావగాని, వంగతోట దగ్గిరమాత్రం బావకాదు." మరి నే వెళ్లొస్తాగాని, లక్షువమ్మా!, నీవొళ్లు కాపాడుకో. అసలే బక్కప్రాణం. రేపొద్దున్నుంచీ మజ్జిగనీళ్లకు పిల్లవాణ్ణి పంపుతామమ్మా!

మహాలక్ష్మమ్మ. ఒఖ్ఖగేదెపాడి. అబ్బే! మాకే తిన్నగా యిల్లు గడవదు.

సీతాపతి. పోనీలేవమ్మా! వీలు లేనప్పుడు నువ్వైనా ఏంచేస్తావు గాని, కొత్త కందాపెండలమైనా పంపిస్తావుగా?

మహాలక్ష్మమ్మ. ఊఁ! కందా పెండలం మే మిక్కడ ఆరబెట్టుకు కూర్చోలేదు.

[వెంకట్రావు పకపక నవ్వుతాడు.

సీతాపతి. నవ్వకు, బాబూ! నవ్వకు. "నవ్వు నాలుగు విధాల చేటు" [దారిని పడుతూ] ఇలా నవ్వినవాళ్లను చాలామందిని చూశాను. "నడమంత్రపు సిరి నరాలమీది కురుపు."

వెంకట్రావు.<br>
రామయ్య.<br>
మహాలక్ష్మమ్మ. } ఒకేసారిగా { నీ బొంద!<br>
ఆరి ఖడవా!<br>
నీ తల పగల!

తెర]



## పాత్రలు

పల్లెటూరి రైతు
అతని భార్య
అతని కొడుకు
అతని మనమడు



# కొత్త గడ్డ

తెర లేచేసరికి అప్పుడే భోజనం చేసివచ్చిన రైతు తన యింటిచావిడిలో మంచంపైన కూర్చుని చుట్ట కాల్చుకుంటూ వుంటాడు. అతనివయస్సు 50 పైగా, 60 లోపు. అతడు పొడగరి. కాయకష్టం చేసుకొనేవాడు గనుక, చేవతేలిన వొళ్లు. పెద్ద నుదురుతో, పెద్ద కళ్లతో, అక్కడక్కడ కొంచెం నెరసిన గుబురుమీసాలతో కళగల మొహం. నీర్కావి పంచె కట్టుకుని, నీర్కావి పైపంచె కప్పుకున్నాడు.

చావిడికి నాలుగు ద్వారాలు కనబడుతూ వుంటాయి. కుడివైపు నున్నది సింహద్వారం, ఎడమవైపు నున్నది పెరటిగుమ్మం. ఎదుటి రెండింటిలో ఒకటి పడకగది గుమ్మం, రెండోది పడమటింటి గుమ్మం. ఈ రెండింటిమధ్య పడకగదిలోకి కిటికీ. పడమటింటి గుమ్మందగ్గిరగా చావిడిలో ఒక ముక్కాలుపీటపై హరికేన్ లాంతరు వెలుగుతూవుంటుంది. రైతు కూర్చున్న మంచంకాక, మరొకటి పెరటిగుమ్మంవైపున గోడకు ఆన్చి నిలబెట్టి వుంటుంది. ఇతరసామగ్రి యేమీ లేకుండా చావిడి అద్దంవలె వుంటుంది. రైతు గొడ్ల చావిడి తలవాకిలిలో యింటికి యెడమపక్కగా వుంటుంది.

తెరలేచిన కొన్నిక్షణాలకు, పడమటింటిలోనుంచి మనమడు పరుగుపరుగునవచ్చి తాతవొడిలో గారాబంగా వొరుగుతాడు. ఇంచుమించు ఆరేళ్లవాడు, చాలా చురుకైనవాడు.

మనమడు. నాకే(—మరే:—కత సెప్పు, తాతా!

రైతు. [మనమని ముఖాన్ని రెండుచేతులలోకి తీసుకుని, నుదుటిని ముద్దు పెట్టుకుంటూ] కథ లొద్దు: కాకరకాయ లొద్దు. పద్యం చెబుతా నేర్చుకోరా బాబూ! [మనమని ఎత్తుకుని వాడిలో కూర్చోబెట్టుకొని] "శ్రీరాముని దయచేతను..."

మనమడు. "చీరాముని ..."

రైతు. "చీ" కాదురా, తండ్రీ! "శ్రీ"

మనమడు. అట్టాగే అన్నాను, తాతా!

రైతు. ఏదీ? మళ్ళీ అను: "శ్రీరాముని దయచేతను ..."

మనమడు. "చీరాముని ..."

రైతు. అదుగో! మళ్ళీ తప్పంటున్నావ్!

మనమడు. నాకు రావడంలేదు, తాతా!

రైతు. అదే వొస్తుంది. ఏదీ అను! "శ్రీరాముని దయచేతను...."

మనమడు. "చీరామునిదయ...."

రైతు. [మరింత స్ఫుటంగా ఉచ్చరిస్తూ] "శ్రీ"

[మనమడు సిగ్గుపడి, కళ్లు చేతితో కప్పుకుని, ముసి ముసి నవ్వులు నవ్వుతాడు.

రైతు. సరే, నాయనా! నీ కొచ్చినట్టే అనులే! "శ్రీరాముని దయచేతను...."

మనమడు. "చీరాముని దయసేతను...."

రైతు. "నారూఢిగ సకలజనులు నౌరాయనగా...."

మనమడు. "నారూడిగ చకల...."

రైతు. ["ఢి" ని నొక్కుతో] "నారూఢిగ...."

మనమడు. "నారూడిగ...."

రైతు. [మరి లాభంలేదనుకొని] "సకలజనులు నౌరాయనగా...."
మనమడు. "చకల జనులు నౌరా అనగా...."
రైతు. "ధారాళమైన నీతులు...."
మనమడు. "దారాళమైన నీతులు...."
రైతు. "నోరూరగ జవులుపుట్ట నుడివెద సుమతీ"
మనమడు. "నోరూరగ చెవులుపుట్ట...."
రైతు. [నవ్వుతూ] చెవులు కాదురా!—"జవులు"
మనమడు [తాత నవ్వుకారణంగా మాట అసలే తెలియక]. "జలుబు"
రైతు [మరింత బిగ్గరగా నవ్వుతూ]. జలుబట—జలుబు! జలుబెవరికిరా, బాబూ? [నవ్వు ఆపుకుంటూ] "జవులు" రా!—"జవులు"!
మనమడు. [మూతి బిగించుకుని] నే నను!
రైతు. ఏం బాబూ?
మనమడు. నువ్వు నవ్వుతున్నావుగా, అమ్మా!
రైతు. నవ్వనులే, బాబూ! ఇక నవ్వనుగా! ఏదీ?—అను! "జవులు"
మనమడు. "జవులు"
రైతు. "పుట్ట"
మనమడు. "పుట్ట"
రైతు. "నుడివెద సుమతీ"
మనమడు. "నుడివెద చుమతీ"
రైతు. "శ్రీరాముని దయచేతను...."
మనమడు. ఊఁ! నా కిదొద్దు తాతా!

రైతు. పోనీ, వేరే పద్యమేదైనా చెబుతాలేరా, బాబూ! "అక్కరకు రాని చుట్టము..."

మనమడు. నాకు పద్దా లొద్దు. కాకికత సెప్పు.

రైతు. కథలంటే చెవి కోసుకొంటావ్. ఎందుకొచ్చిన కథలు? కూటికా? గుడ్డకా? చక్కటి పద్యాలు నేర్చుకోరా, నాయనా!

మనమడు. ఉహుం! నాకు కతలే కావాలి.

రైతు. సర్లే! నువ్వు పడుకో—అట్టాగే చెబుతాలే [మనమని యెత్తి, మంచంపై పడుకోబెడతాడు.]

మనమడు. ఊం! చెప్పు మరి.

రైతు. కాస్త నిదానించరా, బాబూ! ఏదీ దుప్పటి కప్పుకో.

మనమడు. ఉహుం! నాకొద్దు. [కప్పుతున్న దుప్పటిని తీసివేయబోతాడు.]

రైతు. చలేస్తున్నది. నా బాబు కాదూ? కప్పుకో! [దుప్పటిని చక్కగా కప్పుతాడు.]

మనమడు. ఏం తాతా, కత సెప్పవే?

రైతు. ఎంత ఆరాటంరా నీకు కథలంటే! సర్లే! ఏంకథచెప్పను?

మనమడు. కాకికత.

తాత. రోజూ అదేనా? వినడానికి నీకు విసుగులేకపోతే, చెప్పడానికి నాకు విసుగు కాదట్రా? కొత్తది....కోతికథ.... చెబుతాలే. అనగనగ ఒక కోతి....

మనమడు. నాకు కోతి కతొద్దు! కాకికతే కావాలి.

రైతు. నీపంతమే నెగ్గాలంటావ్. సరే! నీ యిష్టమొచ్చినట్టే కానియ్యి. అనగనగ ఒక కాకి...

మనమడు. ఊఁ

రైతు. ఆ కాకికి ఒక మాంసంముక్క దొరికింది....
మనమడు. ఎక్కడ దొరికింది తాతా ?
రైతు. కటికివాడి కొట్టుదగ్గిర.
మనమడు. కటికివాడంటే ?
రైతు. మొన్న చెప్పాగదట్రా !
మనమడు. నాకు గ్యాపకంలేదు. మళ్ళీ సెప్పు.
రైతు. మేకల్ని, గొఱ్ఱెల్ని కోసి అమ్ముతాడే!—వాణ్ణి కటికివాడంటారు.
మనమడు. అవి ఏడవ్వా, తాతా, వాటిని కోస్తే ?
రైతు. పాపం! ఏడవ్వా మరీ ?
మనమడు. వాటికి తాతలేడూ ?
రైతు. [నవ్వుతూ] లేకే! వున్నాడు.
మనమడు. వుంటే—మరేఁ—నువ్వు మానాన్న నన్ను కొట్టబోతే అడ్డమొస్తావే! - అట్టా - మరి - వాళ్ళ తాత అడ్డంరాడూ ?
రైతు. [మరింతగా నవ్వుకుంటూ, మనమని చెక్కిలి ముద్దు పెట్టుకుని] ఎక్కడనుంచి పుట్టుకొస్తాయిరా నీకీ మాటలు! సరేలే! కథ విను! మాంసంముక్క తెచ్చుకుని....
మనమడు. ఊఁ!
రైతు. ఆ కాకి ఒక చెట్టుమీద కూర్చుంది....
మనమడు. ఏ చెట్టుమీద తాతా ?
రైతు. మన చెరువుగట్టున లేదూ ? — మఱ్ఱిచెట్టు, దానిమీద కూర్చున్నది. కూర్చుంటే ఒక నక్కొచ్చింది.
మనమడు. [ఆవలిస్తూ] ఊఁ!
రైతు. వొచ్చి ....

మనమడు. ఊఁ!

రైతు. కాకిబావా! కాకిబావా!....

మనమడు. ఊఁ!

రైతు. [ఇప్పటికి తానే కథలో లీనమైపోయిన ధోరణిలో] నువ్వు ఎంత అందంగా వున్నావ్! నీ అందంకంటె కూడా నీ పాట మరీ బాగుంటుందట! ఏదీ! ఒకపాట పాడు! అనిందట....

మనమడు. [నిద్రమైకంలోనుంచి] ఊఁ!

రైతు. అనేసరికి....

[మనమడు ఊఁకొట్టడు.

రైతు అనేసరికి ఆ కాకి కాఁ కాఁ అని అరిచిందట. [మనమడు నిద్రపోయిన సంగతి కానక] అరిచేసరికి కాకినోట్లోనుంచి మాంసంముక్క.... [మనమడు నిద్రపోయినట్టు తెలుసుకుని] ఏరా, బాబూ! నిద్దరోయావా? [మనమని వీపు నిమురుతూ] పసివాళ్ళు మాట్లాడుతూ, మాట్లాడుతూనే చిటుక్కున నిద్దరో తారు. వాళ్ళకు చీకా, చింతా? కల్లా కపట మెరగని వాళ్ళ బ్రతుకే బ్రతుకు. వాళ్ళు సాక్షాత్తు ఆ పరబ్రహ్మస్వరూపులే! సంసార లంపటంలో పడిపోయినవాళ్ళకు ఇటు మసిలి, అటు మసిలి, పడక కుదిరితేనేగాని కంటిమీద రెప్పపడదు. ఈ సంసారం—ఈ మమకారం—అంతా ఆ శ్రీరఘురాముడి చిద్విలాసం [కళ్లు మూసుకొని నమస్కారం చేస్తూ]

శ్రీ రఘురామ, చారుతులసీదళదామ, శమక్షమాదిశృం
గారగుణాభిరామ, త్రిజగన్నుత శౌర్యరమాలలామ! దు
ర్వార కబంధరాక్షస విరామ, జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ, భద్రగిరి, దాశరథీ కరుణాపయోనిధీ!

రాముడు, ఘోరపాతక విరాముడు, సద్గుణకల్పవల్లికా
రాముడు, షడ్వికార జయరాముడు, సాధుజనావనవ్రతో
ద్దాముడు, రాముడే పరమదైవము మాకని, మీయడుంగు గెం
దామరలే భజించెదను, దాశరధీ కరుణాపయోనిధీ ।

[ఆవలిస్తూ, చిటికలువేస్తూ, రైతు రామసంకీర్తన చేస్తూ వుండగా భార్య ప్రవేశిస్తుంది. ఆమె వయస్సు దాదాపు 50 సంవత్సరాలు. కాని, 60 నిండినదానివలె కనబడుతుంది. పొట్టిగా; బొద్దుగా వుంటుంది. గుండ్రనిముఖం. ముడతలుపడి కొంచెం దిగజారిన బుగ్గలు. ముప్పాతిక నెరసిన జుట్టు; మధ్యపాపిడి, కొప్పు ముడి. రూపాయివెడల్పు కుంకుమబొట్టు.

భార్య. దాని ముంచేసిన మేత యేసినట్టుగా వుంది. అదేమోగాని మన పెద్దగేదె ఒఖ్ఖపరకైనా కొరకడంలేదు.

రైతు. ఖర్మం ! గాళ్లు తగిలిందేమో ! కిష్టప్పగారి దొడ్డిని ఊడ్చేసిందని ఇందాక చెట్టుకాడ చెప్పుకుంటున్నారు. రేపు పొద్దున్నే కామయ్యనొకసారి పిలుచుకొచ్చి చూపిద్దాంలే ! ఎడ్లముందు మే తున్నదా ?

భార్య. ఆఁ !

రైతు. కాస్త ఎగదోసి, మరొక జనపకట్టేసి రాకపోయావూ ?

భార్య. ఎలిసి మీఁదున్నది. చీకట్లో నా కందుతుందా, పెడుతుందా?

రైతు. అబ్బాయి అత్తారింటికెళ్ళిన ఈ అయిదారు రోజుల్నుంచీ వాటికి తిన్నగా నీళ్ళూ మేతా లేవు. వాడుంటే అడుగడుక్కీ వాటి అజాగతీ కనుక్కుంటూ వుంటాడు.

భార్య. వాడు వెళ్ళి రేపటికి సరిగా వారం. ఈ వారం రోజుల్నించీ మనదొడ్డికి అయిపేదీ? ఊరుమందంతా వొచ్చి, ఆ వేసిన నాలుగు పరకలు మేసిపోతున్నాయ్. వాళ్ళకేమి పోగాలమేగాని, మరీ ఆ రత్తయ్యగారి గుంపు పలుపు విప్పి ఊరుమీదికి ఎగదోలేస్తున్నారు.

రైతు. ఊరు మాటుమణిగాక వాళ్ళ గొడ్డుగోవలు అస లెన్నడైనా కట్టుగొయ్యల నుంటేగా! దొంగ రత్తయ్యగారి సంపదని వాళ్ళకి మరి పూరికే పేరొచ్చిందీ?

భార్య. వాళ్ల తాడు తెంచారుగాని, మన అబ్బాయి ఇదిగో వస్తాన నెళ్లి ఇంకా రానేలేదేమో?

రైతు. సంకురాత్రి రేపు సోమవారంనాడేగా? పండగముందు వాళ్ళు రానివ్వొద్దూ?

భార్య. ఆఁ! పండగనీ, అల్లుడనీ, వాళ్ళ కిదే పట్టింది! ఆ లగ్గంకా డిచ్చిన గుడ్డలతర్వాత, మళ్లీ వాడు ఏనాడైనా ఒక పిలికైనా ఎరుగున్నాడూ? మన కివ్వవలసిన కట్నం మనకు పారెయ్యడానికి చేతులు రాకే "ఇదుగో, అదుగో" అంటూ రోజులు గడుపుతున్నారు. నే నొద్దన్నకొద్దీ ఈ పాడుసంబంధం నువ్వే తెస్తివిగా!

రైతు [బయట చప్పుడుకాగా ఆలకించి]. ఏమి టది? మనగొడ్ల చావిడిలో అలికిడౌతున్నది.

భార్య. ఆ దొంగ రత్తయ్యగారి మాయదారిమందే వొచ్చి పడిం దేమో?

రైతు. ఓరి వీటిని మాదిగాడికి తోల!—మనకి ఇవెక్కడ పంపక మైనై. [ఈ మాట అంటూనే మంచంపైనుంచి దిగ్గునలేచి

మూలనున్న కోలుపుకర్ర తీసుకునిబయటికి వెడుతూ]. జిర్రైయిఁ జిర్రైయిఁ!

[బయటనుంచి కొడుకుగొంతు: "నేను నాన్నా!"

భార్య. నువ్వటరా! బాబూ!

[రైతు గొంతు "నువ్వెప్పుడొచ్చావురా?"

కొడుకు. [ప్రవేశిస్తూ] ఇప్పుడే! వస్తూవస్తూ, గొడ్లముందు మే తెగదోసొద్దామని చొప్పరంలో కెళ్ళాను.

[వయస్సు 30 సంవత్సరాలు. ఈవయస్సునాటి రైతును ఊహించుకుంటే కొడుకు రూపును వేరే వర్ణించ నవసరంలేదు.

భార్య. పొద్దోయి, పోరటోయి ఇప్పు డొచ్చా వేమిరా?

రైతు. ఇంత చిమ్మచీకటిని పడి రాకపోతే, తెల్లారినా కొస్తే కాదట్రా? దస్తుకూడా వెంటున్నదేమో!

భార్య. తల్లీ బిడ్డా దాగున్నారట్రా?

కొడుకు. ఆఁ!

భార్య. పిల్లవా డెవరి పోలిక?

కొడుకు. ఏమో?

భార్య. ఎరుపా? నలుపా?

రైతు. ఆఁ! పదిహేనురోజుల గుడ్డు. వాడు తిన్నగా చూశాడో లేదో! నువ్విన్ని వైనాలడిగితే వాడేం చెబుతాడు?

భార్య. సర్లే! మగబిడ్డ - ఎట్టావుంటే యేంగాని, సరిసి బాగుం దట్రా? నన్ను తలుస్తున్నదా?

కొడుకు. ఆఁ! నాయనమ్మ దగ్గిరి కొస్తానని వెంటబడింది.

భార్య. తీసుకురాక పోయావట్రా ?- నాతల్లి నాదగ్గి రుండేదేమో? దాన్ని చూసి ఏళ్ళూ పూళ్ళూ అయినట్టుగా వుంది. ఎంద రున్నా అది లేకపోతే యింట్లో సందడే వుండదు. నా యావంతా దానిమీదే వుంది.

రైతు. సర్లే! నీ సోది కేమిగాని, ముందు వాడికి అన్నమొడ్డించు.

భార్య. పొద్దనెప్పుడు తిండి తిన్నావో! రారా! - కాళ్లు కడు క్కురా!

కొడుకు. సందేళ ఫోంచేసే బయల్దేరానమ్మా.

భార్య. ఇందా కెప్పుడో రెండు మెతుకులు తింటే అంతదూరం నుంచి ఇంతదూరం నడిచొచ్చేసరికి అరిగిపోకుండా మీ అత్తారు అంత పెద్దపెట్టు పెట్టారేమిటి? రా! రా! - వొడ్డిస్తా!

కొడుకు. అద్పే! ఆకలి లేదమ్మా!

[ఈ మాట అంటూ పట్టి విప్పి, దాన్ని పడకగదిలో వుంచి, తిరిగి చావిడిలోకి వస్తాడు.

రైతు. నువ్వింకా రాలేదని వాడు ధూంధాములు చేస్తున్నాడురా!

భార్య. అవునురా! ఉడుగుడు గొచ్చి పోతున్నాడు. సందేళరూడా వొస్తే "రేపో మాపో వొస్తాడులేవే, పిచ్చియ్య పెద్దయ్యా! వెళ్ళినాడు రాకుండా అక్కడే కూకుంటాడేమిటి?" అని నేను సర్దిచెప్పి పంపించా.

రైతు. ఎల్లుండికి నోటు లిమిటేషను పట్టి పోతుందట్రా! "మీ అబ్బాయి చూడగా కావాలనే ముఖం చాటేసినట్టున్నాడు. చాల్ చాల్ లేవయ్యా మీ మర్యాద! ప్లెయింటు పడేస్తా!" నంటూ వాడు పీధిని పడుతున్నాడ్రా.

భార్య. వాడినోటికి శుద్ధీ పద్దీ వుంటేగా? నోటి కెంత కూతొస్తే అంతా వూడేస్తాడు.

రైతు. మరి మీ మా మేమన్నాడురా? కట్నంబాపతు కొాదవ పైక మిచ్చాడా?

కొాడుకు. ఆ ఊళ్లో పొలా లిప్పుడు బాగా పండుతున్నాయి, నాన్నా! ఈ యేడు పుట్టీ ముప్పందుంకాడికి రాలిందట.

రైతు. ఆఁ! పండినేడు పండుతుంది; పోయినేడు పోతుంది. అది పాడు గరువునేల గాదట్రా.

కొాడుకు. లేదు నాన్నా! ఇప్పుడు మురుగుకాల్వ పడిందికాదూ? ములకెయ్యడంలేదు. బంగారం పండుతున్నది.

భార్య. మా యియ్యపురాలు వాకిట్లో పురులు కట్టేసిందేమిటి? అయితే ఆమెగారిముందు నే నిఖ అసలే నిలవలేను.

కొాడుకు. రెండోపంటకింద జనుం వేశారు, నాన్నా! ఏమి యేపుగా పెరిగిందనుకున్నావ్! చేలోకి దిగితే మనిషి కనబడ్డంలేదు. అక్కడకూడా ధరలు చకచక పెరిగిపోతున్నాయి. నిరుటికీ, ఈయేటికే ఎకరానికి రెండు మూడొందలు పెరిగింది. అయిదారేళ్ళనాడు వందకీ, వందంబాతిక్కీ, మూజూడనిదాన్నే ఇప్పుడయిదారు వందలకి అడుగుతున్నారు. ముందు ముందు ధరలింకా....

రైతు. ఆ చవిటిపఱ్ఱలమాట నాకు చెప్పకురా! ఏమైనా నల్లగడ్డ నల్లగడ్డే! ఊఁ! సరిగాని, పైకం పట్టుకొచ్చావా?

కొాడుకు. ఉహుఁ!

భార్య. ఇంకెన్నిసార్లు తిప్పించుకుంటారు? ఏడేళ్లనుంచి దగ్గిరెట్టుకున్నారు చాలదూ? [భర్తతో] నేను ఆనాడే అనలా?

"ఒకపొలి తే కేయిస్తే మనకు నిండిందా? ఇలాంటి చదివింపులు చాలా చూశాం! పెళ్లిపీటలదగ్గిర రొఖ్ఖం పోస్తేనే సరి" అని నే నంటే నువ్వన్నావిప్పా ?

రైతు. మరి, పిచ్చియ్య ఆగురాడ్రా? నోటు లిరగ రాసిస్తామన్నా వా డిఖ చెవినట్టించుకునేటట్టు లేడు.

భార్య. ఆ! ఇచ్చేవాళ్లైతే ఏనాడో యిచ్చేవాళ్లు. ముప్పైఏళ్లనాడు మాట్లు తిప్పించుమని, మూడేళ్ళనాడిచ్చిన అయిదారొందలే మనకేం ముట్టినా! మిగతాది గుమ్మాన పడిపోయినట్టే!

కొడుకు. ఎందుకొచ్చిన మాటలమ్మా, యివి? కావాలంటే, పక్కీతో సహా పట్టుకుపొమ్మని వా ళ్ళన్నారు. నేనే ఇప్పు డొప్పుటే అని చక్కా వొచ్చేశాను.

భార్య. అదేమిటిరా, బాబూ ?

రైతు. సరే కానియ్య! డిఃకో టముకేయించి, కొంపా గోడూ అప్పులాడు వేలం వేయించుకు పోతాడులే!!

భార్య. ఆ పిచ్చయ్య అంత పనీ చేయించడనా ? వా డెంతకైనా తగు!

రైతు. వేలం, జప్తులు నే నెన్ని డెరగను. ఇంత బ్రతుకూ బ్రతికి, ఇంటెనకాల చచ్చినట్టు, ఇన్నేళ్ళొచ్చాక ఇప్పుడు వీధికి లాగించుకుంటానా ? నీ పెళ్లాం తెచ్చేమాట నువ్వు భద్రం చేసుకో! సెంటో కుంటో తెగనమ్మి వాడిబాకీ వాడికి పారేస్తా!

కొడుకు. ఆ డబ్బేనా నాది ? ఈ కొంప్ర నాదికాదూ ? ఎప్పటి కప్పుడు ఇలా అప్పులై పోతూవుంటే చివరి కేమి విలుస్తుందనే నా ఏడుపు!

రైతు. నేనేమి జుర్రుకుంటున్నానా? సంసారమన్నాక అప్పూ సప్పూ కాకుండా వుంటుందా?

భార్య. నే నెవ్వరికీ ఏమీ దోచిపెట్టడంలేదు. ఇద్దరు ఆడపిల్ల లున్నారంటే వాళ్ళు పండక్కీ పబ్బానికీ ఆకులో ఇంత కుంక మైనా యెరగరు. పెద్దపిల్ల తొలుసూరిదానికి మొన్న పెళ్ళి చేసుకుంటే, "గాజులు తొడిగించుకోవే" అని పెళ్ళికూతురు చేతిలో పెట్టడానికి రూపాయి డబ్బులైనా నాకు గతిలేకపాయె! అమ్మమ్మకని అది దణ్ణం పెట్టొస్తే నలుగురిలో నాకు చెడ్డ సిగ్గేసింది.

కొడుకు నాకు కాకుండా మీరేమో చేస్తున్నారని నే నన్నానటమ్మా? రెక్కలు విరుచుకోవడమే కనబడుతున్నదిగాని, ఎవ్వరు బాముకుంటున్నదీ ఏమీ లేదు. మన రెండెకరాలమీద మనకొచ్చే అయివేజెంతో నాకు తెలవదూ?

రైతు. మరి అన్నీ తెలిసినవాడివేనా, ఇంత లక్షణంగా వ్యవహారం చేసుకొచ్చావ్?

కొడుకు. నే నొకటి అడుగుతాను, నాన్నా! మనం కష్టపడు తున్నామా? వాళ్ళు దాచుకుంటున్నామా?

రైతు. ఆఁ! నాదేమున్నదిలే! పెద్దవాణ్ణి అయిపోయాను. అంత కష్టం నీదే.

కొడుకు. అదే మన్న మాట! వయస్సులో వున్నవాణ్ణి. ఇప్పుడు కాకపోతే, నేను మరెప్పుడు పాటుపడతాను? కాని నలభై, యాభై యేళ్ళనుంచి చెమటోడ్చినా, ఈనాటికైనా నీడపట్టున కూర్చునే యోగ్యత నీకు లేదయ్యె! ఎండనక, వాననక,

పొద్దస్తమానం పాటుపడ్డా మన కేం మిగులుతున్నది? మూడేళ్ళనా డివ్వడేలిన అయిదారొందల అప్పు ఎలాగో యెత్తి పారవేశామనుకుంటే, మళ్ళీ నాలుగొందల అప్పు కనబడుతున్నది. ఇంతేనా?

భార్య. కలిసిరావడం లేదు- ఏం చేస్తాంరా?

కొడుకు. కలిసిరావడం, గిలిసిరావడం కాదమ్మా! మనకొచ్చే ఆదాయంతో మన కుటుంబం గడవదు. మరి అప్పుకా కేమౌతుంది.

భార్య. కొద్దిసంసారంలో తవ్వుకోవడం, పూడ్చుకోవడం, అందరికీ వుంటుంది. ఒక్క మనకేనా?

కొడుకు. ఊఁ! నీకు తెలియదులే, అమ్మా! మా ముత్తాత దబ్భై ఎకరాల ఆసామి. మా తాతలు పదేసి ఎకరాలవాళ్లు. మానాన్నల దగ్గిరి కొచ్చేసరికి రెండెకరాలు అయింది. ఇక, నావొడి కొచ్చేసరికి నేను రేపు కుంటా సెంటూ పంచిపెట్టాలి. అదైనా ఈకాస్తా ఈలోగా ఋణాలకింద హరించిపోకుండా మిగిల్తేనే. ఇప్పటి లెఖ్ఖనిచూస్తే, అస లేమీ మిగల్నే మిగల్దులే!

రైతు. అయితే, అప్పుడు నీపెళ్ళాం తెచ్చే ఆరొందలు విన్నా. ..

కొడుకు. అవి నన్ను ఉద్ధరించవులేఁ!

భార్య. మరి ఏమిటిరా నీ గొడవ?

కొడుకు. మనఖర్చుకు సరిపడ రాబడి యేర్పరుచుకోవా లంటున్నాను.

రైతు. లేని రాబడి రమ్మంటే, ఎలా వొస్తుంది? నారుపోసినవాడు నీరు పొయ్యడూ? అన్నింటికీ ఆ శ్రీరామచంద్రుడే వున్నాడు!

కొడుకు. దేవుడిచ్చిన ధాన్యంవేసి ప్రాయసంతే సరిపోతుందా నాన్నా? మన దేవులాటకూడా వుండాలి.

రైతు. అయితే నువ్విప్పు దేం చేస్తానంటావురా?

కొడుకు. మన రెండెకరా లమ్మితే ...

రైతు. తాత ముత్తాలనాటిగడ్డ అమ్ముకుంటావట్రా?

కొడుకు. ఎకరం మూడువేలకాడికి ఆయిపే వొస్తాయి. మన యిల్లు, పొద్ది అమ్ముకుంటే....

భార్య [నోరు నొక్కుకుంటూ]. అవ్వ! ఏనాడో పెద్దలుకట్టిన కొంపకూడా తెగనమ్ముకుంటావట్రా?

కొడుకు. పాతబట్టి వున్నది గనక మరొక రెండున్నర వేలయినా రావొచ్చు. ఈమొత్తం పెడితే ఆ వూళ్ళో...

రైతు. ఆఁ! చెప్పావ్ కాదు! అత్తారిపంచకి చేరాలనుకుంటున్నా వన్నమాట!

భార్య. మాయదారిమూక! వాళ్ళే నూరిపోసి పంపించారు.

కొడుకు. ఈమాట ఎక్కడొస్తుందోననే యిన్నాళ్లూ తటపటాయించాను. సరే! రావలసినమాట రానే వొచ్చింది గనక, మరి బరిలో పడతాను. ఏఁ! ఇక్కడి రెండెకరాలు అమ్మేసి, అక్కడ ఇరవై ఎకరాలు కొనుక్కోవడం చేదా?

భార్య. వున్నవూరు వొదిలిపెట్టుకు పోతారట్రా?

కొడుకు. ఏఁ! ఊరు బువ్వ పెడుతుందా?

భార్య. అదీ ఒక ఊరేనటరా! ఈగలు, దోమలు బుయ్యిమని ముసురుకుంటూ అడివూరు.

కొడుకు. అక్కడున్నవాళ్లూ మనుషులే.

భార్య. ఏం మనుషులురా వాళ్ళు? వొట్టి అడివి మనుషులు! పని మట్రం తెలిసింది మచ్చుకేనా కనబడదు. అసలు ఆ ఊరు మొత్తంమీద తీరైన కొంప ఒఖ్ఖటైనా వుండిందీ? అన్నీ, చుట్టు గుడిసెలే!

కొడుకు. అయితే, మనదేనా మహాపట్టణం?

భార్య. నీ కెవ్వరు చెప్పగలరుగాని, అలిగి అత్తారింటికి, చెడి చెల్లెలింటికి వోరాదురా!

కొడుకు. ఇప్పుడు ఎవరిమీద ఎవరు అలుగుతున్నారమ్మా?

రైతు. సర్లే! ఇల్లటమెళ్ళడం, నీకంత ముచ్చటగావుంటే నువ్వెళ్లు!

కొడుకు. ఆ ఊళ్లో కాకపోతే, ఆ చుట్టుపక్కల మరెక్కడైనా చేతినిండా కొంట్ర సంపాయించుకోగూడ దేమిటి?

రైతు. చేసుకునే సత్తా వుండాలేగాని, ఇక్కడ లేదేమిటి కట్టుబడి కెంత పొలమైనా?

కొడుకు. వాడి పొలం, వీడి పొలం కట్టుబడిచేస్తే మనకు నిండుతుందా? మూడేళ్లు పడరాని పాట్లుపడి, పాటిమట్టి తోలి, పెంట కట్టించి, దేవుడీనాం బలంచేస్తే, తీరా అది కాస్త అక్కర కొచ్చేసరికి, ట్రస్టీ దాన్ని పాటకు పెట్టించి, తన బావమరదిపేర కొట్టేయించుకోలా? పిచ్చిభూమో, యెచ్చిభూమో, అది మన దైతేనే మనం చెమటోడ్చినా, చెమటోడ్చి నందం. అందుకనే ఎక్కడికైనా వెళ్ళి, ఈ చారెడునేలకు, మరొక చారెడు సంపాయించుకుందామని నా ఆరాటం. ఇక్కడ ఈ పడేకష్టమే అక్కడ పడితే, అది సుక్షేత్రం కాదూ?

రైతు. మా కేమొద్దులే! అచ్చొచ్చిన భూమి అడిగిడే చాలు.

కొడుకు. ఏమి అచ్చిరావడం? ఎంత రెక్కలు విరుచుకున్నా కడుపు నిండక పోవడమేనా?

రైతు. ఏమైనా అర్త్రాకిపంచని చేరతావట్రా? అది మగసిరి పనేనా? అంతకంటె అడుక్కుతినడం మేలు!

భార్య. ఇంతకీ వాళ్ళ మాయమాటల్లో పడిపోయాడు.

కొడుకు. మాయమాట లేమి ఖర్మం! మంచిమాటలే! వాళ్లు రమ్మన్నప్పుడే వెళ్ళితే, నూరెకరాలు కట్టుకునే పని. అప్పు డక్కడ ఈ పాటైనా పైతొత్తిడి లేదు.

రైతు. ఇప్పుడైనా మించుకుపోయింది లేదులే! కావాలంటే నీది నువ్వు పంచుకు పో! ఈ కళ్ళను ఈ రెప్పలు మూసెం కాకపోతే, నీకు అక్కడ ఏంగతి పట్టేదీ చూడకపోతానా? పో! నీసగం నువ్వు పంచుకు పో! [మనమణిని చూపిస్తూ] వాడే నాకు కొడుకూ, మనమడూ అనుకుంటా! వాడైనా వుంటాడు నా గడ్డమీద.

కొడుకు. ఆమాట కొస్తే వాణ్ణి యిక్కడ వొదిలేసి పోతానా?

రైతు. ఏం! నేను చచ్చింతర్వాత నా యింట్లో దీపంపెట్టేవా డుండ గూడదనా?

కొడుకు. అయిన వూరొదిలిపెట్టడమంటే నాకు మాత్రం కాళ్లాడుతున్నాయనుకున్నావా? ఇక్కడ వొక యెకర మమ్మి, అక్కడ పదెకరాలు కొనాలనే ఈ తాపత్రయం నాకు దేనికి? నారెక్కల కష్టం [కుర్రవాడిని వేలితో చూపిస్తూ] వాడికి అక్కరకు రావాలని కాదూ? వాడి బాగెరిగిన వాడివైతే నువ్వు వూరినే పట్టుకుని వూరేగాలంటావా?

రైతు. [పట్టరాని కోపంతో] సర్లే! నువ్వే నాకు కానప్పుడు వాడు నా కొడుకా? తీసుకు పో! వాణ్ణికూడా తీసుకుపో! పోయి ఏట్లో కలువ్!!

భార్య. ఉ:! చాల్లే! ఏమిటా మతిలేని మాటలు? ఎవరైనా వింటే నవ్విపోతారు.

రైతు. నవ్వకేం? నవ్వుతారు! పైగా ఒక్కనోటితోనే నా నవ్వేది! కాలాన్నిబట్టి బళ్లు ఓడలౌతాయి; ఓడలు బళ్లు అవుతాయి. అలాగని జెండా పీక్కుని, ఊళ్లవెంట అడుక్కు తినబోతారా? ఎకరాలేనా ముఖ్యం? మంచీ చెడ్డా లేదూ! మా తాత ముత్తాతలు ఈ ఊరు పెత్తందారులు. ఏ పంచాయితీ వచ్చినా, ఈ నాటికీ మమ్మల్నే పిలుస్తారు. అమ్మోరిసంబరం జరిగితే తొలేట మాదే. ఎకరానికి నాలుగెకరా లొస్తుందని చూసుకుంటే సరేనా? వంశమర్యాద నిలబెట్టుకోవద్దూ? కూడులేక చచ్చిపోతారేమిటి? చచ్చినా, ఎవడి పంచని వాడు చస్తే, అదొక తీరూ దారీ. లేకపోతే, కాలు పుచ్చుకుని కుక్కనీడ్చినట్టు అవతలి కీడుస్తారు. ఎక్కడైనా తాగినరొమ్ము నే గుద్దుతారా? కన్నతల్లివంటి ఊరును కాలదన్నిపోతారా? పోరా! పో!! కావాలంటే, నువ్వు పో!!!

[రైతు కేకలకు మనమడు తుళ్లిపడి లేచి, ఏడుపు ప్రారంభిస్తాడు.

భార్య. చాల్లే! ఏమిటా గొంతుచించుకోవడం! పిల్లవాడు తుళ్ళిపడి లేచాడు. [దగ్గిరికి వెళ్ళి, కుర్రవాడి వీపునిమురుతూ] మాబాబుగా!

ఊరుకో! ఊరుకో!! [కుర్రవాడు ఏడుపు మానడు] బజ్జోరా, నాయనా! బజ్జో!

మనమడు [తాతవైపు చేతులుజాచి ఏడుస్తూ] తాతా! ఊః! ఊఁ!
[తాత దగ్గిరికి తియ్యడు. అతి కష్టంమీద ముఖం తిప్పేసుకుంటాడు.]

భార్య. నాయనవుగా! పడుకో! పడుకోరా బాబూ!

మనమడు. [ఇంకా యేడుస్తూనే] తాతా! తాతాఁ! ఊఁ! ఊఁ!

భార్య. దగ్గిరికి తియ్యవేఁ?—వా డలా యేడుస్తూవుంటే?

మనమడు. ఊఁ! ఊఁ! తాతా!

భార్య. నే నున్నానుగాదురా! బజ్జో బాబూ!

మనమడు. ఊఁ! ఊః! నాకు తాతే కావాలి...ఊఁ! తాతా!...ఊఁ!

రైతు [గాద్గదికంగా]. నీ తాత లేడురా, బాబూ! నీ తాత చచ్చిపోయాడు.

భార్య. ఇంతకీ నాకొచ్చిపడింది ఈ ఖర్మ!

మనమడు [ఏడుపు పెద్దదిచేసి]. ఆఁ! ఆఁ! తాతా! ఊఁ! ఊఁ!!

భార్య. అబ్బ! ఎత్తుకున్నదాన్ని నేను మనిషిని కాదట్రా? ఊరుకో!

కొడుకు. వెధవని రెండు చరిస్తే సరి! గారాం మరీ ఎక్కువైపోయింది!

మనమడు [భయదైన్యాలతో నిండిన కళ్లతో రెండుచేతులు చాచి, తాత వైపు విరిగబడుతూ]. తాతా!! తాతా!!!

[రైతు ఇక వుండబట్టలేక మనమని యెత్తుకుంటాడు. కప్పవలె కరుచుకుని, భుజంపై తల పొదువుకుని, మనమడు ఇట్టే తిరిగి నిద్రపోతాడు.

రైతు [రెండుమూడుసార్లు చావిడిలో పచారుచేసి, కొడుకుతో]. నీపట్టు నీదేనట్రా?

కొడుకు. నేనేమి ఏడ్పు ఏడ్చినా నాకోసంకాదు. అదుగో! అక్కడ ఆ పుట్టినవాడికోసం. ఇదుగో! ఇక్కడ ఈ పెరుగుతున్నవాడి కోసం. ఈ యిద్దరికి మరొక రిద్దరైతే, వాళ్ళని కూలికీ నాలికీ నిలబెట్టాలి!

భార్య. ఆఁ! చెట్టుకు కాయలు బరువటరా?

కొడుకు. అసలు చెట్టొకటి మిగిల్తేనా? మనం ఆరోజుకారోజు చేవదేల్తున్నామా? నీళ్లు కారుతున్నామా? మనకే? కష్టమో, సుఖమో మన బ్రతుకులు ఎలాగో వెళ్ళమారిపోతాయి. రేపు వాళ్ళ మాటేమిటి? వాళ్లు పాలేరుతనానికి నిలబడవలసిందేనా?

రైతు. నువ్వేమన్నా, ఆదికాలంనుంచి ఇది మన ఊరురా! ఊరు మొత్తంమీద ఒకప్పుడు మనదే పెద్దకుండ. కష్టమొచ్చినా, సుఖమొచ్చినా- చల్లనితల్లి- కడుపులో పెట్టుకు కాపాడింది. దీన్ని విడిచిపెట్టక తప్పదట్రా? [కొడుకు మాటాడకపోగా, దీర్ఘంగా నిట్టూర్చి] ఈ గడ్డమీద పుట్టాను; ఇక్కడే పెరిగాను; ఇక్కడే మట్టికూడా అయిపోదామనుకున్నా. కొత్తగడ్డమీద అడు గెట్టాల్సొస్తుందని కలలోనైనా అనుకోలేదు. [మరి రెండు, మూడుసార్లు పచారుచేసి] నాగలి పట్టిననాటినుంచీ నేను దున్నుకున్న నేలలో మరొకడు అడుగుపెడితే నాగుండె తరుక్కుపోదటరా? [కొడుకుమనస్సు మారుతుందేమోనని, ఒక్కక్షణంపాటు ఆగి, మరి లాభం లేదనుకుని] ఇంతవరకు నన్నెవ్వరు వొంగదీయలేదు. ఈనాడు [మనమడి వీపును

చేతితో తట్టుతూ] ఈ పసికందుకి వొంగిపోవాల్సొచ్చింది.
[ఒక త్రుటిపాటు ఆగి, ప్రారబ్ధానికి తల వొగ్గుతున్నట్టుగా]
సరే! నీ యిష్టమొచ్చినట్టే కానియ్యి!

[కొడుకు పెదవులపై విజయసూచకంగా చిరునవ్వు మొలక లెత్తుతుండగా—

తెర]



## పాత్రలు

| | |
|---|---|
| వెంకయ్య | సన్నకారు రైతు |
| రత్తమ్మ | అతని భార్య |
| గోపాలరావు | అతని కొడుకు |
| వరసమ్మ | అతని తల్లి |

## స్థలం

వెంకయ్యగారి యింటివసారా

## కాలం

వర్తమానం

గమనిక ఈ నాటిక ఈ సంపుటిలోని తక్కిన అన్నింటివలె స్వతంత్ర రచన. ఇది దేనికీ అనువాదం కాదు; అనుసరణైనా కాదు. కాని, దీనిలో హెరాల్డ్ ఛాపిన్ వ్రాసిన "ది డంబ్ అండ్ ది బ్లయిండ్" అనే ఏకాంకనాటిక "ఇన్‌ఫ్లుయెన్స్" కనబడుతుంది. దాన్ని చదివివుండకపోతే, దీనిరచన బహుశా జరిగివుండేది కాదు.



# వెలుగునీడలు

అది వెంకయ్యగారి యింటివసారా. రాత్రి ఏడుగంటల ప్రాంతం. వసారాలో కుడిపక్కని వాల్చిన కుక్కి నులకమంచం; ఎడమ పక్కని తవుడుమూట, ఉలవలబస్తా, వడ్లసంచులు వగైరా. వసారా మధ్యగా [ప్రేక్షకులకు ఎదురుగానున్న గోడ మధ్యలో] యింటిలోపలికి ద్వారం. ఈ ద్వారానికి ఎడమ పక్కగా గోడకు ఎత్తిపెట్టివున్న మరొక నులకమంచం. ఇంటిలోపలికి వెళ్లే ద్వారానికి కొస్త కుడిపక్కగా పాతకాలపు దీపపుస్తంభంపై కిరసనాయిల్ దీపపుబుడ్డి.

వాల్చివున్న నులకమంచం పడిమిని చిరిగిన 'జంఖానా' పక్కగా వేసుకొని నరసమ్మ కూర్చుని వుంటుంది. వయస్సు డెబ్బై ప్రాంతాలగాని, అరవై మించినట్టు ఒప్పుకోదు. వయస్సు పూర్తిగా మళ్లినదైనా ఓపిక ఉడగలేదు; మాపుకూడా ఏమంత తగ్గలేదు.

దీపపు బుడ్డివద్ద పుస్తకాలు చుట్టూ పరుచుకు కూర్చుని, గోపాలరావు – ఈ అబ్బాయి ముద్దుపేరు "గోపి" — పాఠాలు చదువుతూ వుంటాడు. ఏడెనిమిదేళ్లవాడు. నాయనమ్మ శిక్షణ కారణంగా కొన్ని ముదిమాటలు మాట్లాడ్డం కద్దు.

రత్తమ్మ గయ్యాళివలె పైకి కనబడినా, మనస్సు మెత్తనిదే. సంస్కారం శూన్యం. దానికి లేమి తోడైంది. కోడికూతతో లేచినా రాత్రి ఎనిమిది తొమ్మిది, గంటలవరకు తెమలని పని. అంతూ పంతూలేని పనివల్లనే చెడ్డ విసగటగా వుంటుంది. వయస్సు ముప్పై అయిదుకు మించదుగాని, నలభై చేసొన్నట్టు కనబడుతుంది. లేకలేక ఒక పిల్ల, ఒక పిల్లవాడు కలిగారు.

వెంకయ్య నలభై ఏళ్లవాడు. రెండు, మూడెకరాల ఆసామి. చిన్నపాలేరైనా లేకుండా స్వంతివ్యవసాయం చేసుకుంటున్న వాడు. వ్యవసాయపుపనులు లేనిరోజులలో కిరాయి ఆడతాడు. పొద్దస్తమానం నడుములు విరిగే పాటు పడేవాడు గనకనే చిర్రుబుర్రు లాడుతూవుంటాడు.

తెర లేస్తుందనగానే ఎక్కాలు చదువుతున్న గోపి పొలికేకలు, మంచంనడిమిని కూర్చుని గాలితోనైనా మాట్లాడగల నరసమ్మ సణుగుడు ప్రారంభమౌతుంది.

గోపి [తాపీగా]. ఒకపేడు ఏడు; రెండేళ్ళు పధ్నాలుగు; [గబగబ] మూడేళ్ళు ఇరవై ఒకటి; నాలుగేళ్ళు ఇరవై ఎనిమిది, అయిదేళ్ల ముప్పై ఏయేడు [తనకే సందేహం తోచగా, కళ్ళుతెరిచి, ఎక్కాల పుస్తకం చూచి, తప్పు దిద్దుకుంటూ] అయిదేళ్ళు ముప్పై అయిదు; ఆరేళ్ళు నలభై రెండు; ఏడేళ్ళు నలభై తొమ్మిది; ఏడేళ్ళ నలభై తొమ్మిది; ఎనిమిదేళ్ల ...ఎనిమిదేళ్ళ ... ఆఁ! ....ఎనిమిదేళ్ల....ఊఁ! ....ఎనిమిదేళ్ల [కళ్ళు మరింత గట్టిగా మూసుకుని] ఆఁ! ....ఊఁ! ....ఎనిమిదేళ్ల [తుపాకి పేల్చినట్లు] యాభై ఆరు; తొమ్మిదేళ్ళ అరవై మూడు [గమ్మ

స్థానాన్ని చేరేటప్పుడు కలిగే సంతృప్తిని ధ్వనిస్తున్నట్టుగా] పదేళ్ళ డెభై్భ [దీపపుబుడ్డిపైకి వంగి] పదకొండేళ్ళ....

నరసమ్మ. జుట్టు కాలేను. తిన్నగా కూర్చోరా బాబూ!

గోపి [విసుగ్గా]. ఏమిటే నాయనమ్మా! చెవికింద ఒకటే రొద. నేను చదువుకుంటావుంటే....

నరసమ్మ. సదువూ, సట్టుబండలు. దీపంమీదికి వొంగబడతావు దేనికిరా! కాస్త అవతలికి జరుగు. నీకు పున్నె ముంటుంది.

గోపి. అబ్బ! సరేలేవే! [మళ్ళీ తన ధోరణిలో పడి] పదేళ్ల డెభై్భ; పదకొండేళ్ళ డెభై్భయేడు [పట్టువిడుస్తున్నట్లు] పన్నెండేళ్ళ ఎనభైనాల్గు.

[గోపి వెనక్కి వెళ్ళి ఎక్కాన్ని వల్లెవేస్తూంటాడు. రసమ్మ తనలో తనేమో గొణుక్కుంటూ ంటుంది. ఇంతలో లోపలినుంచి చంటిపిల్ల ఏడ్పు ప్రారంభిస్తుంది.

గోపి [ఎక్కం వల్లించడం చాలించి]. అమ్మా! అన్నం పెట్టవే!

రత్తమ్మ [లోపలినుంచి]. ఆగరా! కాస్త ఆగు! పెడతాలే!

గోపి. ఆకలేస్తున్నదే, అమ్మా!

రత్తమ్మ [లోపలినుంచే]. ఆగమనేది విన్ను కాదట్రా!

గోపి [మారాం చేస్తున్నవాడివలె]. ఉహుం! ఇప్పుడే పెట్టాలి!

నరసమ్మ. వాడికడుపు సచ్చిపోతున్నట్టుంది. రెండు మెతుకులు పెట్టరాదటే, రత్తమ్మా!

రత్తమ్మ [చరచర వసారాలోకి వచ్చి]. నీకేం? మంచం నడిమిని కూర్చుని ఎన్నైనా చెబుతావ్! ఇక్కడ ఈ మాయదారిపిల్ల కుయ్యో, మొర్రో మని ఏడుస్తుంటే, ఎలా పెట్టమంటావ్?

నరసమ్మ. దాని కడుపుకి ఆమదం పెట్టకపోతే ...

రత్తమ్మ. పెట్టకేఁ! పొద్దున్నేగా మండబెట్టింది.

నరసమ్మ. దాని కింకా ఏడాదైనా ఎళ్ళలేదు. వారాని కొకసారి ఆమదం పెట్టుకుంటారచే ? మా కాలంలో..

రత్తమ్మ [వెటకారంగా]. ఊఁ! మీ కాలంలో ?

నరసమ్మ. నాకు దేనికిలే తల్లీ ? నే నేం సెప్పినా నీకు ఎటకారంగానే వుంటుంది.

గోపి. అబ్బ! అన్నమే అమ్మా !

రత్తమ్మ. ఏమంత పొద్దుపోయిందని ? ఇప్పుడేగా దీపా లెట్టింది! ఆ సతుకుడేమిటో మరి కాసేపు సతుకు.

గోపి. ఇవాల్టికి పాఠాలన్నీ చదివేశానే.

రత్తమ్మ. రెండు పొలికేక లెట్టేసరికి ఇవాల్టికి చదువైపోయిందన్నమాట. తినమంటే తింటావ్ ఒక దొచ్చెడైతే.

గోపి. ఉహుఁ! నే నిఖ చదవను.

రత్తమ్మ. ఇఖ చదవ్వేం ? ఏదీ పుస్తకంపట్టు! లేకపోతే ఈ చెంపా, ఆ చెంపా వాయిస్తా !

గోపి. ఉహుఁ!

రత్తమ్మ [చెయ్యెత్తి]. పట్టు! పుస్తకం పట్టు!

నరసమ్మ. ఖాడికాకలై వాడు కొట్టుకుంటూంటే....

రత్తమ్మ. సర్లే! గారాంచేసి నువ్వే వాణ్ణి సగం చెడగొడుతున్నావ్ !

నరసమ్మ. మేమూ కన్నాం పెంచాం గాని, ఇంత యిడ్డూరం ఎక్కడా యెరగనమ్మా !

రత్తమ్మ. నేనూ చాలామంది అత్తముండల్ని యెరుగున్నాగాని....

నరసమ్మ. అయ్యో! అయ్యో! ఎంతమాట! పెద్దదాన్ని నన్ను పట్టుకుని ముండంటావటే?

రత్తమ్మ. ఆమాట నే నన్నానా?

నరసమ్మ. అనలా? అని లేదంటావు దేనికే?

రత్తమ్మ. ఒట్టు వేసుకుంటావ్, ఆమాట నే నన్నానని?

నరసమ్మ. ఎదురు ఒట్టుకూడా దేనికిలే! ఇంతకూ నాకు సావు రావడంలేదు. ఆ మారాజుండగానే, నేను మట్టికలిసిపోతే అందరిచేతా ఈ మాటలుపడే ఖర్మం నాకెందుకు పట్టేది? కాలూ, సెయ్యీ ఆడుతూండగానే, ఆయన దాటిపోయి, నాకు.

[నరసమ్మ ఇంకా ఇలా ఏమేమో గొణుగుతూనే వుంటుంది. మధ్య మధ్య ముక్కు చీదివేస్తూ వుంటుంది.

రత్తమ్మ [తిరిగి చెయ్యెత్తి]. చదువుతావా? రెండో డ్డించ మంటావురా?

గోపి [వాచకాన్ని తీసి గొణుగుడుగా] ఒక పట్టణమున దనవంతు డగు వైశ్యు డొక డుండెను. అతని...

రత్తమ్మ. ఏం! అంకిళ్ళు నొక్కుకు పోయాయా? గొంతే లేవడం లేదు!

గోపి [బిగ్గరగా, కాని, గాద్గదికంగా]. బిడ్డ లొక్కచో జేరి యాడు కొనుచుండగా, నొక కాకిపిల్ల వారి సమీపమున బడెను. దానిని సంతోసమున...

రత్తమ్మ. అంతేలే! నీకు చదువుపేరు చెప్తేనే వలవల ఏడుపు.

గోపి [ఏడుపు దిగమింగడానికి ప్రయత్నిస్తూ]. దానిని సంతోసమున దీసికొని, యా బిడ్డలు దినదినము తమ యెంగిళ్ళుపెట్టి దానిం బెంచిరి. అదియు మిక్కిలి క్రొవ్వి, గర్వించి....

రత్తమ్మ [లోపల పిల్ల ఏడ్పు ఎక్కువకాగా]. ఆసి! దీని పీక పిసక! ఏమి ఏడుస్తున్నది! ఏమి ఏడుస్తున్నది !!

[రత్తమ్మ లోపలికి వెళ్ళిపోతుంది.

గోపి [మధ్య ఒక క్షణంపాటు ఆపిన చదువును తిరిగి సాగిస్తూ]. అదియు మిక్కిలి క్రొవ్వి, గర్వించి, ప్రపంచమున దానిసాటి పచ్చులు లేవనియు, బ్రహ్మదేవుడు సృష్టించిన సమస్త పచ్చులకు దాను సార్వభౌముడనియు భావించి, యెవ్వరిని సరకుసేయకుండెను. అటులుండ నొకనాడు అంసలు కొన్ని సముద్రతీరమున వ్రాలియుండ వైశ్యపుత్రులు కాకికి అంసల జూపి యిట్లనిరి: "ఓ పచ్చిరాజా! పచ్చులకన్నింటికీ నీవు చక్రవర్తివి. నీవలె స్రావ్యముగా బాడగల పచ్చి లేదు. నీవంటి యందమైన పులుగు లేదు. నీలాగున నెగిరి పరుగెత్తగల వియంగములేదు, ఈ అంసల జూడుము..."

[లోపల పిల్ల ఏడుపుతోపాటు రత్తమ్మ విసుగుదల, రత్తమ్మ విసుగుదలతోపాటు పిల్ల ఏడుపు ఎక్కువౌతూ వుంటాయి. బుజ్జగింపుల మధ్య "నీ తల్లి కొర!", "నీకడుపుడక", "నా ప్రాణానికి నువ్వెక్కడ దాపరించావే!" మొదలైన దీవనలు వినబడుతూవుంటాయి. తల్లి వేరే ధ్యాసలో వున్నది గదా అని గోపాలరావు చదువు మానేసి వాచకొన్ని విసిరి కొడతాడు.

నరసమ్మ [రహస్యం చెబుతున్నట్టు]. దెబ్బ లెందుకు పడతావురా, బాబూ! సదువుకో! మరి కూసేపు సదువుకో!

గోపి. ఉహుఁ!

నరసమ్మ [అంకిలి నొక్కుకుంటూ]. అదొచ్చిందంటే....మళ్ళీ యిరుచుకుపడుతుందిరా! సదువుకో! నామాటిని సదువుకో!

రత్తమ్మ [లోపలినుంచి వచ్చి]. వీపు దెబ్బల కేడుస్తున్న దేమిరా? మళ్ళీ మానేసి కూర్చున్నావ్?

గోపి [చేతికందిన పుస్తకాన్ని తీసి, మధ్యలో విప్పి]. మొండె మందలి వెన్నెముక, వెన్నుపూస లనబడు ముప్పదిమూడు చిన్న యెముకలచే కూర్పబడి యున్నది. [రత్తమ్మ లోపలికి వెళ్ళిపోతుంది] ఎదమబాగమందు ఏడు, రొమ్ముబాగమందు పండ్రెండ్రు, నడ్డిబాగమందు ఐదు, తుంటిబాగమందు అయిదు, తోకబాగమందు నాలుగు....

నరసమ్మ. తుంటేమిటి? తోకేమిటి? ఏమి సదువుల్రా ఇవి? మాకాలంలో మే మిలాంటి వెరగం. ఏదో బారతమనీ, బాగోత మనీ, రామాయణమనీ - అంతేగాని మేమీ సోద్యా లెరగం. ముసిలిముండని నేనుకూడా కాస్త యింటా. పద్దెమేదైనా సదవరాదటరా, బాబూ!

గోపి. ఉఁ! పోవే. నాకాకలై నే సస్తూవుంటే....

నరసమ్మ. నిజమేరా, బాబూ! సదువుకునే వాళ్ల కసలు యేడి తల కెక్కుతుంది. ఏళకూ పాళకూ అళ్ళకి తిండీ తిప్పలూ లేకపోతే, మెదడు కరగిపోతుంది. మాకాలంలో....సర్లే! ఎందుకొచ్చిందిగాని, మరి కూసేపు సదువుకో బాబూ! నాయ నవుగా! నేనుకూడా యింటా! యేదీ!....ఒక పద్దెం సదువు.

గోపి. ఏం పద్యం చదవను ?

నరసమ్మ. ఏదో ఒకటి - నీ కొచ్చింది.

గోపి. ఎలుక తోలుతెచ్చి ఎందాక నుతికినా
నలుపు నలుపెగాని, తెలుపుకాదు ;
కొయ్యబొమ్మతెచ్చి కొట్టిన పలుకునా
యిస్వదాభిరామ యినరయేమ.

నరసమ్మ. తుంటీ తోకా ఐంది - ఎలికీ, పిల్లీ, కుక్కా, నక్కా అని మొదలెట్టావ్! రామా, కృష్ణా అనే ముక్క చెవినేసుకుందామంటే, అది యినపడనే యినపడదుగదా !

గోపి. "యిస్వదాభిరామ యినరయేమ"లో "రామా" లేదటే !

నరసమ్మ. రామాయణంలో ఎలికీ, పిల్లీ ఎందుకొస్తాయిరా ?

గోపి. ఊఁ! పోవే నీముఖం! నీకేం తెలుసునని !

[సర్వం తనకే తెలుసునన్న దర్పంలో పద్యాన్ని వల్లెవేయడం ప్రారంభిస్తాడు.

నరసమ్మ [తనలో తను]. చిన్నాళ్ళు మొదలు, పెద్దాళ్ల దాకా అందరూ నన్నిదిలించే వాళ్లే! ఇంతకూ కాలం మారిపోయింది. మా కాలంలో - ఆ రోజు లిప్పు డెందుకొస్తాయి ? అప్పుడు పెద్దాళ్ళకు నచ్చినా ఎదురు సెప్పేవారా ? సెబితే ఐతక నిచ్చేవారా? మా అత్తముండమానానికి మా అత్తముండ కూర్చుంటే ఒక మొట్టికాయ, నుల్చుంటే ఒక మొట్టికాయ ఏసేది. ఇఖ మా మామగున్న వున్నాడంటే, "సొబ్బన్నా" అని పేరు సెబితే పాలు, కాకులు నీళ్ళు తాగేవికావు. ఆరోజులూ పోయాయి, ఆ మడుసులూ పోయారు. [ఒకటిరెండు క్షణాలపాటు ఆగి],

తెకతెక లాడిపోతోంది. వాన కురుస్తుందేమో! కురిసేది, బాగా కురిసినా బాగుండును; రెండు ఉబ్బ సినుకులు పడిపో తున్నది. పనిపెరుపు తప్ప మరేమీ లేదు. మాకాలంలో ఆసాడ మాస మొచ్చేసరికి కుండలతో దిమ్మరించేది. శావణ మొచ్చినా, ఇప్పుడు సరిగా వానే లేదు, కాలం మారినట్టే, అదీ మారింది [ఒక క్షణం ఆగి] పొన్నిగారిసత్తి కూతురుసేత స్రావణ సుక్రారం నోము నోయించింది కామాలు. అప్పయ్య కోడలు పప్పలు పుచ్చుకుని, ఊరెంట బైల్దేరింది. అమ్మో! అదెక్కడ! అది గజ్జెలగుర్రం! దాన్ని పట్ట పగ్గాలు లేకండా వున్నాయి. "ఏమే కూతరా!" అని పలకరిత్తే, యినిపించుకో కండా సక్కాపోయింది. ఏమి సూసుకునో అంత పొంగు! [ఇంకొక క్షణం ఆగి] అదుగో! సినుకు మొదలైంది. మా యంకయ్య పొలంనుంచి రానేలేదు. కర్మం! వానలో తడుస్తాడో, యేమో! నాల్గురోజుల్నుంచి తీస్తున్నా కలుపు కాకండానే వొచ్చింది. రోజుకు బిళ్ళకుడుంలా రూపాయిస్తున్నా. యిప్పు డసలు కూలోడు పలుకుతున్నాడూ? మాకాలంలో అణా బేడా యిస్తే....చంటది సందేశనుంచి తెగేడుత్తాంది. పిచ్చిముండ! దడుసుకున్నదో, యేమో! దానికి వారాని కొకసారైనా దిష్టంటూ తీస్తేగా! [ఒక క్షణం మళ్ళీ ఆగి] జల్లు పెద్దదైంది. మా యంకయ్య...[వెంకయ్య వస్తాడు.] ఏరా! అబ్బాయ్! ఇవ్వాళ మరీ ఇంత పొద్దోయిందే? వానకి తడవలేదుగదా? [వెంకయ్య జవాబుచెప్పడు. పైపంచెతో తల తుడుచుకుంటూవుంటాడు] ఉహుఁ! నాతో ఎందుకు పలుకుతాడు! ఏదో ముసిలిముండ దాని వాగు దది వాగు తుందని....

వెంకయ్య. ఊ! నీ చాదస్తం కాస్త కట్టిపెట్టవే! [పైపంచెను గడంచి మీద ఆరవేయడానికి వెడుతూ, రత్తమ్మ నుద్దేశించి] ఒసేయ్! పొంతని వేన్నీళ్లు ఏమైనా వున్నాయా?

రత్తమ్మ [వసారాలోకి వస్తూ]. వున్నాయ్!

వెంకయ్య [కునికిపాట్లు పడుతున్న గోపితో]. భడవా! చదువు పేరు చెబితేనే నీకు కళ్లు కూరుకొస్తాయ్! పోనీ నిద్రపోయే వాడివి తిన్నగా పోక గంటంలా దీపంపెట్టి, దానిముందు కునికిపాట్లు పడ్డందేనికి?

గోపి. అమ్మ నా కింకా అన్నం పెట్టలేదు, నాన్నా!

రత్తమ్మ. పిల్లది పోరుపెట్టి ఏడుస్తుంటే, దాన్ని కాస్త దగ్గిరికి తీసే దిక్కేడిస్తేనా! ఎలా పెట్టను?

వరసమ్మ. కూసుంటే లేవలేను, లేస్తే కూసోలేను. నా మొఖం! దాన్ని నే నెత్తుకోగలనా, పెట్టగలనా? కాలూ సెయ్యా ఆడు తున్నంతవరకూ సెయ్యలేదూ? వాళ్లు దాసుకున్నానా? నేను సతమతంకాండే, ఈ కొంప ఒక దిక్కుకొచ్చిందీ!

వెంకయ్య [రత్తమ్మతో]. సర్లే! ఆ పొంతలో నీళ్ళిలా తగలెయ్యి!

రత్తమ్మ. దూడ వింకా యిడవలేదు.

వెంకయ్య. ఏం? నేను యేవేళ కొచ్చినా, నాకోసం ఆపని అట్టే పెట్టాలా?

రత్తమ్మ. నాకైనా పదికాళ్లూ, ఇరవై చేతులూ లేవు. అన్ని పన్లకీ నే నొక్కదాన్నే ఎక్కడ చచ్చేది!

వెంకయ్య. చాల్లే! చెంబిలా తగలెయ్!

[రత్తమ్మ విసురుగా చెంబు తెస్తుండగా రంగుమని గడప తగుల్తుంది.

వెంకయ్య. ఏఁ! అంత దూకుడు! చెంబు పగిల్తే నీ అబ్బగాడెవడు తెస్తాడు? [రత్తమ్మ చేతిలోనుంచి చెంబు గుంజుకుని, గోపాల రావుతో] ఓరే! గోపీ! రారా! కాస్త దూడని పట్టుకుం దువుగాని.

గోపి. వాన కురుస్తున్నది నాన్నా!

వెంకయ్య [గద్దిస్తూ]. మొక్క మొలిచిపోవులే! రా!!

గోపి. ఉహుఁ. చీకట్లో నాకు భయమేస్తుంది!

వెంకయ్య. వొస్తావా? రెండు వుతకమంటావా?

[గోపాలరావు యిష్టంలేకండా కదుల్తాడు. వెంకయ్య కూడా పశువులచావిడిలోకి వెడతాడు.

రత్తమ్మ [పిల్లదాని ఏడుప్పు మరింత ఎక్కువకాగా]. ఆసి దీని దుంపతెగ! ఎవరో కొట్టినట్టేడుస్తున్నది!

[లోపలికి వెడుతుంది.

వరసమ్మ. నిన్నటి ముండనా, మొన్నటి ముండనా! అప్పుడే అరవై ఏళ్లొచ్చినై. సూపైనా తిన్నగా ఆనడంలేదు. ఇంకా నేను సేసిపెట్టడంలేదని సాదింపులు. ఒకళ్ల సేత సేయించుకోకండా వుంటే, నేను సేసినంత ఫలం. [పిల్లను రత్తమ్మ రెండు చరుస్తుంది; పిల్ల గుక్కపట్టి ఏడుస్తుంది] మొగుడిమీద కోపం ఆ పసిదానిమీద సూపించడం దేనికో? నోరూ వాయీలేని నెత్తురు గుడ్డు! అదేం పాపం సేసింది? మాకాలంలో మేము ఇలాంటి వెరగమమ్మా! ఆ దిక్కుమాలిన దేముడు ఒక మగ బిడ్డని, ఇద్దరు ఆడపిల్లల్ని మిగిల్చాడేగాని, నేనూ ఆరుగుర్ని కన్నాను; అయిదారేసేళ్లు పెంచుకున్నా. కాని, ఇంత యిడ్డూర

మెరగను. ఏదో యిప్పుడు మాయదారికాలం....ఇది పిదప కాలం కాకపోతే, ఆడు - పెదకిట్టప్పగారి సిన్నోడు - ఆడంత మిడిసిపడతాడూ? ఆడి కున్నది ఇరవై ఎకరాలు. పెద్దకూతురికి రెండకరా లిచ్చి, మూడేలు పోశాడట. ఇంకా ముగ్గు రున్నారు కూతుళ్లు. అందర్నీ ఈ లెక్క నిరగడ సేస్తాడూ? సేస్తే, కొడుకుల కేం మిగులుస్తాడు. సిప్ప సేతికిస్తాడా?....సినుకు మరికాస్త పెద్దదైంది. సినుకులో సిన్న సన్నాసి తడుస్తున్నా డేమో! రాత్రి రెండుజాములైనా వాడి కింత ముద్దే పెట్టదయ్యే! నేనూ సంసార మీదాగాని....[రెండు కునికిపాట్లుపడి] పాడు దోమలు! తెగ పీక్కుతింటున్నాయి. తెల్లార్లూ జాగారమై పోతూవుంటే! కంటిమీద నాకు కునుకే పడకపోయినా - నే నంట: - తెగ గుర కెడుతున్నానంట! నే నెంత సెమిటి ముండనైనా అంత గుర కెడితే నాకు కూస్తైనా యినబడదూ? నే నంటేనే అంతా ఒంటికాలి మీదొస్తారు:...[తిరిగి కునికి పాట్లు పడుతుంది.]

గోపి [పరుగెత్తుకొస్తూ]. అమ్మోయ్! నాన్ననే...

నరసమ్మ. ఏమిట్రా బాబూ!

గోపి. అమ్మోయ్!

రత్తమ్మ [చప్పున బైటికివస్తూ]. ఏరా! ఏమిటి?

గోపి. నాన్ననే....

రత్తమ్మ. ఏమిట్రా?

గోపి. ఆవు తన్నిందమ్మా!

నరసమ్మ. అయ్యో నా బిడ్డా!

రత్తమ్మ. ఆఁ! ఆఁ!

గోపి. ఎదురొమ్ముమీద తన్నిందే! పడిపోయాడు!

[రత్తమ్మ దొడ్డిలోకి పరిగెత్తుకు వెడుతుంది. గోపాలరావు అనుసరించబోతాడు. ఎక్కడలేని ఓపికతో నరసమ్మ మంచంమీదినుంచి లేస్తుంది.

నరసమ్మ. దీపం తీసుకురా, బాబూ! సీకటి మేళాంకూడా కామాలు! పద పద!

[గోపాలరావు దీపం పట్టుకుంటాడు. నరసమ్మ రెండడుగులు వేసేసరికి, రత్తమ్మ భుజంపై చెయ్యివేసుకుని వెంకయ్య లోపలికి వస్తాడు.

నరసమ్మ. అదుగో! నా బాబే వస్తున్నాడు! అయ్యో నా తండ్రీ! పొద్దున్నే ఎవరి ముఖం చూశావురా!

వెంకయ్య. ఆఁ! ఏమీ లేదే! మీదంతా వొట్టి ఖంగారు. తాపు తగల్లేదు; దూసుకుపోయింది.

రత్తమ్మ. కమిలి పోయినట్టుంటే, దూసుకు పోవడమేమిటి?

నరసమ్మ [గాద్గదికంగా]. అయ్యో! నా బిడ్డా!

వెంకయ్య. ఆఁ! దాని మాటలకేమిలే? మోపుగా తగల్లేదమ్మా!

రత్తమ్మ. అత్తయ్యా! ఈయనగార్ని కాస్త రెక్కట్టుకో! నేను మంచం వాలుస్తా.

వెంకయ్య. రెక్కట్టుకోడమా? నీ మొఖమా! చాల్లే యిఖ!

నరసమ్మ [దీన్ని వినిపించుకోకుండా, రెక్కపట్టుకుని]. ఇంకా నయం! లేసినేళ బాగున్నది. బిడ్డవు దక్కావ్!

వెంకయ్య. ఊఁ! కాస్తంతని గంపెడంత చేస్తున్నారు మీరు.

రత్తమ్మ [గోపితో]. బాబూ! ఆ దీపం అక్కడెట్టి దిండు తే. [మంచం వాల్చిన తర్వాత, వెంకయ్య రెక్క ఊతంగా పట్టుకుని] రండి! పడుకోండి! కాస్త ఆముదంతో కాపైనా కాస్తా!

వెంకయ్య [మంచంపై నడుం వాలుస్తూ]. ఆఁ! కాపులూ గీపులూ దేనికే? అదే పోతుంది.

రత్తమ్మ. పాడుదాన్ని! నేనే కాస్త పీలు చేసుకుని దూడనికుమ కుంటే, ఈ ఖర్మ మెందుకొచ్చేది?

నరసమ్మ. నీ తప్పేముంది లేవే! ఒంటిదానివి. అన్నీ ఎక్కడ దిద్దుకుంటావ్! అది నాసేతిలో నిలవదుగాని ఆ పిల్లదాన్ని నేను సమదాయిస్తే, నువ్వు గొడ్డూగోదనూ సూసుకునేదానివి కాదూ?

రత్తమ్మ. ఆఁ! పెద్దతనమొచ్చింది. ఇంకా నువ్వేమి దేవులాడ తావులే! నిన్ను కూచోబెట్టి నీకు చేసేదిపోయి, ఇంకా నీచేత చేయించుకోవడమా?

నరసమ్మ. ఇంకా, కాలూ సెయ్యీ ఆడుతున్నదిగా! పెద్దపనులు కదిలినా, కదలకపోయినా, సిన్నపనికీ, సితకపనికీ నేను నిలబడితే, నీకు కూస్తి తెరిపిగా వుండదూ?

రత్తమ్మ. నువ్వుగనక ఇంతా కాస్త తిరుగుతున్నావుగాని, నీ ఈడొస్తే మేము మూలపడతాం.

వెంకయ్య. పసిది ఏడుస్తున్నది.

రత్తమ్మ. పాపం! అదింకా గోలపెడుతూనే వుంది. దాన్ని కాస్త తీసుకో, అత్తయ్యా!

నరసమ్మ. అలాగేనమ్మా.

[వెడుతుంది.

గోపి [దిండుతోవచ్చి]. ఇదుగో నాన్నా! దిండేసుకో!

వెంకయ్య. ఆఁ! దేనికిరా! బాబూ.

[ఇలా అంటూనే తల ఎత్తుతాడు. గోపాలరావు దిండును తలకిందికి తోస్తాడు.

రత్తమ్మ [దిండు పట్టుకుని]. ఏదీ! కాస్త తలెత్తండి! దిండు సరిగా లేదు.

వెంకయ్య [తలెత్తుతూ, బాధాసూచకంగా]. అమ్మ!

రత్తమ్మ. ఏఁ! కదిల్తే నెప్పి చేస్తున్నదా?

వెంకయ్య. అబ్బే! లేదే!

రత్తమ్మ. లేకపోవడ మేమిటి? ఒకపక్కని మూలుగుతూ! ఎందుకైనా మంచిది నామాటిని కాపు కాయించుకోండి. పొయ్యిలో కాస్త నిప్పేపొస్తా!

వెంకయ్య. ఆఁ! అంతగా అయితే తెల్లారిపొద్దున చూసుకోవచ్చు లేవే!

రత్తమ్మ. తెల్లారేసరికి బరువు చేస్తేనో!

వెంకయ్య. ఊఁ! నీమొఖం కాదూ? అదే పోతుంది.

రత్తమ్మ. సరే! ఇక మీయిష్టం!

వెంకయ్య [దిండును మరింతగా తలకిందికి తోసుకుంటూ]. చంటిది ఏడుపిట్టే చాలించింది.

రత్తమ్మ. అవును, వెర్రితల్లి! ఆలనా పాలనా సనిగాలేక, చిక్కి సగమైపోయింది. యేడ్చేడ్చి, పిచ్చితల్లి చిటుక్కున నిద్దరోయింది.

వెంకయ్య [గోపాలరావుని దగ్గిరికి తీసుకుని తలనిమురుతూ]. చూడవే! వీడి తల తడిసింది. కాస్త తుడువు. జలుబుచేసేను!

గోపి [కౌగిలినుంచి తప్పించుకుంటూ]. ఆఁ! లేదు నాన్నా!

వెంకయ్య [దగ్గరికి లాక్కుని, తనపంచె చెరగుతోనే తల తుడుస్తూ]. చూడవే! పాపం! పొట్ట వెన్నుకు అతుక్కుపోయింది.

రత్తమ్మ. పాపిష్టిదాన్ని! వాడి కింకా తిండీ తిప్పలైనా పెట్టాను కాను.

గోపి. అఁ! ఆకల్లేదే!

రత్తమ్మ [నవ్వుతూ]. ఇప్పుడేగా ఆకలాకలని మారాం చేశావ్?

గోపి. ఉత్తినేనే అమ్మా!

వెంకయ్య [కొడుకును గుండెకు హత్తుకుంటూ]. పిచ్చినన్నాసి!

రత్తమ్మ [కొడుకుపీపు నిమురుతూ]. బంగారు తండ్రి!

తెర]



## పాత్రలు

| | |
|---|---|
| గిరి<br>మూర్తి<br>శాస్త్రి<br>రావ్<br>ప్రసాద్ | లా కాలేజి విద్యార్థులు |

## స్థలం

స్టూడెంట్స్ లాడ్జిలో గది

## కాలం

వర్తమానం



# ద్రోహం

మద్రాస్ లింగిచెట్టివీధిలోని ఒకగది. దానిలో మూర్తి, శాస్త్రి వుంటున్నారు. ఒక్కొక్కరికి ఒక టేబుల్, ఒక చెయిర్, ఒక బుక్ షెల్ఫ్, ఒక క్యాంప్ కాట్. మూర్తిది ఒక లెదర్ సూట్ కేస్; శాస్త్రివి రెండు స్టీల్ ట్రంకులు. మూర్తి టేబుల్ మీద ఒక టెన్నిస్ రాకెట్, చిన్దరవందరగా కొన్ని పుస్తకాలు, ఉపయోగించి అలక్ష్యంగా విడిచిపెట్టిన షేవింగ్ సెట్ వగైరా. శాస్త్రి టేబుల్ మీద ఒక పెద్ద అద్దం, ఒక అలారం టైమ్‌పీస్, చక్కగా సర్దిపెట్టుకున్న పుస్తకాలు మొదలైనవి.

తెరలేచేసరికి శాస్త్రి డ్రస్సింగ్ పూర్తిచేసుకుని, అద్దంముందు నిలబడి తలదువ్వుకుంటూ వుంటాడు. ఒక నిమిషం తర్వాత ఎడమవైపునున్న గది గుమ్మంగుండా మూర్తి చాలా అలసటగా వస్తాడు. అతని అడుగుల అలికిడికి మూర్తి వెనక్కి తిరిగి చూస్తాడు.

**శాస్త్రి.** ఏరా, మూర్తీ! చాదరికి....

[మూర్తి కొరకొర చూపులకు బెదిరి, శాస్త్రి మాట మధ్యలో ఆగిపోతాడు. మూర్తి తన క్యాంప్ కాట్ను

చేరి, దానిపై చతికిలబడి, ముందుకు వాలి, గుండె బరువుగా వున్నవాడివలె ముఖాన్ని అరచేతులతో కప్పుకుంటాడు. దీన్ని చూచి శాస్త్రి తెల్లబోతాడు.

శాస్త్రి [బెదురుగా]. చౌదరి కండిషన్ ఎలా వున్నదేమిరా ?

మూర్తి [విదిలించి వేస్తున్నట్టుగా]. ఉఁ! ఎలా వుంటే నీకు దేనికిలే !

శాస్త్రి. నాలుగైదు రోజుల్నుంచి చూస్తున్నా—నేనంటే నీ వెందుకో గాని చెడ్డ చికాకుగా వుంటున్నావురా. పోనీగాని, ఎలా వుందేమిటి చౌదరి కండిషన్ ?

మూర్తి. ఎలా వుందా ? రాత్రినుంచి డెలిరియం ప్రారంభమైంది.

శాస్త్రి. అయితే, కొంచెం సీరియస్‌గానే వుందన్నమాట.

మూర్తి. ఆరి ఫూల్ !

శాస్త్రి. ఏమిటిరా ?—నే నిప్పుడేమన్నాననీ !

మూర్తి. రాత్రినుంచి డెలిరియంలో వున్నాడంటే, ఏ కొంచెమో సీరియస్‌గా వున్నదనేనా దాని తాత్పర్యం ? నిన్ను ఫూల్ కాదు; ఫూలున్నర అనాలి.

శాస్త్రి. ఫూల్, గీలని ఇప్పుడంటే అన్నావు గాని, ఈసారి అంటే మాత్రం నే నూరుకోను - అదేమైనాగాని.

మూర్తి. పోనీలేరా! వేరే పేరుపెట్టి పిలుస్తాలే. నీకు అతికే పేర్లు చాలా వున్నాయ్.

శాస్త్రి. హుఁ! చాలా వున్నాయేఁ!

మూర్తి. ఆఁ! చాలా లేకేమిరా ? గూస్, డన్స్, యాస్, స్టుపిడ్, ఇడియెట్, థండర్‌హెడ్, మీన్ మైజర్లీ రెచ్ - ఓఁ! వీ అంతేమిటి ?

శాస్త్రి. అన్నింటికీ తెగించి కూర్చున్నవాడివి! అంటావ్! నీ వనకేఁ? నీ నోటికి....

మూర్తి. షటప్!

గిరి [ప్రవేశిస్తూ]. ఏమిటిరా? అప్పుడే మీ కిద్దరికీ మళ్ళీ ప్రారంభమైందీ రభస?

మూర్తి. లేకపోతే, ఈ సిల్లీ ఫూల్ చూడు! నర్సింగ్‌హోంనుంచి నేను తిరిగివచ్చానో, లేదో...

శాస్త్రి. అది కాదోయ్, గిరీ! చౌదరి రాత్రినుంచి డెలిరియంలో వున్నాడని...

గిరి [డెలిరియం అనే ముక్క తర్వాత మాటను తెంచివేస్తూ]. ఏరా మూర్తీ! నిజమే?

మూర్తి [బరువుగా] ఆఁ! మన లోకంలో లేడు. జుట్టు పీక్కోవడం, వొళ్లు రక్కుకోవడం — ఏమని చెప్పను? పట్టుకోలేకుండావున్నాం. చేతులు వెనక్కివిరిచి మంచానికి కట్టివేశారు.

గిరి [దైన్యంగా]. పూర్ ఫెలో! చూస్తూ చూస్తూ వుండగానే ఎంత ముంచుకొచ్చిందిరా!

మూర్తి. మొన్నే మనం అతన్ని వాళ్లవూరు పంపించేసి వుంటే బాగుండేదేమోరా?

గిరి. ఆఁ! వాళ్లది కుగ్రామమట. అక్కడ మెడికల్ ఎయిడ్ ఏముంటుంది? పైగా, ఈ స్థితిలో రైలు ప్రయాణం ప్రమాదమని డాక్టర్ అన్నాడు కూడాగా.

శాస్త్రి. అయినా, మన బాధ్యత తప్పేది.

మూర్తి. ఔను! ముఖ్యంగా నీ బాధ్యత తప్పేది!

శాస్త్రి. ఏమోయ్ గిరీ! చూశావా ?- నేనంటే వీడు వొంటికాలిమీద ఎలా వస్తున్నాడో!

గిరి [విసుగ్గా]. అబ్బబ్బ! సందర్భం లేదు; అసందర్భం లేదు. క్యాట్స్ అండ్ డాగ్స్‌లా మీ కిద్దరికీ ఎప్పుడూ ఒక్కటే కొట్లాట! చెడ్డ న్యూసెన్స్ అయిపోతున్నారు.

మూర్తి. లేకపోతే, ఏమిటి?—ఈ డామ్ ఫూల్ మాటలు! చౌదరి ఫీవర్‌తో మన లాడ్జిలో వుండగా, అది తన కెక్కడ అంటు కుంటుందోనని తప్పుకు తప్పుకు తిరిగాడు. అతను నర్సింగ్ హోంలో అడ్మిట్ అయ్యాక ఒక్కసారైనా అటు తొంగి చూశాడుకాదు. ఇంకా ఏమిటో-వీడి తలకాయ-తన బాధ్యతట!

గిరి. సర్లేరా మూర్తీ! ఇప్పు డెందుకులే, ఈ లేనిపోని రగడ. అయితే, ఇప్పు డక్కడ ప్రసాద్‌గా రున్నారా ?

మూర్తి. ఉహుఁ!

గిరి. నేను ఆయన్ని వెళ్ళమని చెప్పానే! రానే లేదా ?

మూర్తి. రాకేఁ? వొచ్చాడు. కాని, గ్లూకోజ్ రాత్రే అయిపోయింది. అంచేత కొనుక్కురమ్మని ఆయన్ని పంపించి, స్నానంచేసి పోదామని నే నిలా వొచ్చా.

గిరి. మరి, అక్క డెవ్వరూ అటెండ్‌కావడం లేదన్నమాట! నేనైనా పోతా.

మూర్తి. ప్రసాద్ తిరిగొచ్చేవరకు సిస్టర్‌నే కాస్త కనిపెట్టి చూస్తూ వుండమన్నాలే. సరిగాని, సెంట్రల్‌కి ఎవరినైనా పంపించావా?

గిరి. ఓ యస్! మన రావ్ వెళ్ళాడు.

మూర్తి. ఆమె ఈపూట మెయిల్‌కే వస్తే బాగుండును.

గిరి. మనది ఎక్స్‌ప్రెస్ టెలిగ్రామ్. మెసెంజర్‌కని మైలేజీకూడా కట్టామయ్యె. బహుశా అది నిన్న మధ్యాహ్నానికే అంది వుంటుంది. ఆమె ఈ మెయిల్‌లోనే రావచ్చు.

శాస్త్రి. నైన్‌థర్టీ అయింది. లేట్ కాకపోతే మెయిల్ ఈసరికి వచ్చేవుండాలి.

మూర్తి. మరేమీ నీవల్లకాకపోతే తోడుగా కాస్త రైలుదగ్గిరకైనా వెళ్ళి రాకపోయావట్రా, శాస్త్రీ ?

శాస్త్రి. ఆఁ ! ఈ భాగ్యానికి తోడుకూడా కావాలా ?

మూర్తి. తోడు వెళ్ళడంలో నీకు ఆల్ ఆఫ్ ఎ సడెన్ నమ్మకం పోయిందేమిరా ? చౌదరి కాఫీహోటల్‌కి వెళ్ళినా, సినిమాకు వెళ్ళినా, తప్పనిసరిగా తోడువెళ్ళేవాడివిగా !

గిరి. అబ్బబ్బ ! నువ్వూరుకోరా, మూర్తీ !! నీకు బొత్తిగా మతి పోతున్నది.

మూర్తి. నీవేమైనా అనుగాని, వీణ్ణిచూస్తే నాకు అరికాలిమంట నెత్తికెక్కుతున్నది. ఇదివరకైనా వీడిసంగతి నేను కొంత కనిపెట్టకపోలేదుగాని, వీడు మరీ ఇంతటి మీన్, సెల్ఫిష్, స్టుపిడ్, కవర్డ్‌లీ, అబ్‌నక్షస్, స్టింకింగ్, డర్టీ యాస్ అని అనుకోలేదు.

శాస్త్రి [మూర్తి వాక్యం పూర్తికాకముందే అందుకుని]. చూడవోయ్ ! ఎంత రెచ్చెడ్‌గా తిడుతున్నాడో !

గిరి. చాల్లేరా, మూర్తీ ! నీకు సమయాసమయాలు బొత్తిగా తెలియవ్ ! [శాస్త్రితో] శాస్త్రీ ! నువ్విక కాలేజీకి పోరాదటోయ్ !

శాస్త్రి. ఆఁ ! టైం కావొస్తున్నది కూడా. పోవాలిక.

గిరి. అటెండెన్స్ మాకు శాస్త్ర ప్రాక్సీ చెబుతావటోయ్.
శాస్త్రి. నా కది అలవాటులేని పని, మన నాయుణ్ణి చెప్పమంటాలే.
మూర్తి. ఉద్ధరిస్తావ్.
గిరి. మంచిదోయ్, శాస్త్రీ! వీడి మాటలకేమిగాని, నువ్వు వెళ్లు.

[శాస్త్రి నిష్క్రమణ.

మూర్తి. ఇదివరకైతే వీడికి బ్రెయినే తక్కువనుకున్నాగాని, కారెక్టర్ కూడా లేదు.

గిరి. మరీ నాలుగైదు రోజుల్నుంచి శాస్త్రి నీకు పెద్ద అబ్సెషన్ అయిపోయాడురా. అతని ప్రవర్తన నాకైనా ఆశ్చర్యాన్ని కలిగించకపోలేదు గాని, అతన్ని తిట్టి లాభ మేమిటి? "ఇట్ టేక్స్ ఆల్ సార్ట్స్ టు మేక్ ఎ వరల్డ్" అన్నారు. మనం ఎలాగో సర్దుకుపోవాలి.

మూర్తి. శాస్త్రిగాడివంటి పశువుతో కూడానా?

గిరి. ఆహా! అలాంటి వాళ్ళతోనే మరీ ముఖ్యంగా.

మూర్తి. నీవలె నేను వ్యవహారదక్షుణ్ణి కాకపోవచ్చుగాని, నేను మాత్రం....

గిరి. సరే! ఈ చర్చ ఇప్పు డెందుకుగాని, చౌదరికి అదేదో ఇంజెక్షనిస్తే మంచిదని నిన్న సాయంత్రం డాక్ట రన్నాడు. దగ్గిర పైక మేమైనా వున్నదిరా?

మూర్తి. మంత్ ఎండ్ కాదూ? అయిపోయిందిరా! కాని, ఏం?—చౌదరి దగ్గిర మనీ ఏమీ లేదూ?

గిరి. ఉహుం!

మూర్తి. మంత్ బిగినింగ్‌లో వచ్చిన నూటయాభై కాక, వారం రోజులనాడు అతనికి మరొక యాభై మనియార్డర్ రాలా?

గిరి. ఆఁ! ఎంతో స్టేమాత్రమే? రెండోనాటికి కానీ మిగల్చడు. అత నెంత భాగ్యవంతుడైనా, మరీ ఇంత ఖర్చు తగదు.

మూర్తి. అయితే, ఇప్పు డేమి చేస్తాం?

గిరి. అదే తోచడంలేదురా. అప్పిచ్చేవాడైనా కనబడడు. అక్కడికీ మొన్న మన నాయుడిదగ్గిర పది రూపాయలుంటే చేబదులు చేశా.

మూర్తి. ప్రసాద్‌దగ్గిరా ఏమీ లేదు. గ్లూకోజ్ టిన్నుకు తన దగ్గిరున్న మనీ సరిపోదేమోనని నన్నడిగి టూ రూపీస్ పట్టుకువెళ్ళాడు. మన రావ్‌ని అడిగిచూశావా?

గిరి. ఆఁ! రావ్ అతి పేదవాడు. అతని కింటినుంచి వచ్చేది అతని ఖర్చులకైనా సరిగా సరిపోదు. అబ్బే! అతనిదగ్గి రేముంటుంది? ఏమి చెయ్యాలో - ఏమిటో - నా కేమీ తోచడం లేదురా!

మూర్తి. అన్నట్టు. చౌదరి మదర్ ఇప్పు డొస్తున్నదిగా! ఆమెకు డబ్బు కేం తక్కువ? ఆమె నడిగితే సరి.

గిరి కాని, ఆమె ముక్కూ ముఖమైనా మన మెరగం. వచ్చీ రావడంతోటే ఆమెను డబ్బు అడిగితే, ఏమనుకుంటుందో, ఏమోరా!

మూర్తి. ఔనురా! అదీ నిజమే. ఆఁ! అన్నట్టు శాస్త్రిగాడి దగ్గర చాలా మనీ వున్నదిరా. ఫైవర్స్, టెన్నర్స్ మొన్నొకనాడు వాడిచేతిలో పెద్దపొత్తిక చూశా!

గిరి. అయ్యో! అతను కాలేజీకి వెళ్ళిపోయాడే!

మూర్తి. వెళ్ళితేనేఁ? దగ్గిరుంటే ఎక్కడ ఏ బిల్లు పే జెయ్యవల సొస్తుందో నని అటా, బేడా మనీపర్సులో వేసుకుని వాడు

బయటికి బయల్దేరతాడు. వాడి దాపరికం - అదుగో - ఆ పెద్ద ట్రంక్‌లో, దాని తాళం పగలగొడితే ... [ఆశ్చర్యంగా] హెవెన్స్! ఏమిటీ చిత్రం! ఇవ్వాళ పెట్టెకి తాళం బిగించడం మర్చేపోయాడు!

[గబగబ మూర్తి ట్రంకుల వద్దకు వెడతాడు.

గిరి. నోనో! దట్స్ బ్యాడ్! అతను లేనప్పుడు అతని పెట్టె తియ్యడం తప్పు.

మూర్తి [పైనున్న చిన్న ట్రంక్‌ను దించి, అడుగునున్న పెద్ద దాన్ని తెరుస్తూ]. నీకు తెలియదులేరా! ముందు ఈ అవసరం గడిస్తే, తర్వాత తప్పొప్పులమాట కన్సిడర్ చెయ్యొచ్చు. [బట్టల అడుగునుంచి నోట్లపొతిక తీసి, లెఖ్ఖపెడుతూ] చూడరా! వెధవదగ్గిర....[ట్రంక్‌వద్దనుంచి లేచి, గిరి వైపుకు నడిచి వెడుతూ, ముందు నోట్లోనే లెఖ్ఖపెట్టి, తర్వాత పైకి అంటూ] ఫార్టీ - ఫార్టీ ఫైవ్ - ఫిఫ్టీ - ఫిఫ్టీ ఫైవ్ - సిక్స్‌టీ - సిక్స్‌టీ టూ - సిక్స్‌టీ ఫోర్ - సిక్స్‌టీ ఫైవ్ - సిక్స్‌టీ సిక్స్- సిక్స్‌టీ సెవెన్....సిక్స్‌టీ సెవెన్ రూపీస్ వున్నాయ్!

గిరి. మూర్తీ! నువ్వు ఏం చేసినా, చెడ్డ ఇంపల్సివ్‌గా చేస్తావురా! ఇప్పుడు శాస్త్రి వొచ్చాడంటే, మనకి దొంగరికం కడతాడు!

మూర్తి. ఆఁ! వాడిమొఖం కాదూ? నోరు మెదిపాడంటేనా? నా సంగతి తెలియదూ? ఈ టెన్నిస్ రాకెట్ వాడి వీపిమీద విరిగిందన్న మాటే!

గిరి. అత నొకవేళ ఏదైనా మాట తూలినప్పటికీ నువ్వు తొందర పడవద్దురా! ఏవీ, ఒక ఇరవై రూపాయలిలా తే! [వాటిని

అందుకుని] వీలైతే, అతని పైకం సాయంత్రం లోగానే సర్దుబాటు చేద్దాం. లేకపోతే, లైఫ్ అండ్ డెత్ కొశ్చన్ గనక, నేనే పెట్టి తెరిచి, ఒక ఇరవై మాత్రం పట్టుకెళ్ళానని చెప్పు.

మూర్తి. ఏఁ! నేనే తీశానంటే నాతల కొట్టేస్తా దేమిరా?

గిరి. నాన్‌సెన్స్! నీకు తెలియదురా! - నేను చెప్పమన్నట్టు చెప్పు....ఉఁ! నే వెళ్ళొస్తాగాని, ఆ మిగతా డబ్బు వాడి పెట్టిలో పెట్టెయ్.

[మిగిలిన డబ్బును మూర్తి తిరిగి శాస్త్రి ట్రంక్‌లో పెట్టి వేస్తాడు. వాటిని ఎప్పటివలె సర్ది వేస్తాడుకూడా. గిరి తన చేతిలోనినోట్లను మనీపర్సులో పెట్టుకుంటూ, గుమ్మం వైపుకు రెండు అడుగులు వేస్తాడు. ఇంతలో పెద్దగా నిట్టూరుస్తూ రావ్ ప్రవేశిస్తాడు.

రావ్ [కొండవిరిగి పైబడిన వాడివలె కుర్చీలో చతికిలబడి]. అమ్మ!

మూర్తి [భయసంభ్రమాలతో]. ఏరా? ఏమిటి?

గిరి. ఏఁ! ఆవిడ ఈ బండికి రానేలేదా?

రావ్. రాకేఁ? వొచ్చింది. కాని, ఏం చెప్పను?

గిరి. ఏమిటోయ్?

మూర్తి. అబ్బ! చంపక చెప్పరా?

రావ్. మన చౌదరి...

మూర్తి. ఏఁ! సింక్ అయిపోతున్నా డేమిటి?

రావ్. అబ్బే! లేదురా! ఉదయాన వున్నట్టే వున్నాడు.

గిరి. అయితే మరేమిటి?

రావ్. చౌదరి పెద్ద భాగ్యవంతుడని కాదూ, మీ అభిప్రాయం ?

గిరి. యస్! ఏఁ ?

రావ్. అఁ! ఏమీలేదు. నేనూ మీలానే పొరపడ్డాను.

మూర్తి. ఏమిటిరా ? నువ్వు స్ట్రేంజిగా మాట్లాడుతున్నావ్!

రావ్ [కుర్చీపైనుంచి అశాంతిగా లేస్తూ]. పాపం! ఆ తల్లిని చూస్తే నువ్విలా అనేవాడివి కాదురా ? చింపిరితల—జీరికల గుడ్డలు - మ్చ్ - ఏమని చెప్పను ఆమె అవతారం! వొట్టి ఎముకలగూడు! కళ్ళలోవున్న దేమో కాస్త కొనూపిరి. మహా యిల్లాలు! ఉన్నపూట తినీ, లేనిపూట లేకా, కొడుక్కి చదువుకు డబ్బు పంపించేదట.

గిరి } ఒకేసారిగా { రియెల్లీ !
మూర్తి } { అబ్సర్డ్ !

రావ్. ఈసంగతి ఆమె చెబితేనే నాకు తెలిసిందంటారా ? లేక, నేనే కల్పించుకొచ్చానంటారా ?

గిరి ఇంత ఘోరమా ?

రావ్. వాళ్ళకి అయిదెకరాల మాగాణి వుండేదట. అతను బి. ఏ. పూర్తిచేసేసరికి దాన్ని అప్పులవాళ్లు వేసుకుపోయారట. పోతే, ఇప్పుడు ఈ లా కాలేజీ చదువుకోసమని నిరుడు లోగిలి తాకట్టు పెట్టారట. ఈ ఏటికి దొడ్లో పాటిమట్టి అమ్మించి—పాపం!—ఆమె డబ్బు పంపిస్తున్నదట.

మూర్తి. మైగాడ్ !

రావ్. డబ్బుచాలక పిల్లవాడు పట్నంలో ఎక్కడేమి యిబ్బందిపడిపోతాడోనని కూలికి దంపుకూడా దంచేదట. ఈమాట చెవిని

పడితే కొడుకు మనస్సుకు ఎంత నొప్పి కలుగుతుందో నని కడుపులో పెట్టుకునేదట.

గిరి. ఏమోయ్ రావ్! ఈ సంగతులన్నీ ఆమె ఇప్పుడు నీకెందుకు చెప్పింది?

రావ్. ఉహుఁ! నన్ను వినమని ఆమె చెప్పలేదు. కాని, కొడుకుని చూచుకుని - పాపం! - ఆ తల్లిగుండె పగిలేలా యేడుస్తున్నది. ఆ యేడుపుమధ్య ఇంకా ఏవేవో చాలా విషయాలు బయట పెట్టింది లెండి.

మూర్తి. అబ్బ! ఎంత దారుణం!

గిరి. ఇంకా చాలా విషయా లంటే ఏమిటవి?

రావ్. ఎన్నని చెప్పమంటావోయ్! శోకం పట్టలేక తన కష్ట కథంతా వెళ్ళబోసుకుంటున్నది. "మనకు ఒక్కగాను ఒక మగబిడ్డ. వాడు పెద్ద చదువు చదివి, పెద్ద ఉద్యోగం చేస్తే, మనకీ, మన వంశానికీ కూడా గౌరవమే. ఆస్తి వుంటుందీ, పోతుందీ అని చూడకుండా ఎంత డబ్బైనా సరే వాడికి చదువు చెప్పించవే" అని వాళ్ళ ఆయన చెప్పిపోయాడట. తనూ అంతే ననుకుని దొరలా పెంచుకున్నదట. చదువు పూర్తిచేసి, కొడుకు ఏ జిల్లా జడ్జీయో అయితే, చూచి ముచ్చట పడ్డానికి ఆయన లేడుగదా అని విచారించేదట. చదువుకున్న పిల్లని చేసుకుని, కొడుకూ, కోడలూ చిలకా, గోరింకల్లా కాపరం చేస్తూవుంటే, వాళ్ళచేతులమీదగా తను దాటిపోదామను కుందట. దుఃఖం పట్టలేక ఇంకా ఇలా ఏమేమో చాలా వెళ్ళబోసుకుంటున్నది.

గిరి. చౌదరి సిన్సియర్ మ్యాన్ అనుకున్నా. తన స్థితిగతుల సంగతి పొరపాటుగానైనా నాతో ఎన్నడూ అన్నాడు కాదు.

మూర్తి. ఉహుఁ! నాతోనూ అనలేదు.

రావ్. నిజమే! ఎవ్వరితోనూ అనలేదు.

గిరి. కాని, ఎంత స్టయిలిష్‌గా ఉండేవాడు! ఫస్టు ట్వీడ్ సూట్స్ వేశేవాడు. కాస్టలీ స్నోస్, సెంట్స్, పొమేడ్స్, హెయిర్ ఆయిల్స్ వాడేవాడు. ఆమధ్య పి. ఆర్. అండ్ సన్స్‌లో నలభై రూపాయలుపెట్టి సిల్వర్ హెయర్ బ్రష్ కొన్నాడు.

మూర్తి. నీకు అంతే తెలుసునన్నమాట! పోయిననెలలో డెబ్భై అయిదు రూపాయలకు స్పెన్సర్స్‌లో రెయిన్‌కోట్ కొన్నాడు. డబ్బు నీళ్ళలా వాడేశేవాడు.

గిరి. తనకోసం తనే తగలేసుకుంటే, అక్కడి కది కొంత నయమే! సినిమాకి వెళ్ళినా, కాఫీహోటల్‌కి వెళ్ళినా, అందరి బిల్సు పట్టుపట్టి తనే చెల్లించేవాడు కూడాగా !

రావ్. ఇంకా చాలా చేశేవాడు లెండి.

గిరి. అతని ఖర్చుచూచి, ఎంతో శ్రీమంతు డనుకున్నా.

మూర్తి. నేనైతే జమీందారే అనుకున్నా.

గిరి. ఎంత చిత్రం!

మూర్తి. అంతా విచిత్రం!

రావ్. చిత్రంలేదు; విచిత్రంలేదు. నేనూ పేదవాణ్ణే. నేనూ పల్లెటూరివాణ్ణే. చౌదరి మనస్తత్వాన్ని హర్షించలేను గాని, దాన్ని నేను అర్థంచేసుకోగలను. తోటివాళ్ళతో తను పేదవాణ్ణని చెప్పుకోడానికి కాలేజీ స్టూడెంట్‌కి ఎంత నైతికబలం కావాలి! దాదాపు

ప్రతి విద్యార్థి తన కుటుంబ స్థితిగతులకు మించిన ఆడంబర జీవితాన్ని గడిపేవాడేనయ్యే. తల్లిదండ్రులు ఎంత కష్టపడుతున్నారో, ఏమేమి బాధలకు పాల్పడుతున్నారో గమనించకుండా దుర్వ్యయం చేసేవాడే నయ్యే. ఇట్టివారిమధ్య బొత్తిగా లేనివాడైనా తన లేమిని బయటపెట్టుకోడానికి సిగ్గుపడటంలో అబ్బుర మేముంది? తానుకూడా పెద్దయెత్తులకు పోయి, కలవాడిననే నటన చేయడంలో ఆశ్చర్యమేముంది? పైగా, ఎన్నడు ఒక మహాపట్టణం ముఖమెరగనివారు పెద్ద చదువులకని ఏ మద్రాసో, కలకత్తాయో, బొంబాయో చేరేసరికి వాటి వైభవం వారిని విభ్రాంతుల్ని చేస్తుంది. తాము అంతవరకు గడిపింది కేవలం అనాగరిక జీవితమని తమలో తాము సిగ్గుపడతారు. అక్కడినుంచి ప్రతి ప్రలోభానికీ తొలిబలి వారే. పులిని చూచి నక్క వాతలు పెట్టుకున్నట్టు నగరవాసులను ఆద్యంతం అనుకరిస్తారు, నగరాలలోనే పుట్టి పెరిగిన వారికుండే పరిజ్ఞానం, సంస్కారం, లౌకికం మొదలైనవి శూన్యం కావడం వల్ల వారిని అనుకరించబోయి అధఃపతనమైపోతారు. ప్రతి మహానగరం తన వైభవాడంబరాలతో ఈ విధంగా ఎందరినో ఆకర్షిస్తుంది; ఎందరినో ప్రలోభ పెడుతుంది; ఎందరినో హతమార్చుతుంది. పల్లెలు మట్టమై పోతున్నందువల్లనే బస్తీలు పెరిగిపోతున్నాయి. అవి ఎంత పాతాళానికి పోతే, ఇవి అంత ఆకాశాన్ని అంటుతున్నాయి.

శౌరి. ఏమైనా, చౌదరి చేసిన పని అతిఘోరం!

మూర్తి. నా ఒపీనియన్ నన్ను చెప్పమంటావా? ఇది సింప్లీ మాన్‌స్ట్రస్.

రావ్. సరే। ఇప్పు డేమనుకుంటే ఏం లాభంలేరా ? ఏమోయ్, గిరీ! డాక్టర్ నీతో ఇంజెక్షన్‌మాట ఏదో చెప్పాడట.

గిరి [బరువుగా]. ఔనోయ్! అప్పా అండ్ కోలో కొనుక్కొ పోవాలి. ఏఁ ? నువ్వుకూడా రారాదూ ?

రావ్. నామనస్సు చెడ్డ కలతగా వుంది. కాసే పాగి సరాసరి తిరిగి నర్సింగ్ హోంకే వస్తాలే.

గిరి. మంచిది. ఇప్పటికే ఆలస్యమైందేమో. మరి, నే వెడతా! కన్నతల్లికి ఇంత అన్యాయం చేసి, చౌదరి లోకానికి మంచివా డయ్యాడన్నమాట!

రావ్. ఆఁ! ఇది కేవలం అనాలోచిత ప్రవర్తన.

గిరి [వెళ్ళిపోతూ]. ఏదో ఒక ప్రవర్తన! ఏదైతేనే?-కన్నతల్లి కింత ఘోరాన్యాయం చేసింతర్వాత!

[గిరి నిష్క్రమిస్తాడు.

మూర్తి. పూర్ మదర్! కొడుకుకోసం ఎంత శాక్రిఫైస్ చేసిందిరా! ఆవిడ మా అమ్మే అయితేనా?...మా అమ్మ నా చిన్నతనంలోనే పోయింది. మా కున్నది నన్నూ, నా యిద్దరు చెల్లెళ్ళనూ కాల్చుకుతినే సవతి తల్లే ... చౌదరి హార్ట్‌లెస్‌గా ప్రవర్తించాడు గాని, ఆవిడ మా అమ్మే అయితేనా, పువ్వులలో పెట్టి పూజించేవాణ్ణి.

రావ్. పాపం! కొడుకుమీద కొండంత ఆశ పెట్టుకున్నదిరా! మ్చ్! ఏమి కానున్నదో! తమకు చదువు సంధ్యలు లేక పోయాయే అనే విచారం వాళ్ళకి తెలియకుండానే వాళ్ళని పీడిస్తుంది కాబోలు. అందువల్లే కొందరు పల్లెటూరివాళ్ల తమ

బిడ్డల చదువుకోసం ఎన్ని కష్టనష్టాలైనా సంతోషంగా పడతారు. పట్టణాలకు పోయి, వేలకువేలు గుమ్మరిస్తేనేగాని పూర్తి కాని ఈ చదువుకి వాళ్లు బలి అయిపోతూ వుంటారు. త్యాగ మంటే నిజంగా వాళ్ళదే త్యాగం.

[శాస్త్రి ప్రవేశిస్తాడు.

శాస్త్రి. ఎవరిదండీ త్యాగం ?

మూర్తి [అవహేళనగా]. నీదేరా ? నీ ప్రశంసే మన రావుగారు చేస్తున్నారు. నువ్వు గొప్ప త్యాగపురుషుడ వట! సరిగాని, నువ్వు కాలేజీకి వెళ్ళలేదేమిరా ?

శాస్త్రి. వెళ్ళకే! వెళ్లాగాని, ఏదో మాట జ్ఞాపకమొచ్చి వెనక్కి చక్కావొచ్చా.

మూర్తి [తీక్ష్ణంగా చూస్తూ]. ఏమి టది ?

శాస్త్రి. మరేమీ లేదురా. ట్రంక్ లాక్ చేసుకోవడం మర్చిపోయా.

మూర్తి. వెంటనే తిరిగి రాకపోతే, నీ పెట్టిని నేను కొల్లగొట్టేస్తా ననుకున్నావా ?

శాస్త్రి. అబ్బే!, లేదురా! కాని ..

మూర్తి. కాని, గీని ఏమిటది ?

రావ్. మూర్తీ! నువ్వు మరీరా! శాస్త్రిగారి మీదికి కయ్యానికి కాలు దువ్వుతావ్.

మూర్తి. లేకపోతే ఏమి టిది ? ఈ రూంలో వుంటున్నది వీడూ, నేనూ. అయితే, ఇఖ వీడి భయ మేమిటి ? పెట్టికి తాళం లేకపోతే, వీడి ముల్లె నేను కాజేస్తాననేకాదూ ?

శాస్త్రి. ఏమండీ రావుగారూ! ఆమాట నే నన్నానా ?

మూర్తి. అంటేనా ? డొక్క చీరేస్తాను.

[శాస్త్రిమీదకు కొట్టబోయినట్టు మూర్తి వెడతాడు. అతడిని రావ్ వారిస్తాడు. ఇంతలో ప్రసాద్ వస్తాడు.

ప్రసాద్ [ఆందోళనగా]. గిరి లేడూ ?

రావ్. లేడే ! దేనికండీ, ప్రసాద్ గారూ ?

మూర్తి. ఇప్పుడే వెళ్ళాడురా మందుకోసమని. నీకు దారిలో యెదురుపడవలసిందేనే !

రావ్. ఏమిటండీ విశేషం ? మరేమీ తొందరలేదుగదా ?

ప్రసాద్ [బరువుగా]. చౌదరి కొలాప్స్ అవుతున్నాడు.

| | | |
|---|---|---|
| మూర్తి. | ఒకేసారిగా | ఆఁ ! |
| రావ్. | | పాపం ! |
| శాస్త్రి. | | అయ్యో ! |

ప్రసాద్ [నిట్టూరుస్తూ]. ఈ సరికి అయిపోయిందేమో కూడా.

రావ్. ఆ తల్లి ...పాపం !

ప్రసాద్. అసలు ఆవిడ దుఃఖాన్ని చూడలేకే సగం నే విటు పరిగెత్తుకొచ్చా.

మూర్తి. బ్రతికీ, చచ్చీకూడా ఆ తల్లికి ద్రోహం చేశాడన్నమాట !

రావ్. ఆఁ ! అంతేరా.

ప్రసాద్. నిజమేరా.

రావ్. మరి దేనికి ? పోదాం పదండి. మన మెవ్వరం కూడా లేకపోతే - పాపం - ఆవిడ గతి ఏంకాను !

ప్రసాద్. ఆవిడ దగ్గిర డబ్బేమీ లేనట్టున్నది. గిరే ఎక్కడైనా సాధించా లిప్పుడు.

మూర్తి. ఆఁ! వెధవ డబ్బు! డబ్బు కేమిలే! మీరు పదండి! ఐ విల్ గెట్ ఇట్!

[రావ్, ప్రసాద్ వెడతారు. వారిద్దరు గడప దాటినంత నే మూర్తి చటుక్కున శాస్త్రి ట్రంకుల వద్దకు వెళ్లి, పైదాన్ని ఒక పక్కకు విసిరి పారవేసి, అడుగు దానిలోనుంచి డబ్బుతీసి, శాస్త్రివంక ధిక్కారంగా చూస్తూ నిష్క్రమిస్తాడు. శాస్త్రి "ఆఁ! ఆఁ!" అంటూ నోరు తెరిచి, తెల్లమొహంవేసి నిలిచి వుండగా—

తెర]



## పాత్రలు

ఈశ్వరరావు
రామబ్రహ్మం
వెంకటాద్రి
సుబ్బన్న
ప్రసాదరావు
జానకిరామయ్య
బిల్లు కలెక్టర్

## స్థలం

ఈశ్వరరావు యింటివావిడి

## కాలం

వర్తమానం.



# ఏకాభిప్రాయం

ఈశ్వరరావు యింటిచావిడి. కుడివైపున సింహద్వారం, ఎదురుగా రెండు గదులలోకి రెండు ద్వారాలు, ఎడమవైపున పెరటిలోకి ద్వారం. చావిడిలో గదులగోడ సరసను ఒక టేబుల్, మధ్యను ఒక పడకకుర్చీ, రెండు, మూడు మామూలు కుర్చీలు, ఒక బెంచీ. గోడలను కొన్ని క్యాలెండర్లు, ఫొటోలు, వెండితో చేయబడిన లక్ష్మి, సరస్వతి పటాలు.

తెర లేచేసరికి ఈశ్వరరావు పడకకుర్చీలో పడుకుని, ఒక ఇంగ్లీషు దినపత్రిక చదువుతూ వుంటాడు. అతని వయస్సు ఇంచుమించు 35 సంవత్సరాలు. పట్టణంలో ఉద్యోగం చేసుకుంటున్న వాడు గనక, వేషభాషలలో పట్టణ సంస్కారం కనబడుతూ వుంటుంది.

తెరలేచిన కొన్ని క్షణాలకు రామబ్రహ్మం, వెంకటాద్రి ప్రవేశిస్తారు. వారిద్దరు అచ్చ పల్లెటూరివారు.

రామబ్రహ్మం, వెంకటాద్రి కాళ్ళ అలికిడి విన్న ఈశ్వరరావు పత్రిక పుటలలోనుంచి తలెత్తకముందే వారిద్దరు ఎడాపెడా కొట్టే తుపానువలె సంభాషణకు అందుకుంటారు.

రామబ్రహ్మం. దొరికాడయ్యా. మిడతంభొట్లు! దొరికిపోయాడు !!

వెంకటాద్రి. కొట్టాడయ్యా! డింకీకొట్టాడు !!

రామబ్రహ్మం. అఁ! బొమ్మిఖ దిగాల్సిందే!
వెంకటాద్రి. ఆహా! బో ర్డిఖ తిప్పాల్సిందే!
ఈశ్వరరావు. ఎవరు ? ఏమిటి ?
రామబ్రహ్మం. ఇంకా ఎవరంటా వేమిటి ? అయిపోయాడుగా! ఈ దెబ్బతో చిత్తయిపోయాడు.
వెంకటాద్రి. ఇఖ సోదికైనా రాడులే!
ఈశ్వరరావు. ఏమిటయ్యా మీ గొడవ ?
రామబ్రహ్మం. ఊరంతా గుప్పుమంటే నువ్వింకా వినలా ?
వెంకటాద్రి. గుంపు చింపులు పడి వీధులెంట అందరు చెప్పుకుంటుంటే ఈమాట నీదాకింకా రానేలా ?
రామబ్రహ్మం. చోద్యమే నువ్వు దీన్ని వినలేదంటే!
వెంకటాద్రి. చోద్యమంటే చోద్యమా!
ఈశ్వరరావు [విసుగ్గా]. చాల్లే! ఊరికే చంపక, ఎవరో, ఏమిటో చెప్పరాదటయ్యా ?
రామబ్రహ్మం. మీవాడే నయ్యా! మీ జానకిరామయ్య!
వెంకటాద్రి. నీ ప్రాణస్నేహితుడయ్యా!
రామబ్రహ్మం. మీ పంచాయతీబోర్డు ప్రెసిడెంటు!
వెంకటాద్రి. మీ షాహుకారు!
రామబ్రహ్మం. మీ షోకుదారు!
వెంకటాద్రి. మీ మేయరుగారు!
రామబ్రహ్మం. మీ పెత్తందారు!
ఈశ్వరరావు [మరింత విసుగుదలతో]. అఁ! అయితే ?
రామబ్రహ్మం. దెబ్బ తీశాంలే!
వెంకటాద్రి. నషాళాని కంటింది.

రామబ్రహ్మం. ఇఖ పిల్లిమింతరం వేసినట్టే.
వెంకటాద్రి. మట్టి కరిచాడు.
రామబ్రహ్మం. అయిపోయిందిలే బడాయ్!
వెంకటాద్రి. తేలిపోయిందిగా సరుకు!
రామబ్రహ్మం. నాపాటివాడు లేడన్నాడు.
వెంకటాద్రి. రొమ్ము విరుచుకు తిరిగాడు.
రామబ్రహం. అసలు నేలమీద నడిస్తేనా?
వెంకటాద్రి. చుక్కల్లోకి చూచాడు!
రామబ్రహ్మం. గద్దెక్కి కూర్చున్నతర్వాత వాడికి ఈ రామబ్రహ్మం అన లొకటి కనబడితేనా?
వెంకటాద్రి. పట్టం కట్టుకున్న తర్వాత ఈ వెంకటాద్రి వాడికంట దూరనే లేదు.
ఈశ్వరరావు [కోపంగా]. అబ్బ! చాలించండి మీ వెధవ సోది!
రామబ్రహ్మం [తగ్గి, వెంకటాద్రితో]. మన ఈశ్వరరావుకు కోపమొచ్చిందిరా!
వెంకటాద్రి. మన మే మన్నాం అంత కోపానికి?
రామబ్రహ్మం. నువ్వు మాట చొరవనిస్తేనా?
వెంకటాద్రి. నేనా? నువ్వా?
రామబ్రహ్మం. నువ్వే!
వెంకటాద్రి. నువ్వే!
రామబ్రహ్మం. నువ్వేనంటే!
వెంకటాద్రి. అహఁ! నువ్వే.
ఈశ్వరరావు [మందహాసంచేస్తూ]. సరే! ఇప్పుడు మీమధ్య లేనిపోని తగవులాట దేనికిగాని, ఏమి జరిగిం దేమిటి?

రామబ్రహ్మం. అబ్బో! చాలా కథ వుందిలే!

వెంకటాద్రి. అదొక పెద్ద రామాయణం!

ఈశ్వరరావు. దానిలో మీరిద్దరు వాలి, సుగ్రీవులుగాని, ఇంతకూ అసలు విషయం తేల్చారు కారు.

రామబ్రహ్మం. సరే. వినవయ్యా! మొన్నపోయిన పున్నం రేపు కద్దనగా..

వెంకటాద్రి. కాదు! పున్నంనాడే.

రామబ్రహ్మం. నీకు తెలవదులేరా! నువ్వూరుకో!

వెంకటాద్రి. మహలావ్! నీకేనా తెలిసింది?

ఈశ్వరరావు. సరే! ఒకరోజు ఇటో అటో దానికేమి లెండి.

రామబ్రహ్మం. అప్పుడు కాలవగట్టుమీది చెట్లు....

వెంకటాద్రి. డి. పి. డబ్లియు. వాళ్ళవి ...

రామబ్రహ్మం. పాటకొస్తే, పాట పెట్టకుండానే జక్కాయి బుక్కాయి పేరకొట్టేసినట్టు బినామీగారాసి, రివెన్యూ ఇనస్పెక్టరు కొకటి....

వెంకటాద్రి. ఓర్సీరు కొకటి...

రామబ్రహ్మం. పోలీసు యినస్పెక్టరు కొకటి...

వెంకటాద్రి. లాకు సూపరెంటు కొకటి . .

రామబ్రహ్మం. నువ్వాగరా! నన్ను చెప్పనీ!

వెంకటాద్రి. సరే! నువ్వేచెప్పు.

రామబ్రహ్మం. పంచాయితీబోర్డు వైసుప్రెసిడెంటు కొకటి, గుమాస్తా కొకటి, బిల్లుకలెక్టరు కొకటి, వీళ్ళందరినోళ్ళు కట్టెయ్యాలని తలొకరికి తలొక టిచ్చి, తనైతే ఒక నాలుగు పెద్ద చెట్లు....

వెంకటాద్రి. నాలుగు ఖర్మమేమిటి? అయిదో, ఆరో!

రామబ్రహ్మం. ఆఁ! నీ మొఖంకాదూ? నాలుగే!

వెంకటాద్రి. నా కళ్ళతో నేను చూస్తే! ఆరింటికి తక్కువ లేవు. అన్నీ పెద్ద పెద్ద మానులు! కొండలా వాములదొడ్డిలో పేర్చి పెట్టుకున్నాడు. ఒక లక్ష యిటికామ తేలిగ్గా కాల్తుంది.

రామబ్రహ్మం. సరిగాని, వేలానికొచ్చినివి మొత్త మెన్ని చెట్లంటావ్?

వెంకటాద్రి. ఏమో ఆ తబ్సీలు నాకు తెలవదు.

రామబ్రహ్మం. అయితే మరి నోరుమూసు కూరుకో!

వెంకటాద్రి. ఏం పందెం కడతావ్? జానకిరామయ్య తోలించు కున్నవి ఆరేడు చెట్లని నేను....

ఈశ్వరరావు. ఎన్నో ఒకన్ని పోనిద్దురూ! ఆఁ! అయితే ఏమి జరిగింది?

రామబ్రహ్మం. జరగాల్సిందే జరిగింది.

వెంకటాద్రి. చురక అంటించాగా!

రామబ్రహ్మం. తిక్క కుదిరింది!

వెంకటాద్రి. నెత్తి అణిచేశాలే!

రామబ్రహ్మం. నవనాళ్ళూ కుంగినవి.

ఈశ్వరరావు. కాలికిందపెట్టి రాచేశా!

రామబ్రహ్మం. ఏరోయ్!- అంతా నువ్వే చేసినట్టుగా మాట్లాడు తున్నావ్!

వెంకటాద్రి. నేనుగాక నువ్వా? అటునుంచి నరుక్కొచ్చిందెవరు? పంచాయితీ ఆఫీసరు దగ్గిరికి నిన్న పిటీషను పట్టుకెళ్ళింది నేనుకాదూ?

రామబ్రహ్మం. అది రాసిం దెవరోయ్? ముందు ఆ మాట చెప్పు.

వెంకటాద్రి. మహలావ్! నువ్వే రాశావులే సుబ్బన్న రాయింపిస్తే!

రామబ్రహ్మం. కావాలంటే నేనే రాయలేనేమిటి? ఇలాంటివి లక్షా తొంభై రాశాను.

వెంకటాద్రి. ఇంత పెద్ద రాతగాడివేనా మొన్న సుబ్బన్న వూళ్లో లేకపోయేసరికి ఏకుసాలు కౌలుకబోలియతులు రాయలేక గుడ్లెళ్ళబెట్టావ్.

రామబ్రహ్మం. నువ్వంటే నా కిందుకే వొళ్లుమంట! నా రాతకోత అంటేనే కళ్ళల్లో కారం పోసుకుంటావ్!

వెంకటాద్రి. దాని సంగతి నీకేం తెలుసు లేరా? రాత బలి గోరుతుంది!

రామబ్రహ్మం. పొట్ట పొడిచినా అక్షరంముక్క లేనివాడివి నువ్వు కూడా . .

వెంకటాద్రి. బయల్దేరాడయ్యా. ఈయనే మహలావ్ పండితుడు!

ఈశ్వరరావు. మీరిద్దరూ ప్రబుద్ధులే. మీలో తక్కువ తిన్నవారెవరు గాని, పిటిషన్ పెడితే ఏమైందేమిటి?

వెంకటాద్రి. పంచాయితీ ఆఫీసరు తనిఖీకొస్తా నన్నాడు.

రామబ్రహ్మం. ఇవ్వాళే వొస్తాడు.

వెంకటాద్రి. అసలు ఈపాటికి బయల్దేరాడేమో!

ఈశ్వరరావు. సరే! వస్తాడయ్యా! వస్తే జానకిరామయ్యకొచ్చిన భయమేమిటి? బోర్డులో మెజారిటీ వాడిదేనయ్యె! ఊళ్ళో ఉద్యోగస్థులందరు వాడిపక్షమే నయ్యె!

రామబ్రహ్మం. నీకు తెలియదు లేవయ్యా! దానిలో ఒక కిటుకుంది.

వెంకటాద్రి. కీలెరిగే పెట్టాంలే వాత!

రామబ్రహ్మం. ఆయువుపట్టునే కొట్టాంలే దెబ్బ.

వెంకటాద్రి. ఈ దెబ్బతో కుర్చీ దిగాలి.

రామబ్రహ్మం. అసలు గోదావరిస్తానమే చేస్తాడేమో!

ఈశ్వరరావు. ఇంతకూ ఆ కిటు కేమిటి ?

వెంకటాద్రి. దానిలో చాలా తిరుగు డుందిలే!

ఈశ్వరరావు. ఏమి టది? కాస్త విడమర్చి చెప్పరాదూ ?

వెంకటాద్రి. చెట్లను పబ్లీకుగా పాటపెట్టందే పెట్టానని దొంగ రాతలు రాశాడు గాదటయ్యా!

రామబ్రహ్మం. నీ మొఖం! అదికాదు పాయింటు. చెట్లని సేలు చేశాక దాన్ని అప్రూవు చెయ్యడానికి బోర్డుమీటింగు పెట్టాలి. ఈలోగా సొత్తును దాని స్తానంనుంచి కదల్చగూడదు. కదిలిస్తే కేసౌతుంది.

ఈశ్వరరావు. అయితే, ఇంకా మీటింగు జరగలేదేమిటి ?

రామబ్రహ్మం. ఉహుఁ! మీటింగు రేపటికి వేశాడు.

వెంకటాద్రి. ఈలోగా పంచాయితీ ఆఫీసరు రానే వొస్తున్నాడు.

ఈశ్వరరావు. ఓహో! అదా సంగతి!

రామబ్రహ్మం. ఇప్పు డాయ నొచ్చి సొత్తు చూపించమంటే నీళ్ళు నమలాల్సిందే !

వెంకటాద్రి. అసలు స్వరూపాలైనా వుంటేగా ? దుంగలకింద ఏనాడో కోయించేసుకున్నాడు.

ఈశ్వరరావు. అయితే, గట్టి చిక్కేనన్నమాట!

వెంకటాద్రి. చిక్కంటే చిక్కా? యమచిక్కు.

రామబ్రహ్మం. పీకమీద కత్తే!

వెంకటాద్రి. మెడకుచ్చే!

రామబ్రహ్మం. దిగుతుందిలే ఇఖ పొగరు!

వెంకటాద్రి. ఎంత పొగరు లేకపోతే, పెంటపోగు పిసరంత వీధిలో కొచ్చిందని నాపైన న్యూసెన్స్‌కేసు పెడతానంటాడు ? సంసారి అన్నాక పెంటపోగు కాస్త ఇటూ అటూ రాకుండా వుంటుందా ?

రామబ్రహ్మం. నాకుమట్టుకు నోటీ సెట్టలేదూ ? ములుగు మూడు రోజుల్లో తీసెయ్యకపోతే ప్రాసిక్యూషను చేయిస్తాట్ట! ఆసామి అన్నాక కాస్త వెనకా ముందూ వుండదూ ? ఆ రెండుమోపుల చెత్తకే చెరువునీళ్ళన్నీ చెడిపోతాయీ?

వెంకటాద్రి. ఇంతకీ వీడికి కొళ్ళుతెచ్చింది మనమే !

రామబ్రహ్మం. పోనీలే అయినవాడని నేను మాకుదురువాళ్ళ ఓట్లన్నీ వేయించకపోతే, ఈ ముండమోపి అసలు మెంబరైనా అయ్యేవాడేనా?

వెంకటాద్రి. చాల్లే! ఇలాంటిమాటలు నాదగ్గిర చెప్పకు. చెయ్యి తడి అయిందేమో, వోట్లు వేయించావేమో!

రామబ్రహ్మం. ఛీ ఛీ! వాడి పాపిష్ఠిసొమ్ము తిన్నవా డెవడు? ఏమైనా కతికితే, నువ్వే కతికివుండాలి.

ఈశ్వరరావు. మిమ్మల్నిచూస్తే ఒకందుకు మాత్రం నాకు చాలా ముచ్చటేస్తున్నది. మీకు ఒకరి పొడ ఒకరికి క్షణమైనా గిట్టకపోయినా, జానకిరామయ్యమీద మాత్రం కలిసి కత్తి కడుతున్నారు.

రామబ్రహ్మం. పేనుకు పెత్తనమిస్తే తలంతా తెగ కొరికినట్టు, మరి వాడు చేసే పనులేమిటి ?

వెంకటాద్రి. ఇప్పుడే గనక వాణ్ణి నొక్కకపోతే పరి పట్టి పగ్గా
ఉంటాయా?

రామబ్రహ్మం. వాడి అంతు ఇప్పుడే కనుక్కోవాలి.

వెంకటాద్రి. వాణ్ణి ఇప్పుడే పుటమెయ్యాలి.

రామబ్రహ్మం. వాడి పెళ్ళి యిప్పుడే చెయ్యాలి.

వెంకటాద్రి. వాడి భరతం యిప్పుడే పట్టాలి.

ఈశ్వరరావు. కోరితే లంకాదహనం చేయగల సమర్థులు. మీకు
ఎదురేమిటి గాని సుబ్బన్న యింటివద్ద లేదేమిటి?

వెంకటాద్రి. లేకేఁ! వున్నాడయ్యా!

రామబ్రహ్మం. మేము అక్కడినుంచేగా వస్తున్నాం.

వెంకటాద్రి. నీ కబురందింది.

రామబ్రహ్మం. మీ పాలే రొచ్చి

వెంకటాద్రి. సుబ్బన్నతో....

రామబ్రహ్మం. మాదొర ఒకమాటు

వెంకటాద్రి. రమ్మంటున్నాడని

రామబ్రహ్మం. నీకిదే తెగులు! పెద్దమనిషితో మాట్లాడుతూ వుంటే
మాటమాటకు అడ్డొస్తావ్!

వెంకటాద్రి. అసలు నీవెంట రావడం నాదే బుద్ధితక్కువ! [చెంపలు
వేసుకుంటూ] నిన్ననే పనేమిటి? తప్పు నాదేలే!

రామబ్రహ్మం [తనుకూడా లెంపలు వేసుకుంటూ]. కాదు కాదు!
తప్పు నాదే!

వెంకటాద్రి. మ్చ్! నాదే!

రామబ్రహ్మం. ఉహుఁ! నాదే!

[ఈశ్వరరావు నవ్వుతాడు.

రామబ్రహ్మం. చూశావా? ఆ పెద్దమనిషి నిన్ను చూసి ఎలా నవ్వుతున్నాడో!

వెంకటాద్రి. నన్ను చూసి కాదు; నిన్ను చూసే!

[ఈశ్వరరావు ఇంకా బిగ్గరగా నవ్వుతాడు.

వెంకటాద్రి. నువ్వు నిజం చెప్పవయ్యా? ఎవర్ని చూసి?

రామబ్రహ్మం. వీణ్ణి చూసి కాదూ?

వెంకటాద్రి. వీణ్ణి చూసి కాదూ?

[ఈశ్వరరావు కడుపు చెక్కలయ్యేటట్లు విరగబడుతుండగా సుబ్బన్న ప్రవేశిస్తాడు. అతడు ఈశ్వరరావు కంటె రెండు, మూడేళ్లు పెద్ద. ఊళ్లో ఒక పార్టీ నాయకుడు, పెద్ద వ్యవహర్త.

ఈశ్వరరావు. రా, రా! సుబ్బన్నా! రా! పరమానందయ్య శిష్యుల్ని చేర్చి వ్యవహారం చాలా ముదరవెట్టావే!

సుబ్బన్న. మీ రిక్కడ వోగైనారూ? వార్తి సోదిరాముళ్ళు! మీతో పనులైనట్టే! రామబ్రహ్మం! పార్టీమెంబర్లందర్నీ ప్రెసిడెంటు తన యింటికి పిలిపించుకున్నాడు. ఏమి గూడుపురాణీ చేస్తున్నారో కాస్త ఆరా తీసి రా!

రామబ్రహ్మం. ఆఁ! చెయ్యడాని కేముంది? తలపట్లు పట్టుకుంటున్నారు!

[వెడతాడు.

సుబ్బన్న. వెంకటాద్రీ! నువ్వెళ్ళి మన ప్రసాదరావుని ఒకసారి పిలుచుకురా! నే నిక్కడే వుంటాను—చప్పున వెళ్ళిరా!

వెంకటాద్రి. పొద్దునొకసారి వెళ్ళితే, పొల మెళ్ళా రన్నారు. తిరిగొచ్చాడో, లేదో!

[వెడతాడు.

సుబ్బన్న. చాలాదాకా అయిందిలే.

ఈశ్వరరావు. ఆ మొత్త మెంతో చెప్పరాదూ?

సుబ్బన్న. ఆс! తాడో పేడో తేలేసరికి రెండు, మూడు సంచు లైనా కాదూ?

ఈశ్వరరావు. మీకు రెండు, మూడువేలైతే, జానకిరామయ్యా పార్టీవాళ్ళకు కనీసం మరింతైనా కాక తప్పదుగా?

సుబ్బన్న. ఆс! వాళ్ళ యింట్లో సొమ్ము తెచ్చిపెడుతున్నా రేమిటి? పవరు చేతిలో వుందిగా! కాలవగట్ల పాటల్లో మిగిల్చి, పార్టీ ఫండు ఏర్పరుస్తున్నారు.

ఈశ్వరరావు. ఏమైనా ఊరు సొమ్ము దండగ కావడమే గదరా? దీనిలో సగంపెడితే, గరల్స్‌స్కూలుకి ఒక బిల్డింగ్ పడేది కాదూ? స్థలం వుండనే వున్నదయ్యె. దాన్ని భరంతుకూడా చేశారయ్యె. జిల్లేళ్ళు, పల్లేళ్ళు మొలిచి, అది పాడుపడి పోవల సిందేనా?

సుబ్బన్న. నీదంతా పిచ్చిగావి, స్కూలుకోసమంటే డబ్బిచ్చే వాడెవడురా?

ఈశ్వరరావు. ఎందుకివ్వరు? - మనం సరిగా ప్రచారం చేసి, తగు ఉత్సాహం కలిగించాలేగాని!

సుబ్బన్న. బస్తీలో కూర్చున్నావ్!—పల్లెటూరు వ్యవహారాల సంగతి నీకేం తెలుసులేరా? ఇక్కడుండి అన్నీ పడుతుండే మాకే అకళింపు కావు, వాటి లోతుపాతులు! నువ్వు పుస్తకాల్లో చదువుకున్నట్టు జరగమంటే జరుగుతుందా?

ఈశ్వరరావు. ఇంతకూ నా కేమీ తెలియదంటావ్? అయితే, నన్ను రాజీచెయ్యడానికి రమ్మనడం దేనికి?

సుబ్బన్న. ఇంకేం రాజీరా? వ్యవహారం నాచెయ్యికూడా దాటి పోయింది. నేను ఆపాలన్నా, ఇక ప్రాసిక్యూషను ఆపలేను. వాడి కళ్లు ఎంత కప్పుకు పోకపోతే....

[రొజుకుంటూ రామబ్రహ్మం ప్రవేశిస్తాడు.

రామబ్రహ్మం [డొక్కలు యెగరవేస్తూ]. పోయాడు!

సుబ్బన్న [ముఖమే ప్రశ్నార్థకం కాగా]. ఆఁ?

రామబ్రహ్మం [ఇంకా సొలిపడుతూ]. పోయాడు! ఇంకేముంది? పోయాడు!

సుబ్బన్న. ఎవడు పోయాడు? ఎక్కడికి పోయాడు? ఏమొచ్చి పోయాడు?

రామబ్రహ్మం [ఇంకా గుక్కతిప్పుకో లేక]. వాడే?

సుబ్బన్న. ఎవడు?

రామబ్రహ్మం [కాస్త తెప్పరిల్లి]. వాడే! జానకిరామయ్య!

సుబ్బన్న. తప్పించుకు ఎక్కడికి పోయాడంటావ్?

రామబ్రహ్మం. బోర్డు మీటింగు మొన్నే జరిగినట్టు రాసి పారేశాడు!

సుబ్బన్న [ఆశ్చర్యంగా]. ఆఁ!

[ఈశ్వరరావు చిరునవ్వు నవ్వుతాడు.

రామబ్రహ్మం. మెంబర్ల సంతకాలుకూడా చేయించేసుకున్నాడు!

సుబ్బన్న. ఓహో!

[అతని ముఖంలో తీవ్రాలోచన కనబడుతుంది.

రామబ్రహ్మం. తెచ్చి వాములదొడ్డిలో పెట్టుకున్న మానులన్నీ పాలేళ్ళతో పగలేయించి, బళ్ళమీద వాళ్ళకీ, వీళ్ళకీ తోలించేశాడు. అక్కడ చితుకు పుల్లయినా మిగల్చలేదు.

సుబ్బన్న. ఉహుఁ! అలాగేఁ? [కొన్ని క్షణాల తర్వాత విజయ సూచకమైన చిరునవ్వుతో తల పంకిస్తూ] సరే! తనచేత్తో తనే మెడకి ఉచ్చు మరింత బిగించుకున్నా డన్నమాట!

ఈశ్వరరావు. అదేమిటిరా?

సుబ్బన్న. ఏమిటో చెప్తానులే! [రామబ్రహ్మంతో] ఆ వెంకటాద్రి అదే పోకడ పోయాడేమిటి? కాస్త వెళ్ళి ప్రసాదరావుని ఇక్కడున్నట్టు పిలుచుకురా! మర్చిపోక, మీటింగు ఎజెండా తెమ్మన్నానని ప్రసాదరావుతో చెప్పు! చూస్తావేఁ! త్వరగా ఈపని చేసుకురా!

రామబ్రహ్మం. ఇంకేం చెప్పడం? ఇంకేం చూడ్డం? పోయాడు. గుప్పిటిలోనుంచి తప్పించుకు పోయాడు!

సుబ్బన్న. ఆఁ! ఎక్కడికి పోతాడు?—ఏట్లోకి! నువ్వెళ్ళి చెప్పినపని చేసుకురా! నేను నడిపిస్తాగా వ్యవహారం!— నీకెందుకు?

[రామబ్రహ్మం నిష్క్రమిస్తాడు.

ఈశ్వరరావు. సుబ్బన్నా! ఏమి కొత్త యెత్తు యెత్తుతున్నావురా?

సుబ్బన్న. మీటింగు రేపని ఎజెండా పంపించలేదట్రా? దాన్నిబట్టే కాలవగట్టు చెట్లపాట ఇంకా అప్రూవు కాలేదని మాకు తెలిసింది. మాపార్టీ మెంబర్లు ముగ్గురు వూళ్లో లేరుగాని, ప్రసాదరావుకి ఎజెండా అందింది. ఇప్పుడిక ఆ ఎజెండాయే చాలు మన జానకిరాముణ్ణి జెయిలుకు పంపించడానికి!

ఈశ్వరరావు. గట్టిచిక్కే తెచ్చుకున్నాడే!

సుబ్బన్న. గట్టిచిక్కే నని నెమ్మదిగా అంటున్నా వేమిటి? ఇది కొరివిపెట్టి తలగోక్కోవడమే!

[రామబ్రహ్మం, వెంకటాద్రి, ప్రసాదరావు ప్రవేశిస్తారు. ప్రసాదరావు దాదాపు నలభైయేళ్లవాడు. చిరబొజ్జతో నిండైన విగ్రహం. కాని, ఆలోచన తక్కువ.

రామబ్రహ్మం. ఇదుగో! సుబ్బన్నా! నాకు వాకిట్లోనే ఎదురయ్యారు.

ప్రసాదరావు. వ్యవహారం బెడిసిపోయినట్టేనా?

రామబ్రహ్మం. ఏఁ సుబ్బన్నా! ఇఖ ఎలా చక్కదోస్తావ్?

వెంకటాద్రి. ఏదో ఒకదారి చూడు, సుబ్బన్నా!

సుబ్బన్న [ప్రసాదరావుతో]. ఏదీ, ఆ ఎజెండా ఏది?

ప్రసాదరావు. ఎజెండా ఏమిటి?

సుబ్బన్న. కొంపతీసి పారేశావేమిటి?

ప్రసాదరావు. అబ్బే! యుద్ధమొచ్చాక కాగితం కరువని మీటింగుకు తలొక నోటీసు, ఎజెండా పంపించడం లేదుగా? అంతా ఒకే కాగితంమీద రాసి, అందరు మెంబర్ల సంతకాలు దానిమీదే పెట్టించుకు పోతున్నారు.

సుబ్బన్న [తెల్లబోయి]. ఈ సంగతి నేను కానలేదే!

[ఈశ్వరరావు మందహాసం చేస్తాడు.

ప్రసాదరావు. పాత ఎజెండా చించిపారేసి, కొత్తది సృష్టించాడంటావా?

సుబ్బన్న. ఔను! దానిమీద పాత తారీకేసి మెంబర్ల సంతకాలు చేయించుకుంటాడు.

ప్రసాదరావు. మరి నా సంతకం వుండదుగా ?

సుబ్బన్న. హాజరులేవని రిమార్కు రాసేస్తాడు.

ఈశ్వరరావు. సుబ్బన్నా! మరి నీ ఆట కట్టినట్టేనా ?

[సుబ్బన్న జవాబు చెప్పడు. తీవ్రాలోచన చేస్తున్నట్టు కనబడతాడు.

రామబ్రహ్మం. ఆరి! దొరికినట్టే దొరికి, ఎంత సులుసూత్రంగా దాటుకున్నాడు.

వెంకటాద్రి. పిట్ట చిక్కినట్టే చిక్కి, తుర్రున దూసుకుంది !

రామబ్రహ్మం. ఇఖ చూడు వాడి ప్రతాపం !

వెంకటాద్రి. ఇఖ వాడు ఆడిందే ఆట.

రామబ్రహ్మం. పాడిందే పాట.

వెంకటాద్రి. ఇఖ మరీ మండిస్తాడు !

రామబ్రహ్మం. అమ్మ! వాడి యెత్తులు మరెవరి కొస్తాయి !

వెంకటాద్రి. వాడు నక్కని చంపి పుట్టాడు.

రామబ్రహ్మం. ఆవలిస్తే పేగులు లెఖ్ఖెడతాడు.

వెంకటాద్రి. ఏట్లో పారేసినా ఎదు రీదుకొస్తాడు.

రామబ్రహ్మం. కాటిమీద పెట్టినా లేచొస్తాడు.

వెంకటాద్రి. వాడు అఖండుడని నేను ఆదికాలంనాడే చెప్పలా ?

రామబ్రహ్మం. వాడు నా కుదుటివాడు. వాడి మంచిచెడ్డలు నాకంటె నీకే ఎక్కువ తెలుసా ?

వెంకటాద్రి. కాడిగట్టు వాళ్ళం. వాడితో నే నెన్ని పడివున్నానో నీకేం తెలుసు !

రామబ్రహ్మం. అమ్మ పుట్టిల్లు మేనమామ దగ్గిర....

సుబ్బన్న. అబ్బబ్బ ! మీరు కాసేపు ఊరుకోండి ! అఁ ! ప్రసాద రావ్ ! ఈపూట మీటింగు జరిగింది ప్రెసిడెంటు యింట్లోనేగా?

ప్రసాదరావు. ఔను !

సుబ్బన్న. అయితే, మినిట్సుబుక్కు యింటికి పట్టించుకు వెళ్ళా దన్నమాట ! దాన్ని ఆఫీసులోనుంచి కదిలించనే గూడదు.

ప్రసాదరావు. ఔనౌను !

సుబ్బన్న. సరే ! దాన్ని పంచాయితీ ఆఫీసరు వచ్చేలోపల మళ్ళీ ఆఫీసులోకి చేర్చనివ్వకుండా చేస్తే సరి !

ప్రసాదరావు. అపని చేస్తేనా, పచ్చి వెలక్కాయ గొంతున పడ్డట్టే.

సుబ్బన్న. రామబ్రహ్మం ! వెంకటాద్రీ ! చూస్తారేఁ ? మనః వాళ్ళందరినీ పోగుజేసుకు రండి ! బోర్డు ఆఫీసు దరిదాపులకైన ఆ పార్టీమనిషిని అడుగు పెట్టనివ్వరాదు—అదేమైనా సరే !

రామబ్రహ్మం. అడుగుపెడితే, బడితపూజే !

వెంకటాద్రి. బుర్ర రామకీర్తన పాడిందన్న మాటే !

రామబ్రహ్మం. అటువైపుకు తొంగైనా చూస్తే, రక్తం కళ్ జూడడం !

వెంకటాద్రి. అక్కడే పాతిపెట్టం !

రామబ్రహ్మం. అక్కడే గోరీ కట్టం !

వెంకటాద్రి. ఎవడికి కలేజా వుంది అటు రావడానికి !

రామబ్రహ్మం. ఎన్ని గుండె లుండాలి అక్క డడుగెట్టాలంటే !

వెంకటాద్రి. ఇంటిదగ్గిర చెప్పుకు రావాలి.

రామబ్రహ్మం. తీస్తాం దెబ్బ.

వెంకటాద్రి. వేస్తాం వీరంగం.

రామబ్రహ్మం. చూపిస్తాం మా తడాఖా!

వెంకటాద్రి. ఇవ్వాళ పుచ్చి లెగరాల్సిందే.

రామబ్రహ్మం. పీనుగులు నడవాల్సిందే.

సుబ్బన్న. మాటలు కాదు; చేతలు కావాలిప్పుడు. పదండి త్వరగా! ప్రసాదరావ్! నువ్వూ పద!—నేనూ మీ వెనకాలే వస్తున్నా.

[రామబ్రహ్మం, వెంకటాద్రి, ప్రసాదరావు వెడతారు.

సుబ్బన్న [వారి ముగ్గురినీ గడపదాటి పోనిచ్చి]. ఆట ఇంకా కట్టలేదు!

ఈశ్వరరావు. ఎందుకు కడుతుంది? దొమ్మీకి దిగబోతున్నావుగా?

సుబ్బన్న. వాడు చేస్తున్న పనులు బాగున్నాయే నీకు?

ఈశ్వరరావు. ఎవరు చేస్తున్న పనులూ బాగుండలేదు. ఈ కోపాలు, ఈ కక్షలు, ఈ కలహాలు....

["ఈశ్వరరావుగారూ!" అని సింహద్వారంలోనుంచి కేక.

ఈశ్వరరావు. ఎవరది?

సుబ్బన్న. ఆఁ! బిల్లు కలెక్టరులే!

ఈశ్వరరావు. ఏమోయ్ దేనికి?

బిల్లు కలెక్టరు [బయటనుంచే]. మీ రున్నారేమో మా ప్రెసిడెంటు గారు సూడమన్నారండీ!

ఈశ్వరరావు. ఏడీ ఆయన?

బిల్లు కలెక్టరు [బయటినుంచే]. మీ దగ్గిరికే వొస్తున్నారు.

ఈశ్వరరావు. సరే! రమ్మను.

సుబ్బన్న. మరి నేను పోతున్నారా?

ఈశ్వరరావు. ఏఁ ?

సుబ్బన్న. వాణ్ణి రమ్మన్నావుగా !

ఈశ్వరరావు. వాడొస్తే నువ్వు వెళ్ళాలేమిరా? మీ ఉభయులకు నేను కావలసిన వాడినేగా ?

సుబ్బన్న. అఁ! నేనుంటే వాడు రాడులే! నువ్వు ఒంటరిగా వున్నావేమో చూచి రమ్మనే, ముందు బిల్లు కలెక్టర్ని పంపించాడు.

ఈశ్వరరావు. మరి నే నేమి చెప్పి లాభం లేదన్నమాట!

సుబ్బన్న. నీకు తెలియవులేరా పల్లెటూరి వ్యవహారాలు!

[సుబ్బన్న నిష్క్రమిస్తాడు. ఈశ్వరరావు తిరిగి పత్రిక తీసి, దేనిపైనా దృష్టి లగ్నం కానందున పేజీలు తిరగవేస్తూ వుంటాడు. కొన్ని క్షణాల తర్వాత జానకిరామయ్య ప్రవేశిస్తాడు. అతడు ఈశ్వరరావు ఈడువాడే. వేషంలో కొంత దర్పం కానవస్తుంది. ఆ దర్పం ప్రవృత్తిలోకూడా లేకపోలేదు.

జానకిరామయ్య. చూశావుగాదురా సుబ్బన్న నడిపిస్తున్న తతంగం?

ఈశ్వరరావు. ఒక్క అదేనన్నమాటేమిటి? సర్వం చూస్తున్నా.

జానకిరామయ్య. కట్టెపుల్లలకు కరువుగా వుందని ఊళ్ళో ఉద్యోగస్థులు మొహమోట పెడితే, వాళ్ళకు కాస్త సప్లయి చేసినందుకు నా పీకమీదికి తెచ్చాడు.

ఈశ్వరరావు. నువ్వేమీ తోలించుకో లేదా?

జానకిరామయ్య. ఈముష్టి రెండుమూడు బళ్ళ పుల్లలు లేకపోతే నాకు గడవదట్రా? నేను ఊళ్లో లేనప్పుడు పంచాయితీబోర్డు గుమాస్తా చేయించాడు ఈ పాడుపని.

ఈశ్వరరావు. నీకు తెలియకుండా జరిగితే వాటి వెందుకు అట్టి పెట్టుకున్నావ్?

జానకిరామయ్య. అది తప్పే! ఆమాట నాకు తోచలేదు.

ఈశ్వరరావు. మరి ఇవ్వాళ ఈ మీటింగు మాటేమిటి?

జానకిరామయ్య. నా ప్రాణంమీదికి తెస్తే, మరి నన్ను చావ మంటావా? ఏదో ఒక విధంగా తప్పకోవద్దూ?

ఈశ్వరరావు. సరేగాని నువ్వు రాజీ ప్రయత్నం చెయ్యమంటేనేగా నే నివ్వాళ పనికట్టుకొచ్చింది? నన్ను రమ్మని చెప్పినవాడివి. ఊళ్లోకొచ్చి సుబ్బన్నను తిట్టడం తగునా?

జానకిరామయ్య. అఁ! లుచ్చా! నేను తిట్టానని చెప్పాడూ?

ఈశ్వరరావు. ఒకపక్కని లుచ్చా అంటూనే తిట్టలేదంటా వేమిరా?

జానకిరామయ్య. ఆ వెధవ ఆడే అబద్ధాలుచూస్తే, ఎవడికి ఒళ్లు మండుకురాదు? వాడొట్టి లఫంగు.

ఈశ్వరరావు ఇప్పుడు నోరు పారేసుకోవడం దేనికిగాని "ఇన్నేళ్ల నుంచీ ప్రెసిడెంటుగా వున్నానుగదా! ఊరుకు ఏమి ఉపకారం చేశా?" నని ఎన్నడైనా ఆలోచించుకున్నావూ?

జానకిరామయ్య. ఎవడైనా చేసే దేమున్నదిరా? పంచాయితీబోర్డు ఆదాయం వడసారం రెండువేలు! దానిలో ఆరేడువందలు జీతాలకు, ఎస్టాబ్లిష్‌మెంటుకు పోతుంది. మిగతా దాంతో ఏమి పనులౌతాయి? పోనీ, ఏమైనా చేయిద్దామంటే, నూరురూపాయలు దాటితే దానికి సవాలక్ష ఎస్టిమేట్సు, అప్రూవల్సు కావాలి. దీనిలో ఎక్కడ ఏం పొరపాటొచ్చినా, సర్‌ఛార్జీలు తప్పవు. ఇదే పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగిరీ బండారం!

ఈశ్వరరావు. అయితే, రాజీనామా పెట్టరాదూ!

జానకిరామయ్య. పెడితేనే బాగుండును. కాని, పరువుకోసం పట్టుకు పాకులాడుతున్నా. ఇది కత్తిమీద సాములా వుంది. ఇవ్వాళ చూశావుగా ఎంత గట్టిదెబ్బ తట్టుకోవాల్సొచ్చిందో!

ఈశ్వరరావు. చూడకేమిరా? ఎత్తుకుపై యెత్తు ఇంద్రజాలపు యెత్తులెత్తారు. సామ్రాజ్యచక్రాన్ని తిప్పే తెలివితేటలున్నాయి. కాని, ఏమి లాభం? ఒకరిపై ఒకరు కక్షలు సాధించుకోడానికే గాని, దేశానికి, ప్రజలకు వుపయోగించడం లేదు.

జానకిరామయ్య. ఒకడు ఒక పదవిలో వుంటే, వాణ్ణి ఎలా దిగదియ్యాలని తప్పితే మనకు వేరే ఆలోచనే వుండదయ్యే. ఇక, మనమేం ముందుకొస్తాంరా ?

ఈశ్వరరావు. ఆ మాటా నిజమే! వీరభద్రయ్యను రిమూవ్ చేయించేగా నువ్వు మొదటిసారి ప్రెసిడెంట్ అయింది!

జానకిరామయ్య. అప్పుడు ఈ సుబ్బన్నే నా మెడలు విరిచాడు. ఈ మహాపదవి నాకు కావాలని నే నేడ్చానా ?

ఈశ్వరరావు. నామాట విని, నువ్విప్పుడు కాస్త తగ్గరాదూ? ఉభయ పార్టీలకు అనుకూలమైనవాణ్ణి ప్రెసిడెంటుగా చేద్దాం. లేకపోతే, ఇప్పుడు రైటింగ్‌లవరకు పోతుందేమో! నువ్వు మినిట్స్‌బుక్ ఆఫీసుకు చేర్చబోతే, అంత పనీ తప్పదు.

జానకిరామయ్య. ఆఁ! ఏడ్చారులే! ముందే ఆలోచించి అందుకు తగు కట్టుదిట్టంచేశా. పోలీసు సబ్‌యినస్పెక్టర్ దాన్ని లోపలికి చేర్పిస్తానన్నాడులే! ఎవడైనా అడ్డొస్తే బొక్కలో తోయిస్తాడు.

ఈశ్వరరావు. కావచ్చులేరా! కాని, కక్షలు పెంచుకుంటే ఊరు ముందుకొస్తుందా?

జానకిరామయ్య. ఆ! నీకు తెలియవులేరా, పల్లెటూరి వ్యవహారాలు!

ఈశ్వరరావు. సుబ్బన్నకూడా సరిగా ఇదే మాట అనిపోయాడు సుమీ! మీ కిద్దరికీ అన్నీ భేదాభిప్రాయాలే అయినప్పటికీ, ఒక్క విషయంలో మాత్రం ఏకాభిప్రాయం వున్నట్టుంది.

జానకిరామయ్య. ఏ విషయంలో?

ఈశ్వరరావు. వార్ని ఖంతకింద నన్ను లెఖ్ఖకట్టడంలో!

తెర ]



## పాత్రలు

| | |
|---|---|
| వెంకట్రామయ్య : | పల్లెటూరి రైతు |
| రాజేశ్వరి : | అతని కుమార్తె |
| సత్యనారాయణ : | అతని అల్లుడు |
| నాగేశ్వరరావు : | అతని మేనల్లుడు |
| చింతాలు : | అతని పాలేరు |
| భీమన్న : | ఒంటెద్దు బండివాడు |

## స్థలం

వెంకట్రామయ్యగారి యింటి చావిడి

## కాలం

వర్తమానం



# భంగపాటు

[వెంకట్రామయ్యగారి యింటిచావిడి. ఎడమవైపున సింహద్వారం, కుడివైపున పెరటిలోకి ద్వారం. ఈరెండు ద్వారాలకు ఒక్కొక్క పార్శ్వంలో ఒకొ్కక్క కిటికీ. ఎదురుగా మరి రెండుద్వారాలు: ఒకటి పడకగదిలోకి, రెండవది వడమటింటిలోకి. చావిడిలో వీధిగోడ చెంతగా యెత్తిపెట్టి వున్న రెండు నవారు మంచాలు. చావిడి గోడలకు లక్ష్మి, సరస్వతి, మోహిని, మేనక – విశ్వామిత్రుడు, శ్రీరామ పట్టాభిషేకం, గోపికా వస్త్రాపహరణం మొదలైన పటాలు (సన్‌లైట్, వినోలియా వైట్‌రోజ్ సబ్బుల అడ్వర్‌టైజ్‌మెంట్స్‌తో సహా)

తెర లేచినప్పుడు చావిడి ఖాళీగా వుంటుంది. వీధితలుపును ఎవరో తట్టినచప్పుడు కాగా, "ఎవ రది?" అంటూ వడమటింటిలో నుంచి రాజేశ్వరి చావిడిలోకి వస్తుంది. ఆమెవయస్సు పదహారు, పదిహేడు సంవత్సరాలు. చామనచాయ. కళకళలాడుతున్న కోలముఖం. కాంతివంతమైన చేరడేసి కళ్లు. తిరిగి తలుపు తట్టిన చప్పుడు కాగా "వచ్చే" అంటూ ఆమె త్వరగా అడుగు వేస్తుంది.

రాజేశ్వరి [తలుపుతీసి]. ఓహో! మీరా!

సత్యనారాయణ [దర్పాన్ని నటిస్తూ, చావిడిలోకి వచ్చి]. ఔను! మేమే!

రాజేశ్వరి. అయితే, దయచెయ్యండి, మరి.
సత్యనారాయణ. బయటికేనా ?
రాజేశ్వరి [చిరునవ్వుతూ]. మీ చిలిపిమాటలు పోనిచ్చారు కారు. [పడమటింటిలోకి వెడుతూ] అమ్మా! వారొచ్చారే!

[సత్యనారాయణ చావిడి మధ్యకు వస్తాడు. అతడి వయస్సు 22 - 23 మధ్య. పొడుగ్గా, పలచగా, నాజూకైనవాడు. ఒళ్ళగోచి పంచెతో, వోదులు లాల్చీతో వల్లెవాటు ఉత్తరీయంతో, బెంగాలీ వేషం. నడకలో, నడతలో బస్తీ మెరుపు. అతడు ఉత్తరీయాన్ని తీసి, ఎక్కడ తగిలించాలా అన్నట్టు చావిడిని కలయజూస్తూ వుండగా సామానుతో, థర్మస్ ఫ్లాస్కుతో బండి భీమన్న వస్తాడు.

బండి భీమన్న [సామాను చావిడిలో పెడుతూ]. సామాను సరిగ్గా సూసుకోండి, బాబయ్యా! ఇదో! ఇది పెట్టి; ఇది పరుపుసుట్ట; ఇది - మరిగలితే - ఏంటో గొట్టం, బాబయ్యా! ఇది పళ్ళబుట్ట. మొత్తం నాల్గు సాల్తీలు. లెక్క సూసుకోండి, బాబయ్యా!
సత్యనారాయణ. సరి లేవోయ్! బాడుగెంత?
బండి భీమన్న. మీ సిత్తం బాబయ్యా!
సత్యనారాయణ [పర్సు తీసి, పావలాకాసు యిస్తూ]. మంచిది, పోవోయ్!
బండి భీమన్న [పావలాకాసు అందుకుని దణ్ణంపెడుతూ]. ఈనాం దయిసేయించండి, బాబయ్యా!
సత్యనారాయణ [పర్సు జేబులో పెట్టివేసుకుంటూ]. ఈనాములు, అగ్రహారాలు యివ్వడానికి నేనేమీ మహరాజును కాదోయ్!

బండి భీమన్న. పెబువులు-మీకేం లోటు, బాబయ్యా! మీరు సల్లగా సూడకపోతే పేదా బిక్కీ బతికే దెలా, బాబయ్యా?

రాజేశ్వరి [చెంబుతో నీళ్ళు తెచ్చి] ఏం, భీమన్నా! ఏమి టది?

సత్యనారాయణ. పావలా యిస్తే, ఇంకా ఈనాం తెమ్మంటున్నాడు!

రాజేశ్వరి. పావలా పుచ్చుకున్నాడూ? స్టేషన్‌నుంచి వూళ్ళోకి బేడే మామూలు. ఏం, భీమన్నా? కొత్తవారిని చేసి, ఇలా గుంజు తున్నావ్! వుండు, మా నాన్నతో చెబుతా!

బండి భీమన్న. నీకు దణ్ణంపెడతా! వొద్దమ్మా, వొద్దు!

సత్యనారాయణ. ఏమోయ్! చెబితే ఏఁ?

బండి భీమన్న. ఎంకట్రామయ్య బాబయ్యతోనే! అబ్బో! ఆయన కరకట్టు మనిషి. మాట తబాబొస్తే, నిలువునా పాతేస్తాడు.

సత్యనారాయణ. భేష్!

బండి భీమన్న. సిట్టెమ్మొగారూ! పోనీ, ఈ పావలా తీసుకుని, బేడే యిప్పించండమ్మా!

సత్యనారాయణ. సరి లేవోయ్! ఇక, నువ్వు పో!

బండి భీమన్న. సిత్తం! బాబయ్యా! సామానులు లెక్క చరిగా సూసుకోండి.

[దణ్ణంపెట్టి వెళ్ళిపోతాడు.

రాజేశ్వరి [నీళ్ళచెంబు అందిస్తూ]. కాళ్ళు కడుక్కోండి.

సత్యనారాయణ. నా కాళ్ళకేఁ? పరిశుభ్రంగానే వున్నాయ్!

రాజేశ్వరి [చిరునవ్వుతూ]. తమరు బస్తీవారు కాబోలు! మేము పల్లెటూరి వాళ్ళం, మోటువాళ్ళం. మా మోటు ఆచారం ఇదే మరి!

[చెంబు అందిస్తుంది.

సత్యనారాయణ [ఉత్తరీయాన్ని రాజేశ్వరి చేతికిస్తూ]. అబ్బే! మోటువాళ్లు కాదు; మాటకార్లు!

[కాళ్లు కడుక్కోడానికి సత్యనారాయణ పెరటి గుమ్మం గుండా వెడతాడు. రాజేశ్వరి ఉత్తరీయాన్ని ఒక పటం మేకుకు తగిలిస్తుంది. ఒక నవారు మంచాన్ని వాల్చి, దానిపై జంపఖానా పరిచి, తలవైపున దిండువేస్తుంది. ఈలోపల కాళ్లు కడుక్కువస్తున్న సత్యనారాయణకు యెదురుగా వెళ్లి, తువాలిచ్చి, చెంబు తీసుకుని, పడమటింటిలోకి వెడుతుంది. సత్యనారాయణ మంచంపై కూర్చుంటాడు.

బండి భీమన్న [బయటనుంచి]. బాబయ్యా!

సత్యనారాయణ. ఎవరది ?

బండి భీమన్న [చావిడిలోకి వస్తూ]. నేనే బాబయ్యా!

సత్యనారాయణ [బుర్ర గోక్కుంటూ, ఎదురుగా వచ్చి నిలిచిన భీమన్నతో]. దేనికోయ్?

బండి భీమన్న. ఏం, లేదు బాబయ్యా! మరిగత్తే, మీరు మళ్లీ పట్నం ఎప్పు డెడతారు, బాబయ్యా?

సత్యనారాయణ [చికాకుగా]. నీ కెందుకోయ్, ఆ భోగట్టా?

బండి భీమన్న. ఏం లేదు బాబయ్యా! మళ్లీ బండెప్పుడు తోలుకు రమ్మంటారో నని.

సత్యనారాయణ. ఓహో! అదా సంగతి! ఎల్లుండి పొద్దున మెయిల్‌కు తోలుకురా!

రాజేశ్వరి [పడమటింటిలోనించి వస్తూ]. మళ్ళీ ఎల్లుండే ప్రయాణ మటండీ ?

సత్యనారాయణ. ఔను ! [బండి భీమన్నతో] మంచిదోయ్ ! ఇక, నువ్వు పో !

బండి భీమన్న. సిత్తం! సిత్తం! దణ్ణం, బాబయ్యా!

[పోబోతాడు.

రాజేశ్వరి. ఇదుగో భీమన్నా ! రామాలయందగ్గిర మా నాన్న వుంటే, పట్నం అల్లుడుగా రొచ్చారని కాస్త చెప్పిపో !

బండి భీమన్న. సిత్తమమ్మా ! సిత్తం !

[వెళ్ళిపోతాడు.

రాజేశ్వరి [చిన్నమొహం చేసుకుని]. అంత తొందరేమండీ ? ఎల్లుండే తిరిగి వెళ్లాలా ? వారం రోజులపాటైనా మీకు సెలవు దొరక దేమండీ ?

సత్యనారాయణ. వారంరోజుల ఖర్మ మేమిటి ? అసలే సెలవు దొరికింది !

రాజేశ్వరి [ఆశ్చర్యంగా]. అదేమిటండీ ?

సత్యనారాయణ. ఏమిటా ? ఉద్యోగం వూడింది.

రాజేశ్వరి [నమ్మలేక]. నిజమే ?

సత్యనారాయణ [వెటకారంగా]. కాదు, అబద్ధం !

రాజేశ్వరి. ఆఁ ! పోదురూ ! మీరు వేళాకోళ మాడుతున్నారు.

సత్యనారాయణ. నిజం చెప్పినా, నువ్వు నమ్మకపోతే, మరి నేను చేసే దేమిటి ?

రాజేశ్వరి. అదేమిటండీ ? ఏడాదిపాటు ప్రయత్నం చేసి ఉద్యోగం సంపాయించడమూ, నెలైనా గిర్రున తిరక్కుముందే అది పోవడమూనా !

సత్యనారాయణ [సిగరెట్టు తీసి ముట్టిస్తూ]. నా అదృష్టం అలా వుందన్న మాట. ఆ పత్రిక కట్టివేశారు.

రాజేశ్వరి. మొన్నే గదండీ దాన్ని ప్రారంభించింది ?

సత్యనారాయణ. నిజమే! కాని, కనీసం లక్షైనా పెట్టుబడి లేకుండా పెడితే, దినపత్రిక నడుస్తుందా ?

రాజేశ్వరి. అయ్యయ్యో! నే నొకటి అనుకుంటుంటే, మరొకటి జరిగిందే !

సత్యనారాయణ [సిగరెట్టు పొగ రాజేశ్వరి ముఖంలోకి "ఉఫ్" మని ఊది]. నీ వేమనుకుంటున్నా వేమిటి ?

రాజేశ్వరి [పొగకు ఉక్కిరి బిక్కిరై దగ్గుతూ]. ఊఁ! పోదురూ! ఏమి టిది మోటు సరసం!

సత్యనారాయణ. పోనా ?

[మంచంపైనుంచి లేస్తాడు.

రాజేశ్వరి [భర్త భుజాలమీద చేతులు వేసి నొక్కుతూ]. మహ బాగుంది! కూర్చోండి; కూర్చోండి.

సత్యనారాయణ [నిలబడే]. నీ వేమనుకుంటున్నావో చెబితేగాని కూర్చోను.

రాజేశ్వరి. చెబుతా గదండీ! ముందు కూర్చోండి.

సత్యనారాయణ. అన్నట్టు, కూర్చోకపోతే మీ నాన్నతో ఫిర్యాదు చేస్తావు కాబోలు !

రాజేశ్వరి [నవ్వుతూ]. అబ్బ! కూర్చుందురూ !

సత్యనారాయణ [కూర్చుంటూ]. సరే! అదేమిటో చెప్పు, మరి !

రాజేశ్వరి. మరే....మరే....[నవ్వుతూ] ఎలా చెప్పనండీ ?

సత్యనారాయణ. నోటితో.

రాజేశ్వరి. ఉహూఁ! నేర్చారు మాటలు !

సత్యనారాయణ. ఇంతకూ అదేమిటో చెప్పావ్ కాదు.

రాజేశ్వరి. మరే....మరే....మీకు ఉద్యోగమైంది గనక, ఇక నన్ను

సత్యనారాయణ. ఓహో! అదా సంగతి!

రాజేశ్వరి. మీకేం! మీ కలాగే వుంటుంది! నే నిక్క డెంత కుళ్ళి చస్తున్నానో మీకేం తెలుస్తుంది? మిమ్మల్ని వొదిలి నే నిక్క డిక ఒక్క క్షణమైనా వుండను. ఉద్యోగం గిద్యోగం మాట నాకు తెలవదు. మీరు పట్నం వెళ్ళితే, ఈసారి నేనూ మీ వెంట రావల్సిందే!

సత్యనారాయణ. భేష్! ఉద్యోగం లేకుండా మద్రాసులో కాపరం పెట్టడ మెలా?

రాజేశ్వరి. ఉద్యోగం లేకపోయినా, మీ దక్కడ వుంటంలేదా?

సత్యనారాయణ. నా దారి వేరు. ఒంటరిగావుంటే నా తిప్ప లేవో నేను పడతా.

రాజేశ్వరి. అయితే, జంటగా మన తిప్ప లేవో మనం పడదాం! సరేనా?

సత్యనారాయణ. గట్టి చిక్కే తెస్తున్నావ్!

రాజేశ్వరి [చిన్నబుచ్చుకుని]. పోనీ లెండి, నేను మీకంత భార మైతే.

సత్యనారాయణ [అనునయిస్తూ]. ఇంతలోనే అలక కావాలా?

రాజేశ్వరి. నాకు తోడు అలకన్నూడా!

సత్యనారాయణ. రాజేశ్వరీ! ఏదీ, ఇలా నావంక చూడు! [చూడదు] ఇలా నావంక చూడమంటూ వుంటే? [ముఖాన్ని తనవైపుకు తిప్పుకుని] పిచ్చిదానా! నిన్ను వొదిలి వుండడం నాకుమాత్రం బాధ కాదనుకున్నావా? తెలవు గనక నువ్వు బయటపడ్డావు; నేను పడలేదు. ఇంతే భేదం.

రాజేశ్వరి [సత్యనారాయణ కళ్ళలోకి చూస్తూ] పోనీ, మనం పట్నం కాపరం వెళ్ళడానికి మా నాన్నని డబ్బివ్వమని అడిగితేనో?

సత్యనారాయణ. అడగడం తేలికే! కాని, ఆయ నివ్వొద్దూ?

రాజేశ్వరి. చిన్నదాన్ని - మానాన్న నా కన్యాయం చేస్తా డేమిటి? మా అక్కయ్యలు ముగ్గురూ కాపరాలకు వెడుతూవుంటే, వాళ్ళకి వెయ్యేసి రూపాయ లివ్వలేదూ?

సత్యనారాయణ. నిజం!

రాజేశ్వరి. నిజమేనండీ.

సత్యనారాయణ. ప్రయాణమై వెడుతూవుంటే వాళ్లు అడక్కుండానే యిచ్చాడా?

రాజేశ్వరి. పెద్దక్కాయి కాపరాని కెళ్ళడం నా కేమంత గుర్తు లేదు గాని, రెండో అక్కాయికీ, మూడో అక్కాయికీ వాళ్ళు ప్రయాణమైనాక పసుపూ కుంకంలో పెట్టి మా పెదనాన్నచేత యిప్పించాడండీ!

సత్యనారాయణ. అయితే, నీవు ప్రయాణమైతే నీకూడా....

[బయటనుంచి "చిట్టెమ్మా!" అంటూ వెంకట్రామయ్య కేక.

రాజేశ్వరి. అడుగో! మానాన్న!

సత్యనారాయణ. భేష్! నువ్వు లోపలికి పో!

రాజేశ్వరి. దేనికండీ?

సత్యనారాయణ. నేను కొంచెం కథ నడిపించాల్లే! నువ్వు వెళ్లు.

[చూపులతో "ఏమి చేస్తారో, ఏమో, జాగ్రత్త సుమండీ!" అన్నట్టు హెచ్చరిస్తూ రాజేశ్వరి పడమటింటిలోకి వెడుతుంది.

వెంకట్రామయ్య పుగాకుతునక పొయ తీస్తూ లోపలికి వస్తాడు. వయస్సు దాదాపు యాభై సంవత్సరాలు. ఆరడుగుల పొడుగు; పొడుగుకు తగిన లావు. పెద్ద కళ్లు, గండుమీసం. చూచీ చూడ్డంతోటే హుందా గలవాడిలా కనబడతాడు.

వెంకట్రామయ్య. ఏం నాయనా! ఎప్పుడు రావడం?

సత్యనారాయణ. ఇంతకు ముందేనండీ.

వెంకట్రామయ్య. అంతా క్షేమమా?

సత్యనారాయణ. ఆఁ!

వెంకట్రామయ్య. మరేమీ విశేషాలు లేవు గద?

సత్యనారాయణ. ఏమీ లేవుగాని....

వెంకట్రామయ్య. ఏమి టది, నాయనా?

సత్యనారాయణ [కొత్త సిగరెట్టు తీసి ముట్టిస్తూ]. రాజేశ్వరిని మద్రాసు తీసుకువెడదామని వచ్చానండీ.

వెంకట్రామయ్య. మంచిది, నాయనా! ఎప్పుడు ప్రయాణం?

సత్యనారాయణ. ఇవ్వాళ రాత్రికే.

వెంకట్రామయ్య. సరి సరి! దాని కొాక వారం, వర్జ్యం, మంచీ చెడ్డా లేదన్నమాట! ఎప్పుడు తలుచుకుంటే అప్పుడేనా?

సత్యనారాయణ, నేను మంచిరోజు విచారించే వచ్చా. ఇవ్వాళ మాఘ శుద్ధ దశమీ సోమవారం. వర్జ్యం ఉదయం పదిగంటలకే వెళ్ళిపోయింది. దక్షిణదిశ ప్రయాణానికి ప్రశస్తమైన రోజు.

వెంకట్రామయ్య. కాని, మధ్యాహ్నం రావడమూ, రాత్రికే ప్రయాణమై వెళ్ళడమూనా! పిల్లని కొత్తగా కాపరానికి పంపించడ

మంచే. ఎంత సన్నాహం కావాలి, నాయనా! పోనీ. రెండు, మూడు రోజులతర్వాత వెళ్ళగూడదూ?

సత్యనారాయణ. కొత్త ఆఫీసు గదండీ - సెలవు దొరకదు.

వెంకట్రామయ్య. ఎంత కొత్త ఆఫీసైతే మాత్రం ఆపాటి సెలవు దొరకదూ?

సత్యనారాయణ. అసలు ఈ రెండురోజుల సెలవు దొరకడమే గగనమైంది.

వెంకట్రామయ్య. సరి సరి! అయితే. అమ్మాయిని ప్రయాణం చేయించవలసిందేనా?

సత్యనారాయణ. మళ్ళీ మొదటికి వస్తున్నారు మీరు.

వెంకట్రామయ్య [పుగాకు తునక లాల్చీ జేబులో పెట్టి, మంచంపై కూర్చుంటూ]. కన్నకడుపు - చూడు! పైగా, అది మా కడసారి బిడ్డ. ఎన్నడూ మమ్మల్ని విడిచివుండెరగదు. ఒకరి చేతిలో పెట్టింతర్వాత పంపించమన్నప్పుడు పంపించి తీరాలనుకో. అయితే, మన ఊరూ. నాడూకాని చెన్నపట్నంలో కాపరం. ఒక ఇరుగా, పొరుగా? నువ్వేమో పగలంతా ఆఫీసులో వుంటావ్. బిక్కు-బిక్కుమంటూ ఒక్కతే అది యింట్లో వుండాలి. బెంగ పెట్టుకుంటుందేమో నని మా భయం.

సత్యనారాయణ. లేనిపోని భయం మీది. మా ఆఫీసుదగ్గర్నే యిల్లు మాట్లాడాను. ఇరుగుపొరుగున నాలుగైదు తెలుగు కుటుంబాలున్నాయి కూడా.

వెంకట్రామయ్య. ఏమున్నా బస్తీదారి వేరు. ఒకరి జోలీ సొంటీ ఒకరికి సుతరామూ పట్టదు. పైగా, తొలిసారి కాపరానికి వెళ్ళడం - ఏమి నిర్వాకం చేస్తుందో. మా వెర్రిబాగుల్ది.

సత్యనారాయణ [లౌకికంగా]. పోనీ, మీరూ, మా అత్తగారూ రెండు, మూడు నెల్లపాటు మాతో వుండి రాకూడదూ?

వెంకట్రామయ్య. మాసూలు యెద్దడిలో క్షణమైనా తీరడం లేదు. ఇప్పుడు వూరు కదిలితే పొలంలో పంట పొలంలో మట్టి కావ ల్సిందే ! లేకపోతే రావడానికేమి? పోనీ, మరి రెండు, మూడు నెల్లపాటు అమ్మాయిని....

సత్యనారాయణ. ఏమో, అది ఇహ మీయిష్టం ; మీ అమ్మాయి యిష్టం.

వెంకట్రామయ్య. నా యిష్టాని కేమొచ్చెలే! నీ యిష్టం, దాని యిష్టం ముఖ్యం.

సత్యనారాయణ. అదేమన్న మాట? మీరు కాదంటే మీ మాటకు మేము వ్యతిరేకంగా వెడతామా?

వెంకట్రామయ్య. నేను కాదనడం తగునా, నాయనా? మరి, అమ్మాయి ఏమంటున్నది?

సత్యనారాయణ. నే నడగలేదు ; మీ రడిగి చూడండి.

వెంకట్రామయ్య. సరి సరి! [బిగ్గరగా] అమ్మా! చిట్టెమ్మా!

[రాజేశ్వరి వచ్చి పడమటింటి గుమ్మంలో నిలబడుతుంది. చావిడిలో జరుగుతున్న సంభాషణను చాటునుంచి వింటున్నందువల్ల సిగ్గుపడుతూ తల కొద్దిగా వంచుకొంటుంది.

వెంకట్రామయ్య. అమ్మా! ఇవ్వాళే ప్రయాణం చేయించమంటున్నాడు సత్యనారాయణ. మరి, నీ యిష్ట మేమిటి?

రాజేశ్వరి [పైట అంచును రెండు చేతులతోనూ పట్టుకుని, దాన్ని వేళ్ళకు చుట్టుకుంటూ, వంచిన తల ఎత్తకుండానే]. ఏమో, మీ యిష్టం ; వారి యిష్టం.

వెంకట్రామయ్య [చిరునవ్వుతూ]. మా యిష్టం మాట కేమిలే! నీ యిష్టమేమిటో చెప్పు, తల్లీ!

[రాజేశ్వరి జవాబు చెప్పదు. సత్యనారాయణ వంక భావపూర్వకంగా చూచి, చిరునవ్వుతూ లోపలికి వెళ్లిపోతుంది.

వెంకట్రామయ్య. సరే, నాయనా! మీ వుభయుల యిష్టమూ అయిన తర్వాత మరి నా అభ్యంతరం దేనికి? కాని, నీ ఉద్యోగం ఖాయమేనా?

సత్యనారాయణ. ఆఁ!

వెంకట్రామయ్య. ఏమి జీత మేర్పాటుచేశారు?

సత్యనారాయణ. నెలకు డెబ్భైఅయిదు రూపాయలు.

వెంకట్రామయ్య. సరి సరి! బి. ఏ. చదివినవాడికి ఇదేమి జీతం నాయనా!

సత్యనారాయణ. తెలుగు పత్రికలలో జీతాలంతే లెండి.

వెంకట్రామయ్య. ఏం గొడవో అది! వేలకువేలు ఖర్చుపెట్టి చదువు కోవడం: చివరికి చూడబోతే వడ్డీ డబ్బులైనా గిట్టవు. సరే గాని, ఈ కరువుకాలంలో ఈ డెబ్భైఅయిదు రూపాయలతో మీ సంసార మెలా గడుస్తుంది?

సత్యనారాయణ. వ్యాసాలు వ్రాసి, పైన ఏమైనా సంపాయిస్తా లెండి.

వెంకట్రామయ్య. వ్యాసాని కేమాత్ర మిస్తారేమిటి?

సత్యనారాయణ. పది రూపాయలు.

వెంకట్రామయ్య. సరి సరి! అదీ అంతంతమాత్రమే నన్నమాట! నెల కెన్ని వ్యాసాలు రాయొచ్చు?

సత్యనారాయణ. మూడు, నాలుగు.

వెంకట్రామయ్య. మూడనుకో! అంటే, మూడు పదులు ముప్పై. అదొక డెబ్బైఅయిదు, ఇదొక ముప్పై. మొత్తం నూరుపైన అయిదు. బస్తీ సంసారానికి ఇదైనా ఏం సరిపోతుంది ?

సత్యనారాయణ. మరేమైనా కూడా గడిస్తాలెండి.

వెంకట్రామయ్య. మరేమైనా అంటే, ఏ విధంగా?

సత్యనారాయణ [కొంచెం చికాకుగా]. ముందుగానె ఎలాగండీ చెప్పడం?—వీలునుబట్టి ఏదో చూడాలి గాని!

వెంకట్రామయ్య. మీకు లోకానుభవం తక్కువ, నాయనా ! మంచి చెడ్డల్ని ముందుగానే విచారించుకోక పోతే, చివరికి చిక్కున పడతారు. నూరురూపాయల సంపాదనతో ఈ గడ్డురోజులలో చెన్నపట్నం సంసారం ఎలా గడుస్తుంది ? ఏదీ లెక్కేసి చెప్పు. ఇంటి బాడు గెంత ?

సత్యనారాయణ. పాతిక రూపాయలు.

వెంకట్రామయ్య పాతిక రూపాయలే! నూరు రూపాయల సంపాదనలో పాతిక ఇంటద్దె కిందే పోతే, ఇంకేం తింటారు ?

[సత్యనారాయణ చికాకు పడి, ఇంకొక సిగరెట్టు తీసి ముట్టిస్తాడు.

వెంకట్రామయ్య ఇప్పుడేగదా, నాయనా, ఒక సిగరెట్టు కాల్చావ్ అప్పుడే ఇది రెండోది! ఈ లెఖ్ఖని రోజు కెన్ని అవుతాయ్ ?

సత్యనారాయణ [మరింత చికాకుగా]. ఇక్కడ మీవూళ్ళో ఉబుసు పోక ఇన్ని కాలుస్తున్నా గాని, రోజూ ఇన్ని కాలుస్తానటండీ ?

వెంకట్రామయ్య. పోనీ, మీ చెన్నపట్నంలో అయితే ఎన్ని కాలుస్తా వేమిటి ?

సత్యనారాయణ [ఎన్ని చెబుదామా అని కొంచెం సంకోచించి, లెఖ్ఖ బాగా తగ్గించి]. రోజు కొక ప్యాకెట్ మాత్రం.

వెంకట్రామయ్య. దాని ఖరీ దెంత ?

సత్యనారాయణ. అయిదణాలు.

వెంకట్రామయ్య [ముక్కుపై వేలువేసుకుని]. అయిదణాలే! అయితే, నెలకి పదిరూపాయలు సిగరెట్లకే చెల్లిపోతుంది. నెలకి పాతిక రూపాయల యింటి బాడుగ, పదిరూపాయల సిగరెట్లు, ఇక యాభై రాళ్ళతో ఇద్ద రెలా బ్రతకడం ?

సత్యనారాయణ [కోపంగా మంచంపైనుంచి చరాలున లేచి]. మీకంత యిష్టం లేకపోతే, మీ అమ్మాయిని పంపించడం మానెయ్యండి! ఈ ప్రశ్నలన్నీ దేనికి?

[అప్పుడే ముట్టించిన సిగరెట్టును గోడమూలకు విసిరి పారేస్తాడు.

వెంకట్రామయ్య [ధోరణిమార్చి]. అదికాదు, నాయనా! పెద్దవాణ్ణి; కావలసినవాణ్ణి. నేను గాకపోతే మీ యోగక్షేమాల్ని మరెవరు విచారిస్తారు ? నీకంత కోపం వస్తున్నప్పుడు నే నిక....

సత్యనారాయణ [తెప్పిరిల్లి, తనుకూడా ధోరణిమార్చి]. అబ్బే! నాకు కోప మేమిటండీ ?

వెంకట్రామయ్య. సరేలే, నాయనా! ఇంతకూ మీరు సుఖంగా వుండడమే నాకు కావల్సింది. పెద్ద పిల్లలు ముగ్గురూ కాపరానికి వెళ్ళేటప్పుడు వెయ్యేసి రూపాయ లిచ్చి పంపించాం. కట్నా

లనుకున్నా, కానుక లనుకున్నా. ఇంతే మేం మిప్పు దివ్వగలిగింది. మాకున్నదేమో ఇరవై ఎకరాల కొంౘ్ర. దానిలో పదెకరాలు హైకోర్టు వ్యాజ్యంలో వుంది. ఆ వ్యాజ్యం మన పక్షమైతే, మా తదనంతరం నలుగురు కూతుళ్ళకు తలా అయిదెకరాలు....

సత్యనారాయణ. దేనికండీ ఇప్పు డీ ప్రసక్తి అంతా ?

వెంకట్రామయ్య. ఈ కాలపు వాళ్ళతో కాపరంలోని కష్ట సుఖాల్ని చెప్పుకోవడం కూడా తప్పే! మేం మేమి తిప్పలుపడ్డా, అది మీకోసం....[సత్యనారాయణ ఇంకొక సిగరెట్టును తియ్య బోవడాన్ని చూచి] మళ్ళీ అప్పుడే ఇంకొక సిగరెట్టా ?

సత్యనారాయణ [తప్పుచేస్తూ పట్టువడిన వానివలె, ప్యాకెట్ జేబులో పెట్టివేసుకుంటూ]. అఁ! లేదులెండి,

వెంకట్రామయ్య. మానడం దేనికి ? కాల్చు, నాయనా! కాల్చు. ఆరోగ్యం చెడిపోతుందేమోననే నా భయం. అన్నట్టు, మీ అత్తకు ప్రయాణంమాట ఇంకా తెలియదేమోగా - చెప్పొస్తా!

[వెంకట్రామయ్య పడమటింటిలోకి వెడతాడు. సత్యనారాయణ విజయగర్వంతో సిగరెట్టు ముట్టించి, గట్టిగా దమ్ములాగుతూ వుండగా, చిట్టిగారెలు, పంచదార, నేతిగిన్నె పుచ్చుకొని రాజేశ్వరి వస్తుంది.

రాజేశ్వరి. పలహారం తెస్తుంటే ఇంతలోనే మళ్లీ సిగరెట్టు ముట్టించా రేమండీ ?

సత్యనారాయణ. చూచావ్! కథెలా నడిపించానో !

రాజేశ్వరి [ఫలహారాన్ని మంచంపై పెడుతూ]. ఏమోనండీ నాకు భయమేస్తున్నది!

సత్యనారాయణ. పిచ్చిదానా! భయం దేనికి ?

రాజేశ్వరి [భర్త సరసను కూర్చుంటూ] మీ ఉద్యోగం సంగతి మా నాన్నకు తెలిస్తేనో ?

సత్యనారాయణ. అందుకనేగా ఇవ్వాళ రాత్రికే ప్రయాణమని పథకం వేసింది. తెల్లవారేసరికి మూడువందల మైళ్ళ దూరాన వుంటాం.

రాజేశ్వరి. అయినా, నాకేమో భయం...

సత్యనారాయణ [కాస్త చికాకుగా]. ఏమిటి? ఆ అర్థంలేని భయం!

రాజేశ్వరి. తర్వాతనైనా మా నాన్నకి మీ ఉదోగ్యం పోయినమాట తెలిస్తే, ఏమంత బాగుంటుంది ?—మీరే చెప్పండి ! ఆయన కానివాడు గనకనా? దాపరికం లేకుండా వున్నమాట చెప్పి....

సత్యనారాయణ. భేష్! నా ఉద్యోగం పోయినమాట తెలిస్తే మీ నాన్న నిన్ను మద్రాస్ పంపుతాడనే ?

రాజేశ్వరి. పంప కేమి చేస్తాడేమిటి ? ఎల్లకాలం యింట్లో పెట్టుకు కూచుంటాడా ?

సత్యనారాయణ. అయిత, నువ్వనే దేమిటి? "నాకు ఉద్యోగం లేదు, సద్యోగంలేదు. కాని, నా పెళ్ళాన్ని పెట్టుకుని మద్రాస్‌లో వూరేగా లనుకుంటున్నా. తే తేవయ్యా! డబ్బుతే!" అని అడగమనేనా?

రాజేశ్వరి. చాల్లెద్దురూ ! ఒక్క మనకే యిస్తున్నా దేమిటి ? తక్కిన ముగ్గురు కూతుళ్ళ కిచ్చుకోలా ?

సత్యనారాయణ. నువ్వు వెయ్యిచెప్పు; లక్షచెప్పు. డబ్బివ్వమని ఆయన్ని నా నోటితో నే నడగను. లోకువకావడం నాకిష్టంలేదు

రాజేశ్వరి. అబ్బో ఎంత బెట్టుసరండీ !

సత్యనారాయణ. కాక ? కాలుచచ్చి వున్నామనుకున్నావా ?

రాజేశ్వరి. ఇస్తే పుచ్చుకుంటారటగానీ, యివ్వమనడం లోకువట ! ఏం చోద్యమండీ? పోనీ, మీ రడగడం దేనికి ? నే నడుగుతా.

సత్యనారాయణ. చాల్లే ! నా పరువు తియ్యకు! "ఉద్యోగం స్థిరమేనా ? జీత మెంత? అదేం సరిపోతుంది? ఎన్ని సిగరెట్లు కాలుస్తావ్ ? ఎంత కాఫీ తాగుతావ్ ? ఎన్ని సినిమాలు చూస్తావ్ ?"—ఈ లాయర్ ప్రశ్నలన్నీ అయ్యాక, ఉద్యోగం పోయిందని చెబుతావుగా ! ఇహ, నే నేమైనా తలెత్తుకు తిరగాలా !

రాజేశ్వరి. ఏమండీ ! ఆయనేమో పరాయివాడన్నట్టు....

[వెంకట్రామయ్య పడమటింటిలోనుంచి వస్తూ తన రాకను సూచించడానికి పొడిదగ్గు దగ్గుతాడు. రాజేశ్వరి మాట సగంలో మింగివేసి, మంచంపై నుంచి దిగ్గున లేస్తుంది.

వెంకట్రామయ్య [చావిడిలోకివచ్చి]. చిట్టెమ్మా ! చింతాలెక్కడమ్మా ?

రాజేశ్వరి. గొడ్లచావిడిలో వున్నట్టున్నాడు, నాన్నా!

వెంకట్రామయ్య. వెళ్ళి, కాస్త పిలువమ్మా !

[రాజేశ్వరి పెరటి గుమ్మంగుండా వెడుతుంది.

వెంకట్రామయ్య [సిగరెట్టు కాల్చుతున్న సత్యనారాయణను చూచి, తల పంకిస్తూ]. ముందు పలహారం తీసుకో, నాయనా !

[కాల్చుతున్న సిగరెట్టును చప్పున నోట్లోనుంచి తీసి, దాన్ని కాస్త వెనగ్గా పెట్టి, సత్యనారాయణ ఫలహారం చెయ్యడం ప్రారంభిస్తాడు.

వెంకట్రామయ్య [రెండవ నవారు మంచాన్ని వాల్చుకుని దానిపై కూర్చుంటూ]. ఇంత తొందర ప్రయాణ మేమిటని మీ అత్త చాలా నొచ్చుకుంటున్నది. కడసారి కూతురు - దానికైనా అచ్చట్లు ముచ్చట్లు తీరొద్దూ? కాని, "వాళ్లభయులూ ప్రయాణానికి ఉబలాట పడుతూ వుంటే మనకు దేనికే?" అన్నా. మేము పాతకాలపువాళ్ళం, మాకు....

చింతాలు [పెరటి గుమ్మంగుండా వచ్చి]. ఏమయ్యగోరూ!

వెంకట్రామయ్య. చూడు, చింతాలూ! మన చిట్టెమ్మ కాపరానికి వెడుతున్నది. మరి నువ్వు....

చింతాలు. ఎప్పు డయ్యగోరూ?

వెంకట్రామయ్య. ఇవ్వాళ రాత్రి బండికేరా!

చింతాలు. అదేమి టయ్యగోరూ! అంత యవదానం లేకుండానే!

వెంకట్రామయ్య. ఔనురా! ఈకాలపువాళ్ళు మన మాటల్ని వింటారా, పెడతారా? సరిగాని . .

[ఇంతలో చావిడిలోకి వచ్చిన రాజేశ్వరిని చూచి, వెంకట్రామయ్య మాటకు చింతాలు అడ్డువస్తాడు.

చింతాలు. సిట్టెమ్మగోరూ! మీ రెల్లిపోతే, మే మేం గావాలమ్మా?

రాజేశ్వరి [చిరునవ్వుతూ]. అదేమిటి, చింతాలూ! మిమ్మల నందర్నీ నేనే పోషిస్తున్నా నేమిటి?

చింతాలు. అది కా దమ్మగోరూ! మీరెల్లిపోతే, యిల్లు సిన్నబోదూ? మీరు కంటి కాపడకపోతే, మన సిన్నావు....

రాజేశ్వరి. ఔను, నాన్నా! మన చిన్నావు...

సత్యనారాయణ. చిన్నా వేమిటి?

చింతాలు. సిట్టెమ్మగోరు కంటి కాపడకపోతే, సిన్నావు పీలూ మేతా ముట్టుకుంటుందనే ? దాని పాణాలన్నీ ఆ తల్లిమీదే.

సత్యనారాయణ. అయితే, నువ్వు ఆ ఆవును మావెంట పట్నం తోలుకు రావోయ్.

చింతాలు. సత్తెం, బాబూ! తోలుకు రానా ?

వెంకట్రామయ్య. పిచ్చి వెధవ్వి! ఆయన నవ్వులాట కంటున్నాడు.

చింతాలు. అదేటో అయ్యగోరూ! నాకేమీ తోసడంలేదు. సిట్టెమ్మ గోరు లచ్మిలా తిరుగుతూ వుంటే యిల్లూ వాకిలీ కళకళలాడుతూ వుంటుంది. ఆమెగోరు ఎల్లిపోతే అంతా బావురుమందండీ ?

వెంకట్రామయ్య. నిజమేరా! కాని, తప్పుతుందా ? సరిగాని, తొందర ప్రయాణం. లక్షపను లున్నాయ్. నువ్వు వెళ్ళి, మీ అమ్మగారు చెప్పినట్టు, బియ్యం, పప్పు, కారం, పసుపు,— అన్నీ మూటలుకట్టు. అటకమీదినుంచి అమ్మాయి పెళ్ళినాడు చదివించిన ఇత్తడి సామాను దించు. పీటలుకూడా వుండాలి— ఎక్కడున్నాయో చూడు. మన బసివిగాణ్ణి పంపి, బండి భీమన్నని పెందరాళే పిలిపించు. పనులన్నీ త్వరగా తెమలాలి సుమీ !

చింతాలు [నీరసంగా]. సరే, అయ్యగోరూ !

[పోబోతాడు.

వెంకట్రామయ్య. ఆఁ! అన్నట్టు, మొన్న వాళ్ళపిల్ల అన్నప్రాశ నానికి సుబ్బక్కగా రబ్బాయి - నాగేశ్వరరావ్ - మన వెండి సామాను పట్టుకుపోయాడు గాని, దాన్ని పట్టుకురా! తేమాణం వెయ్యకు - త్వరగా కానివ్వు !

చింతాలు. ఏమో, అయ్యగోరూ! నాకు కాళ్లూ సేతులూ ఆడ్డం లేదు.

[వెడతాడు.

వెంకట్రామయ్య. నిజమే! ఇక, యిల్లంతా బావురు మంటుంది.
[సత్యనారాయణకు వెక్కిళ్లు వస్తాయి. అంతట వెంకట్రామయ్య కుమార్తె నుద్దేశించి] మంచినీళ్లు పెట్టలేదేమి, తల్లీ?

రాజేశ్వరి. మర్చిపోయా, నాన్నా! ఇదుగో, చిటికెలో తెస్తా!

[చకచక పడమటింటిలోకి వెడుతుంది.

వెంకట్రామయ్య. వెర్రిబాగుల్ది! ప్రయాణం సంతోషంలో దానికి పనే తోచడంలేదు. కంటాం; పెంచుతాం; ప్రాణాలన్నీ వాళ్ళ మీదే పెట్టుకుంటాం. అయినా, వయస్సొచ్చేసరికి రెక్కలు కట్టుకు యెగిరిపోతారు. మాకు మిగిలేది వార్ధిగూడు. ఆడపిల్లల్ని కన్నవారి బ్రతు కింతే. ఏమంటావ్, నాయనా? ఇంతే కాదూ?

[జవాబుగా సత్యనారాయణ చిరునవ్వు నవ్వుతాడు. ఇంతలో రాజేశ్వరి మంచినీళ్లు, కాఫీ తెచ్చిపెడుతుంది.

వెంకట్రామయ్య [కొత్తగా ఏదో జ్ఞాపకానికి వచ్చినట్టు]. చింతాలూ!

చింతాలు [లోపలినుంచే]. వొచ్చే. అయ్యగోరూ! వొచ్చే!

వెంకట్రామయ్య [రాజేశ్వరితో]. వెళ్ళమ్మా, వెళ్లు! నువ్వుకూడా కాస్త పలహారం చేసిరా.

రాజేశ్వరి. నువ్వుకూడా రా, నాన్నా!

వెంకట్రామయ్య. నే నొస్తాలే - నువ్వు వెళ్లు, తల్లీ! ఇక మా బ్రతుకు దేనికి? తిండికేగా?

రాజేశ్వరి. } ఒకేసారిగా { ఏం మాట లవి, నాన్నా!
సత్యనారాయణ. } ఒకేసారిగా { ఏమిటండీ, అది!

వెంకట్రామయ్య. పసివాళ్లు - మా కడుపు తీపి మీకేం తెలుస్తుంది? సరిలే, తల్లీ ! నువ్వు వెళ్లు,

[రాజేశ్వరి పడమటింటిలోకి వెడుతుంది.

సింతాలు [పడమటింటి గుమ్మంగుండా వచ్చి]. ఏమయ్యగోరూ ?

వెంకట్రామయ్య. అరే ! చూడు ! కొట్టప్పయ్య దగ్గరి కెళ్ళి ధోవతులు, ఉత్తరీయాలు, చీరలు - మంచివి చూచి - మనింటి కొకసారి పంపించమను. కావల్సినవాటి నుంచుకుని, మిగతావి వాపసుచేస్తామని చెప్పేం! వెళ్ళు- ముందు ఈ పని చూచిరా !

సింతాలు. అలాగే, అయ్యగోరూ !

[సింహద్వారంగుండా వెడతాడు.

వెంకట్రామయ్య. ముందుగా కాస్త ఉత్తరం ముక్కైనా రాశావు కాదు - అన్ని యేర్పాట్లూ చేసుకునే వాళ్ళం.

సత్యనారాయణ. పని తొందరలో తీరనే లేదండీ.

వెంకట్రామయ్య. ఏమో నాయనా ! అంతా హడావుడి ప్రయాణమై పోతున్నది.

రాజేశ్వరి [పడమటింటిలోనుంచి వచ్చి]. నాన్నా! నిన్ను అమ్మ రమ్మంటున్నది.

వెంకట్రామయ్య. పలహారానికేనా ? దాని సిగ దరిగిరిలే! ఇప్పుడు నాకు పలహార మొక్కటే తక్కువై పోయింది !

రాజేశ్వరి. కాదు, నాన్నా ! పచ్చళ్లు పెట్టడానికి జాడీలు తక్కువైనవట. పెదనాన్నగారింటినుంచి రెంటిని తెప్పించాలట.

వెంకట్రామయ్య. అలాగే, తల్లీ !

సత్యనారాయణ. ఇంత దూరాభారం - ఎందుకండీ ఇప్పుడు వచ్చళ్లూ - గిచ్చళ్ళు ?

రాజేశ్వరి. నేనూ ఆమాటే అంటూ వుంటే వినడం లేదండీ !

వెంకట్రామయ్య. వెర్రిబాగులవాళ్ళు ! మీ రిద్దరు ఏమి నిర్వాకం చేస్తారో గదా !

సత్యనారాయణ. } ఒకేసారిగా { మీదంతా వింత !
రాజేశ్వరి. } { చాల్లే, నాన్నా !

వెంకట్రామయ్య [దైన్యంగా చిరునవ్వుతూ]. నలుగురు బిడ్డల్ని యెత్తితే మీకూ తెలిసొస్తుంది లెండి ...మరి, నే వెళ్ళి, పెద్దవాడు - మా అన్నగారితో ప్రయాణంమాట చెప్పి, ఆయన్ని తోడుకొస్తా. తల్లీ! నువ్వు జాగుచెయ్యక చప్పున ప్రయాణం కా!

[సింహద్వారంగుండా వెడతాడు.

రాజేశ్వరి. ఏమోనండి - నాకేమో భయంగానే వుంది.

సత్యనారాయణ. నే నింత కథ నడిపించినతర్వాత కొంపతీసి భంగపాటు చెయ్యవుగదా ?

రాజేశ్వరి. అబ్బ ! వస్తాలెండి. కాని....

సత్యనారాయణ. కానీ, అర్ధణా - ఏమి టది ?

రాజేశ్వరి. మా అమ్మ, మా నాన్న....

సత్యనారాయణ. మంచిది ! వాళ్ళనే అంటి పెట్టుకుండు. నాదారిని నే పోతా.

రాజేశ్వరి. అబ్బ ! అది కాదండీ !

సత్యనారాయణ. అయితే, మరి చిన్నావుమాటా ?

రాజేశ్వరి. చాల్లెద్దురూ! నేను రానూ లేను; వుండనూ లేను. మీకేం తెలుస్తుంది నాబాధ ?

సత్యనారాయణ. ఏడ్చినట్టే వుంది!

["చిట్టెమ్మా" అని పిలుస్తూ, సింహద్వారంగుండా వెంకట్రామయ్య తిరిగి చావిడిలోకి ప్రవేశిస్తాడు.

రాజేశ్వరి. ఏఁ నాన్నా! వెళ్ళలా?

వెంకట్రామయ్య. లేదమ్మా! అడుగు పడనే లేదు. మన వాకిట్లోనే సుబ్బక్కగారి చిన్నాడు - లక్ష్మడు - ఎదురుపడితే, వాడికి చెప్పి పంపించా.

[వీథిలోనుంచి "సత్యనారాయణా!" అని పిలుపు.

వెంకట్రామయ్య. ఎవరది?

రాజేశ్వరి. నాగేశ్వరరావు బావయ్యలా వున్నాడు.

[ఫలహార పాత్రల్ని తీసుకుని లోపలికి వెళ్ళిపోతుంది.

నాగేశ్వరరావు [చావిడిలోకి వస్తూ]. ఏం, సత్యనారాయణా ! ఎప్పుడు రావడం ?

సత్యనారాయణ. ఇంతకుముందే.

వెంకట్రామయ్య. కూర్చోరా, అబ్బాయ్, కూర్చో!

నాగేశ్వరరావు [సత్యనారాయణ కూర్చునివున్న మంచంపై కూర్చుంటూ]. ఏమిటీ చెన్నపట్నం విశేషాలు ?

సత్యనారాయణ. ఆఁ, విశేషాల కేమున్నవి ?

నాగేశ్వరరావు. ఏమిటీ అవ్యవధిప్రయాణం ? రాజేశ్వర్ని తీసుకుని ఇవ్వాళ రాత్రికే తిరిగి వెడుతున్నావట!

వెంకట్రామయ్య. నేనూ ఆ మాటే ఎంతోదూరం చెప్పి చూశారా. కాని. వెళ్ళితీరా లంటున్నాడు!

సత్యనారాయణ. వెళ్ళాలి. మరి!.. .కొత్త ఆఫీసుగదూ ? సెలవు దొరకదు.

నాగేశ్వరరావు. సెలవు దొరక్కపోవడ మేమిటి? మీ పత్రికని....

సత్యనారాయణ [మాటకు చటుక్కున అడ్డంవచ్చి]. మీ తమ్ముడు ఇప్పుడు బి. ఏ. జూనియరా ? సీనియరా ?

నాగేశ్వరరావు. అబ్బే! వాడింకా ఇంటరైనా ప్యాస్‌కాలేదు.

సత్యనారాయణ. అన్నట్టు, ఇంకొక పార్ట్ మిగిలిపోయింది కాబోలు!

నాగేశ్వరరావు. పార్టూలేదు; గీర్టూ లేదు. చదువూ, సంధ్యా లేకుండా అడ్డగాడిదలా ఊరుపట్టుకు తిరిగాడేమో సెలెక్షన్‌లోనే డిటెయిన్ చేశారు. వాడి మాటకేం గాని....

సత్యనారాయణ. మాసూలు పూర్తిచేశావా ?

నాగేశ్వరరావు. వ్యవసాయ మెత్తివేసి, పొలమంతా మూడేళ్ళనాడే కట్టుబడి కిచ్చేశాగా!

సత్యనారాయణ. కట్టుబడి కివ్వడం దేనికి ? స్వంత వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదా ఏమిటి ?

నాగేశ్వరరావు [ఈ ప్రశ్నను వినిపించుకోకుండానే]. చూడు ! నీకు సెలవు....

సత్యనారాయణ. అయితే, ఈమధ్య మీ అమ్మాయికి అన్నప్రాశన చేశావటగా - నన్ను పిలవలేదేఁ ?

నాగేశ్వరరావు. పిలవలేదన్న నెపమేగాని, పిలిస్తే నువ్వు వచ్చే వాడివి గనకనా ? ఇంతకూ మీ....

సత్యనారాయణ. ఊళ్ళోకి వచ్చికూడా మాయింటివైపు తొంగైనా చూచాడు కాదని మీ అమ్మ నెపంవేస్తుంది. ఒకసారి మీయిం

టికి వెళ్ళి, పిల్లల్ని చూచివద్దాం. రా. - పోదాం. [చెయ్యి పట్టుకుని నాగేశ్వరరావును లేవదీస్తాడు. అతడు తిరిగి మాట్లాడ రాదనే ఆతురతకొద్దీ] ఆఁ! అన్నట్టు, నువ్వు మద్రాస్ వస్తానని వచ్చావ్ కాదేమి? ఎప్పటికప్పుడు ఇదుగో, అదుగో అనడమే గాని

వెంకట్రామయ్య [ఈసరికి సింహద్వారాన్ని చేరిన సత్యనారాయణను ఆశ్చర్యంగానా అన్నట్టు చూస్తూ]. పైపంచి మర్చిపోయావ్. వేసుకెళ్ళు, నాయనా!

సత్యనారాయణ [వీపుపై కమిచీదెబ్బ పడ్డట్టు వెనక్కి తిరిగి]. దేనికి లెండి - ఈ అడుగు దూరంకోసం.

వెంకట్రామయ్య. అడుగైనా, ఆమడైనా పైపంచి లేకుండా వీధిలోకి వెళ్ళడం మంచిదికాదు.

సత్యనారాయణ. సరిలెండి. [చక చక ఉత్తరీయాన్ని తీసి, పైన వేసుకుని, రెండడుగులలో నాగేశ్వరరావును కలుసుకుని] ఆఁ! ఇప్పుడు వడ్లధర ఎలావుండి? బస్తాకు పదకొండు రూపాయలైనా పలుకుతున్నదా? అంతమాత్రమైనా లేకపోతే ..

[గుక్క తిప్పుకోకుండా మాట్లాడుతూనే నాగేశ్వరరావును వీధిలోకి ఈడ్చుకుపోతాడు. సత్యనారాయణ వైఖరి కొంత అనుమానాన్ని కలిగించగా, లాల్చీ జేబులోనుంచి పుగాకు తీసి, చుట్ట చుట్టుకుంటూ వెంకట్రామయ్య ఒక మంచంపై కూర్చుంటాడు.

బండి భీమన్న [వీధిలోనుంచి]. బాబయ్యా!

వెంకట్రామయ్య. ఎవర్రా అది?

బండి భీమన్న [చావిడిలోకి వస్తూ]. నేనే బాబయ్యా! బండి భీమన్నని.

వెంకట్రామయ్య. బండి కట్టుకొచ్చావట్రా?

బండి భీమన్న. లేదు బాబయ్యా!

వెంకట్రామయ్య. ఏఁ?

బండి భీమన్న. ఏంలేదు, బాబయ్యా! మరిగత్తే, బండి బేగి తోలుకు రమ్మని బసివిగా డొచ్చాడు. మరి నే నేమో పట్నంబాబయ్య గార్ని మద్దాన్న మడిగితే ఎల్లుండి పొద్దున్నే మెయిల్‌బండికి రమ్మన్నారండీ.

వెంకట్రామయ్య [అప్పటివరకు రెండు మోకాళ్ళపై రెండు మోచేతుల్ని ఆన్చి ముందుకు వంగి, తల వంచుకుని, చుట్ట చుట్టు కుంటూ వున్నవాడు చప్పున నిటారుగాకూర్చుని, సగం చుట్టిన చుట్టను లాల్చీజేబులో కుక్కి, బండి భీమన్నను గుచ్చిచూస్తూ ] వెధవ! నువ్వు తిన్నగా వినలేదు కాబోలు!

బండి భీమన్న. అయ్యొ బాబయ్యా! తిన్నగా యినకపోడమేటండీ? సిట్టెమ్మగోరుకూడా "ఎల్లుండే ఎల్లిపోతారండీ!" అంటేనూ!!

వెంకట్రామయ్య. నిజమట్రా?

బండి భీమన్న. ఏ వొట్టుపెడితే ఆ వొట్టు, బాబయ్యా!

వెంకట్రామయ్య [తల పంకిస్తూ]. సరి సరి!

బండి భీమన్న. మరి బం డెప్పుడు కావాలి, బాబయ్యా!

వెంకట్రామయ్య [ఇంకా తల పంకిస్తూనే]. సరి సరి!

రాజేశ్వరి [పడమటింటిలోనుంచి వచ్చి]. ఏం, భీమన్నా! బండి తోలుకురాలా?

బండి భీమన్న. వొస్తానమ్మా! వొస్తా. సిటికలో తోలుకొస్తా.
వెంకట్రామయ్య. సర్లే రా - నువ్విక పో!
బండి భీమన్న. సిత్తం, బాబయ్యా! సిత్తం!

[వెడతాడు.

రాజేశ్వరి. నాన్నా! వా రేరీ?
వెంకట్రామయ్య. మన నాగేశ్వరరావుగారింటికి వెళ్ళాడమ్మా! ఇప్పుడే తిరిగొస్తా నన్నాడు గాని, సత్యనారాయణ తన ఉద్యోగం మాట నీతో ఏమైనా అన్నాడా?
రాజేశ్వరి [తెల్లబోయి, దాన్ని కప్పిపుచ్చుకోడానికి ప్రయత్న పూర్వకంగా]. లేదు, నాన్నా! ఏమీ అనలేదే! ఎందుకు?
వెంకట్రామయ్య. ఆ(! ఏం లేదమ్మా!
రాజేశ్వరి [ఒకవేళ రహస్యం తెలుసుకున్నాదేమో కనిపెట్టాలని]. నువ్వు ఉత్తినే అడగవు, నాన్నా! ఏమిటీ సంగతి?
వెంకట్రామయ్య. అబ్బే! ఏం లేదు, తల్లీ! [ఇంతలో సత్యనారాయణ తిరిగివస్తాడు] ఏం, నాయనా! అప్పుడే తిరిగొచ్చావ్?
సత్యనారాయణ. ప్రయాణానికి వ్యవధి లేదు గదండీ!
వెంకట్రామయ్య. ఆ మాటా నిజమే, నాయనా! మరి నే వెళ్ళి, పైకాని కేర్పాటు చేసొస్తా.
సత్యనారాయణ [అలక్ష్యాన్ని నటిస్తూ]. ఏమో, మీ యిష్ట మది.
వెంకట్రామయ్య [చిరునవ్వుతూ]. సరి సరి!

[వెడతాడు.

సత్యనారాయణ [మంచంపై చతికిలబడుతూ]. అమ్మయ్య! వాణ్ణి వొదిలించుకునేసరికి తాతలు దిగొచ్చారు.
రాజేశ్వరి. ఎవరండీ, అది?
సత్యనారాయణ. వాడే, ఆ పీనుగ, నాగేశ్వరరావు.

రాజేశ్వరి. ఏం చేశాడండీ?

సత్యనారాయణ. మా పత్రిక కట్టివేసినమాట వా డెక్కడో, ఇప్పు చూచాయగా విన్నాడు. ఆ మాటని కాస్తా మీ నాన్నముందు....

రాజేశ్వరి. కొంపతీసి అనెయ్యలేదు గదా ?

సత్యనారాయణ. లేదులే! కాని, అనకుండా వాణ్ణి పట్టుకునేసరికి బ్రహ్మప్రళయమైంది. తనదంతా మునిగిపోతున్నట్టు దేభ్యంలా సరిగా ఇప్పుడే ఇక్కడికి తయారయ్యాడు—చూడు!

రాజేశ్వరి. అత నెప్పుడూ అంతేనండీ! ఒకరి పచ్చనచూచి వోర్వ లేడు. కాని, మా నాన్నకు కొంచెం అనుమానం తగిలినట్టున్నదే!

సత్యనారాయణ. నిజం! ఏమన్నా డేమిటి?

రాజేశ్వరి. మీరు మీ ఉద్యోగంమాట నాతో ఏమైనా అన్నారా అని అడిగాడు.

సత్యనారాయణ. అడిగితే?

రాజేశ్వరి. "నాతో ఏమీ అనలేదు, నాన్నా!" అని చూస్తూ చూస్తూ పచ్చి అబద్ధ మాడాను.

సత్యనారాయణ. అయ్యో పాపం ! నీ కెంత కష్టం వచ్చింది !

రాజేశ్వరి. మీకేం? మీ కలాగే వుంటుంది. నానోట అబద్ధం రాదని అందరితో చెప్పుకుని మానాన్న ఎంత మురుస్తాడో మీకేం తెలుసు?

సత్యనారాయణ. ఓహోహో! సత్య హరిశ్చంద్రుడటు ; తమ రిటు.

రాజేశ్వరి. సంతోషించాం - చాల్లెద్దురూ !

సత్యనారాయణ. సరిగాని, మీనాన్న మరేమైనా అడిగాడా ?

రాజేశ్వరి. ఉహుం ! ఆయన మళ్ళీ మాట్లాడేలేదు. నేనే "ఏమిటీ సంగతి, నాన్నా ?" అని అడిగితే "అబ్బే ! ఏం లేదమ్మా ! ఊరికేనే" అని చప్పరించేశాడు.

సత్యనారాయణ. అయితే, ఏమీ ఫరవా లేదులే! పైగా. పైకం కోసం వెళ్ళాడు కూడాగా!

రాజేశ్వరి. అయినా, ఏమోనండీ! నాకు బెదురుగా వుంది. మన ప్రయాణానికి ఆటంక మేమీ కలగదుగదా?

సత్యనారాయణ. కలిగితే మంచిదేగా! రావాలని నీకు ఎలాగూ లేదయ్యే!

రాజేశ్వరి. అదేమన్న మాటండీ!

సత్యనారాయణ. ఏం మాటో - నీవన్నదేగా!

రాజేశ్వరి. చాల్లెద్దురూ! నేననకేం! ఇంతకూ మా నాన్నకి నిజం తెలిసిందంటారా?

సత్యనారాయణ. అబ్బే! లేదు. నేను ఆ నాగేశ్వరరావు నోరు కట్టేశా! మా పత్రిక ఆగిపోలేదని వాడికి ఫెలానైతే నచ్చ జెప్పా! కథ నడిపించడంలో ఎవరైనా మన తర్వాతే!

రాజేశ్వరి. మా నాన్న సంగతి మీకు తెలియదండీ! ఆయన అసాధ్యుడు. ఆవలిస్తే పేగులు లెఖ్ఖెడతాడు.

సత్యనారాయణ. మీనాన్నకంటె నేను రెండాకులు ఎక్కువే చదివానంటావా?

రాజేశ్వరి. మీరు ఎంత బి. ఎ. చదివినా, తెలివికి మా నాన్న తర్వాతే!

సత్యనారాయణ [వెంకట్రామయ్య గొంతుపెట్టి]. సరి సరి!

రాజేశ్వరి. వెక్కిరింతకూడా దేనికిలెండి? ఇప్పుడు కాకపోతే, మరొక్కప్పుడైనా చూద్దురుగానిగా!

సత్యనారాయణ [దర్పంగా]. ఓహోహో

రాజేశ్వరి. సర్లెండి! మరి నే వెళ్ళి పెట్టి సర్దుకోనా?

సత్యనారాయణ. నన్ను సాయం రమ్మంటావా?

రాజేశ్వరి. అడ్డంరాకుండా వుంటే సాయం వచ్చినంత ఫలం!

[చిరునవ్వు నవ్వుతూ పడకగదిలోకి వెడుతుంది.

సత్యనారాయణ. భేష్! ఇదే నన్నమాట నువ్వు నాకిచ్చే కాంప్లిమెంట్!

రాజేశ్వరి [పడకగదిలోనుంచి]. ఏమిటండీ, అది?

సత్యనారాయణ [దీర్ఘం తీస్తూ]. ఏమీ లేదు.

["అరి వాడి తస్సాచెక్కా!" అంటూ వెంకట్రామయ్య వీధిగుమ్మంగుండా చావిడిలోకి వస్తాడు. ఆశ్చర్యంగా సత్యనారాయణ అతనివంక చూస్తాడు.

రాజేశ్వరి [పడకగదిలోనుంచి వచ్చి]. ఏమి టది, నాన్నా?

వెంకట్రామయ్య. ఆ షావుకారు రత్తయ్య - చూడమ్మా! ఇప్పుడు తనదగ్గిర చిల్లి గవ్వయినా లేదంటున్నాడు. ఎప్పుడడిగితే అప్పు డిస్తాడుగదా అని పాత పంటమ్మిన దస్తంతా వాడిదగ్గిర పెడితే - అయ్యయ్యయ్యయ్యో! - ఎంత పని చేశాడు?

రాజేశ్వరి [ఆశాభంగంతో]. నిజం?

వెంకట్రామయ్య. ఔను, తల్లీ!

రాజేశ్వరి [తెలివితక్కువగా]. అయితే, మా ప్రయాణం?

వెంకట్రామయ్య. దాని కేమమ్మా? మీరు వెళ్ళండి వెనకా ముందుగా నే పంపిస్తాగా!

రాజేశ్వరి. అదికాదు, నాన్నా! మరి....

[సత్యనారాయణ చూపులతో వారిస్తాడు. రాజేశ్వరి మాటమధ్యలో ఆగిపోతుంది.

వెంకట్రామయ్య. ఏమిటమ్మా అది ?

[జవాబు చెప్పకుండానే నీళ్లు కారుతూ రాజేశ్వరి పడకగదిలోకి వెళ్ళిపోతుంది.

సత్యనారాయణ. దానికేం లెండి. మీ కెప్పుడు వీలైతే అప్పుడే పంపించొచ్చు, కాని....కాని....

వెంకట్రామయ్య. సంకోచం దేనికి ? ఏమి టది, నాయనా ?

సత్యనారాయణ. "ఇంత అవ్యవధిగా ఈ ప్రయాణం చేయించడం తగునా?" అని మళ్లీ నాకే సందేహం తోస్తున్నదండీ !

వెంకట్రామయ్య. దాని కేమిలే, నాయనా ! తీసుకెళ్ళాలని నువ్వు, ంటరావాలని మా అమ్మాయి ఉబలాట పడుతున్నారుగా!

సత్యనారాయణ. అయినా, చూడండి! అచ్చట్లు ముచ్చట్లు తీరలేదని మా అత్తగారు అనుకుంటున్నారయ్యే. ఆమె మనస్సునైనా నొప్పించడం భావ్యమా అని....

వెంకట్రామయ్య. కూతుళ్ళను కన్నతల్లికి ఆవిషయంలో సంతృప్తి ఎక్కడికిలే !

సత్యనారాయణ. ఇంత హఠాత్తుగా మిమ్మల్ని విడిచిపెట్టమంటే రాజేశ్వరికిక్కూడా కష్టంగానే వుంది. పోనీ మరొక నెల తర్వాత తీడుబాటుగానే....

వెంకట్రామయ్య. ఏమైనా, అయిన ప్రయాణాన్ని ఆపడం మంచిది కాదు, నాయనా!

సత్యనారాయణ [ఉడుకుబోతుతనంతో] బయల్దేరాలని అను కున్నామే గాని, ఇంకా బయల్దేరలేదు గదండీ!

వెంకట్రామయ్య. మంచిది, నాయనా! ఇక నీ ఇష్టం; దాని ఇష్టం.

[ముఖాన్ని తిప్పుకుని, ముసిముసినవ్వులు నవ్వుకుంటూ పడమటింటిలోకి వెడతాడు. రాజేశ్వరి గదిలోనుంచి వస్తుంది. ప్రయాణం ఆగిపోయినందుకు విచారం ఒక వైపున, తండ్రి లౌకికానికి గర్వం మరొక వైపున పైచెయ్యి కోసం ఆమెలో పెనగులాడుతూ వుంటాయి.

రాజేశ్వరి. ఏమండీ! ఇక, కథ నెలా నడిపిస్తారు?

సత్యనారాయణ. ఇంకేమి కథ? కథ అడ్డం తిరిగింది!

రాజేశ్వరి [తండ్రి లౌకికాన్ని చూడగా కలిగిన గర్వానిదే పైచెయ్యి కాగా]. అయితే, ఎవరు రెండాకు లెక్కువ చదివినట్టు?

సత్యనారాయణ. ఆఁ! చాల్లే, సంతోషించాం.

రాజేశ్వరి. ఆవలిస్తే ఆయన పేగులు లెఖ్ఖెడతాడని నేను ముందే చెప్పాగదండీ!

సత్యనారాయణ [చికాకుగా]. ఔను! ఆ తానులోదేగా ఈ ముక్క!

రాజేశ్వరి. చాల్లెద్దురూ! మాటలుమాత్రం నేర్చారు.

[రాజేశ్వరి గదిలోకి వెళ్ళిపోతుంది. సత్యనారాయణ సిగరెట్టును ఆశ్రయిస్తాడు.

బండి భీమన్న [వీధిలోనుంచి]. బాబయ్యా!

సత్యనారాయణ [కోపంగా]. ఎవర్రా అది?

బండి భీమన్న [చావిడిలోకి వచ్చి]. బండి తోలుకొచ్చా, బాబయ్యా!

సత్యనారాయణ. ఎల్లుండిపొద్దున రమ్మంటే ఇప్పు డెందుకొచ్చావ్! వెధవా! పో పో!

బండి భీమన్న. అయ్యో! ఇదేటి సిత్రం, బాబయ్యా!

సత్యనారాయణ. పొమ్మనేది నిన్ను కాదట్రా!

[ఒక అడుగు ముందుకు వేస్తాడు.

బండి భీమన్న [బుర్ర గోక్కుంటూ వెనకడుగు వేస్తూ]. సిత్తం! సిత్తం! కోపం సెయ్యకండి, బాబయ్యా! మరిగలితే, ఎంక ట్రామయ్య బాబయ్య...

సత్యనారాయణ [ముందు కురికి, భీమన్న మెడపై చెయ్యివేసి]. డాం ఫూల్! పోతావా, లేదా?

బండి భీమన్న. పోతున్నా, బాబయ్యా! పోతున్నా!

[చకచక సింహాద్వారం వైపుకు నడుస్తాడు.

రాజేశ్వరి [పడకగది గుమ్మంలోకి వచ్చి]. ఏమిటండీ, అది? పాపం! మధ్య వాడేం చేశాడు?

సత్యనారాయణ. చాల్లే! నువ్వు కట్టిపెట్టు!

బండి భీమన్న [సింహద్వారాన్ని దాటుతూ]. ఇదేటో సాలా సిత్రంగానే వుందే!

[వీధిలోనుంచి "సత్యనారాయణా!" అంటూ నాగేశ్వరరావు కేక.

సత్యనారాయణ. మళ్లీ ఎందుకో తయారౌతున్నాడు, ఈ శనిగాడు!

[పడమటింటి గుమ్మంలో నిలబడివున్న రాజేశ్వరి చాటుకు వెడుతుంది.

నాగేశ్వరరావు [చావిడిలోకి వచ్చి]. ఇప్పుడేనా ప్రయాణం?

[సత్యనారాయణ జవాబు చెప్పడు.

నాగేశ్వరరావు. అయితే, మీ పత్రిక తెప్పించా లనుకుంటున్నా వెల చందా యెంత? రెండుంబావలా కాదూ?

సత్యనారాయణ [విసుగ్గా, కోపంగా]. ఊఁ!

నాగేశ్వరరావు. ముందు ఒక నెలపాటు తెప్పించి చూస్తాలే. [జేబులోనుంచి డబ్బుతీస్తూ] కాస్త దీన్ని మీ ఆఫీసులో కట్టు.

[పైక మివ్వబోతాడు.

సత్యనారాయణ. నా చేతికి దేనికి? నువ్వే మనియార్డర్ చేసెయ్!

నాగేశ్వరరావు. ఆఁ! రెండుంబావలా చందాకి రెండణాల మనియార్డర్ కమిషన్ దండగ దేనికి? మీపత్రికే, మీ ఆఫీసే కదూ? ఏమంత శ్రమ? కాస్త కడుదూ!

సత్యనారాయణ. ఉహుఁ! నువ్వే పంపించు. కావాలంటే, ఆ రెండణాలు నే నిస్తా!

నాగేశ్వరరావు [నవ్వుతూ]. ఏదో పనిలో పని - చేస్తావనుకున్నా గాని....

వెంకట్రామయ్య [పడమటింటిలోనుంచివస్తూ]. ఏమిటిరా, అబ్బాయ్?

నాగేశ్వరరావు. ఎలాగూ ఆఫీసుకు వెడుతున్నాడు గదా అని, వాళ్ళ పత్రిక్కి ఒకనెల చందా కట్టమని నేనంటే....

వెంకట్రామయ్య. లేదురా! హడావుడి ప్రయాణమౌతున్నదని కూక లేసి ప్రస్తుతానికి నేనే ఆపుచేయించా.

నాగేశ్వరరావు. మరి ఆమాట చెప్పదేఁ! అందువల్లే కాబోలు చెడ్డ చికాగ్గా వున్నాడు. [సత్యనారాయణతో] సరే, ఇంకా రెండు, మూడు రోజులపాటు వుంటావుగా! రేపొచ్చి కనబడతాలే. కరణంగారింటికి తొందరపనిమీద పోతున్నా.

[వెళ్ళిపోతాడు.

[ఇక అక్కడ వుండడానికి ముఖంచెల్లక, గట్టిగా పిగ
రెట్టుదమ్ము పీకుతూ సత్యనారాయణ పడకగదిలోకి
చక్కాపోతాడు. దీన్ని చూచి, తల పంకిస్తూ
వెంకట్రామయ్య చిరునవ్వు నవ్వుతాడు.

ామయ్య [మంచంపై కూర్చుని, పగంచుట్టి జేబులో పడ
వనన చుట్ట పైకితీసి, దాన్ని చుట్టడాన్ని పూర్తిచేస్తూ].
చిట్టెమ్మా!

రాజేశ్వరి [గదిలోనుంచి]. వస్తున్నా, నాన్నా!
[మాట అంటూనే వస్తుంది.

వెంకట్రామయ్య నువ్వు నాకొక ముచ్చట తీర్చాలమ్మా! పెద్దపిల్ల
కడుపు పండనే లేదు. రెండోదానికీ, మూడోదానికీ అంతా ఆడ
పిల్లలే. మరి, నీ కడుపునైనా ఒక మగపిల్లవాడు పడితే...

రాజేశ్వరి. ఊఁ! చాల్లే, నాన్నా!

వెంకట్రామయ్య. అంత సిగ్గు దేనికమ్మా! ఇలా చూడు! తాతకు
దగులు నేర్పడానికి ఒక మనమడు కావొద్దూ మరి?
[రాజేశ్వరి ముసిముసి నవ్వులతో నిష్క్రమిస్తుంది.
వెంకట్రామయ్య చుట్ట ముట్టిస్తూ వుండగా—
తెర]



## పాత్రలు:

| | |
|---|---|
| శివరావు: | బ్యాంకి గుమాస్తా |
| కృష్ణవేణి: | శివరావు భార్య |
| వెంకాయమ్మ: | అతని తల్లి |
| శ్రీరాములు: | ప్లీడర్ గుమాస్తా |
| సత్తిగాడు: | క్లబ్ ఫ్యాన్ |

## స్థలం

శివరావు అద్దెకున్న భాగంలో ఒక గది

## కాలం

వర్తమానం



# ఇంటి గుట్టు

[అది శివరావు అద్దెకున్న భాగంలో పెద్ద గది. కుడిచేతివైపుది వీధితల వసారా; ఎడమచేతివైపుది వెనకపక్క వసారా. వంటిల్లు వెనకపక్క వసారాలో సగంభాగమే. ఉన్నది ఒక్క గదే గనక, అది పెద్దదైనా, ఒక మంచంతో, ఒక వెదురు పుల్లల టేబుల్‌తో, ఒక ఈజీచెయిర్‌తో, రెండు కుర్చీలతో, మూడు, నాలుగు పెట్టెలతో ఇరకాటంగా వుంటుంది.

తెరలేచిన క్షణానికి సినిమా పాట పాడుకుంటూ, శివరావు ప్రవేశిస్తాడు. అతడు యించుమించు పాతికేళ్లవాడు. సన్నగా, పొడుగ్గా, నాజూకైనవాడు. నీటుగోటులు హెచ్చు. లోతు లేనివాడు గనక ఇట్టే ఉబ్బిపోగలడు; ఇట్టే కుంగిపోగలడు. సూట్ వేసుకున్నాడు. మిఠాయి పొట్లాలతో నింపిన గుడ్డ సంచి చేత తెచ్చాడు.]

శివరావు [చేతిలోని గుడ్డసంచి టేబుల్‌మీద పెడుతూ]. కృష్ణా! కృష్ణా! [హాట్ తీసి, చెలాకీగా చిలక కొయ్యపైకి విసిరివేసి] అమ్మా! అమ్మా! [క్షణం ఆగి] ఎవ్వరూ పలకరు. ఏమైపోయారబ్బా? [ఈలవేస్తూ, పైకొంచెం వదులు చేసుకుని, మరింత బిగ్గరిగా] కృష్ణా!!

[వెనక వాకిలిగుండా కృష్ణవేణి వస్తుంది. ఆమె పదహారేళ్ల పల్లెపడుచు. కాని, వేష భాషలలో బస్తీ కాపురం తళుకు కొంత కనబడుతూవుంటుంది. ఆమె ఒకరిని ఒకమాట అనదు; ఒకరితో ఒకమాట పడదు.

కృష్ణవేణి [ముక్తసరిగా]. దేనికండీ?

శివరావు. రాణీగా రేంచేస్తున్నా రేమిటి? బదులే లేదు!

కృష్ణవేణి. చెయ్యడానికి నాకు మరేముంది? వంటచేస్తున్నా.

శివరావు. నీ కొక శుభవర్తమానం తెచ్చా! ఏమిటో చెప్పుకో?

కృష్ణవేణి. ఏమిటది? మీరే చెప్పండి.

శివరావు. ఉహుఁ! నువ్వు చెప్పుకోవాలి.

కృష్ణవేణి. బాగుంది. నామొహం నా కేంతెలుసు?

శివరావు. ఊహించుకు చెప్పు.

[కృష్ణవేణి చెప్పనన్నట్టు తల తిప్పుతుంది.

శివరావు. ఉహుఁ! చెప్పుకోవాలి. కావాలంటే మూడు ఛాన్సు లిస్తా.

కష్ణవేణి. నా కేమీ వద్దులెండి.

శివరావు. అహఁ! చెప్పుకోవాలి. ఏదీ....వన్!

కృష్ణవేణి. బాల్లెద్దురూ!

శివరావు. టూ!

కృష్ణవేణి. చెబితే చెప్పరాదా? లేకపోతే, మానరాదా? ఏమిటీ నన్ను ఆడించడం?

శివరావు [నవ్వుతూ]. త్రీ!

కృష్ణవేణి. పిచ్చిదాన్నిచేసి ఆడించండి! ఆడించండి!!

శివరావు. ఆడించడానికి నువ్వు కోతివి కాదుగా!

కృష్ణవేణి. ఊఁ! చాల్లెద్దురూ!
శివరావు. సరే! నువ్వు చెప్పుకోలేవన్నమాట! మరి, నే చెప్పనా?
కృష్ణవేణి [చేతుల్ని విడిపించుకుని]. వద్దులెండి.
శివరావు. వద్దన్న వాళ్ళకి చెప్పడం దేనికి? సరే,—ఇక దయ చెయ్యండి.
కృష్ణవేణి. రమ్మన్నా, పొమ్మన్నా మీకే చెల్లు!

[ఒక అడుగు వేస్తుంది.

శివరావు [రెక్కపట్టి దగ్గరికి లాక్కుంటూ]. రాణీగారికి....
కృష్ణవేణి. రాణీ లేదు; గీణీ లేదు. ఇలా బతకనివ్వండి.
శివరావు. ఏం కృష్ణా! కోపం వచ్చినట్టుందేఁ?
కృష్ణవేణి. నాకుతోడు కోపం కూడానా?
శివరావు. చీర తేలేదనే ఇంత ఆగ్రహం?
కృష్ణవేణి. చీరా గీరా నే తెమ్మన్నానటండీ?
శివరావు. నేనే తెస్తానన్నా ననుకో. కాని, శుభవర్తమానం వెంటనే చెప్పాలని ఆఫీసునుంచి ఇవ్వాళ సరాసరి ఇంటికొచ్చా. రేపు తప్పకుండా నీ కొక ఉప్పాడ జరీచీర కొనుక్కొస్తాగా!
కృష్ణవేణి. నా కొద్దులెండి.
శివరావు [కృష్ణవేణి గుండెదగ్గిరిగా చెవిపెట్టి, ఏదో వింటున్నట్టు నటించి]. నోరు వద్దంటున్నా, గుండెమాత్రం "తే! తే!" అంటూ కొట్టుకుంటున్నదే!
కృష్ణవేణి [ఒక అడుగు వెనక్కు జరిగి]. కట్టండి; ఇంకా తాటాకులు కట్టండి.
శివరావు [నవ్వుతూ]. తాటాకులు కట్టడానికి నీకు తోక లేదుగా?
కృష్ణవేణి. అంతే లెండి. ఎవరికైనా నేనేగా లోకువ!

శివరావు. సరేగాని, శుభవర్తమాన మేమిటో చెప్పనా.?
కృష్ణవేణి. చెప్తే చెప్పండి; మానే మానండి. మీ యిష్టం!
శివరావు. చెబితే నా కేమిస్తావ్ ?
కృష్ణవేణి. నాదగ్గ రేముంది మీ కివ్వడానికి ?
శివరావు. వుంటే, యిస్తావా ?
కృష్ణవేణి. ఏమిటది ?
శివరావు. ఒక....

[ముద్దు అన్నట్టుగా పెదవులతో సూచిస్తాడు.

కృష్ణవేణి. నాకు చెప్పొద్దులెండి.

[వెళ్ళబోతుంది.

శివరావు [భుజంపై చెయ్యివేసి ఆపి]. ఎక్కడి కలా పరిగెత్తుతా నంటావ్ ? కాస్త, ఆగు ! చెబుతాగా ! అయితే మా అమ్మేదీ!
కృష్ణవేణి. ఏమో, నాకు తెలవదు.
శివరావు. నీకు తెలవకపోవడ మేమిటి ? ఎక్కడికి వెళ్లింది ?
కృష్ణవేణి. ఎక్కడికీ లేదు. అదుగో! ఆవెనక వసారాలో వున్నట్టుంది.
శివరావు [వసారా వైపుగా రెండడుగులువేసి]. అమ్మా !
వెంకాయమ్మ [బయటనుంచి, బరువుగా]. ఆఁ !
శివరావు. అమ్మా ! నిన్నే !
వెంకాయమ్మ [వస్తూ]. వొస్తున్నారా, అబ్బాయ్ !

[తర్వాత ఒక అరనిమిషానికి చిరిగిన చొక్కా కుడుతూ వెంకాయమ్మ వస్తుంది. ఆమె అచ్చమైన పల్లెటూరి యిల్లాలు. జీవితం అంతాకూడా గీసిగీసి సంసారం జరుపుకొనడంవల్ల శుష్కించిపోయినట్టు కనబడుతూ వుంటుంది. ఏదో చింతకూడా ఆమె ముఖంలోనుంచి తొంగిచూస్తూ వుంటుంది. వితంతువు కనక తెల్ల చీర, తెల్ల రవికె. వేలుముడిజుట్టు, సగం నెరిసిన తల.]

వెంకాయమ్మ [గదిలోకి రాగానే, శివరావుతో]. దేనికిరా ?
శివరావు. నీ కొక శుభవర్తమానం తెచ్చానమ్మా !
వెంకాయమ్మ. నాకు శుభవర్తమాన మేమిటిరా ?
శివరావు. నాకు ఇవ్వాళ ఆఫీసులో ఇంక్రిమెంట్ యిచ్చారమ్మా !
వెంకాయమ్మ. ఆఫీసులో యిచ్చారూ ? ఏమి టది ?
శివరావు. జీతం హెచ్చించా రమ్మా !
వెంకాయమ్మ. ఎంతరా ?
శివరావు. పది రూపాయలమ్మా ! ఇక నెలకి ఎనభై రూపాయ లిస్తారు.
వెంకాయమ్మ. పదే నటరా ? జీతం హెచ్చించా రంటే, ఇంకా ఏ పాతికో, ముప్ఫయ్యో అనుకున్నా.
శివరావు. ఆఫీసులో మరెవ్వరికీ యివ్వనే లేదమ్మా! నా కొక్కడికే ప్రత్యేకంగా యిచ్చారు.
వెంకాయమ్మ [మాట తెంచివేస్తున్నట్టు]. సరేరా, అబ్బాయ్ ! సంతోషం !
శివరావు. రేపు నీ కోడలి కొక చీర, నీ కొక....
వెంకాయమ్మ. నాకు దేనికిరా, అబ్బాయ్ ! దానికి తెచ్చుకో.
కృష్ణవేణి. నాకూ వద్దు !

[వంటింటిలోకి దారి తియ్యబోతుంది.

శివరావు. ఇదుగో ! కృష్ణా ! బ్రహ్మానందాన్ని, మాధవరావుగార్ని, శ్రీనివాసరావుగార్ని కాఫీకి పిలిచా. వాళ్ళిప్పు డొస్తారు. బజారు నుంచి నేను స్వీట్స్ తెచ్చాగాని, కాస్తేదైనా సేవరీ చేసి, కాఫీ పెట్టు.
కృష్ణవేణి. ఏమి చెయ్యనండీ? ఇంట్లో ఏమీ లేదు.

శివరావు. మొన్నామధ్య తెప్పించిన ఉప్మారవ్వ లేదూ?
కృష్ణవేణి. కాస్త మిగిలింది. అదేం సరిపోతుంది?
శివరావు. దాన్నే ఎలాగో సరిపెడుదూ.
కృష్ణవేణి. సర్లెండి.

[వెనక వాకిలిగుండా వెళ్ళిపోతుంది.

శివరావు [కోటు, షైడు తీసి చిలకకొయ్యకు తగిలిస్తూ]. ఈగది ఒకసారి ఊడుస్తావమ్మా?
వెంకాయమ్మ. ఇంతకు ముందేరా పనిమనిషి ఊడ్చివెళ్ళింది.
శివరావు. ఎక్కడిది దుమ్ము అక్కడే వుంది. దాని మొహం! ఏమి ఊడ్పడ మిది?
వెంకాయమ్మ. అది అణిగి మణిగి పనిచేస్తేగా? ఇక్కడొక చీపురు, అక్కడొక చీపురు వేసి చక్కాపోతుంది. చూస్తూ ఊరుకోలేక అదేమిటని నే నడిగితే మూతి, ముక్కూ విరుస్తుంది. నేను పెట్టి పోషించడం లేదుగా? —— అది నామాట వినడానికి!
శివరావు. అంత వొళ్లు పొగరెక్కివుంటే, దాన్ని పని మాన్పించ వమ్మా !
వెంకాయమ్మ. నాకు దేనికిరా, అబ్బాయ్! నే నిక్కడ వుండొచ్చానా, పెట్టొచ్చానా? దాన్ని అదుపాజ్ఞల్లో పెట్టడానికి మధ్య నే నెవతిని?
శివరావు. అదేమిటమ్మా! అలా అంటావ్? [వెదురుపుల్లల టేబుల్ గదిమధ్యకు లాగుతూ] అమ్మా! టేబుల్ క్లాతేదీ?
వెంకాయమ్మ. ఏమోరా, నాకేం తెలుసు? ఇది నా కొంపా, గోడా?

[వెనక వాకిలిగుండా వెడుతుంది.

శివరావు [పడకకుర్చీని టేబుల్ దగ్గరికి తెచ్చివేసి]. కృష్ణా!

[కృష్ణవేణి వస్తుంది.

శివరావు. టేబుల్ క్లా తేదీ?

కృష్ణవేణి. మురిగ్గా వుంటే మొన్న బట్టికి వేశానండీ!

శివరావు. అయితే పాతదేమైంది?

కృష్ణవేణి. అది ఏనాడో జీరికలై పోయిందిగదండీ!

శివరావు. మరి, ఇప్పు దేమిటీ చెయ్యడం? పోనీ, నా ఉత్తరీయ మైనా కప్పుదాము. ఏదీ, ఒకటి తే! ఏమీ కప్పకపోతే, ఇది చెడ్డ అసహ్యంగా వుంటుంది.

[పై రెండు ట్రంకుల్నీ కిందికి దించి, అడుగుదాన్ని ఉత్తరీయంకోసం కృష్ణవేణి గాలిస్తూ వుంటుంది. శివరావు చేతులులేని కుర్చీని, కుర్చీపీటను ఈడ్చుకొచ్చి, వాటిని టేబుల్ దగ్గర చక్కగా అమర్చడానికి ప్రయత్నిస్తూ వుంటాడు.

కృష్ణవేణి. డబ్బుకు పాలవాడు తొందర చేస్తున్నాడండీ!

శివరావు. ఇవ్వాళేగా ఒకటో తారీఖు. ఆ వెధవకి అప్పుడే ఏం తొందర?

కృష్ణవేణి. పోయిననెల వాడికి సగమేగదండీ యిచ్చాం. నేతివాడికి కూడా బకాయిపెట్టాం. వాడూ వేపుకు తింటున్నాడు.

శివరావు. కాస్త వెనకా ముందూ అయితే వెధవలు ఆగలేరూ? ఈ అలగా జనంతో ఇంతే! మర్యాదా మన్నా లేదు.

కృష్ణవేణి. ఇక, కూరగాయల్ది బతక నివ్వడమే లేదు. దానికి పాత బాకీతో చేరి నాలుగురూపాయలదాకా అయింది. రేపు పొద్దున్నే వచ్చి అది వాకిట్లో కూర్చుంటుంది.

శివరావు. రానీ, వెధవముండని! దానిడబ్బు దానిముఖాన గిరగిర తిప్పి కొట్టి, ఇక మన గడప తొక్కొద్దని మెడపట్టి గెంటుతా!

కృష్ణవేణి. పచారీకొట్టువాడి గుమాస్తా తెల్లారప్పుడే నాలుగుదఫా లొచ్చి వెళ్ళాడు. వాళ్ళిఖ ఆగరట.

శివరావు. మొన్నేగా వాడికి ఒక యిరవై జమ కట్టొచ్చాను!

కృష్ణవేణి. ఏమో? - ఇంకా పాతికదాకా యివ్వాలట!

శివరావు. దొంగ లెక్కలు రాస్తున్నాడు కాబోలు! స్కౌండ్రల్! రేపు వెళ్ళి, వాళ్ళ అంతు కనుక్కుంటా!

కృష్ణవేణి. ఏ నెల కా నెల వాళ్ళడబ్బు వాళ్ళకి పారేస్తే, ఈ చికాకు మన కుండదు గదండీ?

శివరావు. ఆ జీతమేమో తెచ్చి నీ చేతికే యిస్తున్నాగా! ఆరిందావి! అంతా చక్కగా దిద్దుకురారాదూ?

కృష్ణవేణి. అంతే లెండి! నేను మంచిదాన్నయితే మీకిన్ని చిక్కు లెందుకొస్తాయి? పాపం! నావల్ల మీరు...

[కళ్ళను గిర్రున నీళ్ళు తిరగ్గా మాటమధ్యలో ఆగిపోతుంది.

శివరావు. కృష్ణా! [దగ్గరికి లాక్కుని] నువ్వు వొట్టి వెర్రిదానివి సుమీ!

కృష్ణవేణి [కోపంగా]. చాల్లెద్దురూ! ముందు జీతం తెచ్చిస్తున్నా రేమో! తర్వాత సిగరెట్లకనీ, సినిమాలకనీ గుంజుకు వెడు తున్నారేమో! ఇఖ, నేనేం చచ్చేది?

శివరావు [అనునయిస్తూ]. నేను తలకుమించిన ఖర్చుల్ని చేస్తూ వుంటే—పాపం!—నువ్వేం చేస్తావులే. తప్పు నాదే!

కృష్ణవేణి. అబ్బే! మీ తప్పేముంది లెండి. ఇంతకూ నేను దరి ద్రపు గొట్టుదాన్నట.

శివరావు. ఛీ! ఏమి టది?

కృష్ణవేణి [ట్రంకు అడుగునుంచి ఉత్తరీయాన్ని తీసి]. ఇదుగో నండీ ఉత్తరీయం!

శివరావు [దాన్ని అందుకొని, మడతవిప్పి చూచి]. ఏడ్చి, ఇదీ చిరిగిందేనే! వేరే లేదూ?

కృష్ణవేణి [ట్రంక్ మూతవేస్తూ]. మరెక్కడిదదండీ?

శివరావు [కాస్త చికాకుగా]. ఊఁ! సరే!

[కృష్ణవేణి ట్రంకుల్ని తిరిగి దొంతరగా పెడుతూ వుంటుంది. చిరుగులు కనబడకుండా, ఉత్తరీయాన్ని మడత పెట్టి టేబుల్ పై పరచడానికి శివరావు ప్రయత్నిస్తూ వుంటాడు.

శివరావు. అయితే, టిఫిన్ చెయ్యడమైందా?

కృష్ణవేణి. ప్రారంభించిన ఎడ మెక్కడండీ?

శివరావు. మంచిది - త్వరగా కానివ్వు మరి!

[కృష్ణవేణి వెనకగుమ్మంగుండా వెడుతుంది.

శివరావు. ఛా! ఎలా మడత పెడదామన్నా ఈ పాడుచిరుగు తప్ప డమే లేదు!

వెంకాయమ్మ [చీపురుతో వచ్చి]. కాస్త తప్పుకోరా, అబ్బాయ్! గది ఊడ్చుతా!

శివరావు. ఫరవాలేదులే, అమ్మా! అటు ఆ మూలనుంచి ఊడ్చుకురా!

[వెంకాయమ్మ ఒక మూలనుంచి గది ఊడ్వడాన్ని ప్రారంభిస్తుంది.

శివరావు [ఉత్తరీయాన్ని వాలుగ్గా మడతపెడుతూ]. ఇవ్వాళ మనింటికి పెద్దపెద్దవాళ్ళొస్తున్నారమ్మా!

వెంకాయమ్మ. మంచిదిరా, అబ్బాయ్!

శివరావు [చిన్నదిగా మడతపెట్టడంవల్ల చాలీ చాలకుండాపోయిన ఉత్తరీయాన్ని టేబుల్‌మీద వేసి, దాని అంచును ఒకవైపున కిందికి లాగబోతే, రెండోవైపున అది పైకి పోతూవుండగా]. బ్రహ్మానందాన్ని పిలిచానమ్మా! మే మిద్దరం కాలేజీలో కలిసి చదువుకున్నాము. వాడు నా ఈడువాడే. అయితే గియితే, రెండేళ్ల పెద్దేమో. వా డిప్పుడు మునిసిపల్ కమీషనర్. నెలకు రెండు వందల జీతం తెచ్చుకుంటున్నాడమ్మా!

వెంకాయమ్మ. వాడి పెళ్ళాం అదృష్టంరా అది!

శివరావు. మాధవరావుగారుకూడా వస్తున్నారమ్మా! ఆయనకి త్వరలో తాసిల్దార్ అవుతుం దనుకుంటున్నారు.

వెంకాయమ్మ. ఎవతో భాగ్యశాలి! పెట్టి పుట్టిందేమో, అనుభవిస్తుందిలే!

శివరావు. శ్రీనివాసరావుగార్ని కూడా రమ్మన్నానమ్మా! ఆయన పెద్ద డాక్టరు. నెలకి నాలుగువందలకి తక్కువలేకుండా కళ్ళజూస్తున్నాడు.

వెంకాయమ్మ. ఊళ్ళోవాళ్ళ సంపాదన చూసి మురిస్తే, మన కేం వొరుగుతుంది లేరా, అబ్బాయ్! ఎవడికుంటే వాడే తింటాడు.

శివరావు. అది కాదమ్మా! పెద్దవాళ్ళ స్నేహముంటే, ఎందుకైనా మంచిది కాదూ? వాళ్ళ శిఫార్సు వుంటే ఉద్యోగంలో ఎంత పైకైనా పోవచ్చు.

వెంకాయమ్మ. ఏమోరా, అబ్బాయ్! నాకేం తెలుస్తాయ్ ఆ గొడవలు?

శివరావు. వాళ్ళందరికీ మా బ్యాంకిలో కాతా లున్నా యమ్మా! నా దగ్గిరికి తరుచు వస్తూపోతూ వుంటారు.

[బయటినుంచి 'శివరావుగారూ' అని కేక.

శివరావు. మాధవరావుగా రనుకుంటా. అప్పుడే వచ్చారు. ఇంకేం చూడుస్తావ్‌లే, అమ్మా! నువ్వెళ్ళు.

[వెంకాయమ్మ చీపురుకట్ట అక్కడే పారేసి వెళ్ళబోతుంది.

శివరావు. అమ్మా! అదేమిటి? ఆ చీపురుకట్ట తీసుకుపో.

[వెనక్కువచ్చి వెంకాయమ్మ చీపురుకట్ట తీసుకు వెడుతుంది. "శివరావుగారూ!" అని తిరిగి బయటినుంచి కేక.

శివరావు. మాధవరావుగారా? దయచెయ్యండయ్యా. దయచెయ్యండి!

పచారుకొట్టు గుమాస్తా [లోపలికి వస్తూ]. నేనండీ కుటుంబరావుగారి గుమాస్తాని.

శివరావు [ముందు తెల్లబోయి, అంతలోనే కోపం తెచ్చుకుని]. ఏమిటయ్యా! తెల్లారి అప్పుడే ఇది అయిదోసారి రావడమట! దేనికీ ఇన్నిసార్లు ఇంటిచుట్టూ తిరగడం? మీ డబ్బు ఎగేసి పారిపోతా మనుకుంటున్నారా?

పచారీకొట్టు గుమాస్తా. ఎందుకండీ అంత కోపం? షాహుకారు వెళ్ళిరమ్మంటేనే వొస్తానా? నా అంతట నేనే వొస్తానా?

శివరావు. మొన్నేగదా ఒక యిరవై జమ కట్టొచ్చాను. అప్పుడే ఏం పుట్టి మునిగింది?

పచారీకొట్టు గుమాస్తా. ఇంకా ఇరవై అయిదు రూపాయల తొమ్మి దణాల ఏడుపైసల బాకీ వుంది. సంవత్సరాది వొస్తున్నది. కొత్త కాతాపుస్తకాలు పెట్టుకోవాలి. పాతబాకీ లన్నీ అణా పైసలతో సహా చుప్తాగా వసూలుచేసుకు రమ్మన్నాడు షాహుంకారు.

శివరావు. ఆ లెక్కా డొక్కా యేమిటో రేపుపొద్దున్నే కొట్టుదగ్గరి కొచ్చి చూచి, బాకీ ఫైసల్ చేస్తానని చెప్పు.

పచారీకొట్టు గుమాస్తా. చిర్తా, ఆవర్జాలు చూసి మేము సరిగానే లెఖ్ఖ వేశామండీ. మా లెఖ్ఖలో తేడా వొస్తుందని ఇంతవర కెవ్వరూ అనలేదు.

శివరావు. పోనీ, ఇప్పుడు నే నంటున్నాగా! సరే, ఇఖ వెళ్ళు. ఏమో ననుకున్నా! మంచి మర్యాదస్తులే.

పచారీకొట్టు గుమాస్తా. ఇది లోకంలో రివాజే లెండి. బాకీ అడక్క పోతే మర్యాదస్తులు. అడిగితే.. ....

శివరావు. చాల్లే! అధికప్రసంగం చెయ్యకు.

పచారీకొట్టు గుమాస్తా. అడిగితే మీకు కోపం, అడక్కపోతే ఆయ నికి కోపం. ఈ బాకీ వసూళ్ళంతటి బాదఖావ్ పని మరి లేదు!

[వెళ్ళిపోతాడు.

శివరావు [తెప్పిరిల్లడానికా అన్నట్టు ఒకక్షణం ఆగి]. అమ్మా!.... అమ్మా!

వెంకాయమ్మ [వస్తూ]. దేనికిరా, అబ్బాయ్!

శివరావు. గది పూర్తిగా జిమ్మి వెయ్యవమ్మా!

వెంకాయమ్మ. ఎవ రేమిటిరా, ఇప్పు డొచ్చి వెళ్ళింది?

శివరావు. ఆఁ! ఎవరూ లేదమ్మా! పచారీకొట్టు గుమాస్తాగాడు. పుట్టి మునిగినట్లు ఇంటిచుట్టూ తెగ తిరుగుతున్నాడు, వెధవ!

వెంకాయమ్మ. వాళ్ళకి బాకీవుంటే వాళ్ళు తిరగరట్రా? కాస్త వెనకా ముందూ చూసి కాపరం చేసుకోవాలి. "ఆడపెత్తనం తంబల దొరతనం" అన్నారు.

[చీపురుకోసం వెడుతుంది.

శివరావు [వొంకినున్న కోటుజేబులోనుంచి చిన్న దువ్వెన తీసుకుని, తల దువ్వుకుంటూ]. కృష్ణా!

[''జేనికండీ?'' అంటూ ముందు కృష్ణవేణి వస్తుంది. ఆమె వెనకాలే చీపురుతో వెంకాయమ్మకూడా వచ్చి, గది జిమ్మడాన్ని పూర్తిచేస్తూ వుంటుంది.

శివరావు. చూడు, కృష్ణా! మనకి మూడే కుర్చీ లున్నాయ్. మరొకటి కావాలి. పక్కింటివాళ్ళ నడిగి ఒకకుర్చీ తీసుకురా!

కృష్ణవేణి. ఏమో! వాళ్ళని నమ్మడానికి వీల్లేదండీ. మంచి గుణాన వుంటే యిస్తారు. లేకపోతే, విదిలించి కొడతారు.

[వీధి వాకిలిగుండా వెడుతుంది.

శివరావు. ప్లేట్లు ఎక్కడున్నవో చూచి, కాస్త కడిగి పట్టుకు వస్తావా, అమ్మా!

వెంకాయమ్మ. మీ ప్లేట్లు, గీట్లు ఎక్కడున్నవో ఏమిటో నాకు తెలవదురా, అబ్బాయ్!

శివరావు. వంటింటి అలమరలో లేవూ?

వెంకాయమ్మ. వోటిచేతులదాన్ని. చెయ్యిజారి పగిల్తే మీచేత మాటలు పడాలి. మీ ఆవిణ్ణి ర్మాన్నిన్వరా! అది తెస్తుందిలే!

[గది జిమ్మడాన్ని పూర్తిచేసి వెళ్ళిపోతుంది. వెనక వాకిలిగుండా చీపురుతో ఆమె వెళ్ళిపోవడమేమో, తల వాకిలిగుండా కృష్ణవేణి కుర్చీతో రావడమేమో,

శివరావు. మా అమ్మ చికాగ్గా వుంది. టీ పార్టీకి డబ్బు తగలేస్తున్నా వనే కాబోలు! కాని, పెద్దవాళ్ళు మనింటి కెందుకొస్తారు? ఇవ్వాళ ఏదో సాకు దొరికింది గనక, వాళ్ళని పిలవడం పడింది. పిలిచినా వాళ్ళు అంద రిళ్ళకు వెళ్ళరు. పిలిచింది మనం గనకే "ఓ! అంతకంచేనా?" అన్నారు! [కృష్ణవేణి ఔననిగాని, కాదనిగాని అనకపోవడాన్ని గమనించి] ఏం, కృష్ణా! పలకవ్, ఉలకవ్! ఇది వార్థి దుబారేనని అత్తాకోడళ్ళిద్దరు కలిసే తీర్మా నించుకున్నా రేమిటి!

కృష్ణవేణి [వెటకారంగా]. ఊఁ!

శివరావు. సరేగాని, ఏవీ ప్లేట్లు పట్టుకురా! స్వీట్స్ వాటిలో పెట్టి సిద్ధంగా వుంచుదాం.

[కృష్ణవేణి వెడుతుంది. శివరావు తను వెంట తెచ్చిన గుడ్డసంచి అందుకుని, దానిలోనుంచి ఒక పొట్లాన్ని పైకి తీసి, దాన్ని విప్పుతూ వుంటాడు. ప్లేట్ల దొంతరతో కృష్ణవేణి తిరిగొస్తుంది.

శివరావు [ప్లేట్లను నింపుతూ]. ఉప్మా అయిందా?

కృష్ణవేణి. ఆఁ!

శివరావు. కాఫీ పెట్టావా?

కృష్ణవేణి. ఆఁ! మరి, వాటినికూడా తెమ్మంటారా?

శివరావు. అందర్నీ రానీ! ఇప్పటినుంచీ తెస్తే చల్లారిపోతాయి.

కృష్ణవేణి. అంతా వస్తారంటారా?

శివరావు. మనం పిలవడమూ, రాకపోవడమూనా? మన కెంత పలుకుబడి లేకపోతే, చిన్నపనికీ పెద్దపనికీ మా ఏజెంట్ నన్ను

ప్రతి ఆఫీసర్ దగ్గిరికీ తరుముతాడు! ఎంత కొమ్ములు తిరిగిన ఆఫీసరైనా మనం వెళ్లామంటే, ముందు మన పనిచేసి పంపిస్తాడు. మన సూటూ, మన బూటూ, మన హ్యాటూ చూసే సరికి ఎంతటివాడైనా సీ టిస్తాడు. నువ్వేమైనా అనుగాని, వేషంలో కొంత డాబూ దర్పం కావాలి. లేకపోతే, మన ముఖం చూసేవాడెవడు?

కృష్ణవేణి. ఏం డాబూ, దర్పాలో! ఊరినిండా అప్పులూ, మనమున్నూ!

శివరావు. ఇలాంటి యింక్రిమెంట్లు మరి రెండొస్తే. ఈ అప్పు లేం చేస్తాయ్! వెధవప్పులు! [చిటిక వేస్తూ] ఇట్టే తీర్చిపారెయ్యం!

కృష్ణవేణి. ఆc! రెండేళ్ళకు ఇప్పుడేగా కాస్త జీతం హెచ్చించారు.

శివరావు. మన సత్తా వాళ్ళకి ఇప్పుడిప్పుడేగా తెలిసొచ్చింది! ఇక, చూడు! చక చకా ఎలా పైకి పాకిపోతామో! నాలుగేళ్ళు పోయేసరికి ఏజెంట్ పని! అప్పు డొక కారు, బంగళా, నౌకర్లు చాకర్లు....

కృష్ణవేణి. ఆc! అన్నీ పగటి కలలు!

వరావు. ఆగు! నువ్వే చూద్దువుగానిగా! నాకు యింక్రిమెంట్ వచ్చితీరుతుందంటే, నువ్వు నా మాట నమ్మావూ? అలాగే....

[బయటినుంచి "శివరావ్!" అని కేక.

శివరావు. అదుగో, అది బ్రహ్మానందం! సరే- నువ్వు లోపలికిపో. [కృష్ణవేణి వెడుతుంది]....రావోయ్! బ్రహ్మానందం! రా!

శ్రీరాములు [లోపలికివస్తూ]. నేనురా, శ్రీరాముల్ని. ఏc! అంత కొత్తవాణ్ణి అయిపోయా నేమిటి? - నా గొంతు ఆనవాలు పట్టలేకపోడానికి!

శివరావు. ఓరి పీనుగ! నువ్వట్రా! ఎక్కడనుంచి ఊడిపడ్డా విప్పుడు?

శ్రీరాములు. మా ఆడవాళ్ళకు మొన్నటినుంచి జ్వరం తగుల్తు తున్నదిరా! మందు తీసుకొద్దామంటే, ఉదయం తీరనే లేదు. అందుకని కోర్టునుంచి రాగానే, డాక్టర్‌గారింటికెళ్లా. ఏమిటిరా ఏమిటో టీపార్టీ చేస్తున్నావట?

శివరావు. ఔనురా! కాని, నీ కెవరు చెప్పారు?

శ్రీరాములు. నువ్వు చెప్పకపోతే మాత్రం దాగుతుందట్రా! ఇంతకూ ఏమిటీ విశేషం?

శివరావు. ఆఁ! మరేమీ లేదురా! పది రూపాయల ఇంక్రిమెంట్ వచ్చింది. అందుకని . .

శ్రీరాములు. ఆఁ! చెప్పావ్ కాదు! అయితే టిపార్టీకి నన్ను పిలవనే లేదేమిరా?

శివరావు. నువ్వు కనబడి ఏడిస్తేగా?

శ్రీరాములు. అంతేలే! నీకు మే మిప్పుడు కనబడం. ఇప్పుడు నీ వన్నీ పెద్దపెద్దవాళ్ళతో స్నేహాలు. ప్లీడర్ గుమాస్తాగాణ్ణి! నీ కంటిలో నాబోటి బక్కవా ళ్ళిప్పుడు దూరరు.

శివరావు. అఘోరించావ్‌లే! ఇప్పుడుమాత్రం మించిపోయిన దేముంది? వుండు - నువ్వుకూడా టీపార్టీకి వుండరా!

శ్రీరాములు. నే నొచ్చి అడిగితే, నన్ను పిలుస్తా వన్నమాట! ఏం మర్యాద స్తుడివిరా!

శివరావు. ఏడ్చావులేరా! బొట్టూ, కాటుకా పెట్టి పేరంటాల్ని పిలిచి నట్టు పిలవాలా? సరిగాని, టీపార్టీమాట ఎలా పసిపట్టావ్?

శ్రీరాములు. ఎవడో చెప్పాడులే ఆకాశరామన్న!

శివరావు. చాల్లేరా! నిజం చెప్పు.

శ్రీరాములు. డాక్టర్ శ్రీనివాసరావుగార్ని పిలిచావటగా? ఆయనే అన్నాడు. ఆయనకి ఏదో అర్జెంట్ కేసు తగిలిందట. "నీ కది దారేగదా! రా లేనని కాస్త చెప్పిపో!" అని పని పురమాయించాడు.

శివరావు. అయ్యో! ఆయన తప్పకుండా వస్తా డనుకున్నారా!

శ్రీరాములు. ఎవరో - పాపం! - హడావుడిగా పరిగెత్తుకొచ్చారు. డెలివరీ కేసట! తిరిగొచ్చేసరికి ఎంత ఆలస్యమౌతుందో, ఏమో! లేకపోతే ఆయన ఖాయంగా వొచ్చేవాడే!

శివరావు. ఔను. ఏదో పెద్ద ఆటంకం కలిగివుండకపోతే, ఆయన ఆగిపోయేవాడు కాదు.

శ్రీరాములు. సరే! మరి నే వెళ్లొస్తా!

శివరావు. కాస్త ఆగరా! వెడుదువు గానిలే!

శ్రీరాములు. లేదురా! పోవాలి! దానికి ఇవ్వాళ మధ్యాహ్నంనుంచి జ్వరం మరీ ఎక్కువైంది. వేరే దిక్కైనా లేదు. నేను పోకతప్పదు.

శివరావు. మాధవరావుగారు, బ్రహ్మానందం వచ్చే వేళైంది. ఒక్క పావుగంటలో వెళ్ళిపోవచ్చులేరా!

శ్రీరాములు. ఇది నాకు పరాయి యిల్లట్రా! ఎప్పుడుబడితే అప్పుడే రావొచ్చు. మరి నే వెళ్లొస్తా.

[వెడతాడు.

కృష్ణవేణి [వచ్చి]. ఎవరండీ అది ?

శివరావు. ఆఁ ! శ్రీరాములుగాడు.

కృష్ణవేణి. అంటే ?

శివరావు. వాడి వూరు, మా వూరు పక్కపక్కనే! మాకు ఏదో బీరకాయపీచు చుట్టమటకూడా. రెండు, మూడు నెల లైంది, ప్లీడరుగుమాస్తాగా వా డిక్కడి కొచ్చి. రెండో గుమాస్తాగా ఒక పాతిక రాళ్ళు తెచ్చుకుంటున్నాడులే, వాడు నన్ను పూసుకు పూసుకు తిరగాలంటాడు. ఇలాంటి వాళ్ళని దగ్గిరికి చేరనిస్తే మన పరువు తీసేస్తారు. చేసినా స్నేహాలు పెద్దవాళ్ళతో చెయ్యాలి. ఇలాంటి చచ్చు గుమాస్తాగాళ్ళతోనా !

కృష్ణవేణి. ఆయ నేమిటో డాక్టరంటా డేమిటి ?

శివరావు. డాక్టర్ శ్రీనివాసరావుగారికి అర్జెంటు కే సొచ్చిందట. అందువల్ల మన టీపార్టీకి రాలేనని వాడిద్వారా కబురు చేశారులే.

కృష్ణవేణి. అయిందీ ? అప్పుడే ఒకరు జారుకున్నా రన్నమాట. తక్కిన యిద్ద రేరీ ?

శివరావు. ఆఫీసర్లు కాదూ? వాళ్లకి ఊపిరిసలపని పను లుంటాయ్. వస్తారు, కాస్త వెనకా ముందుగా.

[బయటనుంచి "శివరావుగారూ !" అని కేక.

శివరావు. అదెవరు ?

కృష్ణవేణి. ఏమోనండీ ! నేతివాడేమో !

శివరావు. అరి వెధవ ! వీడికి వేరే వేళ కుదరలేదు కాబోలు ! పుట్టి మునిగినట్టు వీ డిప్పుడే వచ్చాడు !

["శివరావుగారూ !" అని తిరిగి కేక.

శివరావు [బిగ్గరగా]. బయటనుంచి అరుస్తావ్ దేనికి? లోపలికిరా! [పళ్ళునూరుతూ] నీ కాళ్లు విరగ్గొట్టి పంపుతాలే! రా!!

క్లబ్ ఫ్యూన్ [దణ్ణంపెడుతూ లోపలికివచ్చి]. నేనయ్యా! సత్తి గాణ్ణి! మరిగత్తే మాదవరావుగార్ని, బమ్మానందంగార్ని తమరు టీపార్టీకి దయసెయ్య మన్నారట. [బుర్రగోక్కుంటూ] కాని, ఆరి కేమో తొందరపని తగిలిందంట. ఆమాట మీతో సెప్పిరమ్మన్నా రయ్యా!

శివరావు [మనిషి చచ్చిపోయి]. ఏడ్చినట్టే వుంది! ఎక్కడున్నా రేమిరా వాళ్ళిద్దరు?

క్లబ్ఫ్యూన్. క్లబ్బులో వున్నారయ్యా.

శివరావు. ఏం చేస్తున్నారురా!

క్లబ్ఫ్యూన్. సెత్తే, నన్ను తెగ్గోస్తారేమో నయ్యా!

శివరావు. ఫరవాలేదురా, చెప్పు!

క్లబ్ఫ్యూన్. నే సెప్పానని తమరు....

శివరావు. చెప్పమలేరా! నీ కేమీ భయమొద్దు.

క్లబ్ఫ్యూన్. ఆ రిద్దరూ పేకాటలో కూకున్నారయ్యా!

శివరావు. రాస్కెల్స్!

క్లబ్ఫ్యూన్. పేదోణ్ణయ్యా! తమరు విగ్గదీస్తే సెప్పాగాని....

శివరావు. ప్చ్! నీ కేమీ ఫరవాలేదు! నీకు మాట రానివ్వను. సరే — నువ్వు పో!

క్లబ్ఫ్యూన్. వెళ్ళొస్తానయ్యా! దయుంసండి.

[దణ్ణంపెట్టి వెళ్ళిపోతాడు.

శివరావు. స్కౌండ్రల్స్ !

కృష్ణవేణి. వీళ్ళ ఎగవేశా రన్నమాట. నే చెప్తే వింటారటండీ? ఉత్తిపుణ్యానికి డబ్బుకు డబ్బూ ఖర్చుపోతారు; మనస్సుకి మనస్సూ హైరాన పెట్టుకుంటారు. మన యెత్తువాళ్ళతో మనం వుండాలిగాని, పైకి ఎగరబోతే....

శివరావు. ఊఁ ! చాల్లే—! సంతోషించాం ! పోపో !!

కృష్ణవేణి. అంతే లెండి ! అమ్మకీ నేనే లోకువ ! కొడుక్కీ నేనే లోకువ !

[కృష్ణవేణి వెడుతుంది. శివరావు "ఉస్స్ !" అంటూ పడకకుర్చీలో జేరగిలబడతాడు.

శివరావు. [పడకకుర్చీలో జేరగిలబడినవాడు, హఠాత్తుగా నిటారుగా కూర్చుని] అమ్మా !....అమ్మా !

వెంకాయమ్మ [వచ్చి]. దేనికిరా, అబ్బాయ్ !

శివరావు. కాస్త ఈ ప్లేట్లు తీసుకుపోవమ్మా !

వెంకాయమ్మ. అదేమిటిరా ? అంతా ఏరీ ?

శివరావు. ఆఁ ! ఏం తగలబడ్డారో ! నువ్వు వాటిని తీసుకుపో !

వెంకాయమ్మ [ప్లేట్లు తీస్తూ]. ఎల్లుండి మంచిరోజటరా, అబ్బాయ్! నేను మన వూరు వెడతా.

శివరావు. ఎందు కమ్మా, యిప్పుడు ? అక్కడేం మునుకు పోతుంది ?

వెంకాయమ్మ. లేదురా, అబ్బాయ్ నే వెళ్ళాలి.

శివరావు. రాకరాక మొన్నే గదమ్మా, నువ్వొచ్చావ్ ! అప్పుడే వెళ్లాలా ? మరొక నెలరోజులైనా వుండగూడదూ ?

వెంకాయమ్మ. ఇక్కడ కిది చాల్లే.

శివరావు. ఇక్కడ నీకు బాగా లేదే మమ్మా!

వెంకాయమ్మ. బాగేమిటి, వోగేమిటి? ఎక్కడైనా నేను పొట్టకూటి దాన్నేగా! ఇంత పని చేయించుకుంటారేమో, ఇంత ముద్ద వేస్తారేమో!

శివరావు. నిన్ను పనెవ్వరు చెయ్యమన్నారమ్మా? - మహారాజులా కాలిమీద కాలువేసుకు కూర్చోక!

వెంకాయమ్మ. ఆఁ! కాలిమీద కాలువేసుకు కూర్చుంటే నెత్తిని బండ పెడతారు.

[ప్లేట్సుతో వెళ్ళిపోతుంది.

శివరావు [కుర్చీనుంచి లేచి]. కృష్ణా!

కృష్ణవేణి [వచ్చి]. దేవికంటీ?

శివరావు. మా అమ్మ ఊరు వెళ్ళిపోతానంటున్న దేమిటి?

కృష్ణవేణి. ఏమో నాకేం తెలుసు?

శివరావు. ఆమెతో పోట్లాడావా?

కృష్ణవేణి. ఉహుఁ!

శివరావు. నిజం చెప్పు.

కృష్ణవేణి. లేదండీ! ఆమే ఉత్తిపుణ్యానికి నన్ననీ్న దులపరించింది.

శివరావు. అకారణంగా ఆమె నిన్ను మాట లెందు కంటుంది?

కృష్ణవేణి. ఏమో, నన్నడిగితే?

శివరావు. అసలు జగడం ఎలా ప్రారంభమైం దేమిటి?

కృష్ణవేణి. ఆమెగారితో జగడ మెవరు పెట్టుకున్నారండీ? కృష్ణా, రామా అంటూ మీకు ఒక్కచే జపమైపోయిందని ఆమే సాధింపు ప్రారంభించింది. ఆమె అదృష్టంవల్ల మీకు పెద్దచదు వొచ్చిం

దట; నా దురదృష్టంవల్ల మీకు పెద్ద వుద్యోగం రాకుండా పోయిందిట. పెద్దబ్బాయికి అన్యాయం చేసి, కాపరాన్ని అప్పుల పాల్జేసి, మిమ్మల్ని చదివించారట. ఏ తాసిల్దార్ వనైనా కాకపోతుందా అని గంపెడాశ పెట్టుకున్నారట. పెట్టి పోషించక పోయినా, ఏదో వాస్తూపోతూ వుందామంటే, ఇది పరాయి కొంపకంటె కనికష్టమై పోయిందట.

శివరావు. ఆమెను నువ్వేమి నొప్పించావో? లేకపోతే ఆమె ఇలా ఎందుకంటుంది?

కృష్ణవేణి. ఏ వొట్టుపెడితే ఆ వొట్టు! నేనేమీ అనలేదండీ!

శివరావు. చాల్లే! నువ్వేమీ అనకపోతే ఆమె మనస్సుకింత కష్టమెందుకు కలుగుతుంది? వొంటిమీద వెండి బంగారాల్ని తెగనమ్మికూడా నాకు చదువు చెప్పించింది. ఆమెను పువ్వుల్లో పెట్టి పూజించేది పోయి, మనం కాపరంపెట్టిన ఇన్నాళ్ళ, కొకసారొస్తే మంచి మర్యాదే చేశావ్!

కృష్ణవేణి. నాతోడు! నేనేమీ అనలేదండీ!

శివరావు. ఉహూ! నంగనాచివి!

కృష్ణవేణి. సర్లెండి. నాఖర్మ మిది!

[వెడుతుంది.

శివరావు [అశాంతిగా నాలుగైదుసార్లు పచారుచేసి]. అమ్మా!

వెంకాయమ్మ [వస్తూ]. ఏమిటిరా, అబ్బాయ్!

శివరావు. జగడ మెందుకు వచ్చిందమ్మా!

వెంకాయమ్మ. జగడ మేమిటిరా?

శివరావు. నాదగ్గిర ఇంకా దాపరికం దేనికమ్మా? పోట్లాట ఎలా ప్రారంభమైంది?

వెంకాయమ్మ. మీ యింటి కొచ్చి, ఎదురు మీతో పోట్లాట కూడానా?

శివరావు. అదేమి టమ్మా? ఇది నీ యిల్లు కాదూ?

వెంకాయమ్మ. ఆఁ! నాయిల్లు కాకేఁ! మీ ఆవిడ మా యిల్లు, మా కంచాలు, మా మంచాలు అని నేనొచ్చిన కాడినుంచీ అంటున్నది నువ్వు విన లేదూ? ఇక్కడ నా దేముంది?

శివరావు [నవ్వుతూ]. ఓహో! ఇదేనా నీ ఫిర్యాదు!

వెంకాయమ్మ. ఔను! నీకు నవ్వుగానే వుంటుంది. పెళ్ళాం బెల్లం, తల్లి విషం - లోకంలో వున్న సంగతేగా?

శివరావు. అది కాదమ్మా? ఇక్కడ మన చుట్టాలా, పక్కాలా? మేము కాపరంపెట్టి రెండేళ్ళు కావొస్తున్నా, ఇప్పటికిగాని నువ్వు వచ్చావ్ కాదయ్యె. ఈలోపున ఇరుగుపొరుగు వరాయి వాళ్ళతో మా యిల్లనడం దానికి అలవాటై పోయింది. అలవాటు చొప్పున నీతోకూడా....

వెంకాయమ్మ. చాల్లే! వెనకేసుకొచ్చావ్!

[విసురుగా వెడుతుంది.

శివరావు. అమ్మా [కాస్త ఆగి] అమ్మా! [ఎంతకూ పలకక పోగా] ఎందు కమ్మా! ఇంత కోపం! [క్షణం ఆగి] కృష్ణా! [నాలుక కరుచుకుంటూ] కృష్ణవేణీ!

కృష్ణవేణి. [కళ్లు తుడుచుకుంటూ వచ్చి] దేనికండీ?

శివరావు. మా అమ్మ మనస్సుకు కష్ట మెందుకు కలిగిందో తెలుసా?

కృష్ణవేణి. ఏమో, నన్నడిగితే?

శివరావు. అవిడతో మాట్లాడుతూకూడా మాయిల్లు, మామంచాలు, మా కంచాలు అంటావట! అలా అంటే ...

కృష్ణవేణి. అబ్బే! నే ననలేదండీ!

శివరావు. అలవాటుచొప్పున అన్నావేమోలే! కాని, పొరపాటుగానైనా పరాయిదాన్నిగాచూస్తే ఆమె మనస్సుకు...

కృష్ణవేణి. నా కామె కాదు; ఆమెకు నేనే పరాయిదాన్ని. చిన్నదైనా తమ్ముడికూతుర్ని చేసుకుంటే, మాలో అతుక్కుపోయేదని ఆమె సూటీ పోటీగా అనని రోజులేదు.

శివరావు. చాల్లే! ఇఖ కయ్యానికి కాలుదువ్వకు!

కృష్ణవేణి. అంతే లెండి! మీరూ మీరూ ఒఖటి. నేనేగా పరాయిదాన్ని!

[గిర్రున నీళ్లుతిరిగిన కళ్ళతో ఒక్కసారి తలెత్తి చూచి, కృష్ణవేణి వెళ్ళిపోతుంది, "అబ్బబ్బ" అంటూ శివరావు తిరిగి పడక కుర్చీలో జేరగిలబడతాడు.

శ్రీరాములు [చడీ చప్పుడు కాకుండా వచ్చి]. ఏరా, అప్పుడే అంతా వొచ్చి వెళ్ళిపోయా రేమిటి?

శివరావు [విసుగ్గా]. ఊఁ!

శ్రీరాములు. వేళకు అందుకో లేనేమోనని అక్కడికీ ఆదరాబాదరా పడొచ్చారా? అసలు రాకేపోదును. కాని, నువ్వు ఏమనుకుని పోతావోనని తెరిపి చేసుకొచ్చా. అడుగూ బొడుగైనా కాస్త నా కేమైనా మిగిలిందా?

శివరావు కా_స్త ఖర్మ మేమిటి? అంతా నీకే మిగిలింది!

శ్రీరాములు [కంఠంవరకూ మెక్కడానికి అన్నట్టుగా తాపీగా ఒక కుర్చీలో కూర్చుంటూ]. నిన్ను చూస్తే నా కెంతో ముచ్చటరా! శ్రమలేని ఉద్యోగం, ఒకటో తేదీకి ఠంచనగా జీతం, మధ్యమధ్య ప్రమోషన్లు, పెద్దపెద్దవాళ్ళతో స్నేహాలు, రవ్వారట్టూ లేకుండా గుట్టుగా సంసారం. ఓఁ! ఏం హాయి!

శివరావు. ఆఁ! చాలా హాయి! ఇంటిగుట్టు ఈశ్వరుడి కెరుక!

తెర ]



## పాత్రలు

| | |
|---|---|
| మోహనరావు<br>అనసూయ | తెరపైకి వచ్చేవారు |
| బిచ్చగాళ్లు<br>సీతారామయ్య<br>తులసమ్మ | నేపథ్యంలో నిలిచేవారు |

## స్థలం

మోహన్‌రావ్ స్టడీ

## కాలం

వర్తమానం



# నవకవి

మోహన్‌రావు స్టడీ. కుడిచేతివైపు ద్వారం వీధితల వరండాలోకి; ఎదురుగానున్న ద్వారం డ్రాయింగ్ రూమ్‌లోకి; ఎడమ చేతివైపుది భోజనాలగది, వంటిల్లు మొదలైన వాటిలోకి. [వీధి తల వరండాలోనుంచి స్టడీలోకి ఒక ద్వారంవుంటే, డ్రాయింగ్ రూమ్ లోపలికి మరొక ద్వారం వున్నదన్నమాట.] ఎదురుగుండావున్న ద్వారానికి రెండుపక్కలా రెండు కిటికీలు. తలుపులు, కిటికీలకు అందమైన కర్టెనులు.

గదిలో ఒక పక్కగా రోజ్‌వుడ్ టేబుల్, కుర్చీ. గోడలకు అజంతా చిత్రాలు. అక్కడక్కడ కొన్ని పుస్తకాల బీరువాలు.

తెర లేచేసరికి మోహన్‌రావు టేబుల్ వద్ద కూర్చుని ఏదో వ్రాయడానికి ప్రయత్నం చేస్తూవుంటాడు. కుడిచేతిలో కలం; ఎడమ చేతిలో సిగరెట్టు. వ్రాత సాగడం కష్టమైపోయినకొద్దీ సిగరెట్టు దమ్మును మరింత గట్టిగా లాగుతూవుంటాడు.

అతని వయస్సు ముప్పయి అయిదుప్రాంతాల. కాశ్మీర్ శాలువ వల్లెవాటుతో సహా పక్కా బెంగాలీబాబు వేషం.

ఆనసూయ వయస్సు పాతిక సంవత్సరాలు. అందకత్తె గాని ఆడంబరాలకు పోక, సంసార పక్షంగా వుంటుంది. మాటకారి గాని, మెత్తని మనస్సు.

మోహనరావు [వ్రాసే ప్రయత్నం విరమించి]. అనూ! అనూ !

అనసూయ [ప్రవేశిస్తూ]. ఏమిటండీ, అనూ, వినూ! శుభ్రమైన పేరుండగా "అనసూయా" అని పిలవరాదూ!

మోహనరావు. అది నీకు నా ముద్దుపేరు. పేరు పొట్టిచెయ్యందే ముద్దుపేరు కాదు. నన్ను మోహన్‌రావ్ అంటే అందులో ముద్దేముంది? మోహన్ అనాలి. ఏదీ - ఒక్కసారి - ముద్దుగా మోహన్ అను.

అనసూయ. ఉః! చాల్లెద్దురూ!

మోహనరావు. ఇక్కడే నీకూ నాకూ పేచీ. ముద్దూ మురిపెం. నీకు తెలియదు సరిగదా, నేను చెప్పినా తెలుసుకోవు. అదే ఇంగ్లీషు దంపతులైతే ఒకరి నొకరు ఏమని పిల్చుకుంటారో తెలుసా? "మై డియర్", "మై డార్లింగ్" అని తప్పితే మరొక మాట వాళ్ళ నోటివెంట రానేరాదు. అంటే "ప్రియా!", "ప్రియతమా !" అన్నమాట.

అనసూయ. ప్రియమో, చౌకో నాకు దేనికిగాని. ఎందుకు పిల్చారో చప్పున చెప్పండి. నేను పోవాలి! పొయ్యి పోతున్నది.

మోహనరావు. పొయ్యే నీకు ప్రపంచం!

అనసూయ. లేకపోతే విస్తరిలోకి మెతుకులెలా వస్తాయండీ!

మోహనరావు. తిండి కేమొచ్చె? పాడు తిండి! పొట్ట నింపుకోవడమే ప్రధానమైతే మనకూ, పశుపక్ష్యాదులకూ భేదమేమిటి? జీవితపు విలువలు తెలిసినవారికి అన్నవస్త్రాదులు కాదు ముఖ్యం; అరుణోదయం, మలయమారుతం, వసంతకాలం, కోకిలారావం, సుధాచంద్రికలు, సుమధుర....

అనసూయ. మళ్ళీ మొదలెట్టారూ మీ కవిత్వం? అయితే నేను చక్కాపోతున్నా లెండి.

[పోబోతుంది.

మోహనరావు. ఆఁ! ఆఁ! లేదులే. కాస్త నిదానించు. నేను కొత్తగా ఒక నాటకం ప్రారంభించా.

అనసూయ. అయితే రాసుకోండి! మీ దేవకన్నెల్ని గురించి వినడానికి నా కిప్పుడు తీరుబాటు లేదు.

మోహనరావు. ఉహుఁ! ఈసారి నాటకం దేవకన్యల్ని గురించి కాదు.

అనసూయ, మీ రాజపుత్రికల గొడవైనా నాకు పట్టదండీ!

మోహనరావు. అబ్బెబ్బే! ఇది పూర్తిగా కొత్త నాటకం. కథావస్తువులో, కథాసంవిధానంలో, పాత్రకల్పనలో, పాత్రపోషణలో, సంభాషణల గతిలో, సన్నివేశాల రతిలో—అంతా కొత్త, అన్నీ కొత్త పోకడలతో రసస్ఫోరకంగా నడుస్తుందిలే!

అనసూయ. నడపనివ్వండి, మరి! మధ్య నాతో ఈ కబుర్లు దేనికి? మీకూ, నాకూ కూడా పని చెరుపు!

మోహనరావు. కాని, మొదటి రంగంలోనే కొంచెం అడ్డింది.

అనసూయ [నవ్వుతూ]. అయితే, అట్లకాడతేనా, అడ్డు తుళ్ళగించడానికి ?

మోహనరావు. పరిహాసంలో గట్టిదానివేలే ! కాని, నా కిప్పుడు పట్టిన ప్రశ్న పరిహాసంకాదు ; ప్రణయం.

అనసూయ. అంత ప్రళయమేమి వచ్చి పడిందండీ?

మోహనరావు. అదుగో! తిరిగి పరిహాసమా? ఇహ చాలించి, రాసినంతవరకు నా నాటకాన్ని సావధానంగా విని, ఒక సలహా చెప్పు.

అనసూయ. అయ్యో రామ! మీకు సలహా చెప్పేపాటి దాన్నా? అయినా చదవండి.

మోహనరావు. ఈ నాటకంలోని రసస్ఫూర్తి నీవనుభవించాలంటే, ముందు కొంత ఉపోద్ఘాతం అవసరం.

[ఉపోద్ఘాతం ప్రారంభించడానికి గంభీరముద్రను ధరించి, అర్ధనిమీలిత నేత్రుడౌతాడు.

అనసూయ. ఏమండోయ్! నాకు అవతల చేతినిండా పనుంది. మీ రిప్పుడు మబ్బులలోకి పరుగులిడితే....

మోహనరావు [విసుగ్గా]. అబ్బ! రసభంగం చేస్తావ్! నీ సరసాలకు సమయాసమయాలు లేవు!

అనసూయ [నాలిక కరుచుకుంటూ]. అయ్యో రామ! తప్పే!

మోహనరావు. సరే! ఇకనైనా నన్ను కాస్త ఉపోద్ఘాతాన్ని చెప్పనిస్తావా?

అనసూయ. ఊఁ! కానివ్వండి.

మోహనరావు [ఈసారి పోజ్ పెట్టకుండానే]. అతడు కురూపి. కాని కవి, రసజ్ఞుడు, వ్యుత్పన్నుడు. కళాసంపత్తి ఎక్కువ. కవిత్వంకోసం బ్రతుకుతాడు. రుచిగలవాడు.

అనసూయ. రుచిగలవా దేమిటండోయ్! మీరు కొరుక్కుతిని చూశారేమిటి?

మోహనరావు ["కాస్త ఆగు!" అన్నట్టు సంజ్ఞచేసి]. అతడు సౌందర్యపిపాసి; స్నిగ్ధ హృదయుడు.

అనసూయ. ఇంతకూ ఈ అత దెవడండీ?

మోహనరావు. నా నాటకానికి కథానాయకుడు

అనసూయ. అతనికి ఊరూ, పేరూ లేదేమిటి?

మోహనరావు. అతనిపేరు చంద్ర.

అనసూయ. అదేమిటండీ ఆడపేరు!

మోహనరావు. అతడు కవికాదూ? పేరు విన్నంతనే అతడు కవి అని స్ఫురించాలి. రసజగత్తును సృష్టించే కవికి రసధునివంటి పేరు పెట్టడమే రసౌచిత్యం.

అనసూయ. సరే! ఆ చంద్రప్పగారి మాటేమిటి ?

మోహనరావు. అబ్బబ్బ! నేను ఎంతో ఆలోచించి నిర్ణయించిన పేరు సొగసు ఇట్టే చెడగొట్టేశావ్!

అనసూయ. ఆ సొగసు లేవో నాకేం తెలుస్తాయి లెండి. సరే కానివ్వండి!

మోహనరావు. చెప్పాను కదూ ? - అతడు కురూపి.

అనసూయ. వొర్రి కోతిలా వుంటాడేమిటి ?

మోహనరావు. అబ్బ! ఇంత కటువుగా మాట్లాడతావేఁ ?

అనసూయ. మీరే అంటిరిగా అతడు కురూపివాడని.

మోహనరావు. సర్లే! విను! బాహ్యసౌందర్యం లేకపోయినా, అంటే, పైపై అందం లేకపోయినా....

అనసూయ. పైపై అందమొకటి, లోపల అందమొకటి - ఇన్ని వుంటాయటండీ ?

మోహనరావు. ఔనౌను! ముక్కూ, ముఖం అంద మొక అందమా ? రసజ్ఞ హృదయంవల్ల, రసోపాసక జీవితంవల్ల సిద్ధించే ఆత్మ సౌందర్యమే వాస్తవికమైన సౌందర్యం. రసోపాసకులు ఆశాజీవులు. ఊహాతీతమైన దేనికో వారు అశ్రులు ఖార్స్తారు. వారినే కవిత్వం వరిస్తుంది. వారు బాధలో

హృదయం చీల్చుతారు; బ్రతుకులో కవిత్వం ఏరుకుంటారు.
ప్రతిపదం జీవించే పలుకుతారు.

అనసూయ. ఆ చెప్పే దేదో నాకు కాస్త తెలిసేటట్టు చెప్పండి.

మోహనరావు. రసోద్వేగంలో పడిపోయానులే! సరే, విను!
చంద్ర పైకి అందగాడుకాకపోయినా, విజానికి అందమైనవాడే.

అనసూయ. కాబోలు!

మోహనరావు. కాబోలు కాదు; ముమ్మాటికీ.

అనసూయ. మంచిది; అచ్చుకున్నానండీ! అతడు బాలచంద్రుడే!

మోహనరావు. అతడు ఒక యువతిని ప్రేమిస్తున్నాడు. ఆమె దివ్యసుందరమూర్తిని తన హృదయపీఠంపై ప్రతిష్ఠాపించు కుని, ప్రేమసుమాలతో అహర్నిశలు అర్చిస్తున్నాడు.

అనసూయ. పనిపాటలు చేసుకోకపోయినా, మీవలె బాగా జరుగుబా టున్నవాడేమిటి?

మోహనరావు [ముఖం చిట్లిస్తూ]. నీకు తోచేవన్నీ యిలాంటి అవకతవక ప్రశ్నలే!

అనసూయ. నాకు తెలియకడుగుతా గాని, తిని కూర్చోడానికి తగుస్థితి లేనివాడైతే, రాత్రింబగళ్లు ఏదో ఒక అమ్మాయిని గురించి జపంచేస్తూ కూర్చోగలడటండీ!

మోహనరావు. చాల్ చాల్లే! ఈ విషయాలు నీకు తెలియవ్.

అనసూయ. అయితే, మరి నాకు చెప్పడం దేనికి?

మోహనరావు. ఆ మాటా నిజమే! నా మూడ్ చెడగొట్టేశావ్.

అనసూయ. అయ్యో రామ! మళ్ళీ మాడుపోటు వచ్చిందేమిటి?

మోహనరావు. ఊఁ! మాడుపోటూ లేదు; గీడుపోటూ లేదు.

[మోహన్‌రావు సిగరెట్టు ముట్టిస్తాడు. అనసూయ

"ఏం! కోపమొచ్చిందా?" అని అడుగుతుంది. ఆతడు జవాబు చెప్పడు. ఇంతలో ఈ క్రిందిపాటను పాడుతూ తలవాకిలి లోకి ఇద్దరు ముగ్గురు బిచ్చ గాళ్లు వస్తారు.

"బిచ్చగాళ్ళమండి నారాయణా!
కాసిని బియ్యం పెట్టించండి నారాయణా!
పట్టెడన్నంలేదు నారాయణా!
మాకు కట్ట గుడ్డాలేదు నారాయణా!
కొంపగోడూలేదు నారాయణా!
చింపి గుడ్డ లిప్పించండి నారాయణా!
ఆకలికి చస్తున్నాము నారాయణా!
మేము చలికి నొస్తున్నాము నారాయణా!
లేనివాళ్లమండి నారాయణా!
మాకు లేదన బోకండి నారాయణా!"

[బిచ్చగాళ్ళ పాటమధ్య "నిజంగా ఇదంతా కోపమేనా?" అని అనసూయ అడుగుతుంది. ఆమె మాటను విననట్లు మోహనరావు నటిస్తాడు. ఒక క్షణం తర్వాత "చాల్లే! పొండోయ్" అని బిచ్చగాళ్లను కసురుకుంటాడు. అయినా వాళ్లు పాటపాగిస్తూ పోతూవుండగా, "మీకొక్కాదూ చెప్పేది! చచ్చు పీనుగుల్లారా! పో పొండి!" అని గద్దిస్తాడు. అప్పటికీ బిచ్చగాళ్లు పాట మానరు. అంతట "వస్తున్నాన్రా! ఆగండి!" అని అనసూయ అంటుంది. పాట ఆపి, "అమ్మా! మా అమ్మా!! కాశీ అన్నపూర్ణమ్మా! గుప్పెడు గింజలు" అని

బిచ్చగాళ్లు అర్థిస్తారు. సిగరెట్టు కాల్చుతూ మోహనరావు గదిలో పచారుచేస్తూ వుంటాడు. బిచ్చగాళ్లకు ముష్టిపెట్టి పంపించిన అనసూయ తిరిగి వస్తుంది.

అనసూయ. పాపం! వాళ్ళ దేశంలో కరువు వచ్చిందండీ! కళ్లు లోపలికి పీక్కుపోయి, ముఖాలు చప్పగా దోక్కుపోయి, పొట్టలు వెన్నుకు అతుక్కుపోయి, పక్కటెముకలు బయటికి పొడుచుకొచ్చి, పీనుగులంటే పీనుగులుగా....

మోహనరావు [చెవులు మూసుకుంటూ]. ఈ పాడుమాటలు నాకు చెప్పకు!

అనసూయ. పాడుమాట లేమిటండీ! పాపం! తినడానికి పట్టెడు మెతుకులు లేక, తాగడానికి చిట్టెడు గంజైనా లేక, ఇళ్ళూ వాకిళ్ళూ వొదిలిపెట్టుకొని, చెట్టుకొక పక్షిచొప్పున అయిపోయి, "అమ్మా! తల్లీ!" అంటూ వాళ్లు అఘోరిస్తుంటే! వాళ్ళ వొంటిని ఎక్కడైనా ఇంత కండన్నమాట వుంటే వొట్టు. వొట్టి ఎముకలగూళ్ళు. కళ్ళలో పెట్టుకున్నారు కాస్త కొనూపిరి! వాళ్ళని చూస్తే నాగుండె చెరువైపోయింది.

మోహనరావు [కోపంతో సిగరెట్టు విసిరికొట్టి]. చాల్ చాలు! కట్టిపెట్టిక! కూడులేక ఎన్ని కుక్కలు చావడంలేదు! వాటి సంగతి నేను పట్టించుకో బోతున్నానా?

అనసూయ. అయ్యో రామ! మనుష్యులు, కుక్కలు ఒక్కటే నటండీ!

మోహనరావు. ఆఁ! అంతే! సంస్కారం లేకపోతే, రసజ్ఞత లేకపోతే! నేను కవిని. సౌందర్యాన్ని నేను ఉపాసిస్తాను; ఆనంధాన్ని నేను అన్వేషిస్తాను. వాటిని నా రచనలద్వారా లోకానికి పంచిపెడతాను. నాదృష్టి మేఘమాలికలపై కేగాని,

మురికి గుంటలపైకి పోరాదు. నేను వినవలసినవి కోకిల పాటలే గాని, కూటికై అరుపులు కాదు. నా హృదయం పరుగులిడేది వింత మిణుగురులకు, తళుకు మెరుపులకు. వీడని ఒక ఆవేదనతో, దొరకని ఒక తేజస్సుకై ....నేను....నేను....

అనసూయ [తెల్లపోయి]. అయ్యో రామ! ఎందుకండీ అంత కోపం? [లెంపలు వాయించుకుంటూ] బుద్ధి పొరపాటైంది.

[అనసూయ వెళ్ళిపోతుంది. మోహన్‌రావు కుర్చీలో కూర్చుని కొత్త సిగరెట్టు ముట్టిస్తాడు. టేబుల్ వద్ద కూర్చుని వ్రాయడానికి ప్రయత్నించగా ఒక్క అక్షరమైనా రాలదు. అంతట కుర్చీలోనుంచి లేచి, గదిలో నాలుగైదుసార్లు పచారుచేస్తాడు. పిమ్మట "అనూ!" అని ఆప్యాయంగా రెండు, మూడుసార్లు పిలుస్తాడు.

అనసూయ [వస్తూ]. మళ్ళీ ఎందుకండీ?

మోహనరావు. ఏఁ! కోపమొచ్చిందా?

అనసూయ. కోపమైనా, తాపమైనా మీకే చెల్లు! నా దేముంది? మొద్దురాచ్చిప్పను!

మోహనరావు. నాది సున్నితమైన మనస్సని నీకు తెలుసుగదా? తెలిసీ, కటువు మాటలుచెప్పి నన్ను నొప్పించడం తగునా?

అనసూయ. తప్పైనని చెంపలు వాయించుకున్నా గదండీ!

మోహనరావు. అదుగో! తిరిగి నాకు బాధ కలిగిస్తున్నావ్. నీకు కోపం లేదంటేగానీ నా మనస్సు కుదటపడదు.

అనసూయ. అఁ! కోపమేమీ లేదండీ!

మోహనరావు. కోపంలేదని ఊరికే అంటేకాదు. ఏదీ ఒక్క చిరునవ్వు!

అనసూయ [చిరునవ్వు తెచ్చి పెట్టుకుంటూ]. ఊఁ!.చాల్లెద్దురూ?

మోహనరావు. దరహాస చంద్రికలు సోకనిదే కవి హృదయం విప్పారదు. ఆఁ! అన్నట్టు నా నాటక కథ ఎంతవరకు చెప్పాను? ఆఁ! ఆమె ...

అనసూయ. ఆమె యెవతండీ? [అంతలో నాలిక కరుచుకుని] ఆఁ! ఎవతైతే నాకు దేనికిలెండి! ఊరుకోలేక నవ్వులాటకు నేనేమైనా అంటే మీకు తక్షెదు కోపమొస్తుంది.

మోహనరావు [నవ్వుతూ]. అబ్బే! సందేహం వస్తే అడగనూ వచ్చు; తీర్చుకోనూ వచ్చు. నా మనోవీధిలో ఈ పాత్రలు స్పష్టంగా, సజీవంగా, సుపరిచితంగా మూర్తివంతమై వున్నవి కదూ? అంచేత నీకు కూడా సుపరిచిత వ్యక్తులేనన్నట్టు పొరపడు తున్నాను. ఆమె ఎవరో నీకు చెప్పనేలేదు. ఆమె సరళ. చంద్ర ప్రేమిస్తున్న సుందరి.

అనసూయ. ఓహో!

మోహనరావు. పేరు చక్కగా కుదిరింది కాదూ! ఆమెది సరళ ప్రవృత్తి. అంచేత సరళ అని నామకరణం చేశాను.

అనసూయ. ఓఁ! దివ్యమైన పనిచేశారు.

మోహనరావు. ఆమె ఎంత రూపవతో అంత గుణవతి; ఎంత గుణవతో, అంత విద్యావతి. ఇక ఆమె సంపత్తి ఇంతంత కాదు.

అనసూయ. పాడుదేవుడు! అన్నీ ఒక్కరికే అమర్చి పెడతాడు!

మోహనరావు. ఆమె భాగ్యానికి ప్రలోభపడి ఒక జిత్తులమారి.... అతడి పేరు శాస్త్రి....జంబుకశాస్త్రి అని ధ్వనించాలే! ధ్వని ప్రధానంగా గలదే ఉత్తమకావ్య మౌతుంది....చంద్ర, సరళ, శాస్త్రి అని పేర్లు పెట్టడంలో నేను చక్కగా ధ్వనించాను

కాదూ?.....ఆమె భాగ్యానికి ప్రలోభపడి ఆమెను పరిణయ మందా లని శాస్త్రీ ప్రయత్నిస్తున్నాడు. సరళహృదయ గనుక, అతడి కపటాన్ని ఆమె కానలేక పోతున్నది. అతడి పైపై మెరుగు లకు భ్రమసి, అతడి మాయమాటలకు మురిసి అతడే తగిన వరుడని ఆమె భావిస్తున్నది. హృదయంలేని ఒక ధనాశా పరుడు సరళ జీవితాన్ని బలిగొన బోతున్నాడే అని చంద్ర తనలో తాను కుమిలిపోతున్నాడు. ఈ ఘట్టంలో నేను నా నాటకాన్ని ఎత్తుకుంటున్నాను. ఏఁ! ఈ ఎత్తుగడ రసవత్తరంగా వుంటుంది కదూ?

అనసూయ. ఆఁ! మీ మాటలు నాకు రావు గాని, బలే పసందుగా వుంటుంది.

మోహనరావు. నిజమేనా? పరిహాసాని కంటున్నావా?

అనసూయ. అయ్యొ రామ! ఇదెక్కడి పాపమండీ! నే నే మాటన్నా పరాచక మంటారు!

మోహనరావు. సరే! నా మొదటిరంగం,—సరళ దివ్యసౌధాన్ని పరివేష్టించివున్న పుష్పోద్యానవనం. దానిలో ఒక లతానికుంజం. చంద్రోదయమైంది. శీతల సుధాచంద్రికలు పర్యంకం మీద పడుతూ, దేవకన్యవలె చంద్రశిలాఫలకంపై ఆసీనయైన సరళకు వన్నెపెడుతున్నవి. ఆమె పాదపద్మయుగ్మం వద్ద శాస్త్రి కూర్చుని వుంటాడు. అతడు ఒక ప్రేమగీతాన్ని ఆలాపిస్తూ వుంటాడు. ఆ గీతం ఆమెలో అవ్యక్త మాధుర్యాన్ని ప్రభవింపజేయగా, మందానిలంలో మావిచిగురువలె ఆమె చలించిపోతుంది. చంద్ర శిలావేదిపైనుంచి అశాంతిగా లేచి, ఆమె లతానికుంజం వెలు పలికి వస్తుంది. మరింత తేనె లూరేటట్టు ప్రేమగీతాన్ని ఆలా పిస్తూ శాస్త్రి ఆమెను అనుసరిస్తాడు. అప్పుడు....

అనసూయ. ఆ అమ్మాయికి అమ్మా బాబూ లేరేమిటి?
మోహనరావు [పిడుగుపైబడ్డట్టు]. అదేమిటి?
అనసూయ. అమ్మా బాబూ వుంటే అదుపాజ్ఞల్లో పెట్టుకోరటండీ? పెళ్ళికాని పిల్లను పరాయిమగాడి వెంట తోటలట్టుకు తిరుగనిస్తారా?
మోహనరావు. నీ సామాన్యపు కొలతబద్దలతో నేను సృష్టిస్తున్న ఆదర్శజీవులను కొలవాలంటావ్! ఇది పొసగని విషయం.
అనసూయ. మీ కొలబద్దలకైతే గజానికి ఆరడుగు లుంటాయి కాబోలు!
మోహనరావు. నీ పరిహాసాలకేమి గాని, నేను చెప్పబోతున్న దాన్ని కాస్త చెప్పనీ! "శాస్త్రి కపటి. అతడు ప్రేమిస్తున్నది నిన్ను కాదు; నీ భాగ్యాన్ని" అని సరళను హెచ్చరించడం తన విధ్యుక్త ధర్మమని ఒక నిశ్చయానికి వచ్చి, సరిగా ఆ వేళకు చంద్ర వస్తాడు. రసకందాయం పట్టులో చంద్ర వచ్చాడని శాస్త్రి ఆగ్రహపరవశు డౌతాడు. అన్యాపదేశంగా చంద్రను నిందించాలని,....సరే, ఇక నేను రాసింది చదువుతా విను.

[తను వ్రాసిన కాగితాలు తీసుకుని, నాటకంలో వేషధారివలె పోజ్ పెట్టబోయి, అంతలోనే ఆగుతాడు.

మోహనరావు. ఆఁ! అన్నట్టు నీ కిక్కడ ఒకమాట చెప్పాలి. లేకపోతే, నా ఉపక్రమణలోని రసవద్విశేషం నీకు బోధపడదు. చంద్ర నల్లటివాడు. నల్లటివాడని అతణ్ణి శాస్త్రి వెక్కిరిస్తున్నాడన్నమాట.
అనసూయ. ఓహో!

మోహనరావు. ఇక, చదవనా ? [అనసూయ "సరే" అన్నట్టు తల ఊపగా, నాటకంలో వేషధారి పోజ్ పెట్టి] మంచిది, విను !

శాస్త్రి. సరళా ! నల్లని ఆమబ్బు చూడండి. క్రూరవన్యమృగం వలె అది పైకి దూకుతుంటే, భీతహరిణాలవలె చుక్క కన్నెలు ఎలా చలించిపోతున్నవో !

చంద్ర. నల్లనిమబ్బే నిండుమబ్బు. అదే ధారాపాతంగా అమృతోదకాలను కురియిస్తుంది; భూతలాన్ని నవనవోన్మేషం చేస్తుంది.

అనసూయ. వీళ్ళమాటలు మనమాటలుగా లేవే?

మోహనరావు. చంపేశావ్! ఎత్తుగడలోనే నేను కాళిదాసు పోకడ పోయాననుకుంటే, నువ్వు చేసే వ్యాఖ్యాన మిదేనా?

అనసూయ. ఆఁ! నా మొఖం, నా కేంతెలుసు లెండి! చదవండి.

మోహనరావు. మధ్యమధ్య నువ్వు వ్యాఖ్యానాలు చెయ్యనంటే గాని చదవను. [అలాగే నన్నట్టు అనసూయ తల ఊపుతుంది] ఈ మాటమీదే నిలబడాలి సుమా! [సరేనన్నట్టు అనసూయ శిరః కంపనం చేస్తుంది.] అయితే, విను!

సరళ. చంద్రా ! కవిచంద్రు లనిపించుచున్నారండీ !

శాస్త్రి [సంభాషణ ధోరణి మార్చివేయవలెనన్న ఆతురతతో ఒక పువ్వు తుంచి]. ఇంద్రధనస్సులోని రంగులన్నీ దీని రేకుల లోనే వున్నాయి. ప్రకృతిలోని అందమంతా ఇది పుణికి పుచ్చుకున్నది.

చంద్ర. కాని, సౌరభమే శూన్యం. నిర్జీవ ప్రతి మెంతో, సౌరభ శూన్య సుమ మంతే.

సరళ [కిలకిల నవ్వుతూ] . .

[ఇంతలో ఎవరో ఒక్కిరిబిక్కిరై దగ్గుతున్నట్టు విన బడుతుంది.

మోహనరావు. ఎవరది?

అనసూయ. సీతారామయ్యగారు కాబోలు!

మోహనరావు [చప్పున రెండుచేతులతో రెండుకళ్లు మూసివేసుకుంటూ]. ఖర్మం! సరాసరి ఇక్కడికే రాడుగదా! వెళ్ళి కాస్త ఆయన్ని పంపించెయ్యి!

అనసూయ. అంత భయం దేనికండీ! ఆయనేం దెయ్యమా? భూతమా?

మోహనరావు. ఆ శవాకారాన్ని నేను చూడలేను. ముందు వెళ్లు— పంపించి రా!

అనసూయ. అయ్యో రామ! వెడుతున్నాలెండి.

[అనసూయ వెడుతుంది. ఆమె వెళ్ళిన క్షణానికి మోహనరావు ముందు వేళ్ళసందుగుండా గుమ్మంవంక చూచి, భయంలేదని గుండె దిటవుచేసికుని, తర్వాత కళ్ళకు కప్పుకొన్న చేతుల్ని తీసివేసుకుంటాడు. సిగరెట్టు కేసు, అగ్గిపెట్టె అందుకోబోయేసరికి అనసూయ తిరిగివస్తుంది.

అనసూయ. సీతారామయ్యగారేనండీ! ఈ ఉత్తరమట కాస్త చదివి పెట్టండి.

మోహనరావు [ఉత్తరాన్ని అందుకుంటూ]. తెలుగు ఉత్తరమేగా? నువ్వే చదివి చెప్పకపోయావూ?

అనసూయ. ఆ గొలుసుకట్టు రాత నాకు తెలిస్తేనా?

మోహనరావు [ఉత్తరాన్ని చకచక లోపల చదువుకొని]. ఆఁ! ఏంలేదు. ఆడబిడ్డ లాంఛనాలకింద మూటపదహార్లివ్వకపోతే, వాళ్ళు పెళ్ళిసంబంధం వదులుకుంటారట.

అనసూయ. ఏమి అఘాయిత్య మిది?

[సీతారామయ్య తిరిగి ఉక్కిరి బిక్కిరిగా దగ్గుతాడు.

మోహనరావు. సరే! నువ్వెళ్ళి ఆయన్ని సాగనంపిరా!

అనసూయ. ఇలాంటి కష్టాలు మరి నాలుగు చుట్టుకుంటే ఆ పిచ్చి మారాజు తానే వెళ్ళిపోతాడు. ఎవ్వరూ సాగనంప నక్ఖరలేదు.

[అనసూయ వెడుతుంది. సీతారామయ్యగారికి తిరిగి దగ్గుతెర వస్తుంది.

మోహనరావు [ముఖం చిట్లిస్తూ]. అబ్బబ్బ!

[విసుగుదలతో గదిలో పచారు చేస్తుంటాడు. దగ్గు కుంటూ సీతారామయ్య వెళ్ళిపోతాడు.

అనసూయ [తిరిగివచ్చి]. పాపం! మాటవినగానే ఆయన నిలువునా నీరై పోయాడండి. చేతి కక్కరకొచ్చిన చెట్టంత కొడుకు నిరుడు పోయినప్పటినుంచీ ఆయన పడుతున్న కష్టాలు ఆ పగవాడికైనా వద్దు. "కట్నం వెయ్యిన్నూట పదహార్లకే గిజ గిజలాడుతుంటే మరొక నూటపదహార్లు నే నెక్కడ తెస్తానమ్మా?" అని ఆయన - పాపం!—కంట తడి పెట్టుకున్నాడు. కాని, ఏం చేస్తాడు? రక్తం పిండుకునైనా ఆ నూటపదహార్ల ముడుపుకూడా చెల్లించాల్సిందే. అందరి కాళ్లూ పట్టుకుని, అష్టకష్టాలు పడితేగాని, ఈ సంబంధం కుదిరింది కాదు. అయ్యో రామ! ఆడపిల్లల్ని కనడమే మహాపాతకమైపోతే! చేతనైతే లోకానికి సిగ్గొచ్చేలా దీన్నిగురించి ఒక నాటకం రాయరాద టండీ?

మోహనరావు. వెర్రిదానా! ఇలాంటి సామాన్య విషయాలు కావ్య వసువు లౌతాయా?

అనసూయ. లోకంలోలేని విషయాల్నిగురించి రాయడం ఎవర్ని ఉద్ధరించడాని కండీ ?

మోహనరావు. ఉద్ధరింపేమిటి ? ఆ ప్రశ్న లేనే లేదు. కళ కళకోసమే. కోకిల ఎందుకు పాడుతుంది ? పువ్వు ఎందుకు విచ్చుతుంది ? సెలయేరు ఎందుకు ప్రవహిస్తుంది ?

అనసూయ. ఇంకా నయం! "నువ్వెందుకు అన్నం తింటున్నావ్? గుడ్డ కడుతున్నావ్ ?" అన్నారు కాదు.

మోహనరావు. ఎంత గొప్ప సంగతినైనా ఇట్టే కూడుగుడ్డల లెవెల్‌కు దించేస్తావ్! ఇందుకు పూర్తిగా వ్యతిరిక్తమైనదే సాహిత్యం. జీవితాన్ని కవి యథామాత్రకంగా చిత్రించ గూడదు; ఆదర్శత్వ మివ్వాలి. లోకానికి కేవలం అతీతుడై అతిలోకాన్ని సృష్టించాలి.

అనసూయ. ఆఁ! ముందు ఈ లోకంలో కడతేరితే గదా, తర్వాత ఏ లోకమైనా.

మోహనరావు. దుఃఖం, దైన్యం, దారిద్ర్యం, కల్ల, కపటం, కాఠిన్యం - ఇదేగా లోకమంటే? ఈ పాడులోకంనుంచి ఎంత దూరానికి పారిపోగలిగితే, అంత గొప్ప కవి కావచ్చు. "దిగిరాను, దిగిరాను దివినుండి భువికి" అని నవకవి ఊరికే అన్నాడూ ? పక్షాలు విప్పుకుని అంబరపథంలోకి ఎగసిపోగల కవే రసాధిదేవతను ప్రసన్నం చేసుకోగలుగుతాడు! రసం లేనిదే....

అనసూయ. ఏం రసమో ? నీరసం!

మోహనరావు. ప్చ్! నిన్ననే పనిలేదులే. ఇంతకూ తప్పు నాది! నేను నీతోనా సాహిత్యమీమాంస చెయ్యవలసింది ?

అనసూయ. పోనీ, ఇప్పటికైనా మీ తప్పు తెలుసుకున్నారు. నేను పోతున్నాలెండి. నాకు పొయ్యి ఊలికేనే పోతున్నది.

[నాలుగడుగులు వేస్తుంది.

మోహనరావు. అనూ! అనూ! పోదువుగానిలే! ఒక్కమాట చెప్పిపో!

అనసూయ. నేను మాటలు నేర్చినదాన్ని కానే! ఏమిటది?

మోహనరావు. నా నాటకంలోని ఒక ఘట్టంలో....[తాను వ్రాసిన కాగితాలు తిప్పివేస్తూ] ఈ మధ్య భాగాలు వదిలేస్తున్నాలే! సహృదయంతో వాటిలోని రసాన్ని నువ్వు ఆస్వాదింప నిరాకరిస్తున్నపుడు చదివిమాత్రం ప్రయోజన మేమిటి? చివరి భాగం మాత్రం చదువుతా. చంద్ర సరళతో ...ఏం! చదవ మంటావా? ...చంద్ర సరళతో [నాటకంలోని వేషధారివలె పోజ్ పెట్టి] "సరళా! ఇక ఓపలేను; సైపలేను. నేను మిమ్ము ప్రేమిస్తున్నాను; పూజిస్తున్నాను. నాది కాముకుని తుచ్ఛ ప్రేమకాదు; కళాజీవి పవిత్ర ప్రేమ. కళాకన్య కోసం యుగ యుగాలనుంచి, జన్మజన్మాంతరాలనుంచి అన్వేషిస్తున్నాను. కోకిల పాటలో, కేకిని ఆటలో, వెన్నెల తేటలో ఆమెను కానలేక వేగిపోయాను. తెలిమబ్బు అంచులో, ఇంద్రచాపం వంపులో ఆమెను కానలేక వేసారిపోయాను. పూల బాసలలో, తేటి గీతాలలో ఆమెను కానలేక నిట్టూర్చాను. మల్లియ నవ్వులో, పున్నమి పులకరింతలో ఆమెను కానలేక నిస్పృహ చెందాను. ఎన్నో వింతకలలు కన్నాను; వంతకథే మిగిలింది. కాని, మీ వదనశ్రీని చూచి నంతనే, నా తపస్సు ఫలించింది. తుది మొదలులేని అగాధ తమస్సులను చీల్చుకుంటూ మీ తరళ లోచనాలు మెరుపులై

మెరసినవి; పలుకులై పిలిచినవి. మీరు నన్ను స్వీకరించవచ్చు: లేదా నిరాకరించవచ్చు. కాని, నా ప్రేమ మేరువుకంటె విశ్చలమైనది; నైగరాకంటె మహోద్వేగ మైనది: సాగరం కంటె అగాధమైనది. మీరు ఆనతిస్తే, ప్రళయాగ్ని గుండంలో నైనా దూకగలను; కాలకూట విషమునైనా గ్రోలగలను. కాని, మీ సిగపువ్వు వాడినా నేను సహించలేను. శాస్త్రి మీ పాదరజాన్ని ఔదలదాల్చడానికైనా తగడు. అతడు ధనలోభి, కామాంధుడు, సంస్కారశూన్యుడు, రసజ్ఞతావిహీనుడు. అతడి కపటానికి మీరు బలి కావలదని నా ప్రార్థన", అని అంటాడు. అప్పుడు సరళ....

అనసూయ. అప్పుడు సరళ "అమ్మయ్యా !" అంటుంది.

మోహనరావు [ఆశ్చర్యంగా]. అదేమిటి ? ఆ పిచ్చిమాట ఎందుకంటుంది ?

అనసూయ. జడివాన కురిసి కురిసి వెలిసిందిగదా అని ?

మోహనరావు. సరసాలకు సీకు సమయాసమయాలు లేవు గాని, చంద్ర తనను ప్రేమిస్తున్నట్టు సరళ ఎన్నడు శంకించనైనా లేదు. అట్టిది మహాగ్నిపర్వతమే బ్రద్దలైనట్టుగా అతడు తన ప్రేమను ప్రకటించాడు. కవి అనీ, రసజ్ఞుడనీ అతడంటే ఆమెకు భక్తిగౌరవాలు లేకపోలేదు గాని, అతని సౌందర్య విహీనత్వ కారణంగా అతనిని వరునిగా ఆమె ఎన్నడు భావించలేదు. ఈ పరిస్థితిలో ఆమె మనస్సులో ఎట్టి తుపాను చెలరేగుతుంది ?

అనసూయ. ఏమో నాకేం తెలుసు ? ఆ వైనం ఆ సరళమ్మగారినే అడిగి చూడండి.

మోహనరావు. ఆ పరిస్థితిలో నీవే కాసేపు వున్నావనుకో.

అనసూయ. అంత దౌర్భాగ్యం నాకెందుకు పడుతుందండీ ?

మోహనరావు. నీవు చెప్పకపోతే పోయావుగాని, నేనేమని ఊహిస్తున్నానంటే. . .

అనసూయ. మీకు తెలియని సంగతులు, మీకు అనుభవంలో లేని విషయాలు మీ రెందుకు రాయాలండీ ?

మోహనరావు. అదే కవి ప్రత్యేకత! సమస్త విషయాలను అతడు ఊహిస్తాడు. అతడి ఊహకు అందంది ముల్లోకాలలో లేదు. అతడి మనోనేత్రం మహాశక్తివంతమైనది : అతడి అంతర్భావు మహామహితాత్మ మైనది !

అనసూయ. అందువల్లే కావోలు మామూలు కళ్ళతో చూడరు. మామూలు చెవులతో వినరు !!

మోహనరావు. ఇలాంటి మాటలంటే నా కిక కోపమొస్తుంది సుమీ!

అనసూయ [భయం నటించి, లెంపలు వాయించుకుంటూ] ! అపరాధం ! మహాపరాధం !!

మోహనరావు. శాస్త్రిపట్ల అసూయతోనే అతడిని అంత నికృష్ట మైనవాడినిగా చంద్ర చిత్రించినట్టుగా సరళ శంకిస్తుందని నేను ఊహిస్తున్నాను. నా ఊహ సరైనదే అంటావా ?

అనసూయ. మీరు ఏమైనా అనుకోవాలేగాని, మరి దానికి తిరుగేమి ఉండీ ?

మోహనరావు. అనుకోవటాలు, గినుకోవటాలు కాదు. ఇక్కడే నన్ను కొంత సంశయం పీడిస్తున్నది. అందువల్లే నా నాటకం నడవడంలేదు. నీవే సరళ స్థితిలో....

అనసూయ. అయ్యో రామ! వద్దన్న కొద్దీ దానికీ, నాకూ సాపత్యం పెడతా రెందుకండీ?

మోహనరావు. నాకోసమని మాట వరసకు నీవే.. [బయటనుంచి ఎవరో "అనసూయమ్మా!" అని పిలవగా] వీ రెవరు? అబ్బబ్బ! అంతా రసాభాస!

అనసూయ. ఏమండీ తులసమ్మగారూ! మీరా?

[అనసూయ వెడుతుంది. ముఖంలో విసుగుదల కన బడుతూ మోహనరావు తను వ్రాసిన కాగితాలు తిరగవేస్తూ వుంటాడు. కొన్ని క్షణాల తర్వాత సిగరెట్టు ముట్టిస్తాడుకూడా.

అనసూయ [తిరిగివస్తూ]. పాపం! ఆమె వలవల యేడుస్తున్న దండీ! "మాది అవిభక్తకుటుంబం. ఇక్కడ నీ దేముంది?" అని ఆవిడను... వాడు లేడూ?.. ఆవిడ మరిది....వార్డి కర్కో టకుడు... ఈపూట ఇంట్లోనుంచి గెంటివేశాడట. భర్తపోయిన ఈ ఆరేడు నెలలనుంచీ ఆవిడను ఆ మరిది....వాడి దెంత కటికిగుండో గాని....నానాహింసలు పెడుతున్నాడు. మీ నాన్న గారేనట వాళ్ళకి నాలుగైదేళ్ళనాడు అన్నాదమ్ముల భాగాలు పంచిపెట్టి, పారీకత్తులు రాపిచ్చింది. ఆ కాస్త కొంపకూడా కలుపుకుపోతే, ఆమె తను వెలా గడుస్తుంది? నాఅనేవారైనా లేకపోబట్టే గదా, వాడు ఆమె నన్ని అవస్థల పాల్జేయడం! మీరు కాస్త జోక్యం కలిగించుకుని ఆమెకు కోర్టువ్యవహారం....

మోహనరావు [నోరు మూసుకుంటూ]. ఔరా! కవిత్వం చెప్పే నోటితో కూటసాక్ష్యాలు పలకమంటావా?

అనసూయ. ఇందులో అబద్ధ మేముందండీ? వాళ్ళు ఏనాడో వేరుపడ్డ సంగతి ...

మోహనరావు [చేతిలోని కాగితాలను నేలకు విసిరికొడుతూ]. చాల్ చాల్లే! పాపం వాళ్లు, పాపం వీళ్లు అంటూ అందర్నీ తెచ్చి నా నెత్తి నెక్కించు. ఈ వాతావరణంలో కళాసృష్టి ఏం జరుగుతుంది? రసాధిదేవతను ఏమి ప్రసన్నం చేసుకోగలం? రసవాహినులను ఎలా ప్రవహింప జేస్తాం? అందుకే కవి నిర్జనప్రదేశానికి పోవాలి; ఏకాంతవాసం చెయ్యాలి. నేనూ పోతాలే ఏ నదీతీరానికో, ఏ పర్వతప్రాంతానికో, ఏ అరణ్యగర్భానికో!

అనసూయ [తెల్లబోయి]. అయ్యో రామ!!

తెర]



## పాత్రలు

ప్రొఫెసర్ రాధాకృష్ణ
మిసెస్ శ్యామలా రాధాకృష్ణ

## స్థలం

మద్రాస్‌లో
ప్రొఫెసర్ రాధాకృష్ణ
డ్రాయింగ్‌రూం

## కాలం

వర్తమానం



# అర్ధాంగి

అది ప్రొఫెసర్ రాధాకృష్ణ డ్రాయింగ్ రూమ్. కుడివైపున బయటి, వరండాలో నుంచి ద్వారం; ఎడమవైపున డైనింగ్ రూమ్, కిచెన్ మొదలైన వాటిలోకి ద్వారం. ఎడమవైపునే ఒక మూలగా మేడపైకి మెట్లు. ఒక సెటీ, రెండు చెయిర్స్, ఒక సెంట్రల్ టేబుల్, రెండు పెగ్ టేబుల్స్, ఒక స్టాండర్డ్ ల్యాంప్, ఒక బుక్ షెల్ఫ్, రెండు పామ్ స్టాండ్స్, ఒక పెద్ద తివాచీ, ఒక సైడ్ టేబుల్ మొదలైన ఫర్నిచర్‌తో, చక్కని చిత్రాలు, విగ్రహాలు మొదలైన వాటితో అది అధునాతన సంస్కృతి తొలుకాడుతున్న డ్రాయింగ్ రూమ్.

తెరలేచిన ఒక క్షణానికి మోటార్ కారు వచ్చి వాకిట్లో ఆగిన శబ్దమౌతుంది. ఆ వెంటనే బయటి వరండాలోనుంచి ఈ కింది మాటలు వినబడతాయి.

ఆడగొంతు. థాంక్స్ మచ్.

మగగొంతు. ఓ, ఇట్స్ ఎ ప్లెజర్.

ఆడగొంతు. మరి సెలవు.

మగగొంతు. నమస్కారం.

ఆడగొంతు. నమస్కారం.

ఆ పిమ్మట మోటారుకారు బయల్దేరి వెళ్ళిన శబ్దం. ఈ శబ్దం అణిగిపోకముందే శ్యామల ప్రవేశిస్తుంది. ఆమెదే వరండాలో నుంచి వినవచ్చిన ఆడగొంతు.

శ్యామలకు ఇరవైమూడవ సంవత్సరం నడుస్తున్నా, ఇరవై దాటనట్టు కనబడుతుంది. ఆమెలోని ఆకర్షణకు ఆమె సౌందర్యం కంటె, ఆమె సంస్కృతి అధిక కారణం.

హేండ్ బ్యాగ్ తోనూ, ఏదో ఒక పార్సెల్ తోనూ ప్రవేశించిన శ్యామల వాటిని సెంట్రల్ టేబుల్ పై పెట్టి, సోఫాలో కూర్చోబడుతుంది.

శ్యామల. బోయ్! బోయ్!

బోయ్ [లోపలినుంచి]. ఆఁ! ఇదుగో వచ్చే, అమ్మా! వచ్చే!!

శ్యామల. ఏం చేస్తున్నావ్?

బోయ్ [ప్రవేశించబోతూ]. వస్తున్నానమ్మా! వస్తున్నా!

శ్యామల. వీధితలుపు వేసుకోమంటే, తెరిచి పుంచావే? దొంగలెవరైనా దూరితేనో!

బోయ్. అయ్యగారొచ్చారమ్మా!

శ్యామల [ఆశ్చర్యంగా]. ఆఁ! ఎంతసేపైంది?

బోయ్. అప్పుడే అరగంట కావొచ్చిందమ్మా!

శ్యామల. ఆయ నేరీ?

బోయ్. మేడమీదున్నా రమ్మా!

[ఇంతలో రాధాకృష్ణ ప్రవేశిస్తాడు. వయస్సు ముప్పై ప్రాంతాల అందగాడవలేముగాని, చాల నాజూకైనవాడు. మనస్సులో రేగుతున్న తుఫాను దాచి పెట్టుకోడానికి ప్రయత్నిస్తున్నవాని ముఖ కవళికతో ప్రవేశిస్తాడు. కాలేజీకి వెడుతూ వేసుకున్న కోటును అత డింకా విప్పనైనా లేదు.

శ్యామల. ఏమండీ! మీటింగ్ అప్పుడే అయిపోయిందా?

రాధాకృష్ణ. ఏం! అన్ ఎక్స్‌పెక్టెడ్‌గా వచ్చా నేమిటి ?
శ్యామల. అదికాదండీ! ఇవ్వాళ సాయంత్రం మీ కాలేజీ ఎకనామిక్స్ అసోసియేషన్ మీటింగు వుందన్నారుగా !
రాధాకృష్ణ. ఆఁ! అది కాన్సెల్ అయిపోయిందిలే.
శ్యామల. ఏం ?
రాధాకృష్ణ. ఆ స్పీకర్ వెధవ రానేలేదు.
శ్యామల. అయ్యో! రామారావుగారు వాకిట్లోనుంచే వెళ్ళిపోయారే! మీ రింట్లోనే వున్నట్టు తెలిస్తే, మాట్లాడిపోదురు.
రాధాకృష్ణ. అతనికి నాతో ఏం మాట లున్నాయ్ ?
శ్యామల. ఏమో, నాకేం తెలుసు ? మీరు సాయంత్రం అయిదు గంటలకు ఆయనతో ఎంగేజ్‌మెంటు పెట్టుకున్నారటగా !
రాధాకృష్ణ. ఆఁ! ఔను. కాలేజీలో మీటింగ్‌మాట గుర్తులేక....
శ్యామల [చిరునవ్వుతూ]. మీ ప్రొఫెసర్ల జాతికి మతిమరుపు మామూలే లెండి !
రాధాకృష్ణ. ఎంత మతిమరుపైనా బుద్ధిమాంద్యం ఇంకా రాలేదు.
శ్యామల. యం. ఎ. లో ఫస్ట్‌క్లాస్, ప్రెసిడెన్సీ ఫస్ట్, గోల్డ్ మెడలిస్ట్! మీకా బుద్ధిమాంద్యం !

[బాధతో వున్నట్టు రాధాకృష్ణ ఒక కుర్చీలో చతికిలబడి, దాని చేతిపై మోచేతిని ఆన్చి, అరచేతిలో తల వాల్చుకుంటాడు.

శ్యామల. ఏం! అలా వున్నారే ?
రాధాకృష్ణ. ఎలా వున్నాను ? బాగానే వున్నానే !
శ్యామల. తల నొప్పిగా వుందా ?
రాధాకృష్ణ. ఉహుం !

శ్యామల. మరి, అలా వున్నారేమండీ ? ఇందాక ఎప్పుడో కాలేజీ నుంచి వచ్చినవారు ఇంకా సూటైనా విప్పలేదు.

రాధాకృష్ణ. ఆఁ ! ఏంలేదు. కాస్త బడలికగా వుంది.

శ్యామల. ఒక కప్పు కాఫీ పెట్టుకురానా ?

రాధాకృష్ణ. బోయ్ పెడుతున్నాడులే.

శ్యామల. బోయ్! [ఒకక్షణం ఆగి మరికొంచెం బిగ్గరిగా] బోయ్!!

బోయ్ [లోపలినుంచి]. ఆఁ అమ్మా !

శ్యామల. కాఫీ కాలేదూ ?

బోయ్ [లోపలినుంచే]. అయిపోవచ్చిందమ్మా! తెస్తున్నా !

శ్యామల [సెంట్రల్ టేబుల్‌పై తానుంచిన పార్శెల్ అందుకుని, దాన్ని విప్పుతూ]. ఈ సిల్కు చీర చూడండి. చెల్లారామ్స్‌లో కొన్నా. రెండువందల నలభై రూపాయలు పుచ్చుకున్నారు. [మడతవిప్పి చీర చూపిస్తూ] ఏఁ! బాగుందంటారా ?

రాధాకృష్ణ [చీరవంక చూడక శ్యామలను చూస్తూ]. నాలుగైదు రోజులనాడుకూడా ఒక చీర తెచ్చావ్ కాదూ ?

శ్యామల. అది ఈ కట్టుకున్నదే నండీ ! మిసెస్ రాజారాం ఇది ఎంతో మంచి సెలెక్షన్ అని మెచ్చుకుంది.

రాధాకృష్ణ [వ్యంగ్యంగా]. ఒక్క నా విషయంలో తప్ప నీవన్నీ మంచి సెలెక్షన్లే !

శ్యామల [నవ్వుతూ]. ఏఁ! మీమీద మీకే నమ్మకం తగ్గిపోతున్న దేమిటి ?

రాధాకృష్ణ. అబ్బే! లేదు. కాని, నీకుమాత్రం....

బోయ్ కాఫీ ట్రేతో వచ్చి, దాన్ని ఒక పెగ్ టేబుల్‌పై పెట్టి వెళ్ళిపోతాడు.

శ్యామల [కెటిల్‌లోనుంచి, ఒక కప్పులోకి కాఫీ పోస్తూ]. ఆఁ! ఏమిటది ? నాకుమాత్రం ?

రాధాకృష్ణ. ఊఁ! ఏంలేదులే.

శ్యామల [కాఫీకప్పు అందిస్తూ]. ఈపూట యింత అలసటగా కనిపిస్తున్నారే ? వేడి వేడిగా కాస్త కాఫీ పుచ్చుకోండి.

రాధాకృష్ణ [కప్పు అందుకుంటూ]. నీకొద్దూ ?

శ్యామల. నే నింతకుముందే పుచ్చుకున్నా. వద్దన్నకొద్దీ రామారావుగారు కన్నిమరాకు కారు పట్టించారు. తాగింది రెండు కప్పుల కాఫీయే అయినా, రూపాయి బిల్లుచేశారు !

రాధాకృష్ణ. లేడీ ఫ్రెండ్స్ విషయంలో అతడు ఖర్చుకు వెనకాముందు ఆడడులే !

[ఈమాట అంటూనే సగంమాత్రమే తాగిన కాఫీకప్పు ట్రేలో పెట్టివేస్తాడు.

శ్యామల. ఏఁ! మళ్ళీ షుగర్ ఎక్కువవేశాడా? ఎన్నిసార్లుచెప్పినా- ఈ ఫూల్ !-కాఫీని పానకంలా చేసుకొస్తాడు. బోయ్ ! బోయ్ !!

రాధాకృష్ణ. ఆఁ! షుగర్ సరిపడే వేశాడు.

శ్యామల. అయితే కాస్సేనా పుచ్చుకోలేదే !

[బోయ్ ప్రవేశిస్తాడు.

రాధాకృష్ణ. ఈ ట్రే పట్టుకుపోరా !

శ్యామల [బోయ్ ట్రే అందుకోబోతూ వుండగా]. నోటిదగ్గిర పెట్టి తీసేశారు. మరి కాస్త పుచ్చుకోండి - అలసట తగ్గుతుంది.

[కప్పు తిరిగి అందించబోతుంది.

రాధాకృష్ణ. అహఁ! మరొద్దు. [బోయ్‌తో చికాకుగా] పోరా ! తీసుకుపో !

[ట్రేతో బోయ్ వెళ్ళిపోతాడు.

శ్యామల. కాఫీ బాగుంటే దాన్ని మీరు వదిలిపెట్టరే! ఆ వెధవ మళ్ళీ పానకం చేసుకొచ్చినట్టున్నాడు. నేను పెట్టుకురానా ?

రాధాకృష్ణ. నీకంత శ్రమ దేనికిలే!

శ్యామల. శ్రమేమిటండీ ? చిత్రంగా మాట్లాడుతున్నారు! మీతో చెప్పకుండా షాపింగ్‌కు వెళ్ళానని కోపమే, ఇదంతా ?

రాధాకృష్ణ. కోపానికైనా, తాపానికైనా నాకు హక్కేముంది ? నువ్వు స్వతంత్రురాలివి.

శ్యామల. [నవ్వుతో] ఏం! మీరు స్త్రీ స్వాతంత్ర్యానికి హఠాత్తుగా విరోధులైపోయారేమిటి ? మీకోసమని రామారావుగారొస్తే....

రాధాకృష్ణ. ఔను! ఈమధ్య అతనికి నాతో తరుచు పనిపడుతున్నది.

శ్యామల. మరి, ఆయన పెడుతున్న కొత్త లిమిటెడ్ కంపెనీ ప్రాస్పెక్టస్ మీ రింకా పూర్తిచేసి పెట్టనేలేదట!

రాధాకృష్ణ. వాడి ఆడిటర్సు ఫరమ్ లేమా ?—వాడికి కావలసింది ప్రాస్పెక్టస్సే అయితే!

శ్యామల. ఎక్‌నామిక్స్‌లో మీకు చాలినవారు లేరని మీరంటే ఆయన కెంతో గురి! మొన్న మీరు స్టెర్లింగ్ బ్యాలెన్సులమీద వ్రాసిన వ్యాసాన్ని కాస్మాపాలిటన్ క్లబ్‌లో మెచ్చుకోనివారు లేరని ఆయన చెప్పాడండీ!

రాధాకృష్ణ. ఏమైనా, నేను బడిపంతుల్నేగా! నేను కాస్మాపాలిటన్ క్లబ్ మెంబర్నా ? కన్నిమరాలో కాఫీలు తాగుతానా ? నాకు హిల్మన్ కారుందా ?

శ్యామల. ఏం! ఈ పూట చాలా చిత్రమైన మూడ్‌లో పడ్డారు! మీ రింటికొచ్చేవరికి నేను బయటికి పోయావనే ? మీ మీటింగ్

కౌన్సిల్ అవుతుందని నాకేం తెలుసు ? మీరు ఎంగేజ్‌మెంట్ కీప్ చెయ్యలేదు గనక, క్లబ్బుకైనా పోతానని రామారావుగా రంటే, నన్ను చెల్లారామ్సవద్ద డ్రాప్ చెయ్యమన్నాను. వద్దన్న కొద్దీ ఆయన కన్నిమరాకు తీసుకువెడితే కాస్త ఆలస్యమైంది.

రాధాకృష్ణ. ఔను. అతను చాలా సరసుడు! [సెంట్రల్ టేబుల్‌పై నున్న సిల్కు చీరపైకి కన్ను పోనిస్తూ] తన లేడీ ఫ్రెండ్స్‌కు కాస్ట్లీ ప్రజంట్సుకూడా యిస్తాడు!

శ్యామల. అయితే, మీరు ఏం సజెస్ట్ చేస్తున్నారు ?

రాధాకృష్ణ. అబ్బే! ఏమీలేదు.

శ్యామల. అయితే మీ మాటల కర్థం ?

రాధాకృష్ణ. అతని స్వభావాన్ని గురించే నేను ప్రస్తావిస్తున్నాను.

శ్యామల. ఆయన స్వభావమేమిటో మీకే తెలవాలి. చిరకాలంగా అతను మీకు సుపరిచితుడు. మీరు ఇంటర్‌డ్యూస్ చేసేవరకూ అతని ముక్కూ మొఖమైనా నే నెరగను.

రాధాకృష్ణ. సుపరిచితుడు గనకనే చెబుతున్నాను. ఎంతటి సరసుడు కాకపోతే, ఒక్కవారంలో శ్రమ అనుకోకుండా రెండుసార్లు నిన్ను షాపింగ్‌కు తీసుకు......

శ్యామల ["షాపింగ్" వద్ద మాటను తెంచివేస్తూ]. మీరు ధ్వనిస్తున్న దేమిటి ?

రాధాకృష్ణ. అబ్బే! ఏం లేదు.

శ్యామల. నిజంగానా ?

రాధాకృష్ణ. ఆఁ!

శ్యామల. ముమ్మాటికీనా ?

రాధాకృష్ణ. ఊఁ!

**శ్యామల.** సర్లెండి!

[ఈమాట అంటూనే సెంట్రల్ టేబుల్ పైనుంచి సిల్కు చీర తీసుకుని శ్యామల వెళ్ళిపోతుంది. ఆమె తన హాండ్ బ్యాగ్ అక్కడే విడిచిపెట్టి వెడుతుంది. ఆమె వెళ్ళినతర్వాత మానసిక వేదనతో సోఫాలో జేరగిలబడి, రాధాకృష్ణ కళ్ళు మూసుకుంటాడు. కొన్ని క్షణాల తర్వాత గట్టిగా నిట్టూర్చి, కళ్లు తెరిచేసరికి శ్యామల హాండ్ బ్యాగ్ పై అతని కన్ను పడుతుంది. దాన్ని తెరిచిచూడాలనే గుఱ్ఱప్ఘ్ని అతనికి వెంటనే పుడుతుంది. చరాలున ముందుకు వంగి, దాన్ని అందుకోబోయి, తన సంస్కారం అడ్డురాగా అంతలోనే ఆగిపోతాడు. కాని, అనుమానపిశాచం సంస్కారంకుత్తుకను నులిమివేయగా, హాండ్ బ్యాగ్ అందుకుని, తప్పుచేస్తున్న వాడివలె మేడ మెట్లపైకి ఒకసారి చూస్తాడు. పిమ్మట హ్యాండ్ బ్యాగ్ తెరిచి దాన్ని గాలిస్తాడు. ఏవో రెండు, మూడు ఉత్తరాలు అతనికి కనపడతాయి. వాటిని చదివి మళ్ళీ లోపల పెట్టివేస్తాడు. ఇంకా గాలించి, ఒక మని ఆర్డర్ కూపన్ పైకితీస్తాడు. దాన్ని చదువుకునేసరికి అతని ముఖం విప్ఫారు తుంది. ఇంతలో మేడమెట్లపై కాలి అలికిడౌతుంది. చప్పున మని ఆర్డర్ కూపన్ అతడు తన కోటు జేబులో పెట్టివేసుకుంటాడు. జేబులోని చెయ్యి పైకి తీయకముందే శ్యామల ప్రవేశిస్తుంది. భర్త చేసిన పనిని చూచినందున ఆమె ముఖంలో ఆశ్చర్యం, ఆగ్రహం, ఆవేదన ఒకదానితో ఒకటి పెనవేసుకుంటూ ఒక్కసారిగా కనపడతాయి.

రాధాకృష్ణ [శ్యామలను కన్నెత్తిచూడ్డానికి సిగ్గుపడి, పెదముఖం పెట్టి, టై విప్పుకుంటూ]. ఆ వెధవ పెట్టిన కాఫీ నిజంగానే బాగాలేదు. మరికొంచెం కాఫీ పెడతావా, శ్యామలా ?

[శ్యామల జవాబు చెప్పదు.

రాధాకృష్ణ [ఏదో ఒకటి మాట్లాడాలనే ఆతురతకొద్దీ] ఇంకా వస్తాడేమో, ఇంకా వస్తాడేమో నంటూ అరగంటసేపు వెయిట్ చేసినా, ఆ స్పీకర్ — డామ్ స్కౌండ్రల్ - రానే లేదు. మీటింగ్ కాన్సెల్ చేశాక, కారు బ్రేక్‌డౌన్ వల్ల రాలేకపోతున్నానని టెలిఫోన్ చేశాడు. తన కారు లేకపోతే, ఏ టాక్సీలోనో రాగూడదూ? మన ఇండియన్సుతో యిదే పెద్ద చికాకు. ఎంగేజ్‌మెంట్స్ కీప్ చెయ్యరు. ఆయిడియెట్ కోసం ఎదురుచూస్తూకూచో బట్టి పెద్ద తలనొప్పి వచ్చింది. నిన్ను వెంటబెట్టుకుని కాసేపు అలా బీచ్‌వైపుకైనా పోదామని యింటికొస్తే ఇక్కడా డిజ్‌ఎప్పాయింట్‌మెంట్ అయింది. [కణతలు నొక్కుకుంటూ] అబ్బ! ఇంకా తలనొప్పి తగ్గనే లేదు. [మెడపై చెయ్యివేసుకుని] మెడలుకూడా పీక్కుపోతున్నాయి. [సానుభూతికోసం ఒక క్షణం ఎదురుచూచి, నిరాశచెంది] నేనుపోయి బట్టలు మార్చుకొస్తాగాని, కాస్త కాఫీ పెట్టు. డబుల్ డోస్ కావాలి.

[కోటు విప్పి భుజంపైన వేసుకుంటూ రాధాకృష్ణ మేడపైకి పోతాడు. అతను వెళ్లిపోయిన తర్వాత పెదవి కొరుక్కుంటూ, తల పంకిస్తూ కొన్ని క్షణాలపాటు నిలబడి, తుదకు ఒక నిర్ణయానికి వచ్చినట్టు శ్యామల కనబడుతుంది.

శ్యామల. బోయ్!

బోయ్ [ప్రవేశిస్తూ]. ఎందుకమ్మా ?

శ్యామల. పొద్దుటి "హిందూ" ఏదిరా ?

బోయ్. అదుగో నమ్మా! ఆ పుస్తకాల బీరువామీద.

[పత్రిక చేతికిచ్చి బోయ్ వెళ్ళిపోతాడు. శ్యామల నిలబడివుండే పత్రిక మొదటిపేజీ తిప్పి, రెండవ పేజీ వెదికి, దానిలో తనకు కావలసింది కనబడిన వెంటనే సైడ్‌టేబుల్ వద్దకు వెడుతుంది. ఆ టేబుల్ డ్రాయర్‌లోనుంచి లెటర్‌హెడ్స్ ప్యాడ్ తీసి, ప్రొఫెసర్ రాధాకృష్ణ పేరు అచ్చొత్తివున్న పైభాగాన్ని చించివేస్తుంది. తర్వాత ఆ డ్రాయర్‌లో నుంచి ఒక కవరుకూడా తీసుకుని సోఫాలో కూర్చుంటుంది. తన హాండ్ బ్యాగ్‌లోనుంచి ఫౌంటెన్ పెన్ తీసుకుని, ఏమో వ్రాస్తూ వుంటుంది. ఇంతలో రాధాకృష్ణ పైజమాతో, లాల్చీతో మేడమెట్లు దిగి వస్తాడు. బట్టలు మార్చుకున్న తర్వాత చక్కగా టాయిలెట్ చేసుకుని మరీ అతడు ప్రవేశిస్తాడు.

రాధాకృష్ణ [శ్యామల ముఖాన్ని చూడ్డానికి ఇంకా సిగ్గుపడుతూ, వీధిలోకి చూస్తున్నట్టు గుమ్మంవైపుకు తిరిగి విలబడి]. కాఫీ పెట్టావా ?

[శ్యామల జవాబు చెప్పదు.

రాధాకృష్ణ. ఆఁ! అన్నట్టు, నీతో చెప్పానా ? ఇవ్వాళ ఉదయం మిస్టర్ చెట్టియార్ పిలుపడితే రేపొకసారి తన ఆఫీసులో

తప్పకుండా కలుసుకోమని ఫోన్‌చేశాడు. వాళ్ళ ఇన్‌స్యూరెన్స్ కంపెనీకి కొత్త జనరల్ మేనేజర్ కావాలట. దాన్ని నాకు ఆఫర్ చెయ్యడానికే కాబోలు! అది సౌండ్ కంపెనీయే. ఆపని పుచ్చుకోమంటావా? కమిటీ కాలేజీలలో ఉద్యోగాల కంటె, నిజానికి ఏ పనైనా మెరుగే! ప్రతి కమిటీ మెంబరూ పెత్తనం చెలాయించేవాడే! - ఇచ్చే అకొద్ది జీతాలైనా నెల నెలకు సరిగా ముట్టజెప్పకపోయినా! "వీడు నాతమ్ముడి భావ మరిది తోడల్లుడు కొడుకు. వీడికి సీటివ్వాలి; వాడు నా అన్నయ్య పినమామ మరద లల్లుడు. వాడిని ప్రమోట్ చెయ్యాలి," అంటూ సిఫార్సులు చేసి ప్రాణాలు తీస్తారు. ఏఁ! శ్యామలా! మిస్టర్ చెట్టియార్ రేపు జనరల్ మేనేజర్‌పదవి ఆఫర్‌చేస్తే పుచ్చుకోమంటావా?

[శ్యామల అప్పటికీ జవాబుచెప్పదు.

రాధాకృష్ణ [శ్యామలవైపుకు వస్తూ]. ఏమిటది, శ్యామలా?— అంత దీక్షగా వ్రాస్తున్నావ్!

శ్యామల [తాను వ్రాస్తున్నది కనబడకుండా కాగితం పైఅంచును మడిచిపట్టుకుంటూ]. అఁ! ఏమీ లేదు. ప్రజంట్స్ యివ్వగల ఫ్రెండ్స్‌కు ఉత్తరాలు రాస్తున్నా.

రాధాకృష్ణ [లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటూ]. వాట్ నాన్‌సెన్స్!

శ్యామల. ఇంతకు ముందు మీరే అన్నారుగా, వారంరోజులలోపల రామారావుగారి దగ్గిర రెండుసార్లు ప్రజంట్స్ పుచ్చుకున్నానని!

రాధాకృష్ణ. అబ్బే! ఆమాట నే నన్నానా?

శ్యామల. ఆమాట అనకపోతే నే? ఆ అర్థం వచ్చేటట్టు మాట్లాడారుగా!

రాధాకృష్ణ. అః! చెడ్డ తలనొప్పికొద్దీ నే నేదో అంటే, నువ్వేవో లేనిపోని అర్థాలు తీస్తున్నావ్. నాకు తెలియదూ? - మీనాన్న పంపించిన డబ్బుతో నువ్వు షాపింగ్ చేస్తున్నావని.

శ్యామల [సోఫాలోనుంచి చరాలున లేచి, ముఖాముఖిగా నిలబడి]. మా నాన్న నాకు డబ్బుపంపించిన సంగతి మీ కెలా తెలిసింది?

[తెల్లబోయి రాధాకృష్ణ జవాబుచెప్పడు.

శ్యామల [తీవ్రంగా]. నన్ను శంకించి, చాటుమాటుగా నా హ్యాండ్ బ్యాగ్ విప్పిచూస్తే తెలిసింది - అంతేనా?

రాధాకృష్ణ. అబ్బే! లేదు.

శ్యామల. అయ్యో! అబద్ధంకూడానా? [సెంట్రల్ టేబుల్‌ను వేలితో చూపిస్తూ] అడుగో! నా హ్యాండ్‌బ్యాగ్ విప్పిలేదూ? దానిలోని నా మనియార్డర్ కూపన్ [పైకిచూపిస్తూ] మేడమీది మీ కోటుజేబులోకి ఎలా నడిచివెళ్ళింది?

రాధాకృష్ణ [చిన్నమొఖం చేసుకుని, శ్యామల చేతుల్ని పట్టుకుని]. తప్పే! క్షమించు.

శ్యామల [చేతుల్ని విడిపించుకుంటూ]. తప్పు మీది కాదు; నాదే! చేసుకుంటున్న ఉద్యోగం చేతులారా విడిచిపెట్టుకోవడం తప్పు. నాదే కాదూ? నాకే సంపాదనుంటే మీరివ్వాళ నన్నెందుకు శంకించేవారు?

రాధాకృష్ణ [దీనంగా]. శ్యామలా! నన్ను మన్నించవ్!

శ్యామల. ఇక నన్ను నేనే మన్నించుకో లేను - మిమ్మల నేం మన్నిస్తాను! భర్త యివ్వన్దే భార్యవద్ద డబ్బుంటే, ఆమె దొంగతనమో, రంకుతనమో చేసిందని తీర్మానించు కుంటారు. చదువుకున్నదాన్నని, తెలిసినదాన్నని అనుకున్నా గాని, ఈపాటి గుర్తించగల జ్ఞానం నాకు లేకపోయింది.

[ఉద్వేగంతో చలించిపోతూ పెడముఖం పెట్టుకుంటుంది.

రాధాకృష్ణ. శ్యామలా! ఇటుచూడు! [ఆమె తిరిగిచూడకపోగా తనవైపుకు తిప్పుకుంటూ] "బిలీవ్ మి, మై డియర్. ఐ యామ్ ఫీలింగ్ అట్టర్‌లీ ఎషేమ్డ్ ఆఫ్ మైసెల్ఫ్."

శ్యామల. నన్నుచూచుకుంటే నాకుమాత్రం సిగ్గువెయ్యడంలేదా? మన మిద్దరం మేధావంతులమే. ఇద్దరం సంస్కృతి గలవాళ్లమే. ఒకరినొకరు ప్రేమించుకున్నాం; ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకొన్నా మనుకున్నాం. కాని, మన విద్య, మన సంస్కృతి, చివరికి మన ప్రేమైనా, మీరు నన్ను శంకించడానికి అడ్డుకాలేక పోయింది. అయినా, తప్పు మీది కాదు. నా ఆర్థిక బానిసత్వమే మనమధ్య విషం చిలికింది. దాన్ని తొలగించుకో గలిగితేనే, నేను తిరిగి మీముఖం చూడగలిగినా, మీరు నాముఖం చూడ గలిగినా! ఒకరు భరించేవారై, మరొకరు భరించబడే వారైనంత వరకు హృదయాలు నిజంగా కలవవ్

రాధాకృష్ణ. అయితే, ఇప్పుడు తిరిగి....

శ్యామల. ఔను! తిరిగి ఏదైనా ఉద్యోగంలో ప్రవేశిస్తాను. [సగం వ్రాసిన ఉత్తరం వద్ద తిరిగి కూర్చుంటూ] గుంటూరు విమెన్స్ కాలేజీలో లెక్చరర్ పోస్ట్ ఖాళీగా వుందట. దానికి అప్లయి చేస్తున్నా.

రాధాకృష్ణ. ఉద్యోగమే చేసితీరాలంటే ఇక్కడ ఈవూళ్ళోనే ఏదైనా దొరికేవరకూ పోనీ ఆగనైనా లేవూ?

శ్యామల. ఇవ్వాళే నేను కన్నుతెరిచా; నాది కల్లబ్రతుకని తెలుసుకున్నా. నాకు అర్థం లేనంతవరకు నేను మీకు అర్ధాంగిని కాలేను. ఆ అర్హతను సంపాదించుకోవడంలో నేను ఆలస్యమెందుకు చెయ్యాలి?

రాధాకృష్ణ. శ్యామలా! ఇవ్వాళ నీపట్ల మహాపచారమే చేశానని ఒప్పుకుంటున్నాగా!

శ్యామల. మీపట్ల నేనుచేసిందికూడా మహాపచారమే. నన్ను నేను ఆర్థికదాస్యంలో పెట్టుకోబట్టేగదా, మీనోట ఇవ్వాళ అబద్ధం పలికించడం జరిగింది. మన ఈ జీవితం మనిద్దరి నైతిక పతనానికి సమానంగా కారణమౌతున్నది.

రాధాకృష్ణ. అయితే, మనకు తాత్కాలికంగా ఎడబాటు తప్పనట్లేనా?

శ్యామల. ఇది కేవలం మీ, నా ప్రశ్నమాత్రమే కాదండీ. చదువుకునే. భాగ్యం - ముఖ్యంగా పెద్ద చదువులు చదువుకునే భాగ్యం - మా స్త్రీజాతిలో ఎంతమంది కబ్బుతుంది? నేను చదువుకున్న చదువుకు సార్థక్యం - నాబోటి పదిమందికి దాన్ని

చెప్పినప్పుడే అనుకున్నా. ఆ ఉద్దేశంతోనే టీచర్‌గా ప్రవేశించాను. మన వివాహం స్థిరపడగానే "నా సంపాదన చాలదా? నువ్వు శ్రమపడ్డం దేనికి ?" అని మీరంటే నా సుఖాన్నే, నా స్వార్థాన్నే చూచుకుని, నా లక్ష్యాన్నే మరిచిపోయాను. ఆ పాపానికిప్పుడు పరిహారం చేసుకోబోతున్నాను.

[అప్లికేషన్ పై సంతకం పెట్టి, దాన్ని మడిచి కవరులో పెడుతూ వుంటుంది.

రాధాకృష్ణ. మనకు ఒక బిడ్డేవుంటే, నువ్వింత తొందరపడేదానివా?

శ్యామల. ఔను! అంతవరకు అదృష్టవంతురాలినే!

రాధాకృష్ణ. ఇదీ ఒక అదృష్టమే!

శ్యామల. కాదటండీ! మీరే ఇప్పుడన్నట్టు, మనకు ఒక బిడ్డేవుంటే నేను ఈపాటి తెగింపైనా చెయ్యగలిగేదాన్నా? ఆత్మగౌరవాన్ని కాపాడుకోగలిగేదాన్నా ?

రాధాకృష్ణ [వాదంలోకి దించితే, మనస్సు మార్చవచ్చుననే ఆశతో]. ఆత్మగౌరవాల కేమిగాని, మాతృత్వమే స్త్రీ జీవితానికి శోభైనా, సాఫల్యమైనా. అసలు స్త్రీ పురుష ప్రేమకు విశిష్టతను కూర్చేది సంతానాపేక్షే. ఆ అపేక్షే లేకపోతే...

శ్యామల [పట్టరాని కోపాన్ని అణచివేసుకోడానికి ప్రయత్నిస్తూ]. "ఆత్మ గౌరవాల కేమిగాని....". ఔను! మీదృష్టిలో స్త్రీకి ఆత్మే వుండదు. ఇక, ఆత్మగౌరవం ఎక్కడినుంచి వస్తుంది లెండి!

రాధాకృష్ణ. ఇది న్యాయమేనా, శ్యామలా? నే నేమన్నా దానికి పెడర్థాలు తీస్తున్నావ్!

శ్యామల. ఇందులో పెడర్థాలేమున్నై! నేనే తల్లినై వుంటే, బిడ్డలపై మమకారంకొద్దీ మీరేం చేసినా పడివుండేదాన్నని మీరంటున్నారు - అంతేగా!

రాధాకృష్ణ. నీతో వాదానికి నేనెక్కడ నిలవగలను గాని, నీ నిర్ణయం మారదా, శ్యామలా?

[ఈ ప్రశ్నకు జవాబు అన్నట్టుగా శ్యామల కవరుపై అడ్రస్ వ్రాస్తుంది.

రాధాకృష్ణ. "లుక్ హియర్, మై డియర్!"

శ్యామల. బోయ్!

రాధాకృష్ణ [చిట్టచివరి ఆశగా]. పోనీ రేపటివరకైనా ఆగరాదా?

బోయ్ [ప్రవేశిస్తూ]. వచ్చే, అమ్మా!

శ్యామల. ఈ ఉత్తరాన్ని పోస్టుచేసిరా!

బోయ్ [ఉత్తరాన్ని అందుకుంటూ]. అలాగేనమ్మా!

[బోయ్ వెళ్ళబోతాడు.

రాధాకృష్ణ. తొందర లేదులేరా! ఆగు!

[బోయ్ ఆగిపోతాడు.

శ్యామల. ఉహుఁ! వెళ్ళరా, వెళ్ళు!

[బోయ్ తిరిగి కదులుతాడు.

రాధాకృష్ణ. నీకాదురా చెప్పేది? రేపు వెయ్యొచ్చులే!

[బోయ్ మళ్ళీ నిలిచిపోతాడు.

శ్యామల. ఔను! వాడికి జీతభత్యా లిస్తున్నది మీరేగా? వాడికి పనిచెప్పడానికి నాకు హక్కేముంది? లేరా! లే! ఆ ఉత్తరమిలా తే! నేనే పోస్టుచేసుకుంటాలే!

రాధాకృష్ణ. వెళ్ళరా, వెళ్ళు! వేసిరా!

తెర]



పాత్రలు :

మనమడు

అతని తల్లి

అతని తాత

స్థలం :

వార్సా

సమయం :

1939 సెప్టెంబర్

10 వ తేదీ ఉదయం



# జీవజ్వాల

ఈ నాటికలోని పాత్రలు మార్షల్ పిల్సుడ్‌స్కీ పట్ల చాలా భక్తిభావాన్ని ప్రదర్శిస్తారు. ఇది సహజం. రష్యాపై దండెత్తడానికి 1914 లో పిల్సుడ్‌స్కీ కూడదీసిన మొదటి లీజియన్‌కు చెందిన ఒక సైనికుడు మార్షల్ జీవితాంతంవరకు ఆయన వాలెట్‌గా పనిచేశాడని "న్యూ స్టేట్స్‌మన్ అండ్ నేషన్" లోని ఒకవ్యాసంలో చదివాను. ఆ ఒక్క వాక్యాన్ని ఆధారంచేసుకుని ఈ నాటికలోని తాతను సృష్టించాను. మార్షల్‌కు అంత విశ్వాసపాత్రంగా సేవచేసిన వ్యక్తి అతని పట్ల విపరీతమైన భక్తిని ప్రదర్శించడం సహజం. తాతనుబట్టి తాత కుటుంబంలోని ఇతరుల వైఖరికూడా వుంటుందనడంలో దోషంలేదు.

అయితే, ఈ పాత్రలతోపాటు మనం మార్షల్‌ను స్తోత్రం చెయ్యలేము. మాతృదేశ స్వాతంత్ర్యసిద్ధికి పిల్సుడ్‌స్కీ కఠోర తపస్సు చేశాడనడం నిజం. కాని, జాతీయాభిమానమే అతనిలో ఒక పెద్ద లోపమైంది. సోషలిస్టుగా అతడు జీవితాన్ని ప్రారంభించాడు. ఎంతవరకు సోషలిస్టుల సాహచర్యం తన జాతీయోద్యమానికి వినియోగించిందో, అంతవరకు దాన్ని వినియోగించుకున్నాడు. ఆ తర్వాత అసలు సోషలిస్టు సిద్ధాం

తాలకే విరోధి అయ్యాడు. ఇది ద్రోహమని ఒక సోషలిస్టు మిత్రుడు నిందిస్తే, "నీవూ నేనూ సోషలిజం అనే రైలును అందుకున్నాం. నేను పోలిష్ స్వాతంత్ర్యం అనే స్టేషన్ దగ్గర దిగిపోయాను; నువ్వు యుటోపియాకు [ఆదర్శరాజ్యానికి] నీ ప్రయాణాన్ని సాగించు" అని అవహేళన చేశాడు.

1772 లో రష్యా, జర్మనీలు మొట్టమొదటిసారిగా పోలెండ్‌ను పంచుకున్నాయి. అప్పటినుంచి 1815 వరకు మరి మూడు సార్లు పోలెండ్ పంపకం జరిగింది. నాల్గవ పంపకంలో రష్యా, జర్మనీ, ఆస్ట్రియాలు భాగస్థులు. 1918 వరకు ఈ నాల్గవ పంపకం అమలులోనే వుంది. ఏదో ఒక విదేశ రాజ్య దాస్యానికి లోబడి వుండడమే దుర్భరం. ఇక, మూడు విదేశ రాజ్యాలకు గులాం కావడం సంగతి చెప్పనక్కర్లేదు. అంచేతనే పోలిష్‌వారిలో జాతీయత మూర్తీభవించి, చివరికి అది ఒక జాడ్యంగా పరిణమించింది. పిల్సుడ్‌స్కీ ఈ జాడ్యానికి అందరికంటె ఎక్కువగా గురి అయ్యాడు.

జాతీయాభిమాన జాడ్యం ముదిరినప్పుడు అది జాతీయదురహంకార మౌతుంది. పిల్సుడ్‌స్కీ విషయంలో ఇదే జరిగింది. పోలిష్ జాతికి చెందిన వారినందర్నీ, పోలిష్ భాషను మాటాడే వారి నందరినీ ఒక రాజ్యంకిందికి తేవడంలో సంతృప్తిపడక, అతడు పోలెండ్‌ను యూరప్‌లో ఒక మహారాజ్యంగా చెయ్యాలను కున్నాడు. ఇందుకోసం జర్మన్‌జాతివారు నివసిస్తున్న కొన్ని ప్రాంతాల్ని ముందుగానే పోలెండ్‌లో కలుపుకున్నాడు. ఆతర్వాత రష్యాలోని అంతర్యుద్ధాన్ని అవకాశంగా తీసుకుని, దానిపై దండెత్తి వెళ్ళి, 1920 లో దానిదగ్గరినుంచి వెస్టరన్

యూక్రెయిన్ రాష్ట్రాన్ని అపహరించాడు. ఆతర్వాత లిథు వేనియాపై కత్తికట్టి, 1927 లో దానిదగ్గరినుంచి విల్నా జిల్లాను వశపరుచుకున్నాడు. ఈ దురాక్రమణలతో పోలెండ్‌కు అతడు ఎన్నో కొత్త సమస్యల్ని కల్పించాడు.

ఇంతేకాదు. విదేశ ప్రభుత్వాలతో సంఘర్షణల్ని సాగించడం లోనే జీవితాన్ని వెళ్ళబుచ్చినవాడు కావడంవల్ల పిల్సుడ్‌స్కీలో సైనికప్రవృత్తి ప్రబలింది. అంచేత అతడు పోలెండ్‌ను ఒక పెద్ద సైనికశిబిరంగా చెయ్యాలనే ధోరణిలో పడిపో యాడు. ప్రభుత్వవర్గంలో ముఖ్యస్థానాల నన్నిటిని సేనాధి పతులకు కట్టబెట్టాడు. సైనికవ్యయంకోసం విపరీతంగా పన్నుల్ని వేశాడు. సైన్యాభివృద్ధికోసం చూపిన శ్రద్ధలో వీసమంతైనా సాంఘిక, ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధి పట్ల చూప లేదు. చండశాసనునివలె ప్రజలను పరిపాలించాడు; వారిని పీడిం చాడు; ఏడిపించాడు. 1939 లో నాజీసైన్యాల ధాకకు పట్టుమని పక్షం రోజులైనా పోలెండ్ నిలవలేకపోవడానికి పిల్సుడ్‌స్కీ నింద్య జాతీయవిధానాలే, నిరంకుశ పరిపాలనా పద్ధతులే కారణం. అంచేత ఈ నాటికలోని 'పాత్రలు చేసే ప్రశంసనుబట్టి పిల్సుడ్‌స్కీని ఆదర్శమూర్తిగా' భావించడం కంటె పొరబాటు వుండబోదు.

నిజానికి ఇది పిల్సుడ్‌స్కీ నాటికకాదు; పోలెండ్ నాటిక. పోలెండ్ నాటిక కూడా కాదు; స్వాతంత్ర్య సంపాదన కోసం, సంరక్షణకోసం పోరాడే ప్రతిదేశం నాటిక.

* * *

స్సీన్ : వార్సాలో ఒక డ్రాయింగ్ రూం. కుడివైపుది సింహ ధ్వారం. దాని రెండుపక్కల వీధిలోకి రెండు కిటికీలు. ఎడమ వైపున మరి రెండు కిటికీలు. వాటిమధ్య ఫైర్ ప్లేస్. వెనక భాగాన మేడమెట్లు. గదిమధ్యనుంచి కొంత ఎత్తు లేచినతర్వాత రెండు వరసలుగా చీలి, ఒక వరస కుడివైపుకూ, మరొకవరస ఎడమవైపుకూ పైకి వెడుతున్నాయి. మెట్ల వరసలలో ఎడమ దానికింద బీరువా, కుడిదానికింద సైడ్ టేబుల్, ఆ టేబుల్ పైన రేడియో, దాని ఎదట ఒక కుర్చీ. సైడ్ టేబుల్ వున్న గదిమూల ఒక కబర్డ్. గది మధ్యలో ఒక సెటీ, నాలుగు కుర్చీలు. వాటిమధ్య గ్లాస్‌టాప్డు సెంట్రల్ టేబుల్. దాని మీద చప్పగా వాడిపోయిన పువ్వులతో ఫ్లవర్‌వాస్. గదిలో ఒక పక్కగా పామ్ స్టాండ్. దానిమీద మార్షల్ పిల్సుడ్‌స్కీ బస్ట్. గది మధ్య చక్కని తివాచీ.

సెటీలో ఒక మూలకు వొదిగి తాత కూర్చుని వుంటాడు. వయస్సు డెబ్భై ప్రాంతాల. తాత ముఖం చింతాక్రాంతంగా వుంటుంది. టీ ట్రే పుచ్చుకుని మనమడు ప్రవేశిస్తాడు. అతడు పధ్నాలు గేళ్ళవాడు.

**మనమడు.** తాతా! తాతా!.... పిలిచేది విన్నే, తాతయ్యా!

**తాత** [ఆలోచనలు అన్నీ ఎక్కడో వున్నట్టు]. ఆఁ!

**మనమడు.** నీ టీ ఇదుగో!

**తాత.** ఊఁ!

**మనమడు** అమ్మ పనితొందరలో వుంది. టీ కోసం కిందికి రాలేనంది.

తాత. ఊఁ!

మనమడు. బ్రెడ్ లేదు. కబర్డ్‌లో బిస్కట్లు వున్నవేమో చూడ మన్నది, తాతయ్యా!

[కబర్డ్‌ను తెరిచి చూస్తాడు.

మనమడు. బిస్కట్లు అయినా లేవు, తాతయ్యా!

తాత. సర్లే, బాబూ!

మనమడు. మరి, నేను పోనా?

తాత. మంచిది, బాబూ!

[మనమడు మేడమీదికి వెళ్ళడానికి నాలుగు మెట్లు యెక్కుతాడు.

తాత. బాబూ!

మనమడు. ఆఁ!

తాత. ఇలా ఒకసారి రా!

మనమడు [మెట్లుదిగుతూ]. దేనికి?

తాత. మన గరాజ్‌లోకి వెళ్ళి, ఆయిల్‌కాన్ పట్టుకురా!

మనమడు. ఆయిల్‌కాన్ దేని కిప్పుడు?

తాత. చెబుతాగా! పట్టుకురా!

[మనమడు వెడతాడు.

తాత [మెట్లదగ్గరికి వెళ్ళి కుమార్తె నుద్దేశించి]. అమ్మా!

అమ్మ [మేడపైనుంచి]. దేనికి నాన్నా?

తాత. బీరువా తాళంచెవి ఎక్కడున్న దమ్మా?

అమ్మ. సైడ్‌టేబుల్ డ్రాయర్‌లో వుంది.

[తాత తాళంచెవి తీసుకుని బీరువా తెరుస్తూ వుండగా మనమడు తిరిగి వస్తాడు.

మనమడు. ఇదుగో, తాతయ్యా! ఆయిల్ కాన్. [ముట్టకుండావున్న టీ వంక చూచి] టీ తాగనే లేదేమి, తాతయ్యా? చల్లారి పోతున్నది.

తాత. తాగుతా, బాబూ! మీ అమ్మ నడిగి దస్తరుంటే పట్టుకురా!

మనమడు. దేనికి?

తాత. పట్టుకురా, చెబుతా.

మనమడు. ఊహుఁ! ముందు చెబితేనేగాని తేను.

తాత [బీరువాలోనుంచి ఆర్మీరైఫుల్ బయటికి తీస్తూ]. ఈ రైఫుల్ వాడుకలేక తుప్పు పట్టిపోయింది; తుడవాలి.

మనమడు. అందుకా! తెస్తాను.

[మేడమీదికి వెడతాడు. తాత రైఫుల్ పుచ్చుకు వచ్చి, సెటీలో చతికిల బడి, రైఫుల్ బారెల్ పరిశీలిస్తాడు. తర్వాత ట్రిగ్గర్ మువ్మార్లు పైకిలాగి నొక్కుతాడు. ఇంతలో మనమడు తిరిగి వస్తాడు.

మనమడు. నిన్ను అమ్మ చప్పున ప్రయాణం కమ్మంటున్నది, తాతయ్యా!

తాత. ప్రయాణమా? ఎక్కడికి?

మనమడు. ఎక్కడి కేమిటి? మన వూర్నాను ముట్టడించబోతున్నారనీ, సైనికులు కానివాళ్ళందరు వెళ్ళిపోవాలనీ రేడియోలో చెప్పలేదూ?

తాత. ఆఁ! ఔనౌను! నే నామాటే మర్చిపోయాను. మరి, చప్పున ప్రయాణమై వెళ్ళండి.

మనమడు. అదేమిటి? నువ్వు రావా?

తాత. రేడియోలో చెప్పిందేమిటి ? సైనికులుకానివాళ్లు వెళ్ళి పోవాలని. - అంతేగా ?

మనమడు. ఔను.

తాత. మరి నేను సైనికుణ్ణి. ఎలా వస్తాను నువ్వే చెప్పు ?

మనమడు. ముసిలివాడివి నువ్వేమి సైనికుడివి, తాతయ్యా ?

తాత. సైనికుడు కావడానికి ముసిలివాడేమిటి ? పడుచువాడేమిటి ? ఒకసారి సైనికుడైనవాడు బ్రతికినంతకాలమూ సైనికుడే ?

మనమడు. నువ్వేమి సైనికుడివి తాతయ్యా ! నీ చేతులు....

తాత. ఔను. నా చేతులకు వణుకు పుట్టింది. అయితే నేం ? గుండెమాత్రం గట్టిగానే వుంది.

మనమడు. నీకు చూపైనా....

తాత. నిజమే. నాకు చూపైనా తిన్నగా అనడం లేదు. కాని, నా దారిమాత్రం సూటిగా కనబడుతున్నది.

[ఈ మాటల్ని అంటూ రైఫుల్‌కు ఆయిల్ రాస్తూ వుంటాడు.

మనమడు. నీకేమైనా పిచ్చిపట్టిందా, తాతయ్యా ? ఇంత ముసిలి వాడివి నువ్వేం యుద్ధం చేస్తావు ?

తాత. ఏమంత వయస్సు ? ఇంకా డెబ్భై నిండలేదు.

మనమడు [నవ్వుతూ]. అదేమిటి, తాతయ్యా ! నువ్వింకా చిన్నవాడివనే !

తాత. కాదనుకో ! కాని, ఆ మహామహుడు జీవించివుంటే....

మనమడు, ఎవరది, తాతయ్యా ?

తాత. మార్షల్ పిల్సుడ్‌స్కీ.

మనమడు. ఆయన జీవించేవుంటే తుపాకి పట్టేవాడంటావా ?

తాత. అందుకు సందేహమా ?

మనమడు. నీకంటె ఆయన మూడు సంవత్సరాలు పెద్దవాడని చెప్పావ్ కాదూ, తాతయ్యా ?

తాత. ఔను. ఇప్పటికి డెబ్బై ఫరెండు విండేవి.

మనమడు. ఏమో ! అంత వయస్సులో ఆయనైనా ఇంత సాహసాన్ని చేసేవాడు కాదు.

తాత. ఆయనకు ఇదొక సాహసమా ? కేవలం మూడువందల మందితో జార్ సామ్రాజ్యంపై దండెత్తాడు ! ఆ మూడు వందల మందిలోనుంచే మూడు లక్షలమంది వీరు లుద్భవించారు; శతాబ్దంపైనుంచీ దాస్యబాధతో క్రుంగిపోతున్న మన దేశం స్వతంత్రరాజ్య మైంది.

మనమడు. కాని, అప్పు డాయన వయస్సెంత ?

తాత. అప్పుడా ? [ఆలోచిస్తున్నట్టు క్షణం ఆగి] ఆయన జన్మించింది 1867లో. ఇక, రష్యాపై దండెత్తింది 1914లో అంటే....

మనమడు. 1914లో 1867 పోతే....ఆఁ!....ఉండు.తాతయ్యా ! ....చెబుతాను . .అదొక 33....ఇదొక 14....మొత్తం 47.... అంటే, అప్పటికి వడి వయస్సన్నమాట !

తాత. తర్వాతనైనా ఆయన పౌరుషం చచ్చిందా ! పిల్సుద్‌స్కీ సంగతి నీకు తెలియదు, బాబూ ? పోలెండే ఆయన; ఆయనే

పోలెండ్. దాస్యబాధనుంచి ఆయన విముక్తిచేసిన పోలెండ్పై ఈనాడు నాజీమూకలు....

[“పేపర్” అంటూ న్యూస్‌బాయ్ పత్రిక పడవేసి వెడతాడు. అది పడిన చప్పుడుకు ఇద్దరూ అటు చూస్తారు.

మనమడు. పత్రిక వచ్చింది, తాతయ్యా! స్పెషల్ ఎడిషన్ కాబోలు. [వెళ్ళి దాన్ని తెచ్చి, హెడ్డింగుల్ని చదువుతాడు]. “వార్సా సరిహద్దులలో జర్మన్ సైన్యాల ప్రవేశం”. ..“వలా యన మౌతున్న ప్రజలపై ఫిరంగులు” ..“మన సైన్యాల వీరోచిత ప్రతిఘటన”....

తాత [ఉద్రేకంతో కూడిన ఉచ్చైస్స్వరంతో] పారిపోతున్న ప్రజలపై ఫిరంగులు! ఇది యుద్ధం కాదు, హత్యా కాండ! హంతకులు! రాక్షసులు !!

[ఉద్రేకం మరీ హెచ్చి, ఉక్కిరి బిక్కిరై పోతాడు. చెడ్డ దగ్గు వస్తుంది.

మనమడు. అయ్యో తాతయ్యా! [చప్పున టీకప్పు దగ్గరికి తీసుకువెళ్ళి] కాస్త టీ పుచ్చుకో! దగ్గు తగ్గుతుంది!

తాత [గుక్క తిప్పుకుంటూ]. వద్దు, బాబూ! వద్దు.

మనమడు. వద్దక పోవడమేమిటి, తాతయ్యా! కొంచెం తాగు-మంచిది.

తాత [కప్పు అందుకుని, రెండు గుక్కలు తాగి]. మరి చాలు బాబూ! [కప్పు టేబుల్‌పై పెడుతూ] ఇప్పు డాయనే జీవించి వుంటే....

మనమడు. వుంటే, ఆయనైనా మాత్రం ఏం చేశేవాడు ?

తాత. ఏం చేశేవాడా ? 1920లో ఏం చేశాడో, ఇప్పుడూ అదే చేశేవాడు. అప్పుడు వార్సాకు అరుమైళ్ళ దూరంలోకి వచ్చిన బోల్షివిక్ సైన్యాల్ని ఆయన తరిమికొట్టలేదా ?

మనమడు. ఆయన శక్తి అంటే నీ కెంత విశ్వాసం తాతయ్యా !

తాత. అయన సంగతి తెలిస్తే నీకూ....

మనమడు. నాకు తెలియకేమి ? తెలుసు.

తాత. ఏమి తెలుసు, బాబూ ?

మనమడు. అంతా తెలుసు. ఆయన విల్నాలో పుట్టాడు. ఆయన తండ్రి ఆస్తిని జార్ ప్రభుత్వం జప్తుచేసింది ; ఆయన అన్నకు ఉరిశిక్ష వేసింది ; ఆయన్ని రెండుసార్లు జెయిల్‌లో పెట్టింది. మొదటిసారి సైబీరియాలో అయిదేళ్ళపాటు సీసం గనిలో కూలీగా పనిచేయించింది. రెండోసారి వార్సాలోనే చీకటి కొట్టులో పడవేసి అష్టకష్టాలు పెట్టింది. అప్పు డాయన పిచ్చెత్తి పోయినట్టు నటన చేసి, ఒక డాక్టర్ సహాయంతో జైయిల్‌నుంచి తప్పించుకున్నారు. ఇంకా చెప్పనా ?

తాత [మనమడి ధోరణికి చిరునవ్వుతూ]. ఊఁ ! చెప్పు !

మనమడు. 1914లో యుద్ధం ప్రారంభంకాగానే "మీరు మా పక్షాన చేరి రష్యాపై యుద్ధంచేస్తే, మీదేశాన్ని స్వతంత్రరాజ్యంచేస్తా" మని జర్మనీ, ఆస్ట్రియాలవారు వాగ్దానం చేశారు. దీన్ని నమ్మి ఆయన రష్యాపై దండయాత్ర సాగించాడు. 1917లో రష్యా వోడిపోగానే, ఇక పోలెండ్‌ను స్వతంత్రరాజ్యంగా

ప్రకటించమని ఆయన కోరాడు. ఇందుకు జర్మనీవా రిచ్చిన జవాబు, - ఆయన్ని ఖైదులో పెట్టడం.

తాత [నవ్వుతూ]. ఇంకా తేదీలు జ్ఞాపకంలేవూ ?

మనమడు [గారాబంగా]. కాదు, తాతయ్యా! ఇంకా చెబుతా. విను! ఆయన జెయిల్‌కు వెడుతూవుంటే, కష్టకాలంలో, ఆయన సరసను నిలవాలని నువ్వు వెంట బయల్దేరావు. నువ్వు వెంట రావడానికి వీల్లేదని అడ్డుచెప్పగా, "నేను పిల్సుడ్ స్కీ వాలెట్‌ను; ఆయనవెంట వుండితీరా" అన్నావు. 1918లో జర్మనీ వోడిపోయింది. వెంటనే పిల్సుడ్‌స్కీ విడుదలయ్యాడు. పోలెండ్ స్వతంత్రరాజ్యమైంది. తర్వాత నీకు పెద్ద హోదా నిస్తానంటే "వద్దు! నేను వాలెట్‌గానే వుంటా" నన్నావు. పిల్సుడ్‌స్కీ మొదటి లీజియన్‌లోని మూడు వందల మందికీ ఇంత తక్కువ హోదాతో సంతృప్తి పడింది నువ్వొక్కడివే. నువ్వు....

తాత [నవ్వుతూ]. నువ్వు చెబుతున్నది పిల్సుడ్‌స్కీ చరిత్ర కాదు. మీ తాత చరిత్ర.

మనమడు. కాదు; తాతయ్యా! పిల్సుడ్‌స్కీ జీవితచరిత్ర అంతా నాకు తెలుసు.

తాత. నీకు తెలిసిన విషయాలు ఆయన జీవితంలోని కొన్ని ముఖ్య స్థూలఘట్టాలు మాత్రమే, బాబూ? ఆయన అంతర్జీవితం నీకు తెలియదు. ఆయన జీవితంమీద, ఆయన జీవితలక్ష్యాల మీద వెలుగు ప్రసారించగల చిన్ని చిన్ని సంఘటనలు ఎన్నో నా కళ్లెదట జరిగాయి. వీటిసంగతి లోకానికి తెలియనే తెలియదు.

మనమడు. ఏం సంఘటన లవి, తాతయ్యా ? ఏదీ ఒకటి చెప్పు !

తాత. సరే!– చెబుతా విను. ఒకనాడు వీధిలో నవ్వుతూ తేరుతూ ఆడుకుంటున్న పిల్లల్నిచూచి ఆయన నిట్టూర్చాడు.

మనమడు. ఆడుకుంటున్న పిల్లల్ని చూచి నిట్టూర్చడం దేనికి ?

తాత. నేనూ అదే ఆశ్చర్యపోయాను. అయితే అప్పటికి మాట్లాడ కుండా వూరుకుని, ఆ రాత్రికి "ఉదయం నిట్టూర్చారు దేనికి?" అని అడిగాను.

అమ్మ [మేడపైనుంచి]. బాబూ !

మనమడు. ఆఁ !

అమ్మ. ఒకసారి చప్పున పైకిరా !

మనమడు. దేనికి ?

అమ్మ. ఈ ట్రంక్ కిందికి దించాలి.

తాత. వెళ్లు, బాబూ ! సాయం పట్టు.

మనమడు. వెడతానుగాని, ఆయన....

తాత. ముందు వెళ్ళు !

మనమడు. వెడతాలే, తాతయ్యా ! ఆయన....

తాత. వెళ్ళిరారా, బాబూ ?

మనమడు. సరే! వెడుతున్నా !

[నాలుగైదు మెట్లు ఎక్కుతాడు.

అమ్మ. బాబూ ! రావక్కరలేదులే !

మనమడు [తిరిగివచ్చి]. నీ ప్రశ్నకు మార్షల్ ఏం జవాబిచ్చాడు, తాతయ్యా ?

తాత. చాలా గొప్ప జవాబిచ్చాడు. "మనం దాస్యబాధ అనుభ వించాం. అంచేత స్వాతంత్ర్యంకోసం పరితపించాం. ఎలాగో దాన్ని సాధించాం. నవ్వుతూ, కేరుతూ ఆడుకుం టున్న ఆ పిల్లలకు దాస్యబాధ తెలియదు. అంచేత వాళ్ళు స్వాతంత్ర్యం విలువ గ్రహించగలరా అని సందేహం తోచింది." అన్నాడు. "ఈ సందేహం ఇంకా మిమ్మల్ని బాధిస్తున్నదా ?" అని నే నడిగాను. "లేదు; అప్పుడే పోయింది" అంటూ ఆయన మందహాసం చేశాడు. తర్వాత చప్పున కుర్చీలోనుంచిలేచి, గదిలో పచారుచేస్తూ "మూడుసార్లు పంపకం జరిగినా పోలెండ్ నశించలేదు. మరి ముప్ఫయిసార్లు పంపకం జరిగినా అది నశించదు. అజేయమైంది నా పోలెండ్! అమరమైంది నా పోలెండ్ !!" అని గంభీరంగా అన్నాడు. ఆ మాటలు నా చెవుల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి.

మనమడు. అయితే, తాతయ్యా! మా బడిలో....

తాత [కొంచెం చికాకుగా]. ఉఁ! ఆ వెధవవాగుడు మళ్ళీ నాకు చెప్పకు.

మనమడు. అదికాదు, తాతయ్యా! మార్షల్ చాలా గొప్పవాడే. దేశంకోసం చాలా త్యాగాలు చేశాడు. కాని, చండశాసనుడుగా పరిపాలించాడటగా ? ప్రజాసామాన్యాన్ని పీడించాడటగా !

తాత. ఆఁ! తెలిసీ తెలియక ఏవో పేలుతూ వుంటారు! నెత్తిని ఆమాత్రం మొట్టకపోతే, అలగాజనం మాట వింటారూ ? దెబ్బకే దెయ్యం జడిసేది.

మనమడు. అలకాజన మేమిటి, తాతయ్యా! నువ్వు, మా నాన్న పోరాడింది ప్రజలకోసం కామా? మార్షల్ కోసమేనా? ఆయన జనరల్స్ కోసమేనా?

తాత. నువ్వు పసివాడివిరా, బాబూ! ఈ పెద్ద విషయాలు నీకు తెలియవ్. పోలెండ్‌కు సైనికశక్తిని కూర్చి, తూర్పుయూరప్‌లో దాన్ని మహారాజ్యం చెయ్యాలని....

[చెవులు చిల్లులు పడేటట్టు విమానాల రొద.

మనమడు. అవిగో, తాతయ్యా! విమానాలు! [కిటికీదగ్గరికి పరిగెత్తుకు వెళ్ళి] ఒకటి....రెండు ...మూడు....నాలుగు ... అయిదు.. .ఆరు ...ఆరు విమానాలు, తాతయ్యా!

[విమానాలు దాటి వెళ్ళిపోతున్నట్టు క్రమంగా రొద తగ్గుతుంది.

తాత. తప్పు, బాబూ! తప్పు!! విమానాలు దాడిచేస్తూండంగా కిటికీవద్ద నిలబడరాదు. ఇలారా! ఆ కిటికీ మూసెయ్యి!

మనమడు [కిటికీ వద్దనే నిలబడి]. ఊరు మధ్యకు వెడుతున్న ట్టున్నాయి, తాతయ్యా! ఉదయం గవర్నమెంట్ బిల్డింగ్స్‌మీద చాలా బాంబుల్ని వేశాయట. ప్రాగా ఆసుపత్రి కూలిపోయిం దట. మార్షల్ పాలెస్ బూడిదై పోయిందట.

తాత. మార్షల్ పాలెస్ బూడిదై పోతే పోవచ్చు గాని, మార్షల్ సృష్టించిన పోలెండ్ బూడిద కాదు, బాబూ, బూడిద కాదు. [దగ్గుతూ] బూడిద కాదు, ముమ్మాటికీ!

[మళ్లీ విమానాల రొద.

మనమడు. అవిగో, తాతయ్యా! మళ్ళీ వస్తున్నాయి. [కిటికీదగ్గరికి జరిగి] ఈసారి మూడు. [కొంచెం ఆగి] కాదు, తాతయ్యా! ఈసారికూడా మళ్ళీ ఆరు!

[దూరానికి వెళ్ళిపోతున్నట్టు విమానాల రొద క్రమంగా తగ్గుతుంది.

మనమడు. తాతయ్యా! [దగ్గరికి వచ్చి] మరి, మానాన్న విమానం ఎక్కడున్నదో?

తాత [విచారం ధ్వనిస్తున్న కంఠంతో]. ఏమో, తెలియదు, బాబూ!

మనమడు. తరచు వుత్తరాలు వ్రాస్తూవుంటానని చెప్పాడు. ఒక్క వుత్తరమైనా వ్రాశాడు కాదు,

తాత. ఎక్కడ తీరుతుంది, బాబూ?

మనమడు. ఒక్క వుత్తరమైనా రాలేదని కాబోలు అమ్మ చాలా బెంగగా వుంటున్నది, తాతయ్యా! నువ్వు ధైర్యం చెప్పక పోయావూ?

[తాత జవాబు చెప్పడు.

మనమడు ఏం, తాతయ్యా! జవాబు చెప్పవు?

తాత. ఏం లేదురా, బాబూ! ఏం లేదు [కొంచెం ఆగి] ఏమిటది వీధిలో గలభా?

మనమడు [కిటికీ దగ్గరికి చెక చెక వెళ్ళి]. జనం గుంపులు గుంపులుగా పరిగెత్తుతున్నారు తాతయ్యా! కొందరికి చేతులలో పెట్టెలున్నాయి. కొందరు ఉత్తిచేతులతోనే వెడుతున్నారు. కోటైనా లేదు కొందరికి, [కొంచెం ఆగి] అదేమిటి?.... స్ట్రెచ్చర్! గాయపడ్డ ముసిలివాణ్ణి స్ట్రెచర్‌మీద ఎత్తుకు వెడుతున్నారు

[మరికొంచెం ఆగి] అబ్బబ్బ! ఘోరం! చేతికి దెబ్బతగిలింది. రక్తం కాల్వలు కడుతున్నది! అయినా, రెండోచేతితో అయిదేళ్ళ పిల్లను నడిపించుకు వెడుతున్నాడు, చెల్లాయి. కాబోలు! నా ఈడే వున్నట్టున్నది, తాతయ్యా! ఆ అబ్బాయికి పాపం! చెయ్యి పోయిందేమో! [ఉద్వేగంతో చలిస్తూ] అదిగో! ఇంకొక స్ట్రెచర్. దానివెనక ఇంకొకటి. [హారన్ల మోత] యాంబ్యులెన్సు కార్లు.... ఒకటి.... రెండు.... మూడు... వాటినిండా గాయపడ్డవారే కాబోలు! [మరింత గొంతెత్తి] అబ్బబ్బ! దారుణం! అతి దారుణం, తాతయ్యా! దవడకు దవడ ఎగిరిపోయింది, ఆ అమ్మాయికి! పాపం! ఏడుస్తూ....

తాత. రారా బాబూ! నీ విలా రా! కిటికీ దగ్గరినుంచి కదిలి రా!

మనమడు [వినిపించుకోకుండా]. ఇంకా వస్తున్నారు, తాతయ్యా! ఇంకా వస్తున్నారు జనం! అదిగో! ముసిలిది! నడుంకూడా వంగిపోయింది. కాలికి నెత్తురుతో తడిసినకట్టు! పాపం! అలాగే కుంటుకుంటూ, కుంటుకుంటూ....

తాత [విసుగు, ఆందోళన మిళితమైన కంఠంతో]. ఇలారా బాబూ! కిటికీ మూసెయ్యి!

మనమడు. వస్తా, తాతయ్యా! వస్తా!.... అబ్బబ్బ! ఇది మరీ ఘోరం.... మూడేళ్ళ పిల్లవాడు.... వొంటినిండా నెత్తురే! చచ్చిపోయాడు కాబోలు! మెడ వేలాడుతూ వుంది. తల్లి బిడ్డను గుండెకు హత్తుకుని—

తాత. ఇవతలికి రమ్మనేది విన్నుకాదటరా!

[రెక్కపట్టుకు ఇవతలికి లాగి, కిటికీ మూసివేస్తాడు.

మనమడు. కిటికీని మూశావేగాని, నా కళ్ళనూ, చెవుల్నీ మూశావా తాతయ్యా! ఆ దారుణ దృశ్యాలు నాకళ్ళకు కట్టినట్టే వున్నాయి! ఆ దీనాలాపాలు నా చెవులలో మారుమోగుతూనే వున్నాయి. అదిగో! అది తెగిపోయిన చెయ్యి! అది మెడ వేలాడవేసిన బిడ్డ. అదిగో! అది ముసిలిదాని మూలుగు! అది పసిపిల్లతల్లి ఏడుపు!

తల్లి [గబగబ మేడమెట్లు దిగివచ్చి]. ఏమిటది, బాబూ? కేకలు వేస్తున్నా వేమిటి!

తాత. ఏం లేదమ్మా! గాయపడి వెళ్ళుతున్నవారిని చూచి ఉద్రేకపడుతున్నాడు.

తల్లి. ఔను! నాన్నా! అప్పుడే ముట్టడి ప్రారంభమైనట్టుంది. మనం చప్పున బయల్దేరి వెళ్ళాలి. నేను పెట్టీ బేడా సర్దేశాను. [తండ్రివంక పరీక్షగా చూచి] మీ రింకా ప్రయాణం కాలేదేం నాన్నా? [కొడుకువంక తిరిగి] ప్రయాణంకమ్మని తాతతో చెప్పనే లేదా?

మనమడు. చెప్పానమ్మా!

తాత. ఔనమ్మా! చెప్పాడు. కాని, నేను రాను. మీరు బయల్దేరి వెళ్ళండి.

తల్లి. అదేమి మాట నాన్నా! మీరు రాకపోవడ మేమిటి?

తాత. ముసిలివాణ్ణి. ఇవ్వాళ కాకపోతే రేపు నాప్రాణం పోతుంది. ఎక్కడైతే నేమిటి చచ్చిపోవడానికి! నే నిక్కడే యిల్లు కనిపెట్టుకుంటాను. ఒంటరిదానివి—పిల్లవాణ్ణి ఎలా కాపాడ

తావో ! వాణ్ణి వెయ్యికళ్లతో సంరక్షించు. వెళ్ళమ్మా ! వాణ్ణి వెంటబెట్టుకు త్వరగా వెళ్లు!

మనమడు. లేదు, తాతయ్యా ! నేనూ వెళ్ళడం లేదు.

తల్లి. } ఒకేసారిగా { ఆఁ !
తాత. }

మనమడు. ఔను. నేనూ వెళ్ళడంలేదు.

తాత. తప్పు, బాబూ ! అలా అనబోకు, కాటికి కాళ్ళుజాచినవాణ్ణి ; నీకు నాతో వంతా ?

మనమడు. వంతుకాదు, తాతయ్యా !

తాత. మరి ?

మనమడు. నా ధర్మం.

తాత. అదేమిటి ?

మనమడు. అదేమిటా ? మార్షల్ ఎందుకు నిట్టూర్చాడు ? కొత్త తరంవారు స్వాతంత్ర్యం విలువ గ్రహిస్తారో, లేదో అనేగా ! అలాంటప్పుడు నేను పారిపోవడం తగునా ? నువ్వే చెప్పు, తాతయ్యా ?

తాత. అదికాదు, బాబూ ! నువ్వింకా చాలా చిన్నవాడివి.

మనమడు. నేను చాలా చిన్నవాడినైతే, నువ్వు చాలా పెద్దవాడివి. సైనికుడు కావడానికి ముసిలివాడేమిటి, పడుచువాడేమిటి అవి ఇప్పుడేగా నువ్వన్నది.

తాత. బాబూ ! నామాట విను....

తల్లి. నా కిదంతా అయోమయంగా వుంది. పిల్లవాడికి మీరేం నూరిపోశారు ?

మనమడు. ఏం లేదమ్మా! తాత నా కన్ను విప్పాడు.

తల్లి. ఏమిటది, నాన్నా! వీడింత వింతగా మాట్లాడుతున్నాడు. వీడికి ఏం బోధచేశారు? [కన్నీరు పెడుతూ] నా ఒక్క కొడుకూ నా క్కాకుండా చేస్తారా? వీడినైనా చూచుకు నేను బ్రతుకుదా మనుకున్నాను.

తాత [మనమడిదగ్గరికి వెళ్ళి భుజం నిమురుతూ]. బాబూ! నువ్వ మంకుపట్టు పట్టవద్దు. పెద్దవాణ్ణి. నా మాట....

మనమడు. తాతయ్యా! మార్షల్ బ్రతికున్నంతకాలం ఆయన సేవ చేశానన్నావు. ఆయన చచ్చిపోయాడుగదా అని ఇప్పుడు ఆయనకు ద్రోహం చేస్తావా? నీమాటల్ని వింటే, ఆయన ఆత్మ విలపించదూ?

తాత [కన్నీరు కురుస్తున్న గొంతుతో]. లేదు, బాబూ! లేదు. ఆయనకు నేను ద్రోహం చెయ్యలేను.

మనమడు. అయితే నేను నీతోపాటే వుండిపోతాను.

తాత [విషాద గంభీర కంఠంతో]. సరే, బాబూ! వుండు.

తల్లి. అదేం మాట, నాన్నా! నీకు మతిపోయిందా? నన్ను దిక్కులేనిపక్షిని చేస్తావా? ఈపాడు యుద్ధంలో భర్త పోనే పోయాడు. ఇక....

మనమడు. ఆఁ! ఆఁ! మానాన్న చచ్చిపోయాడా?

[ఎవ్వరూ జవాబు చెప్పరు.

మనమడు [శోకోద్వేగంతో]. జవాబు చెప్పరేమి?....ఏమమ్మా! ఈమాట నిజమా?....తాతయ్యా! నువ్వైనా చెప్పవూ? ఎందుకు నాదగ్గిర దాపరికం? చెప్పండి! చెప్పండి!!

తాత. నిజమే, బాబూ!

మనమడు. నాన్న చచ్చిపోయాడు....నాజీరాక్షసులకు బలి అయి పోయాడు....బలి....ఘోరబలి....నేను వెళ్ళను, తాతయ్యా! ఏమైనా సరే వెళ్ళను. వెళ్ళమని నువ్వూ అనలేవు. నాకు తెలుసు....వెళ్ళమనలేవు నువ్వు.

తల్లి. అది అన్యాయం! ఘోరాన్యాయం!! భర్త పోనే పోయాడు. కొడుకునైనా నాక్కాకుండా చెయ్యవద్దు. వెళ్ళమని వాడితో చెప్పు, నాన్నా! [దగ్గరికివెళ్ళి చేతుల్ని పట్టుకుని] నన్ను కనికరించు.

మనమడు. లేదమ్మా! తాతయ్య నోటివెంట ఆమాట రాదు.

అమ్మ. నాన్నా! నీకు దణ్ణం పెడతాను.

తాత [దుఃఖవివశుడౌతూ]. క్షమించు, తల్లీ! నన్ను క్షమించు. దుఃఖంతో నాగుండె పగిలిపోతున్నది. కాని, ఆ మాటమాత్రం అనలేను.

తల్లి [తండ్రి యెదట మోకరిల్లి]. నాకోసం అను, నాన్నా! నాకు పుత్రభిక్ష పెట్టు.

తాత. క్షమించు, తల్లీ! అనలేను.

తల్లి [చప్పున లేచి కోపావేశంతో]. అనలేవా? అనలేవా? కూతురునైన నాపై దయలేకపోతే పోయె - చచ్చి స్వర్గాన వున్న అల్లుడిపైనైనా నీకు దయలేదా, నాన్నా? ఆయనే ఇప్పుడుంటే, నిన్ను ఎంతగా అసహ్యించుకునేవాడో?

తాత. నన్ను అంటే అనుగాని, అతన్ని అలా అవమానించకు తల్లీ! అతడి హృదయం నాకు తెలుసు. నేమా. ఆనగా

అనేక యుద్ధాలలో కలసి పోరాడాము. అప్పటి కతడు ఇరవై ఏళ్ళవాడు. ఒకనాడు తీవ్రంగా గాయపడి, మరి ఆశ లేదన్న స్థితిలో ఆసుపత్రిలో వుండగా నేను వెళ్ళి "ఇంత చిన్నతనం లోనే నీకెంత అన్యాయం జరిగింది?" అన్నాను. అతడు "విచారించకండి. నా కేమీ చింతలేదు. నా పోలెండ్ కోసం నేను మరణిస్తున్నాను. నేను పోతే మాత్రమేమి? నా పోలెండ్ చిరస్థాయిగా వుంటుంది" అన్నాడు. లేదు, తల్లీ! అతడు నన్ను అసహ్యించుకోడు. పైపెచ్చు మెచ్చుకుంటాడు.

మనమడు. తాతయ్యా! ఒకమాట చెబుతాను - నువ్వు కోప్పడ నంటే.

తాత. ఏమిటది, బాబూ?

మనమడు. నిన్నుచూచి నేను గర్వపడుతున్నా!

తల్లి. అయ్యయ్యో! ఇది ఘోరం! ఘోరాతిఘోరం! నన్ను అనాధను చేస్తారా?

మనమడు. అమ్మా! నీతోనూ ఒకమాట చెప్పాలి - నువ్వు మన్నిస్తే!

తల్లి. ఏమిటది, బాబూ!

మనమడు. నిన్నుచూచి ఎంతో సిగ్గుపడుతున్నాను.

తల్లి. } ఒకేసారిగా { అఁ!
తాత. } { తప్పు, నాయనా! అలా అనబోకు.

మనమడు. ఇలా అన్నందుకు క్షమించు, అమ్మా! కాని ...

తల్లి. నీవు పసివాడవు, బాబూ! నీకు స్త్రీ హృదయం లోతులు తెలియవ్. ఈ యుద్ధం ప్రారంభమైన నాటినుంచీ, నే నెంత

బాధపడుతున్నానో నీ కెలా తెలియజెప్పడం! వారంరోజుల వాడు మన వార్సామీద విమానాలు బాంబులు వేస్తూవుంటే, నీవేమన్నావో జ్ఞాపకం తెచ్చుకో! "నాజీలు మన వార్సాను ధ్వంసం చేస్తున్నారు. మనం వాళ్ళ బర్లిన్ ధ్వంసం చెయ్యాలి. దానికి అదే ప్రతీకారం. అంతేకా దమ్మా ?" అన్నావు.

మనమడు. ఔను. నేనలా అంటే, "నిజమే బాబూ?" అన్నావ్ నువ్వు.

తల్లి. పైకి అలా అన్నప్పటికీ, లోపల నాకు ఎన్నో ఆలోచనలు పోయాయి. "నాజీ వైమానికుల దురాగతాలవల్ల ఇక్కడ ఎందరో తమ బిడ్డల్ని, భర్తల్నీ, అప్పల్నీ పోగొట్టుకుని విలపిస్తున్నారు. బర్లిన్‌పై మనం బాంబుల్ని వేసివచ్చినా ఇంతేగా జరిగేది ? పోలిష్ స్త్రీల దుఃఖమెంతో, జర్మన్ స్త్రీల దుఃఖమూ అంతేగా ? యుద్ధం ఎంత ఘోర వ్యాపారం !" అని నేను అనుకుంటూ వుండగానే ఉత్తరం వచ్చింది. దాన్ని చూడగానే ఎంచేతనో నా గుండెలో రాయి పడింది. "నాన్న దగ్గరినుంచేనా ?" అని ను వ్వన్నావు.

మనమడు. కాదని నువ్వు చెప్పావు. కాని, అది నాన్నదగ్గరి నుంచే వచ్చిందన్నమాట !

తల్లి. కాదు, బాబూ ! ఆర్మీ హెడ్‌క్వార్టర్స్ నుంచి. పైకి పట్టుకు వెళ్ళి, ఉత్తరాన్ని విప్పి చదువుకుందుమగదా....ఆ క్షణంనుంచీ నాకు జీవితంపై అసహ్యం పుట్టింది. అయితే, నిన్ను చూచు కుని - నీకోసం - నీలో జీవించాలనుకున్నాను. ఒక్కసారి గట్టిగా ఏడిపిస్తే హృదయభారం కొంత తగ్గేదేమో! కాని,

నువ్వు ఈ దుర్వార్త ఎక్కడ తెలుసుకుంటావో నని నాదుఃఖాన్ని దిగమింగాను. ఈ వారంరోజుల నుంచీ....లాభం లేదు, బాబూ! చెప్పినా నీ కిది అర్థం కాదు.

మనమడు. అర్థం కాకేం? అద మొదానే వున్నదమ్మా! కాని, నాన్న ఏ ఆదర్శంకోసం జీవించాడో, దేనికోసం మరణించాడో, దాన్ని మనం మర్చిపోవచ్చా? నాన్న బయల్దేరి వెడుతుంటే, నువ్వు కళ్ళ నీళ్ళు పెట్టుకున్నావు. అప్పుడు నాన్న కన్నుకూడా చెమ్మగిలింది గాని, దానిలో గొప్పవెలుగు కనబడింది. అప్పుడు దాన్ని నేను అర్థం చేసుకోలేక పోయాను. కాని, తాతమాటల్ని విన్నమీదట "నేనుపోతే మాత్రమేం? నా పోలెండ్ చిరస్థాయిగా వుంటుంది" అని నాన్న ఆ క్షణంలో అనుకుంటూ వున్నాడని తెలిసింది. నాన్న ధైర్యాన్నీ, త్యాగాన్నీ మార్షల్ పిల్సుడ్‌స్కీ జీవించివుంటే ఎంతగా....

అమ్మ. పిల్సుడ్‌స్కీ....పిల్సుడ్‌స్కీ....రాత్రింబవళ్ళు పిల్సుడ్‌స్కీ సంస్మరణే! దీనితోనే నా బ్రతుకంతా వెళ్ళమారిపోతున్నది. కూతురుగా నేను తండ్రి ప్రేమకు నోచుకోలేదు: భార్యగా భర్త ప్రేమకు నోచుకోలేదు. వారి హృదయాలలో పిల్సుడ్‌స్కీకే గాని, నాకు స్థానం లేకపోయింది. చివరికి కొడుకు ప్రేమనైనా పొందలేక పోతానా అనుకుంటే, వాడి మతినికూడా విరిచేశారు [తండ్రివైపు తిరిగి] నాకెంత అన్యాయంచేశావ్, నాన్నా!

తాత పిల్సుడ్‌స్కీని ఒకవ్యక్తి అనుకుని నువ్వు పొరపడుతున్నావమ్మా! ఆయన ఒక భావం; ఒక లక్ష్యం; ఒక ఉద్యమం.

ఆయన ఒక విప్లవం; ఒక వెల్లువ. పోలెండ్ ఆయనలో మూర్తీ భవించింది మేము ఆయన్ని ప్రేమించామంటే పోలెండ్‌ను ప్రేమించామన్న మాట. ఆయనను స్తుతించామంటే పోలెండ్‌ను స్తుతించా మన్నమాట ఇది నీకు అర్థం కాదేమో గాని, పురుషులమైన మేము దేశదాస్యాన్ని సహించలేమమ్మా! అది మా వ్యక్తిత్వానికే అవమానం; మా జీవితానికే అపవాదు. దాస్య జీవనంకంటె మరణమే మాకు మేలుగా కనిపిస్తుంది.

తల్లి. కాని, నామాటేమిటి నాన్నా? [జవాబుచెప్పక పోవడాన్ని చూచి] ఏమి, నాన్నా! జవాబుచెప్పవు?

తాత. నే నేమి జవాబు చెప్పగలనమ్మా?

[తర్వాత ఒకక్షణం అంతా ప్రశాంతం. అంతలో ఆ గభీరప్రశాంతిని చీల్చుకుని 'స్విష్' 'స్విష్' అంటూ వరసతప్పని వికృతధ్వని. సమీపంలో మార్చ్ చేస్తున్న నాజీ సోల్జర్ల బూట్లు చేస్తున్న ధ్వనే అది. నెమ్మదిగా ప్రారంభమై, క్రమంగా అది హెచ్చుతుంది.

తాత. అదుగో నమ్మా! నీ ప్రశ్నకు అదే జవాబు! నాజీ రాక్షసి తన ఇనపపాదాలకింద మన పోలెండ్ స్వతంత్రరాజ్యాన్ని రాచెయ్యాలని చూస్తున్నది. దీన్ని నువ్వు సహించగలవా? సహించ వచ్చా?

["స్విష్", "స్విష్" ధ్వని మరీ దగ్గరగా వస్తుంది; మరీ భయంకర మౌతుంది. ఆ ధ్వనిని మించికూడా హాండ్‌గ్రనేడ్స్ ప్రేలుడు, భయార్తుల ఆక్రందనాలు వినబడతాయి. తల్లి చప్పున కొడుకుదగ్గరికి జరిగి, అతణ్ణి కౌగిలించుకుంటుంది.

తల్లి. అబ్బ! ఏం ఘోరమిది!

తాత. ఔనమ్మా! ఘోరమే! అయితే, ఇది మన పోలెండ్‌కు కొత్తకాదు. ఈ నాజీల తలదన్నినవారు మనదేశాన్ని దాస్యబద్ధం చెయ్యాలనుకున్నారు; దాని ఆత్మను నశింపజెయ్యాలనుకున్నారు. కాని, నీ భర్త, నీ కుమారుడు లాంటివారిని కన్నదేశం చచ్చిపోతుందా? పోదు! ఈ ప్రళయం తర్వాత పోలెండ్ పునర్జన్మ నెత్తుతుంది. ["స్విష్", "స్విష్" ధ్వని అంతకంతకూ దూరమై, అసలే వినబడకుండా పోతుంది] కాని, నాస్థితిని చూచుకుంటే నాకే సిగ్గూ, విచారమూ కలుగుతున్నది. నా దేశానికి ఘోర సంకటం తటస్థించిన ఈ సందర్భంలో దాని రక్షణకు నిలబడ్డానికి నాకు యవ్వనం లేకపోయింది. నే నెంత దౌర్భాగ్యుణ్ణి!

[తాత కళ్ళనుంచి కన్నీరు కాల్వలు కడుతుంది.

తల్లి. అదేమి, నాన్నా! కంట తడిపెడుతున్నారు. నాకుమాత్రం మన దేశంపైన అభిమానం లేదూ? కన్నకడుపు కాబట్టి, ఈ పసివాడి విషయమై దిగులుపడుతున్నా గాని....

మనమడు. నా విషయమై మాత్రం నీకు దిగులు దేనికమ్మా? నేనూ, నావంటివారూ సుఖంగా, గౌరవంగా, జీవించడానికి తగిన స్వతంత్ర పోలెండ్ రాజ్యాన్ని కాపాడ్డానికేగదా నాన్న ఆత్మార్పణ చేసింది! దీనికోసమే గదా తాత ఇంత పెద్ద

తనంలో కూడా తుపాకి పట్టబోతున్నది !! మాకోసమై జరుగుతున్న ఈ ప్రయత్నంలో నేను పాల్గొనవద్దా ?

తల్లి. నిజమే, బాబూ ? కాని....

మనమడు. కాని, గీని అని ఇంకా సంకోచం దేనికమ్మా ? [ఇంతలో తిరిగి విమానాలరొద, ఆ రొదను మించేలా అతడు గొంతెత్తుతాడు] తాత ద్వారా నువ్వు వీరపుత్రికవైనావు. నాన్నద్వారా వీరపత్నివైనావు. ఇక, నా ద్వారా వీరమాతవు కా గోరతావా, లేదా ?

తల్లి. తప్పక కోరతాను, బాబూ ?

మనమడు. అయితే, అమ్మా ! మాతో చేరి విజయధ్వానం చెయ్యి : " పోలెండ్‌కు జై ".

తాత.<br>తల్లి.<br>మనమడు. } ఒకేసారిగా { పోలెండ్‌కు జై !

[ముమ్మారు అంటారు. తర్వాత తాత బీరువాలోనుంచి తుపాకి గుళ్లు తెచ్చి, రైఫుల్ లోడ్‌చేసి, వీధితల కిటికీలలో ఒకదానివద్దకు వెళ్ళి, వీధివెంట మార్చ్ చేస్తున్న నాజీ దళంపై వణకుతున్న చేతులతో కాలుస్తాడు. వెంటనే ఇరవై, ముప్ఫై రైఫుల్స్, కొన్ని హాండ్‌గ్రెనేడ్స్ వీధిలోనుంచి జవాబు చెబుతాయి. గది పొగలు కమ్ముకుపోతుంది.

ఆ పొగలు కాస్త తగ్గేసరికి తాత చచ్చి పడివుంటాడు. తల్లి వెంటనే భయవిభ్రమాలతో తాత పక్కన సొమ్మసిలుతుంది. తాత చేతిలోని తుపాకి తీసుకుని, కిటికీవద్ద నిలబడి మనమడు దాన్ని ఎక్కు పెడుతుండగా——

తెర ]



# పాత్రలు

| | |
|---|---|
| సుందరి : | పెళ్ళిఈడు పిల్ల |
| సీతమ్మ : | సుందరి తల్లి |
| రాజమ్మ : | సీతమ్మ ఆడబిడ్డ |
| రంగమ్మ : | రాజమ్మ తల్లి |

తమ "సుమంగళి", "స్వర్గసీమ" ఫిల్ములలోని మూడు పాటలను ఈ నాటికలో నేను ఉపయోగించుకొనడానికి అనుమతించిన వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ వారికి కృతజ్ఞుడను.



# ఆడబ్రతుకు

## 1

అది సుందరిగారి యింటిలో ముందుగది. ఎదురుగా వున్నది సింహద్వారం. దానికి రెండు వైపుల రెండు కిటికీలు. కుడి చేతివైపుద్వారం పడకగదిలోకి; ఎడమ చేతివైపుది భోజనాల గది, వంటిల్లు మొదలైన వాటిలోకి.

పెద్దగదిలో పడకగది గోడసరసను ఒక స్టూల్. దానిమీద ఒక గ్రామఫోన్. గోడలకు కొన్ని రవివర్మ పటాలు. భోజనాల గది గోడకు ఆన్చి మరొక టేబుల్. దానిమీద ఏవో కొన్ని ఆఫీసు రికార్డులు, కలం, సిరాబుడ్డి వగైరాలు; దానిదగ్గర ఒక పడకకుర్చీ.

తెర లేచినంతనే మనకు కానవచ్చే సుందరి పెళ్ళీడుకొచ్చిన పిల్ల. "ఆడది మెచ్చిందే అందం" అని సామెత. సుందరి ఆడవారిచే మెప్పు పొందగలిగినంతటి అందకత్తె. మేలిమి చాయకు పడుచుదనపు మిసిమి తోడుకావడంవల్ల కుందనపు బొమ్మ అనిపించుకుంటున్నది. కట్టుకున్నది చాకపారు నేత చీరే అయినా, పెట్టుకున్నవి చేతికి ఒక జత బంగారం గాజులు, చెవులకు లోలకులు, మెడలో ఒంటిపేట గొలుసుమాత్రమే

అయినా, చీని చీనాంబరాలు ధరించే రాజపుత్రికలైనా సుందరిముందు వెలవెల పోవలసిందే.

సుందరిని చూచినంతనే ఆకర్షించేవి కాంతులీనే లేడికళ్లే. ప్రేమతో, విశ్వాసంతో లోకాన్ని చూచేవి ఆ కళ్లు; లోకం నుంచి ప్రేమను, విశ్వాసాన్ని ఆశించేవి ఆ కళ్లు. సుందరి కల్ల, కపటాలు యెరగనిదని, తియ్యని పగటి కలలు కనగలదని ఆ కళ్లను చూచినవారికి వేరే చెప్పనక్కరలేదు.

తెర లేవబోతుందనగా ఈ కింది గ్రామఫోన్ రికార్డ్ "లోవాల్యూమ్" లో ప్రారంభమై, క్రమంగా "హై వాల్యూమ్" లోకి వస్తుంది.

"వస్తాడే-మా బావ-వస్తాడే—రేపో-మాపో-వస్తాడే
ఢిల్లీనుంచి వస్తాడే పరీక్షపాసై వస్తాడే।
ఉల్లాసముగ ఆడీపాడీ, మల్లెపూవులా దండలు వేసీ
తీయతీయనీ పండ్లానొసగీ, చందమామలా అందము చిలికే
బావకుస్వాగతమిస్తానూ-ఇస్తానూ-బావకుస్వాగతమిస్తానూ॥
పూలతోటలో కోయిల పలుకూ క్రొత్తపాటతో మేళవించీ
పాడి ఆనకొనగా, చిలుకలు కిలకిల నవ్వేచూ॥
బస్తీనుంచీ వస్తావె, చీరెలు నగలూ తెస్తావా!
కోరినవన్నీ తెస్తావా! తెస్తాడూ, అడిగినవన్నీ తెస్తాడూ
రేపో మాపో వస్తాడూ
వస్తాడూ, వింటాడూ
నీ మువ్వలమ్రోతలు వింటాడూ, నీ మువ్వలమ్రోతలు వింటాడు
తెస్తాడు, నీ కిస్తాడూ
వెన్నామీగడ లిస్తాడు, వెన్నా మీగడ లిస్తాడు

వస్తాడే మాబావ, వస్తాడే మాబావా
నవ్వుతాడే, నవ్విస్తాడే
హోహోహోహో హాహాహోహో నన్ను పెళ్ళిచేసుకుంటాడే.

[గ్రామఫోన్ రికార్డ్‌తో గొంతుకలిపి పాటపాడుతూ సుందరి గిరగిర తిరుగుతుంది. ఇలా తిరగడంవల్ల కళ్లు బయిర్లు కమ్మగా తూలిపడిపోబోతుంది. కాని నిలదొక్కుకుని ఒక క్షణం పాటు కళ్లు మూసుకుంటుంది. ఆతర్వాత శూన్యాన్ని చూస్తూ "రా అత్తయ్యా! రా! ఇదేనా రావడం? అంతా బాగున్నారా? మా మామయ్య, మా బావ...["బావ" అనే సరికి సిగ్గుపడి, మాట మధ్యలో ఆగిపోయి] "అమ్మా! అత్తయ్యొచ్చిందే!" అని కేక వేస్తుంది. ఈ ఘట్టంలో చప్పున లైట్స్ ఫేడ్ ఔట్ అయిపోతాయి.

## 2

తిరిగి లైట్స్ ఆన్ అయ్యేసరికి సీతమ్మ, రాజమ్మ చిరిచాపపై కూర్చుని మాట్లాడుకుంటూ వుంటారు. సీతమ్మ వయస్సు ఇంచుమించు ముప్ఫై; రాజమ్మ వయస్సు దాదాపు నలభై. సీతమ్మ మాసిన చీరతో, చెరిగిన జుట్టుతో వుంటుంది. బోసిమెడ. చేతికి ఒక బంగారం గాజైనా లేదు. రాజమ్మ చక్కగా ముస్తాబై వుంటుంది. మెడ నిండా నగలు.

సీతమ్మ. మీ అన్నయ్య చూపంతా నీమీదే పెట్టుకున్నారు. మరి నువ్వేం చేస్తావో రాజమ్మొదినా!

రాజమ్మ. ఆఁ! నా దేముందే, సీతమ్మా!

సీతమ్మ. అదేం మా టొదినా! నువ్వు కావాలంటే....

రాజమ్మ. నేను కావాలన్నీ అవుతున్నాయటే ? - ఇది కావడానికి !

సీతమ్మ. అయినదానివి నువ్వే ఇలా మాట్లాడితే, ఇక ఏం సానుకూల మౌతుంది ? సుందరి భూంమీద పడ్డప్పటినుంచీ దాన్ని మేనల్లుడికిచ్చి చెయ్యాలని మీ అన్నయ్య ముచ్చట పడుతున్నారు. మేనల్లుడంటే ఆయన కెంత అపేక్షో నీకు తెలియం దేమున్నది ?

రాజమ్మ. అయితే, ఇప్పుడు నే నీ సంబంధం వొద్దంటున్నానటే ! కన్నారితో వియ్యమంది వస్తూ పోతూ వుండాలని నాకుమాత్రం వుండదూ ?

సీతమ్మ. వద్దనడం లేదనుకో. కాని, కావాలని నువ్వ పట్టు వట్టాలి. నువ్వ పట్టుపడితే మా అన్నయ్య నీమాట తోసేస్తాడా ?

రాజమ్మ. మావారి సంగతి నీకేం తెలుసు ! తనకెంత తోస్తే అంతే ! ఎవరేం చెప్పినా వినిపించుకోడు. నాలుగేళ్ళనాడు భూమీపుత్రా అమ్మొద్దని చెవి నిల్లుకట్టుకు పోరినా విన్నాడూ?

సీతమ్మ. అమ్ముకోవడం మంచిపనే అయిందిగా ! ఆనాడు ఆ రెండెకరా లమ్ముకుని వ్యాపారం చెయ్యబట్టేగా ఈనాడు యాభై వేలు సంపాయించారు !

రాజమ్మ. ఆఁ ! అప్పుడు మూడువేలకు తెగనమ్ముకున్న ఆ చేనే యిప్పుడు అయిదువేలు చేస్తున్నది ! ఆయన చేసే బేరాలన్నీ యింతే ! ఏం బేరాలో - బెండిత్తులు !

సీతమ్మ. మా అన్నయ్య బేరాలకే నువ్వ వంక పెడుతున్నావుగా ! ఆ రెండెకరాలు పోతేనే ? ఇప్పుడు కావాలనుకోవాలేగాని పాతి కెకరాలు కట్టుకోగలడు !

రాజమ్మ. ఏమైనా తాతలనాటిగడ్డ పోయిందిగా ! దాన్ని ఏ వెయ్యి న్నరకో, రెండువేలకో తనఖా పెట్టుకుంటే పనికి పనీ జరిగేది ; పొలానికి పొలమూ మిగిలేది.

సీతమ్మ. నీ మాటల కేమిలే, వొదినా ! తెగింపు చెయ్యబట్టే మా అన్నయ్యకు బాగా కలిసొచ్చింది. మాపని చూడరాదూ ? ఎప్పు డొచ్చినా ఆ జీతపురాళ్లేగా ? యుద్ధానికిముందు ఏదో కా_స్త పచ్చ పచ్చగా కనబడ్డా, ఇప్పుడు నీళ్లకారి పోతున్నాం. ఏం కొన బోయినా ధరలన్నీ మండిపోతున్నాయయ్యొ. రూపాయి మార్చడమే కనబడుతుంది గాని, ఇంటి కొచ్చేది కనబడదు. ఏమీ మిగలకపోతే పాయె ! ఎప్పుడు మిగిలేడ్చింది గనుక ఇప్పుడు మిగలడానికి ! కాని, పూర్వం జరిగినట్టు జరగడమైనా గగనమై పోతున్నది. మాపని దిగదియ్యబట్టేగా మేం మీకు దూరమై పోతున్నాం ! మీకంటిలో మేమిక దూరంలే !

రాజమ్మ. అదేమిటే ! మాకు భాగ్య మొచ్చిందని మాకళ్లు పైకి పోయాయా ?

సీతమ్మ. అబ్బే ! ఎంతమాట ! కాని, మాతో సంబంధం చెయ్యడ మంటే, ముందు నీకే ఏమంత యిష్టం లేనట్టున్నది.

రాజమ్మ. నే నిష్టపడితే సరేనా ? ఆయ నిష్ట పడొద్దూ ?

సీతమ్మ. మా అన్నయ్య కభ్యంతరం లేదట. మావా రడిగితే "ఆఁ! నాదే మున్నది ? నీ యిష్టం, నీ చెల్లి లిష్టం" అన్నాడట.

రాజమ్మ. ఆయ ననవలసినమాట అంతేగా !

సీతమ్మ. అయితే, మా అన్నయ్యకే మాతో సంబంధం చెయ్యాలని కడుపులో లేదన్నమాట !

రాజమ్మ. ఆఁ! మా మాటకేమిలే? అసలు పిల్లవాడిష్ట పడొద్దూ? ఈకాలపువాళ్ల అమ్మా. బాబూ కుదిర్చిన పిల్లల్ని చేసుకుంటున్నారూ?- తమకు నచ్చినదాన్ని తామే ఏరి, కోరి కట్టుకుంటున్నారు గాని!

సీతమ్మ. అబ్బాయినికూడా మావారు కదిలించిచూస్తే, తన కిష్టమే నన్నాడట. నిన్ను, మా అన్నయ్యను, అడిగి చూడమన్నాడట.

రాజమ్మ. ఆఁ! పసివాడు! తెలి సొకమాట, తెలియ కొకమాట, అయినా, ఇప్పుడేం తొందర? వాడి చదువైనా పూర్తికాలేదింకా, మరి రెండు మూడేళ్ళదాకా వాడి పెళ్ళిమాట మేము తలపెట్ట బోవడంలేదు.

సీతమ్మ. అదేమిటి రాజమ్మొదినా? గుడివాడవా రెవరితోనో సంబంధం మాటలు నలుగుతున్నాయటగా!

రాజమ్మ. ఎవ రన్నారు?

సీతమ్మ. ఆఁ! ఎవరంటే నేమిలే! మీరు ఎంత కప్పిపెట్టాలన్నా ఆ నోటా, ఆ నోటా తెలియక పోతుందీ?

రాజమ్మ. మరి అన్నీ తెలిసినదానివి నన్నడగడం దేనికి?

సీతమ్మ. ఊరుకుంటుందీ పాడుమనస్సు! ఆశ పీడిస్తుంటుందిగా? "ఇంకొకసారి అడిగి చూడండి. వాళ్ళమాట వాళ్ళకే వుంటుం" దని నలుగు రనబట్టే, ఇంకా అడగడం.

రాజమ్మ. వాళ్ళెవరో వొచ్చారులే! - మూడెకరాల మాగాణి, అయిదువేల రొక్కం యిస్తామంటూ. పిల్లవొంటిని యాభై నవర్సుల బంగారంకూడా వుందట..

సీతమ్మ. మీచూపు కట్నాలమీదికి పోతే, మేమెక్కడ తూగగల

మొదినా ? మా అన్నయ్య చుట్టరికం చూచుకుంటాడుగావు. డబ్బు కాశపడతా డనుకోలేదు.

రాజమ్మ. ఏం! డబ్బంటే ఎవరికైనా చేదా ?

సీతమ్మ. అయితే మీకూ, మాకూ ఇంతటితో తీరిపోవలసిందేనా, వొదినా ? ఇక మమ్మల్ని మీ గడప తొక్కొద్దంటారా ?

రాజమ్మ. నీదంతా చోద్యమే, సీతమ్మా! ఇంత మాత్రానికే మా అన్నయ్య నాకు అన్నయ్య కాకపోతాడా ? నేను చెల్లెల్ని కాకపోతానా ?

సీతమ్మ. సుందరిని నీ చేతిలో పెడితే, అది సుఖపడుతుందని మీ అన్నయ్య....

రాజమ్మ. ఎవరి కెక్కడ గీతవుంటే అక్కడౌతుంది. మన మనుకున్న వన్నీ అవుతాయటే!

సీతమ్మ. అది వొఠ్ఠి మెతకపిల్ల. నోట నాలిక లేదు. అయినవాళ్ళ కిస్తే కడుపులో పెట్టుకు కాపాడతా రనుకున్నాం. ఇక, దాని గతి ఏంకానో!

రాజమ్మ. దానికేమే ? పుత్తడిబొమ్మ! దాన్ని ఎవరైనా కళ్ళకద్దుకు చేసుకుంటారు.

సీతమ్మ. [నిట్టూరుస్తూ] ఇప్పు డంద మెవరికి కావాలి ? చదువు లెవరికి కావాలి ? బుద్ధు లెవరికి కావాలి ? కట్నాలు పొయ్యాలి. మాకు లేవుగా సంచులు ? - గుమ్మరించడానికి!

రాజమ్మ. ఆఁ! దానికి తగినవా డెవడో దాని కొస్తాడు. పేదపిల్ల లందరు పెళ్ళిళ్లకాకుండా అట్టే వుంటున్నారటే! దాని కెవడో ఎక్కడో పుట్టేవున్నాడుగాని, పుట్టబోడుగా ?

సీతమ్మ ! ఇంకా మీ అన్నయ్య గంపెడాశతోనే వున్నారు. ఈ మాట వింటే ఆయన నడుం విరిగిపోతుంది.

రాజమ్మ ఆఁ ! మా అన్నయ్యకు అల్లుడే కరువౌతాడటే !

సీతమ్మ. అల్లుడు దొరక్క అట్టే వుండడులే! కాని, బుద్ధిమంతుడని మేనల్లుడంటే, ఆయన కెంతో భ్రమత ! ఇంట్లో పెట్టుకుని నాలుగేళ్లు చదువు చెప్పించుకున్నారు కూడా.

రాజమ్మ. ఎవరి మేనల్లుడిమీద ఎవరికి భ్రమత లుండవు లేవే ! నాలుగేళ్లు చదువు చెప్పించినందుకు అయిదారొందలు అయ్యాయేమో ! సుందరిపెళ్ళికి అంతకంత మే మేదో ఒక రూపంలో ముట్టజెప్పకపోములే !

సీతమ్మ. మీరు ముందెప్పుడో అంతకంత మాకు ముట్టజెబుతారని మేము చదువు చెప్పించలేదు. మీ పెట్టుపోతలు మా కొద్దులే తల్లీ ! ఏదో ఒక విధంగా దాన్ని దిరగడ చేసుకోలేక పోతామా?

రాజమ్మ. సరే ! మీరు మమ్మ ల్తోసెయ్యదల్చుకుంటే....

సీతమ్మ. ఎదురు ఈమాట కూడానా ? ఎవరు ఎవర్ని తోసేస్తున్నారో లోకానికి తెలవదూ ? మీ అన్నయ్య వన్నీ పిచ్చి భ్రమతలుగాని, ఇప్పుడు మీచూపుకు మేమెక్కడ ఆనతాం ! మీరిప్పుడు కోటీమీద కూర్చున్నారయ్యే ! మిమ్మ ల్నందుకోవాలన్నా మేము...

[ఫేడ్ ఔట్.

# 3

[మొదటి దృశ్యంలో ఎక్కడ ఏభంగిమంలో నిలబడిందో అక్కడే, ఆ భంగిమంలోనే నిలబడి

సుందరి "అమ్మా! అమ్మా!! అత్తయ్యొచ్చిందే" అని కేకవేస్తుంది. ఈ కేక విని సీతమ్మ ప్రవేశిస్తుంది.

సీతమ్మ. ఏమిటే నీ కేకలు సుందరీ?

సుందరి. అత్త యొచ్చిందే, అమ్మా!

సీతమ్మ. ఏదీ? ఎక్కడ?

సుందరి [శూన్యాన్ని చూపిస్తూ]. అదే! ఎదురుగుండా!

సీతమ్మ. నీకు పిచ్చేమైనా పట్టిందేమే! ఎవరున్నా రక్కడ?

సుందరి [నిద్రలోనుంచి మేల్కొంటున్నట్టు కళ్లు నులుముకుంటూ]. ఔనమ్మా! ఎవ్వరూ లేరు. కాని, ఇంతకుముందు—ఇప్పుడే—అత్తయ్యొచ్చినట్టు ..

సీతమ్మ. ఆవిడ మనింటి కెందుకొస్తుందే! వాళ్ళు కోటీమీద కూచ్చున్నారయ్యో! ఇప్పుడు మనం వాళ్ళ కంటిలో దూరం.

సుందరి. అత్తయ్య రాలేదుగాని, సినిమా తెరమీద బొమ్మ కనబడ్డట్టు. .

సీతమ్మ. నీకు మతి పోతున్నదేమే? వాళ్ళు అసలిప్పుడు కింద నడుస్తున్నారూ? దొంగ వ్యాపారం చేస్తేనే? అందరి కడుపు కొడితేనే? ఎందరి కొంపలో ఆర్పితేనే? తమ కింత పోగు పడింది. ఇప్పుడు మనమంటే వాళ్ళ కెంత చులకన! ఈ పాడు సినిమాలతో సగం నీమతి చెడుతున్నది. కాసేపు మురిపించి డబ్బు పోసుకోడానికి—వాళ్ళకేం?—తెరమీద బొమ్మల్ని తైతక్క లాడిస్తారు!

సుందరి. అయితే, ఫిల్ములలో మనం చూచినట్టు జరగ్గావే జరగదంటావా, అమ్మా?

సీతమ్మ. అది పచ్చి బూటకం! బ్రతుకు దొకదారైతే, సినిమా దొకదారి. దానికీ, దీనికీ సాపత్యమెక్కడ? ప్రేమలనీ, పెళ్లిళ్లనీ వాళ్లు ఏమేమో అంటారు. ప్రపంచంలో ప్రేమ లెక్కడివి, తల్లీ? డబ్బే ప్రధానం. డబ్బులేనివాడు డుబ్బుకు కొరగాడు.

సుందరి. ఆఁ! డబ్బేనా ప్రధానం!

సీతమ్మ. ఔను తల్లీ! మీ మామయ్యకు, అత్తయ్యకు మన మెందుకు దూరమైపోయాం? మనకి డబ్బు లేకపోబట్టేగా? డబ్బుంటేనే ప్రేమలైనా, చుట్టరికాలైనా.

సుందరి. ఆఁ! నీమాట నేను నమ్మనమ్మా!

సీతమ్మ [సుందరిని దగ్గరికి తీసుకుని తల నిమురుతూ]. ఇంత వెఱ్ఱిబాగులదానివి! నువ్వేం కడతేరతావో!

సుందరి. అమ్మా!

సీతమ్మ. ఆఁ!

సుందరి. నే నొక కొత్త సినిమా పాట నేర్చుకున్నా నమ్మా!

సీతమ్మ. ఏమిటది?

సుందరి. అది చాలా చక్కని పాటమ్మా!

సీతమ్మ. అంత చక్కని పాటా?

సుందరి. ఔనమ్మా! అయితే దాని బాణీ నేనింకా బాగా పట్టుకోలేదు గాని, పాడి వినిపించనా!

సీతమ్మ. సరే! పాడవమ్మా! వింటాను.

[సుందరి ఈ కిందిపాట పాడుతుంది:

"గృహమే కదా స్వర్గసీమా!
మహానియమా ప్రేమ మహిమమ్ము వెలసిన

ఈగృహమే కదా, మన గృహమే కదా స్వర్గసీమ!
ఇలలోన లేదంచు తలపోయనేలా?
కలలందు దర్శింపగా కోరనేలా?
జపమేల, తపమేల, వ్రతపూజలేలా?
సాధించితే ప్రేమ సామ్రాజ్యమౌ నీకు.
జగతిని యశమంది, సంపదలంది,
ప్రియమున లాలించి, పాలించు విభుడు."

[పాట పూర్తికావస్తుండగా ఫేడ్ ఔట్.

# 4

తిరిగి లైట్స్ ఆన్ అయ్యేసరికి రంగమ్మ నీళ్ల బిందెతో ప్రవేశిస్తుంది. ఆమె వితంతువు. వయస్సు యాభై అయిదు. కాని, సందర్భానుసారంగా ఆమె దాన్ని యాభయ్యో, అరవయ్యో చేస్తూవుంటుంది.

రంగమ్మ గంపెడు చీకటి నెత్తినేసు కెళ్లినా. పాడుమూక అప్పుడే పంపుచుట్టూ చేరింది. బిందెడు నీళ్లు పట్టుకొచ్చే సరికి ఆలప్రాణం తోక కొచ్చింది. మాయదారి గుంపు! ముద నష్టపు గుంపు!! కాస్త సందిస్తేనా? పైపైకి తోసుకు రావడమే! అదున్నది—ఆ పుట్టుకుంక—దాని ముఖంమండ! —ఆది మరీనీ! పంపుకింద బిందెట్టుకుంటే లాగి పారేస్తుంది. దాన్ని అమ్మోరమ్మ తల్లి యెత్తికెళ్ళ! పోట్లాటకు రయ్యిమని పైకొస్తుంది [బిందె యింటిలో దింపివచ్చి] ఈ నీళ్ళు నేను జేరబొయ్యలే నమ్మా! పాడు నీళ్లు! అయినా, పంపులేని కొంపలో వుండడంకంటె బుద్ధి తక్కువున్నదీ? అద్దె రెండు, మూడు

రూపాయలు ఎక్కువ పెట్టినా పంపున్న యిల్లు చూడరా అంటే మా సన్నాసి నా మాట వింటాడా, పెడతాడా? నే నున్నానుగా మండినసీళ్లు ఎన్నైనా జేరబొయ్యడానికి! వాడికేం నెప్పి? నేను నెత్తిని నోరెట్టుకు మొరిగినా, చీమైనా కుట్టనట్టు ఊరుకుంటాడు. ఎంతకాలం చేస్తాను నే నీ అగవ చాకిరి? అంతకంతకు ఒక ఏడు పైబడుతున్నది గాని, తగ్గడంలేదుగా!...ఒసేయ్! నిన్నే...ఏమేయ్! సీతమ్మా!.... ఉహూఁ! అదెందుకు పలుకుతుంది? వినిపించుకున్నా మెదలకుండా వూరుకుంటుంది. అమ్మో! అదెంత నాలిముచ్చు! ఒసేయ్! సీతమ్మా! ఒసేయ్! నిన్నేనే!.... నే నెంత గొంతు చించుకుంటే మాత్రం దాని కెందుకు వినబడుతుంది? నా పిలుపంటేనే దాని చెవుల్లో చెట్లు మొలుస్తాయ్! అమ్మ! ఎంత కానరాని దదీ! నోట్లో బెల్లంరాయి కొట్టుకున్నట్టు నిలబడే తేలులా చిటుక్కు పొటుక్కున కొండి అంటిస్తుంది. లోకులకు రాగదాన్ని నేనే! అది చేసేపనులు వాళ్ళకేం తెలుస్తాయ్!.. సీతమ్మా! ఏమేయ్!....

[సీతమ్మ వస్తుంది. కిందటి రంగంలో మనం చూచినప్పటి కంటె ఆమె దాదాపు పదిహేనేళ్లు చిన్నది.

సీతమ్మ. ఎందు కత్తయ్యా?

రాజమ్మ. ఎంత అరచినా పలకవే? అంకిలి నొక్కుకు పోయిందా?

సీతమ్మ. కళ్లాపి జల్లుతున్నా నత్తయ్యా! నీకేక వినబడలేదు.

రంగమ్మ. తెచ్చిన నీళ్ళన్నీ దిమ్మరించేశావ్! తెచ్చే దున్నదిగా?— నీకేం నెప్పి!

సీతమ్మ. లేదత్తయ్యా! నాలుగంటే నాలుగు చెంబుల నీళ్లు....

రంగమ్మ. నీకు నాలుగు చెంబులుగానే కనబడతాయ్! ఒక్కొక్క బిందెడు నీళ్లెత్తు కొచ్చేసరికి నా నడుము లిరుగుతున్నాయ్! అరవై యేళ్లొచ్చినై. ఇంకా ఎంతకాలం చేస్తాను నేనీ గాడిది చాకిరి? పాచినీళ్లట! పాచినీళ్లు!! తెచ్చేదున్నదని బుడబుడ పారబొయ్యడమే! ఒక్కచెంబుడునీళ్ళు పట్టుకురా, తెలుస్తుంది నీకే ఆ కష్టమేమిటో, సుఖమేమిటో!

సీతమ్మ. అంత కోపం దేని కత్తయ్యా! పోనీ, నేనే నీళ్ళు తెచ్చు కుంటాను.

రంగమ్మ. నీకు ముచ్చటగా వుందటే?—నన్ను నలుగురి నోళ్ళలో పడెయ్యాలని! "ఆ రంగమ్మ కేం తిప్ప లొచ్చింది? కోడల్ని బజార్లెంట తిప్పుతున్న"దని అమ్మలక్క లందరు మూతీ ముక్కూ విరుస్తుంటే చూడాలని ముచ్చటగా వుందా?

సీతమ్మ. తప్పు మాటంటే, మన్నించత్తయ్యా!

రంగమ్మ. ఎంత వగలాడివే! అన్నిటికీ ఇదొకటి నేర్చుకున్నావ్! ఉలిపిమాట లనడం! "మన్నించత్తయ్యా!" అని చిలక పలుకు పలకడం!

[సీతమ్మ కళ్ళవెంట గిర్రున నీళ్లు తిరుగుతాయి.

రంగమ్మ. ఏం నంగనాచివే! కల్లిబొల్లి ఏడ్పులుకూడా మొద లెట్టావ్! "రంగమ్మ కోడల్ని కాల్చుకు తింటున్న"దని నలుగురి చేత నన్ను ఆడిపోయించమ్మా! ఆడిపోయించు!! రద్దీ రవ్వా లేకుండా బతికిన ముండని, నన్ను అల్లరి పెట్టందే నీకళ్ళు చల్లబడవులే!

[సీతమ్మ కళ్లు తుడుచుకుని వెళ్ళిపోబోతుంది.

రంగమ్మ. ఎక్కడికే పోతున్నావ్ ?

సీతమ్మ. ఒక ముగ్గుకర్రే సొస్తా.

రంగమ్మ. మాట్టాడేదాన్ని నేను మనిషినేనా ? ఒక పక్కని మాట్టాడుతూవుంటే దులపరించుకు పోతున్నావ్ !

సీతమ్మ. తప్పే నత్తయ్యా ! మన్నించు.

రంగమ్మ. అదుగో ! మళ్ళీ...

[సీతమ్మ గుడ్లనీళ్లు గుడ్ల కుక్కుకుంటుంది.

రంగమ్మ. సర్లే ! నీకు నీ అమ్మా, బాబూ నేర్పిపంపిన చిలక పలుకులు ఇవ్వాళ పొమ్మంటే ఎక్కడికి పోతాయిగాని, కాఫీ పెట్టావా ?

సీతమ్మ. ఇంకా లేదత్తయ్యా !

రంగమ్మ. బారెడు పొద్దెక్కినా నీకు కాఫీ పెట్టడానికే తీరలా !

సీతమ్మ. చేతిలో పని కాగానే పెడతా నత్తయ్యా !

రంగమ్మ. అబ్బే ! ఎందుకులే ? పెట్టొద్దు! నా కూతురు పల్లెటూరి దయ్యే! మన్ను పిసుక్కునేదయ్యే! అది నీలా ఉద్యోగస్థుడి పెళ్ళామా ? బస్తీ కాపరం చేస్తున్నదా ? అది కాఫీ ముఖమే మెరుగున్నది ?

సీతమ్మ. రాజమ్మొదిన ఇంకా నిద్ర లేవలేదత్తయా ! ముందే పెడితే చల్లారిపోతాయని పెట్టలేదు. ఇదుగో ! పెడుతున్నా. ఇప్పుడే పెడతా.

[సీతమ్మ పెడుతుంది.

ంగమ్మ [వెనకనుంచి]. దానికి కాసిని కాఫీనీళ్ళివ్వడానికి చేతులు రాక ఎన్ని వేషాలు వేస్తున్నావే! ఇంతకూ నిన్ననే పనేమిటి? నా కొడుకు మంచివాడైతే నువ్వు ఆడించే ఆటగా సాగుతుందా? వాడొఠ్ఠి దద్దమ్మ! పెళ్ళానికి చాల్లేడు. మొన్న అది ఇరుగు పొరుగు అమ్మలక్కలతో చేరి నాటకానికి వెళ్ళొస్తే కుక్కిన పేనులా వూరుకున్నాడు గాని, పల్లెత్తుమా టన్నాడూ? మనం సంసారులం. నాటకాలు, గీటకాలు మన కెందుకు? ఇది డబ్బు దండగచేటనా? మరేమైనానా? అది ఎన్ని దండగలు పెట్టినా వాడి కిష్టమే. కచ్చేరీకి వెళ్ళిన ఆ కాసేపు తప్పితే, దాని కొంగుచ్చుకు తిరగాల్సిందే! పట్టపగలే దాంతో పకపకలు, వికవికలై పోతే! ఇంతకూ నాకు చావు రావడంలేదు. కూతురు రాకరాక చుట్టపుచూపుగా ఒకసారొస్తే దాని కిన్ని కాఫీనీళ్ళకు గతిలేకపాయె! ఇంకా నా బతుకెందుకు?—పాడు బతుకు! ఏ నుయ్యో, గొయ్యో చూచుకుంటే అందరికీ పీడవిరగడై పోతుంది. నలుగురిచేత ఔననిపించుకున్న ముండని. నా కెన్ని తిప్పలొచ్చాయ్! నాకెన్ని తిప్పలొచ్చాయ్!!

[రాని కన్నీళ్లను వేలితో తుడుచుకుని విదిలిస్తుంది.

రంగమ్మ [మూలనున్న చీపురు తీసుకుని, గది కొంత జిమ్మి]. ఒసేయ్! నిన్నే....ఏమేయ్! సీతమ్మా! ఊహుం! అదెందుకు పలుకుతుంది? నా పిలుపంటేనే దాన్ని చెవుల్లో చెట్లు మొలుస్తాయ్! అమ్మ! ఎంత కానరానిదది! ఏమేయ్! నిన్నేనే!!

["గృహమే స్వర్గసీమ" అంటూ నేపథ్యంలోనుంచి పాట ప్రారంభమౌతుంది.

ఫేడ్ ఔట్.

# 5

లైట్స్ ఆన్ అయ్యేసరికి సుందరి, సీతమ్మ నాల్గవ రంగంలో కూర్చున్నట్టుగానే కూర్చునివుంటారు. సుందరి "గృహమే స్వర్గసీమ" పాట చివరి చరణాలలో వుంటుంది. సీతమ్మ చెమ్మగిలిన కళ్ళను పైటచెంగుతో ఒత్తుకుంటూ వుంటుంది.

సుందరి. అదేమమ్మా, కంట తడిపెడుతున్నావ్ ?

సీతమ్మ. ఆఁ! ఏం లేదు, తల్లీ!

సుందరి. ఎందుకమ్మా ? నాకు చెప్పవ్ ?

సీతమ్మ. పాట బాగున్నది, తల్లీ!

సుందరి. చాలా బాగున్నది కాదూ !

సీతమ్మ. ఉఁ!

సుందరి. మరి సినిమాపాటలన్నీ పిచ్చిపాటలంటావ్ ? ఒక్కొక్క పాట వింటుంటే, నాకూ కళ్ళు చెమ్మగిలుతా యమ్మా !

సీతమ్మ. నువ్వెంత వెర్రిబాపమ్మ వేమే, తల్లీ!

సుందరి. అదేమిటమ్మా ?

సీతమ్మ. సంసారమంటే మాటలు కాదు, తల్లీ! మంచి చెడ్డలు ఎన్నెన్నో వుంటాయ్. పడివున్న వాళ్ళకేగాని అవి తెలియవ్. పదిహేను, పదహారేళ్ళనాడు నాది నీ ఈడే. అప్పుడు అచ్చంగా నీ మాదిరిగానే వుండేదాన్ని. ఇప్పుడు నిన్ను చూస్తే అప్పుడు నన్ను చూడ నక్కరలేదు. అప్పుడు మేము ఈ సినిమాలు, గినిమాలు యెరగంగాని, నీకు మల్లేనే నాకూ కూడా కష్టం,

సుఖం తెలవదు. కాపరాని కొచ్చి, సంసార మీదడం ప్రారంభించిన తర్వాతగాని తెలిసి రాలేదు. బ్రతుకులు వెళ్ళమారడం మాటలుకాదని. నేను పడ్డపాట్లు నిన్ను చుట్టుకోరాదని అందరి దేవుళ్ళకు మొక్కుకుంటున్నా గాని, ఒక ఆటగానో, పాటగానో తనువు గడుస్తుందని పిచ్చి భ్రమతలకు పోవద్దు, తల్లీ!

సుందరి. అమ్మా, ఈపూట నువ్వింత యిదిగా మాట్లాడుతున్నావే? మనస్సు బాగుండలేదా ?

సీతమ్మ. ఔను తల్లీ!

సుందరి. అదేమో నమ్మా! ఒక్కొక్కసారి పాట వింటుంటే కడుపులో ఏదో దేవుతున్నట్టుగా వుంటుంది. అదే మరొక్కొక్కసారి పాట వినగానే ఎంత కలతగావున్నా మనస్సు ఇట్టే తేటపడుతుంది. అది మరి పాట మహాత్యమో, మనం వినే వేళావిశేషం మహాత్యమో ?

సీతమ్మ. ఏమో నమ్మా!

సుందరి. ఒక చక్కనిపాట వున్నదమ్మా? దాన్ని వింటే చాలు, గాలిలో తేలిపోతున్నట్టుగానే వుంటుంది నాకు. అదెంత మంచిపా టనుకున్నావ్ !

సీతమ్మ [మందహాసం చేస్తూ]. అబ్బో! అంత చక్కని పాటా!

సీతమ్మ. ఔనమ్మా! నాన్న నాకు దాని రికార్డ్ తెచ్చిపెట్టాడు.

సీతమ్మ. ఎప్పుడు ?

సుందరి. నిన్న సాయంత్రం.

సుందరి. బాబూ, కూతురూ చేరి, నా కీ మాట తెలియకుండా ఇప్పటిదాకా దాచిపెట్టారన్నమాట! మనం కలవాళ్ళమా ?

ఎందుకమ్మా మీ నాన్నచేత ఇలా డబ్బు తగలేయించడం? ఈ రికార్డులకని నెలనెలకి దండగపెట్టే డబ్బు కూడబెట్టుకుంటే, మెడరోత తీరడానికి ఒక నగ ఏర్పడదూ?

సుందరి. తెచ్చిపెట్టమని నే నడగలే దమ్మా! అది మంచి రికార్డని నే నంటే.

సీతమ్మ. ఆయన కొనుక్కొచ్చారు. అంతేనా? నీకు ఏ లోపం చెయ్యరాదని ఆయన ఎన్ని చిక్కులైనా పడతారు.

సుందరి. ఇంకెప్పుడు నాన్నని రికార్డులు తెమ్మననులే, అమ్మా!

సీతమ్మ [నవ్వుతూ]. చూస్తానుగా ఎన్నిరోజులు నిలుస్తావో ఈ మాటమీదే! నిన్ననగా రికార్డు తెస్తే దాన్ని యింతవరకు పెట్టనే లేదని నువ్వెంత ఆరాటపడుతున్నావో! ఏదీ, ఆ రికార్డు వినిపించు!

[సుందరి ఈ కింది గ్రామఫోన్ రికార్డ్ పెడుతుంది:

ఆడబ్రతుకే మధురమ్
వయసూ, వలపూ, సొగసు కులికే
యువతిబ్రదుకే మధురమ్
పసుపు కుంకుమా నొసటను వెలిగే
ఆడబ్రదుకే మధురమ్
పతి కౌగిటిలో పరవశమయ్యే
భార్యబ్రదుకే మధురమ్
పసికూనకు పాలొసగుచు మురిసే
తల్లిబ్రదుకే మధురమ్
ఆః ఆడబ్రదుకే మధురమ్

విరజాజులతో, చిరు నగవులతో
కుంకుమరాగము, అనురాగముతో
సిరిసంపదతో, పసిపాపలతో
అనుగతపతియై, ఆనందవతియై
అలరు సుమంగళి బ్రతుకే మధురమ్
ఆ ఆడబ్రదుకే మధురమ్॥

ఆదిలో పాట "లో వాల్యూమ్"లో వస్తుంది.

సుందరి. అమ్మా! ఇది చాలా మంచిపాట కామా ?

సీతమ్మ. పాటకే ? మంచిపాటే ! కాని, బ్రతుకొక పాటా, ఆటా కాదు, తల్లీ! పైకి సాఫీగానే నడుస్తున్నట్టు కనబడ్డా, అడుగడుక్కీ చిన్నచిన్న చిక్కులూ, చిల్లర యిబ్బందులూ ఒక లక్ష వస్తుంటాయ్. కొద్దికొద్ది సంసారాలనేసరికి ఒకటుంటే ఒకటుండదు అయినా, పరువుకోసమని ఏ లోపం లేనట్టు దేవులాడాలి. ఇక, అత్తపోరూ, ఆడబిడ్డపోటూ వుంటే చెప్పాలీ! ఒక యింటిదానివై నీ సంసారం నువ్వు ఈదుకుంటున్నప్పుడు మంచిచెడ్డలు నీకే తెలుస్తాయిలే !

[లైట్స్ ఫేడ్ ఔట్ అయిపోతాయి. ఆ వెంటనే పాటకూడా నిలిచిపోతుంది. పిమ్మట ఒక క్షణానికి ఒక్క సుందరిమాత్రం స్పాట్ లైట్‌లో నిలబడి వుంటుంది. ఆమె చుట్టుపక్కల కటిక-చీకటి. ఆ చీకటిలోనుంచి వేర్వేరు గొంతులు ఒకదాని తర్వాత ఒకటి చొప్పున, ఒకదాన్ని ఒకటి తరుముతున్నట్టు వినబడతాయి.

మొదటి గొంతు [సుందరికి కానున్న భర్తది]. ఇంకా నీ వంట తెమల్లేదటే ?

సుందరి [గొంతు వినవచ్చినవైపుకు తిరిగి]. అయిపోతుంది ఒక చిటికలో !

మొదటి గొంతు. చాల్ చాలు! ఆఫీసుకు వేళ మించిపోతున్నది. రోజూ ఇదే ఏడుపు!

సుందరి. అయ్యో ! అయిపోయిందంటే !

మొదటి గొంతు. ఏమైపోయింది ? నీ మొఖం !

***

రెండవ గొంతు [పాలమ్మది]. ఏమిటమ్మా ఈ తిప్పించుకోడం?

సుందరి [అటుతిరిగి]. రేపిస్తాంగా తప్పకుండా !

రెండవ గొంతు. రోజూ రేపురేపేనా ? అంత గతిలేనివాళ్ళు పాలెందుకు పోయించుకోవాలి ?

సుందరి. ఏమిటమ్మీ! మాటలు మహా రానిస్తున్నావ్ !

రెండవ గొంతు. ఏం! నేను మీకు అచ్చివున్నానేమిటి మీ కొంప చుట్టూ తిరగడానికి !

***

మూడవ గొంతు [సుందరానికి కాగల అత్తది]. కాస్త నేలమీద ఆని నడువమ్మా ! ఆని నడువు !! మిడిసిపాటు తగదు. ఏం కట్టుకొచ్చావని అంత పొంగు !

[సుందరి అటు తిరిగి గుడ్లు అప్పగించి చూస్తుంది.

***

నాల్గవ గొంతు [పిల్లవాడిది]. అమ్మా. నాకు కొత్తచొక్కాయేఁ!

సుందరి [అటు తిరిగి]. నాన్న రేపు తెస్తాడులే, బాబూ!

నాల్గవ గొంతు. అహఁ! నా కిప్పుడే కావాలి. వాళ్ళ కిష్టిగాడు కొత్త దేసుకున్నాడు.

సుందరి. మా నాన్నవుగా! రేపు నీకు....

నాల్గవ గొంతు. నావన్నీ చిరుగు చొక్కాలే. ఉహుఁ! నా కిప్పుడే కావాలి.

***

మొదటి గొంతు మొన్నెగా పోసెడు నెయ్యి తెచ్చింది!

సుందరి [అటు తిరిగి]. అయ్యో! అయిపోయిందండీ!

మొదటి గొంతు. వెనకా ముందూ చూచుకోవద్దూ? ఇలాగైతే నే నెక్కడ ఛస్తాను.

***

మూడవ గొంతు. చంకల్లోకి ఆ రవి కేమిటి? ఆ బెత్తెడు పమి టేమిటి? చెవులపైకి జారుతూ ఆ జుట్టు ముడేమిటి? ఏం వేషా లివి? దొమ్మరి వేషాలు! ఎక్కడైనా సంసారుల కివి తగునా? దానికి బుద్ధిలేకపోతే, ఆ అత్తకు బుద్ధిలేదా అని నలుగురూ నన్ను దెప్పడానికా?

[సుందరి అటు తిరిగి దిగాలుపడి చూస్తుంది.

***

అయిదవ గొంతు [పిల్లవానిది]. ఒడిలో జీతం తెమ్మన్నారమ్మా

సుందరి [అటు తిరిగి]. రేపిస్తాం లే, తల్లీ!

అయిదవ గొంతు. ఊఁ! ఊఁ! ఇవ్వాళ కట్టకపోతే, పేరు కొట్టేస్తామన్నారే, అమ్మా!

***

మొదటి గొంతు. మళ్ళీ డాక్టరా?

సుందరి [అటు తిరిగి] అయ్యో! నా తండ్రి కెక్కు[illegible]న్నదండీ!

మొదటి గొంతు. తద్దవకి మూడేసిరూపాయలు పొయ్యాలి.

సుందరి. అయ్యో! అయ్యో! నా బాబేం కాను!!

["ఆడబ్రతుకే మధురం" అని రికార్డు ఫుల్ బ్లాస్టుతో ప్రారంభం కాగా—

తెర]



## పాత్రలు

సుబ్బయ్య [రంగస్థలంపై]

గుమాస్తా [నేపథ్యంలో]

గమనిక : ఒకపాత్రను రంగస్థలంపై నిలిపి, రెండవపాత్రను నేపథ్యంలో వుంచి, ప్రపంచ ప్రసిద్ధ అమెరికన్ నాటకకర్త యూజీన్ ఓనీల్ "బిఫోర్ బ్రెక్‌ఫాస్ట్" అనే ఏకాంక నాటికను రచించాడు. కేవలం ఆ టెక్నిక్ మాత్రం ఈనాటికలో అనుసరించబడింది. టెక్నిక్‌లో తప్ప, తక్కిన అన్ని విషయాలలో ఇది పూర్తిగా స్వతంత్ర రచన.



# దొంగ: దొర

శ్రీరామరాజ్యం రైసుమిల్లు ఆఫీసు రూమ్. కుడివైపున వీధితలద్వారం, ఎదురుగా రెండు పెద్ద కిటికీలు. ఆ కిటికీలగుండా దూరాన చెట్లూ, ఆకాశమూ కనబడుతూవుంటాయి. ఆఫీసు రూమ్ ఎడమ పక్కను గుమాస్తాలగది. పైభాగంలో అద్దాలు అమర్చబడిన బల్లకూర్పుతో [గ్లాస్ పేన్డ్ వుడెన్ పార్టిషన్‌తో] ఆఫీసు రూమ్‌లోని ఎడమ భాగమే గుమాస్తాలగదిగా ఏర్పాటు అయివుంటుంది. బల్లకూర్పుమధ్య ఒక ద్వారం. దానికి "స్వింగ్ డోర్స్" [స్ప్రింగ్ తలుపులు]. ఈ తలుపులకు చెరొక వైపున కోట్లు తగిలించుకోడానికి చెరొక చిలకకొయ్య.

గదిమధ్యగా ఒక పెద్ద టేబుల్. దానిమీద టెలిఫోన్, లెటర్ బాక్స్, వ్రాతపరికరాలు, రబ్బర్ స్టాంపులు వగైరా. టేబుల్‌కు ఒకవైపున [ప్రేక్షకులకు సమ్ముఖంగా] ఒక రివాల్వింగ్ చెయిర్; తక్కిన వైపుల మరి మూడు, నాలుగు మామూలు కుర్చీలు.

తెరలేచిన ఒక క్షణానికి శ్రీరామరాజ్యం రైసుమిల్లు యజమాని సుబ్బయ్య ప్రవేశిస్తాడు. అతని వయస్సు నలభైపైన, నలభై అయిదులోపు. పొట్టిగా, పలచగా వుంటాడు. కోలముఖం, చిన్న నుదురు, చింకికళ్లు, పీచుమీసం.

పంచెపై కోటు తొడిగి, మెడచుట్టు నాలుగైదు మెలికలుచుట్టి ఉత్తరీయాన్ని వేసుకున్న సుబ్బయ్య ఆఫీసు రూమ్‌లో ప్రవేశించగానే సరాసరి ఒక చిలకకొయ్యవద్దకు వెళ్లి, ఉత్తరీయాన్ని తీసి దానికి తగిలిస్తాడు.

సుబ్బయ్య [స్వింగ్ డోర్సులో ఒకదాన్ని బయటికిలాగి, లోపలికి తొంగిచూస్తూ, లోపలున్న గుమాస్తాతో]. ఏఁ! ఇంకా పెన్సిళ్లు చెక్కడంకాడే వున్నావ్? ఒక బద్దీకత్తి చేతపట్టుకుని పొద్దస్తమానం పెన్సిళ్ళు చెక్కిపారెయ్యడం ఒక్కటే కనబడుతుంది. పనీ పంగూ లేదు.

[స్వింగ్ డోర్‌ను అతడు విడిచిపెట్టగా అది రపీమని మూసుకు పోతుంది. కోటువిప్పి ఉత్తరీయాన్ని తగిలించిన చిలకకొయ్యకే దాన్నికూడా తగిలించి, అతడు టేబుల్ వద్దకు వెడతాడు.

సుబ్బయ్య [టేబుల్‌పై పెట్టివున్న టపా అందుకుంటూ, గదిలోని గుమాస్తాను ఉద్దేశించి]. రెండో గుమాస్తా యివ్వాళకూడా రానట్టేవా? ఇంకెన్ని రోజు లింట్లో పడుకుంటాడు!

[లోపలనుంచి ఏదో జవాబు వస్తుంది. అది మనకు వినబడదు; ఇంతలో ఒక ఉత్తరాన్ని విప్పి దాన్ని చదువుకోసాగిన సుబ్బయ్య దాన్ని వినిపించుకోడు.

సుబ్బయ్య [ఉత్తరాన్ని చదువుతూనే కుర్చీలో కూర్చుని, దాన్ని పూర్తిచేసి, మరొకదాన్ని విప్పుతూ]. అఁ! ఏమన్నావ్?

[జవాబుకోసం నిరీక్షించకుండానే రెండవ ఉత్తరాన్ని చదవ ప్రారంభిస్తాడు.

సుబ్బయ్య. చందాలట! చందాలు!! ఇక్కడ పోగోసుకు కూర్చున్నాం అందరికీ పందేరం పెట్టడానికి! [ఆ ఉత్తరాన్ని ముక్క ముక్కలుగా చించి, బుట్టదాఖల్ చేస్తూ] వెధవలు! తెంపి వెధవలు!! ధర్మఫండు ఈ మాల సంఘాలకీ, మండి సంఘాలకీ దొబ్బబెట్టడానికేనా? హరిజన సంఘమట. హాస్టలు పెడతారట. మాలాడికీ, మాదిగాడికీ కూడా ఇప్పుడు చదువులు కావాల్సొచ్చాయ్! కుడీ యెడం పోబట్టే కాలమిట్టా తగల బడింది! [తర్వాత ఒక కార్డు అందుకుని, దాన్ని చదువుకుని, కలర్ పెన్సిల్‌తో దానిమీద ఏదో రిమార్కు వ్రాసుకుంటూ గుమాస్తాతో] ఆఁ! అయితే?

[సందర్భంలేని ఈమాట తర్వాత మరొక కవరు చించి, కవరులోనుంచి ఉత్తరం త్వరగా బయటికి రాక పోగా విసుక్కుంటాడు.

సుబ్బయ్య [ఉత్తరాన్ని ఎలాగో బయటికి లాగి దాన్ని చదువు కుంటూ గుమాస్తాతో]. మొన్నరాత్రి హోటల్‌వాడి లారీ రాలా? ఆఁ? ..అంకిలి నొక్కుకుపోయిం దేమిటి? నోట మాటే పెగలడంలేదు! [ఈమాటలు అంటుండగా ఉత్తరం పైకి కన్నుపోగా] ఆఁ! వొచ్చిందటగా! ఆమాట వీడే రాస్తు న్నాడు. "మొన్నరాత్రి పెద్దయ్య ఇక్కడికి సుఖంగా చేరాడు." [గుమాస్తాతో] అయితే—ఓ దేభ్యం!—నిన్నే — పెద్దలారీ వచ్చిం దేమిటి? పనిలో పని, ఆ రేషన్ కొట్టువాడికికూడా ఒక పదిమూటలు యెత్తించకపోయావూ? [ఉత్తరం మొదటి పేజీ తిప్పివేసి, రెండవ పేజీని చదువుకుంటూ] మళ్ళీ అప్పుడే

వీడు సరుకు కావాలంటా డేమిటి? వెధవ! దొంగ వెధవ!! తన హోటల్‌కని ఖరీదుచేసి, అక్కడ మారుబేరం సాగిస్తున్న ట్టున్నాడు. వీడు బ్లాక్‌మార్కెట్టుచేసి, దొంగలాభాలు పోసుకో డానికి అప్పుడే సరు కెలా వేసి పంపిస్తాం? ఆ ఊరు సబిన స్పెక్టరు నిన్నే బదిలీ అయ్యాడని ఎవరో అన్నారు. కొత్తవా డెవ డొచ్చాడో మన కింకా తెలవదు. వాణ్ణి ఆకట్టుకోందే సరు కెలా పంపిస్తాం? [ఆ ఉత్తరాన్ని ఒక పక్కగాపెట్టి, ఆనాటి టపాలో మిగిలివున్న కార్డును చదువుకుంటూ] అయ్యయ్యో! ఈ పెద్ద గుమాస్తా మరి వారం, పదిరోజుల దాకా రాలేడటే! ఒక దారీతెన్నూ లేకుండా లెక్కలన్నీ తీన్ తేరాగా వున్నాయి. ఇన్‌కమ్‌టాక్సువాళ్లు లగాలగీ అంటు న్నారు. [ఆనాటి ఉత్తరాలను లెటర్ బాక్స్‌లో భద్రంచేస్తూ] అబ్బబ్బ! ఈ గుమాస్తాగాళ్ళతో చెడ్డ బెడదై పోతే! పెద్ద గుమాస్తాకి కూతురు పెళ్ళౌతే, రెండోవాడికి రోగ మొచ్చిందట! ఏం రోగమో, మాయరోగం! పని తొందరున్నప్పుడే వీళ్ళకి రోగాలూ, నెప్పులూ వస్తాయ్. వాళ్లు బలిస్తేసరి, రోగా లొస్తాయ్! రావూ? మందేదో తింటావంటే వాడి కొక నెల జీతం ముందే పారెయ్యడం పొరపాటై పోయింది. అది చేతిలో పడ్డాక వాడు రెండురోజులైనా తిన్నగా ఆఫీసు కొచ్చాడో, లేదో! ఆ రెండు రోజులైనా వాడు మిణికిన పనేముంది? ఖంగ్ ఖంగ్ మంటూ చెవికింద దగ్గుతూ కూర్చోడం తప్ప. ఆకలి చచ్చిపోయిందట! ఆకలి!! ఎక్కడ వచ్చిందీ ఆకలి! మొన్నేగా ఈ మూడోగుమాస్తా బడుద్ధాయ్

గాణ్ణి కూడగట్టుకుని జీతం చాలదంటూ ప్రాణం తీశాడు. సాయంత్రమయ్యే సరికి—పాపం!—కాక తగిలినట్టుగా వుంటుందట! ఇద్దరికి ముగ్గురై పనితగ్గేసరికి ఎన్నిరోగాలైనా పుట్టుకొస్తాయ్! వెధవలు! అంట్ల వెధవలు!! [గుమాస్తాతో] సర్లే! ఆ చిట్టా, ఆవర్జా లిలా తగలెయ్! ఈ రెండు రోజుల నుంచీ లెక్కలేమైనా సరిచూచావా? గోళ్లు గిల్లుకుంటూ కూర్చున్నావా? బద్దీ కత్తితో పెన్సిళ్ళు చెక్కి పారెయ్యడం తప్ప, నీకు పనెక్కడ కదులుతుందిలే! నిన్ను నమ్ముకుంటే ఇన్‌కమ్‌టాక్సు లెక్కలు తయారైనట్టే!

[గుమాస్తా గదిలోపలవుంచిన చిట్టా, ఆవర్జాలను అందిస్తాడు. అతని చెయ్యిమాత్రం మనకు కనబడుతుంది. అది పుల్లలాంటి చెయ్యి. సగంవరకు దాన్ని కప్పివున్న చొక్కా చిరిగిపోయి వేలాడుతూ వుంటుంది. చిట్టా, ఆవర్జాలను అందిస్తుండగా ఆ చెయ్యి కొంచెం వణుకుతున్నట్టు మనం గమనిస్తాముగాని, సుబ్బయ్య దాన్ని కానడు.

సుబ్బయ్య [చిట్టా, ఆవర్జాలను అందుకుంటూ]. ఏం? లోపల నక్కుతున్నావే? నందు దొరికిందిగదా అని చెప్పినపని సున్నాచుట్టి, ఊరుపట్టుకు అడుక్కుతిన్నావేమిటి?

[చిట్టా విప్పి కొన్ని పేజీలు చకచక తిప్పివేస్తాడు. ఎక్కువ పేజీలు తిప్పివేసి నందువల్ల వెనక్కి వచ్చి, ఒక పేజీవద్ద ఆగుతాడు.

సుబ్బయ్య [గుమాస్తాతో]. ఏం రాతిది? బ్రహ్మరాత! తెలిసేటట్టు అక్షరాలు కాస్త విడివిడిగా రాయమంటే గొలుసుకట్టు ఆహో

రిస్తావ్ దేనికి ? [నొసలు ముడివేసి] ఏమి టది ? బొప్పా?.... ఉహుఁ!....బొప్పన ?....అఁ! .. బొప్పనే .... లింగన్నగారిక వంకసన్నాలు నలభై రెండు బస్తాలకి బస్తా ఒకటింటికి పన్నెండు రూపాయల రెండణాల ఆరుపైసల చొప్పున అయిదు వందల తొమ్మిది రూపాయల ...

[టెలిఫోన్ గంట గణగణ మోగుతుంది.

సుబ్బయ్య [రిసీవర్ అందుకుని]. హలో! అఁ! శ్రీ రామరాజ్యం రైసుమిల్లే .. ఊఁ! ఊఁ! సుబ్బయ్యనే ...ఏమి టది ?. సర్కిల్‌గారు మాట్లాడతారా ? అయ్యో! అంతకంటేనా! మాట్లాడమనండి...నమస్కారమండీ! నమస్కారం! అమ్మ గారు పుట్టింటినుంచి తిరిగొచ్చారా?....మొన్న హెడ్డు చెప్పాడు లెండి, రేపో మాపో వస్తున్నారని—అఁ! చిత్తం! చిత్తం! అలాగే లెండి, అదెంత భాగ్యం!...అఁ! అఁ! అరమూట చాలంటారా ? పనిలోపని ఒకమూట...సరే, అలాగే!...ఢిల్లీ భోగాలే. వంకపెట్టడానికి వీల్లేదు. నాణ్యమైన సరుకు...అబ్బే! అవల్ రకమండీ!...ఎంతమాట! తమకి క్రొత్తవి వంపిస్తామా? పాతవే. పాతరేసినొడ్లు. మనింట్లోకవి మొన్నొక రెండుపుట్లు కొన్నాం లెండి. వారంనాడు నాలుగుబస్తా లాడించాము. వాటిలో నుంచే...అఁ? కిందటిసారి కొత్త బియ్యం...అఁ! ఔవౌను! హెడ్డు ఆమాట చెబితే నే నెంత నొచ్చుకున్నానని! నే నూళ్ళో వుంటే అలాంటిపని జరిగేదా ? మా రెండో గుమాస్తాగాడికి చెప్పి, కోర్టువాయిదాకని నే వెళ్ళితే...వా డొర్రి వెధవలెండి! ఛప్పు, వెధవ! అయ్య!...అయ్య!...అఁ! అఁ! వాడే!

మింగ మెతుకులేదుగాని మీటింగు లెడతాడు!...ఆఁ! తీసి పారేద్దునుగాని, మనిషిపోతే మనిషి దొరకడం లేదండీ! ఈ యుద్ధ మొకటొచ్చాక గుమాస్తాగాళ్లకీ గిరాకీ వచ్చిందయ్యో!...ఆఁ! ఆఁ!...చిత్తం! చిత్తం!...మరొక గంటకి మూట మీ యింటిదగ్గరుండకపోతే నన్నడగండి! మా లారీ రాగానే...మంచిదండీ అయ్యా! సెలవ్!!

[టెలిఫోన్ రిసీవర్ పెట్టివేస్తాడు.

సుబ్బయ్య [చిట్టా తిరిగి అందుకుంటూ]. తేర సొమ్ము తెగతిని బలిసి కొట్టుకుంటున్నాడు. వీడి కథ, వీడి కమామిషు ఎవడికి తెలవదు! నిన్న మొన్నటిదాకా వీడు కనిస్టేబేగా? కాంగ్రెసు వాళ్ళకి మతులు పోబట్టే వీడిగీత బయటపడింది. ఉన్న చోటుండక అగస్టు ఉద్యమం, వాళ్ళ తలకాయ అంటూ బుద్ధగంతు లేస్తే, వాళ్ళ ముక్కు లిరగ్గొట్టి వీడు సర్కిలయ్యాడు. లేకపోతే, ఎక్కడుండేవాడో! కొత్త బియ్యం తినలేడట! అన్నం కాస్త చిమిడితే వీడి గొంతు పట్టుకుంటుంది కామోసు! మహ మహవాళ్ళే కొత్తా పాతా చూడ్డంలేదు. దుమ్మూ, దుబ్బా కలిసినా గింజొకటి దొరికితే చాలని కళ్ళ కద్దుకుంటున్నారు. తెల్లారిలేస్తే ఏదో ఒకపని పడుతుందిగదా అని అడగ్గానే నంబర్లు పంపిస్తే, కొత్త బియ్యమట! కొత్త బియ్యం!! వీడి అబ్బగాడి సొమ్ము ఇక్కడేదో దాచిపెట్టినట్టు! తేరగా తెమ్మనేది కాకుండా తప్పుపడుతున్నాడయ్యా, తప్పు!!

[చిట్టా ఒక పక్కని పెట్టి, ఆవర్జా తెరుస్తాడు. చిట్టా చూస్తూ, ఆవర్జా పేజీలు తిప్పుతూ, కలర్ పెన్సిల్‌తో టిక్కులు పెడుతూ పోతాడు.

సుబ్బయ్య. కళ్ళు పోతున్నాయ్ ఈ రాతతెలవక. ఏం రాత? పాడురాత! [గుమాస్తాల గదివైపుకు తిరిగి] ఇదుగో నబ్బాయ్! ఇఖ నువ్విలా రాశావంటేనా, యింటికి నడవొచ్చు. [మళ్లీ చిట్టావైపుకు తిరిగి] "ఈడుప్పుగంటి రాఘవయ్యగారి ఖాతాకు ధనిగుజార్తున చెల్లించిన రొక్కం ఏడువందల యాభై రూపాయలు". మళ్ళీ వీడు ఏడున్నరవందలు పట్టుకుపోయాడూ? మరీ లెక్కాపత్రం లేకుండా వాడుకుంటున్నాడే! వీడు తోలింది ముప్పై పుట్లేగా? ఖాతా వాడుకోవడంలో ఈ ఖరాటా యేమిటో వీణ్ణి కాస్త కనుక్కోవాలి.

[ఇంతలో టెలిఫోన్ తిరిగి మోగుతుంది.

సుబ్బయ్య [రిసీవర్ అందుకుని]. హలో! హలో!...ఆఁ?... అబ్బే! మర్చిపోలేదు. తెప్పించి పంపిస్తా!...ఎప్పుడోనా? అబ్బే! ఇదుగో! ఇప్పుడంటే యిప్పుడే...

[ఆ నంబర్ డిస్‌కనెక్ట్ చేసి, కొత్త నంబర్ డయిల్ చేస్తాడు.

సుబ్బయ్య. హలో! రావుగారేనా?...ఆఁ! నేనండీ! శ్రీ రామ రాజ్యం రైసుమిల్లు సుబ్బయ్యని. మా చిన్న పిల్లవాడు ఎందు వల్లోగాని కొంచెం నలతగా వుంటున్నాడు. డాక్టర్‌గారికి చూపిస్తే, పాలలో పంచదార మానేసి, గ్లూకోజ్ వాడమన్నారు. ఒక పౌను డబ్బా...మీరే ఇలాగంటే ఎలాగండీ? మీరీ సాయం చెయ్యాలి. మాట తీసెయ్యొద్దు...పోనీ, ఒక అరపౌను డబ్బా.........కనీసం పాతికపౌను...అయ్యయ్యో! మీవల్ల

కాకపోతే, మరెవరివల్ల ...ఏధరకాడికైనా సరే ..అబ్బెబ్బే! మీ షాపులో వుందనికాదు. మీపరంగా మరెక్కడైనా తెప్పించి... కాస్త విచారించి చూడండి దొరుకుతుందేమో ... ఎంతైతే తప్పుతుంది?—అవసరమొచ్చినప్పుడు! మీరు ఎలాగైనా మాట దక్కించాలి సుమీ!...వుంటానండీ, వుంటాను!

[రిసీవర్ పెట్టివేస్తాడు.

సుబ్బయ్య. వెధవ! దొంగ వెధవ! దొంగలాభాలు దొబ్బమరిగి, వుంచుకునే లేదంటున్నాడు! మరెక్కడో తెప్పించానంటే, అక్కడికి పెద్ద మెహర్బానీ చేసినవాడూ అవుతాడు, పట్టపగటి దోపిడీ చేసుకున్నవాడూ అవుతాడు! పిల్లవాడికి తావాలని చెప్పినా, వాడి లేకిబుద్ధి వాడెక్కడ పోనిస్తాడు! వెధవ! బందిపోటు వెధవ!!

[మాపు మళ్ళీ చిట్టా, అవర్జాలమీదికి పోతుంది. మౌనంగా కాసేపు పద్దుల్ని సరిమాచుకుంటాడు.

సుబ్బయ్య [గుమాస్తాను ఉద్దేశించి]. ఏం పనిది? తిరపతి మంగలి పని! చిట్టాలో పద్దులు అవర్జాలోకి ఒక టెక్కితే ఒక టెక్క లేదు. న్నువ్వు వాళ్ళాంగి పనిచేస్తేనా? చుంచు ముఖమూ, నువ్వూను! కూటికి లేదని కాళ్ళా, వేళ్ళా పడ్డావని ఏదో దగ్గరికి తియ్యడంగాని, నిన్ను పనిలో పెట్టుకోమనున్నదీ? ఎప్పుడు చూచినా, ఈమరోమంటూ వుంటావ్. ఏళ్ళాటిశని నీముఖానే వుంటుంది. ఒక్కరోజు ఆ పెద్దగుమాస్తా రాకపోతే అంతా ఖంగాళీయే! ఈ ముష్టిపనికే వీళ్ళకి జీతాలు చాలవట. నెలకి పాతిక, ముప్పైకాడికి పోసుకుంటున్నానెప్పే! వీళ్ల ప్యాసయిన

బి. ఏ. లు, యం. ఏ. లు హీతాయి పోతున్నాయా? వెధవలు! పింజారీ వెధవలు!! వీళ్ల నసలు రామరామ అనగూడదు. ఎందు కీ అవర్జా? అంతా తిన్నగా మందబెట్టినట్టు చేతికిచ్చావ్!

[అవర్జాను ఫెడేలున మూసి ఒక పక్కని పడవేస్తాడు.

సుబ్బయ్య [చిట్టా మాత్రమే చూస్తూ]. "తవుడు ఖాతాకు జమ: వెరసి అమ్మకం పదకొండు బస్తాలకు బస్తా ఒకటింటికి..." ఏ తారీఖు నిది? ఆరు—మూడు—పంథొమ్మిదివందల నలభై నాలుగు—ఈమధ్య ఏనాడూ యాభై, అరవై బస్తాలకు తక్కువ అమ్మడంలేదే! [గుమాస్తాను ఉద్దేశించి] ఇదుగో! ఓ చవట! నిన్నే! కూడికలు తిన్నగా మిణికావా? కునికిపాట్లు పడుతూ చేతి కెంతొస్తే అంత వేశావా? నిద్రమొఖం, నువ్వూను!

[టెలిఫోన్ మోగుతుంది.

సుబ్బయ్య [రిసీవర్ అందుకుని]. హలో!...జి. పి. ఒ గారా? అయ్యా! నమస్కారమండీ! నమస్కారం!...అబ్బే లేదండీ! మూడురోజులనుంచీ ఫ్యాక్టరీ ఆడ్డంలేదు. ఇంజను పిస్టను దెబ్బతినింది. రిపేరుకు పంపించాం...ఆఁ?...ఆఁ!...రేపో, మాపో తిరిగి ఆడతాం...లేదండీ! రెండు రోజులనుంచీ ఊళ్లో లేను. ఇవ్వాళ పొద్దున్నే తిరిగొచ్చాను...అబ్బే! పద్దుపుస్తకాలు చూచుకుందామని ... ఇన్‌కమ్‌టాక్సు లెక్కలొచ్చి నెత్తిని కూర్చున్నాయ్!...ఆఁ! అన్నింటికీ నేనే అవస్థపడాలి. పెద్ద గుమాస్తా లిద్దరు సెలవుమీ దున్నారు. చిన్నవాణ్ణి పెట్టుకుని నేనే దేవులాడుతున్నా...[నవ్వుతూ] అయ్యా! మీకేమండీ?

మీరు మహారాజులు...అయ్యా !... అయ్యా !.. చిత్తం !...
అబ్బబ్బే ! మీకు మాట రానిస్తామా ?...మొన్న బళ్ళారికి
బట్వాడాచేసిన వెయ్యిబస్తాల మాటేనా ?...ఆ బియ్యంలో
సగానికి సగం మట్టేనన్నారూ ? రామరామ! అంతెక్కడిదండీ ?
వుంటే, గింటే ఏ కొంచెమో వున్నదేమో గాని! నిజంమాటకి
అసలిప్పుడు రైతు సజావుగా గింజ అమ్ముతున్నాడటండీ !
తప్పా, తాలూ, దుమ్మూ, దూగరా, మానుకాయా, మసివి
కాయా—అన్నీ కలిపి....అబ్బే! మనం ఎగుమతి చేసినప్పుడు
పురుగు లేదు. గాలిపాటుకు తర్వాత ఏమైనా పుట్టిందేమో !...
అబ్బే ! మేకు లెక్కడివండీ ? ఇను మిప్పుడు అసలే కరువుగా
వుంటే !...చిత్తం !... అయ్యా !...చిత్తం ! ... అయ్యా !...
వారంనాటికే ?...మూడువేల బస్తా పచ్చిబియ్యమా ?...అంత
ఆర్డరుకు మనదగ్గర ధాన్యం స్టాకులేదే !...మొత్తం స్టాకు
ఎంతంటారా ?...హోల్‌మొత్తం అయిదువేల రెండువందల
బస్తాలండీ! చిత్తం! అంతేలెండి! అయిదువేల రెండువందల
బస్తా ధాన్య మాడితే, కటాకటిగా రెండువేల అయిదువందల
బస్తా బియ్యమే దిగుబడి!..ఆఁ! అయితే, మీదయ వుండాలే
గాని, ఆ సరుకునే మరొక వంద బస్తా దేకించి, రెండువేల
ఆరువందలు చెయ్యలేకపోతామూ?. . కుసాలే అనుకోండి. కాని,
మీరు సర్టిఫైచేస్తే కుసాలు ఆట్రగడాలై పోవటండీ!....ఆఁ!
మద్రాసుకైతే మరీ మంచిది! అక్కడ కుసాలేవో, ఆట్రగడా
లేవో ఏ వెధవకి తెలుసండీ!...అయ్యా ! మరొక ఆర్డరుకూడా
వుందా?....ఆఁ? ఉప్పుడు బియ్యానికా?....కాని, రైతు ధాన్య
మమ్మితేనా ? వాళ్ళ ఆశకి అంతులేదు. కార్తీకమాస మొచ్చే

సరికి గిరాకీ వస్తుందేమోనని నిల్వపోసుకు కూర్చున్నారు!.... మీ రిప్పిస్తానంటే, సరుకు చూపించడ మెంత పనండీ!....ఓం! చాలా వుంది ...రామ్మూర్తిలేడూ? అతనిదగ్గిర. ..ఆఁ! ఆఁ! ఆ ఊరువాడే! ఆ ఊరు మొత్తంమీద అతనే మోతుబరు రైతు. బాగా మదాయించి వున్నాడు....ఆఁ! అతనే! అతని ఒక్కడిదగ్గిరే వెయ్యిబస్తా నిల్వవుంది. తలవాకిట్లో వామిలాంటి పురికట్టుకు కూర్చున్నాడు. మీరు దాన్ని రిక్విజిషన్‌చేసి మన కిప్పిస్తే....అయ్యా! చిత్తం! చిత్తం!! దయమట్టుకు వుంచండి. మీరొక కంటితో కనిపెట్టకపోతే ...నమస్కారమండీ!

[రిసీవర్ పెట్టివేస్తాడు.

సుబ్బయ్య. వీడికి బుద్ధిలేదు. ఇలాంటి సంగతులు టెలిఫోన్‌లో మాట్లాడొద్దురా అని ఎన్నిసార్లు మొత్తుకున్నా వినడు. అన్నీ మనరోజులే వుంటాయా? వెధవ! తిక్క వెధవ!! ఇంత మాత్రం మంచీ చెడ్డా తెలవదు. ఎంతపోసుకున్నా వీడి దాహం తీరదు. ఎదురింకా మట్టీ గిట్టీ అంటాడు. ఏదో ఒక తొత్తరం చెయ్యందే వీడికి గుమ్మరించే సంచులన్నీ ఎక్కడి నుంచొస్తాయ్! నిన్నకాక మొన్నొచ్చాడు. అప్పుడే ఒక లకారం చేతబట్టాడు. దాని పుణ్యమా అని యుద్ధ మొకటొచ్చి బాగుపడ్డాడు గాని, వీడి నెత్తిని కాసీపెట్టి యాలంవేస్తే యేగాణీకి కొనేవాడుండేవాడా? వెధవ! లంచగొండి వెధవ!!

[చిట్టా అంగుకుని మరి నాలుగు పేజీలు తిరగవేస్తాడు.

సుబ్బయ్య [విసుగెత్తి పోయినట్టు చిట్టాను రపీమని మూసి, దాన్ని ఒకపక్కని పడవేస్తూ]. కళ్ళు పోతున్నాయ్, ఈ పాడురాత

తెలవక! అసలు నీవల్ల ఏంపని కదులుతుందిలే! ఇక, ఆ పెద్ద గుమాస్తాదగ్గిరికి మనిషి నురికించాలి చప్పున తెముల్చుకు రమ్మని. సర్లే! ఆ అనామతుఖాతా పుస్తక మిలా తగలెయ్! [ఒక క్షణం ఆగి] లోపల ఏం అఘోరిస్తున్నావ్? వెధవ! చచ్చు వెధవ!! తే! త్వరగా తే!!

[లోపలవుండే గుమాస్తా అనామతుఖాతా పుస్తకం అందిస్తాడు. ఈసారి అతని చెయ్యి గజగజ-వణికి పోతూ వుంటుంది.

సుబ్బయ్య. ఏం? చెయ్యికి వాణుకు పుట్టింది! నీకూ-డా మాయరోగ మేదైనా వచ్చిం దేమిటి?—పని మన్నాచేసి ఇంట్లో పడుకోడానికి!

[అనామతుఖాతా పుస్తకం తెరిచి, దాన్ని మౌనంగా ఒకటి, రెండు నిమిషాలు తిరగవేస్తాడు.

సుబ్బయ్య. మళ్లీ ఈ ప్లీడరు అరమూట బియ్యం వేయించుకు పోయాడూ? ఏమిటి మనకి ఈ మెహర్బానీ! ఏదో శుభకార్య మొచ్చిందంటే, నాలుగు బస్తాలు రాయితీగా యిచ్చామని వరస సాగుతున్నాదే! తాను తన ఫీజు తగ్గుతున్నాడా? ఈసారొస్తే నాకు తెలవదు, మా ఖామందు నడగమను!

[కలర్ పెన్సిల్ పుచ్చుకుని, మొదటిపేజీలోని పద్దుల్ని కూడ నారంభిస్తాడు.

సుబ్బయ్య [కూడిక సరిగా వున్నందున ఆపేజీ తిప్పివేస్తూ] ఉఁ! సరే! [రెండోపేజీ తిప్పి, దానిలోని పద్దుల్ని పైనుంచి కిందికి

ఒకసారి చూస్తూ]. మొన్నరాత్రి హోటల్‌వాడికి తోలిన సరుకు పద్దు ఎక్కడా కనబడదే? [మళ్ళీ ఒకసారి పైనుంచి కిందికి పద్దులన్నీ చూచి, వెనకపేజీలోకి వెళ్లి, దాన్నికూడా తనిఖీచేసి కుర్చీలోనుంచి చరాలున లేస్తూ] అరి వెధవ! దొంగ వెధవ! ఇదేమిటి? ఇలారా! ఎదటికిరా! ఇందుకేనా పొద్దుటినుంచీ గదిలో నక్కీనక్కీ కూర్చున్నావ్! ఇందుకేనా అనామతుఖాతా తెమ్మంటే చేతులు గజగజలాడిపోయాయ్! నేను మరేమిటో అనుకున్నా! వెధవ! బందిపోటు వెధవ! రావేరా? రా! బయటికి రా! [ఎంతకూ గుమాస్తా బయటికి రాకపోగా స్వింగ్‌డోర్సువద్దకు వెళ్ళి, ఒక తలుపును లోపలికి తోసి పట్టుకుని] దొరగారూ! అయితే, మొన్నరాత్రి హోటల్‌వాడికి వేసిన సరుకు అనామతు ఖాతాలోకి ఎక్కలేదేం? ఏమి టది? అలా గుడ్లు అప్పగించి చూస్తారేమండీ?....ఆఁ?.. మర్చిపోయారూ? ముండమోపి! అయితే, క్యాషుందా? ఏదీ, క్యాషుబాక్సు బీగమేదీ? క్యాషు తిన్నగా లేకపోతే, చూసుకో నీపని? ఈపూట నీ పెళ్ళి చేశావన్నమాటే!

[గుమాస్తా యివ్వగా క్యాష్‌బాక్సు బీగం అందుకుని, స్వింగ్‌డోర్‌ను చరాలున వదిలివేస్తాడు. అది రపీమని మూసుకుపోతుంది. తన టేబుల్‌పైనేవున్న క్యాష్‌బాక్సు తెరిచి, దానిలోని పైకాన్ని సుబ్బయ్య లెఖ్ఖపెడతాడు. తర్వాత ఆ మొత్తాన్ని అనామతు ఖాతాలోని మొత్తంతో సరిచూస్తాడు.

సుబ్బయ్య, వెధవ! దొంగ వెధవ!! నువ్వు పద్దురాయడం మర్చిపోతే, క్యాషులో పెచ్చు కనబడదే? [ఒక్క గంతులో వెళ్ళి,

స్వింగ్‌డోర్ బయటికి లాగిపట్టుకుని, పట్టరాని - - మండిపడుతూ] వెధవ! బటాచోర్ వెధవ!! నాలుగొందలు దొబ్బేశావ్! రా, బయటికిరా! నేనేం గుడ్డివాడి ననుకున్నావా? నాలుగొందలు జేబులో వేసుకుని, క్యాషు బ్యాలెన్సుకూ, అనామతు ఖాతాకూ సరిపెడితే, ఆపాటి నేను కనిపెట్టలేనను కున్నావ్! ఏమిటి, ఆ దెయ్యపు గుడ్లూ, నువ్వూనూ! గుడ్లు పెద్దవి చేస్తే, నేనేం భయపడతాననుకున్నావా? పళ్లుకూడా బిగిస్తున్నావ్! ఏం! వొంటిరిగా వున్నానని పైనపడి కొడదామనుకుంటున్నావా? వెధవ! చచ్చువెధవ! నీలాంటివాళ్లని చాలామందిని చూచాను! ఈ పప్పులు మనదగ్గి రుడకవ్. మర్యాదగా ఆ పైక మేంచేశావో చెప్పు. దాన్ని తెచ్చి అత్తారబత్తంగా యిచ్చేశావంటే, రద్ది మాస్తుంది. లేకపోతే, పాత చెప్పు పుచ్చుకుని ఈ దవడ, ఆ దవడ....అరి వెధవ! బటా చోర్ వెధవ! పైపై కొస్తావటరా?

[స్వింగ్‌డోర్‌ను వదిలిపెట్టి, చల్లగా యివతలికి వస్తాడు.

సుబ్బయ్య [టేబుల్‌వద్దకు వచ్చివేసి, ముఖాన్నిపట్టిన చెమటను చొక్కాతో తుడుచుకున్నతర్వాత] ఎందుకబ్బాయ్ చెడిపోతావ్! ఒక్కసారి చాలా డబ్బు కంట బడేసరికి మనస్సు రెపరెప లాడిందేమోలే! ఇలాంటి బుద్ధిపొరపాట్లు ఎవరికైనా వస్తాయ్! పెద్దవాళ్లు చెప్పినప్పుడు సర్దుబాటు చేసుకోవాలి! [స్వింగ్‌డోర్ వద్దకు వెళ్ళి దాన్ని తెరుస్తూ] ఆ పైకం బుద్ధిమంతుడిలా వాపసు చేశావంటే....చేతిలో ఆ బద్దీక త్తేమిటి? [ఒక అడుగు

వెనక్కి వేస్తూ] ఆరి వెధవ! రాక్షసి వెధవ!! అది పెట్టి నన్ను పొడుస్తావా ఏమిటి?

[భయంతో చేతిలోని స్ప్రింగ్ డోర్‌ను చప్పున వదిలి వేస్తాడు. రపీమని అది మూసుకుపోతుంది.

సుబ్బయ్య [పీలైనంత దూరానికి జరిగి]. వుండు వెధవ! దొంగ వెధవ! పోలీసులకు రిపోర్టిచ్చి నిన్ను బొక్కలో తోయిస్తా! పిల్లా జెల్లాతో కూటికిలేక మలమల మాడి చస్తున్నావని నీకొక దిక్కు చూపించినందుకు ఇదట్రా నువ్వుచేసే పని? నేను దగ్గిరికి తియ్యకపోతే, నీకు నోట్లోకి అయిదేళ్ళు వెళ్లే వట్రా? అన్నంపెట్టే చేతినే కరుస్తావూ? నాలుగొందలు దొబ్బింది కాకుండా కత్తి చూపిస్తావూ! కాటావాళ్ళంటే, నిన్నిప్పు డిక్కడ పాతేయించేవాణ్ణి కాదూ? ఏమైనా ఈపూట నీ అంతు కనుక్కోకపోతే నన్ను సుబ్బయ్యని పిలవొద్దు.

[టెలిఫోన్ రిసీవర్ చేతిలోకి తీసుకుని, ఒక నంబర్ డయల్ చేస్తాడు.

సుబ్బయ్య. హలో! సర్కిల్‌గా రున్నారా?...అయ్యా! నేనండీ! శ్రీ రామరాజ్యం రైసుమిల్లు సుబ్బయ్యని. నేను విన్నా. మొన్నా ఊళ్లో లేనండీ! నమ్మకంగా మా మూదో గుమాస్తాకి తాళంచెవి అప్పజెప్పి వెళ్లితే ...[తాను చేస్తున్నపని తప్పని తనకే తోచగా మాట తిప్పివేసుకుంటూ] అయ్యా! మరేం లేదు. ఈ గుమాస్తాలను నమ్మడానికి వీల్లేదండీ! వీళ్ల వచ్చి దొంగవెధవలు కారండీ! అందువల్ల ....

[గదిలోనుంచి ఏదో విరుచుకుబడ్డ చప్పుడు వస్తుంది.

సుబ్బయ్య [గదివంక ప్రశ్నార్థకంగా చూస్తూ]. తమకు మంచి పాతబియ్యం దగ్గిరుండి పంపిద్దా మనుకుంటున్నా. ఇంకా లారీ రాలేదు....అయ్యా! చిత్తం! చిత్తం! [ఒక కంటితో గుమస్తాల గదివైపుచూస్తూ టెలిఫోన్ డిస్‌కనెక్ట్‌చేసి, సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌తో ఇంకా మాట్లాడుతూనే వున్నట్టు నటనచేస్తూ] నేను ఊళ్ళోలేని సందుచూచి, మా మూడోగుమాస్తా వెధవ నాలుగొందల రూపాయలు రొక్కం కొట్టేశాడండీ!....ఆఁ! ఆఁ! అవునండీ! నాలుగొందలు. ఎదురు, పొడిచేస్తానంటూ బద్దీ కత్తి పుచ్చుకుని పైపైకొచ్చాడు... ఆఁ! ఇక్కడున్నట్టు పంపించండి నలుగురు జవానుల్ని....మీరే వస్తానంటరా? చిత్తం! అంతకంటేనా? సెలవ్! నమస్కారమండీ!

[అంతటితో టెలిఫోన్‌లో మాట్లాడుతున్న నటన చాలించి రిసీవర్ పెట్టివేస్తాడు.

సుబ్బయ్య [ఒక క్షణం ఆగి, గుమాస్తాల గదివైపుకు బెదురు బెదురుగా రెండడుగులు వేసి]. వస్తున్నారులే నీ మొగుళ్ళు! బేడీలేసి బొక్కలో తోస్తారు! ఒంటిరిగాచూచి నన్నుమకున్నావా కత్తితో బెదిరించడానికి! వెధవ! దొంగ వెధవ!! పిల్లలుగల వాడివి, ఎందుకు చెడిపోతావుగాని, ఇప్పటికైనా బుద్ధికలిగి నా నాలుగొందలు నాకు పారెయ్యి. ఇప్పుడైనా మించుకు పోలేదు. నా పైకం నాకిచ్చి నా కాళ్ళమీద పడ్డావంటే, వాళ్ళ కేదో సర్దిచెప్పి పంపిస్తా! తీరా వాళ్లొచ్చి పట్టుకుపోయారంటే, మరి నీగతి కుక్కలొల్లవ్! పిల్లా పీచూతో గంపెడు సంసారమూ, నువ్వూ నూ పీకమీదికి తెచ్చుకున్నాక పస్తాయించి

లాభం వుండదు. [నెమ్మదిగా స్వింగ్‌డోర్ వద్దకు వెళ్ళి, వాటిలో ఒకదాన్ని కాస్త తెరుస్తూ] నామాట విన్నావంటే నీకొచ్చిన భయం లేదు! సర్కారు మనచేతిలోవాడే వయ్యో! మనమాట దాటిపోడు. ఏఁ మాట్లాడవే? [బెదురు బెదురుగా లోపలికి తొంగిచూచి] అరి వెధవ! దొంగ వెధవ! కత్తితో మెడకోసుకు చచ్చాడు! చచ్చాడఱ్రో! చచ్చాడు!! అయ్యో! వెధవ! దొంగ వెధవ! నన్ను పీక్కుతినమని నా కొంప మీదికి పోలీసాళ్ళ నెక్కించటానికట్రా! అరి వెధవ! దొంగ వెధవ!!

[వెర్రిగంగిర్లు ఎత్తినవాడివలె ఆఫీసురూమ్‌లో గంతులేస్తుండగా—

తెర]



## పాత్రలు

అప్పయ్య : పల్లెటూరి రైతు
కోటమ్మ : అతని భార్య
చలపతి : అతని కొడుకు
పొన్నమ్మ : ఇరుగుపొరుగు భాగ్యశాలి
భూషయ్య : ఊరు పెత్తందారు

## స్థలం :

అప్పయ్యగారి యింటిచావిడి

## కాలం :

వర్తమానం



# వంతెన

[అది అప్పయ్యగారి మండువా చావిడి. మండువా నాలుగు వైపులా నాలుగు స్తంభాలు. ఆ స్తంభాలను కలుపుతూ పిట్టగోడ. మండువా మధ్య తులసికోట. ప్రేక్షకులకు సమ్ముఖంలో - మండువాకు అవతలగా - కానవచ్చేది సింహ ద్వారం. ఎడమ చేతివైపునున్న రెండు ద్వారాలు గదులలోకి. కుడిచేతివైపునున్న మరి రెండుద్వారాలలో ఒకటి వంటింటి లోకి, రెండవది పెరటిలోకి. చావిడిలో రెండు నవారు మంచాలు మాత్రం వున్నాయి.

తెర లేచిన క్షణానికి పొన్నమ్మ ప్రవేశిస్తుంది. ఆమె వయస్సు నలభై అయిదు ప్రాంతాల. పూర్వకాలపు ముత్తయిదువ ముస్తాబు.]

పొన్నమ్మ. పిన్నామ్మా, కోటమ్మ పిన్నామా!

కోటమ్మ [లోపలినించే]. నువ్వాటే పొన్నీ! చేతిలో కాస్త పనుంది. చేసుకొస్తాగాని, కూకోవే కల్లాలా!

పొన్నమ్మ. ఇంత పొద్దుగూకేళ అంత వంటేమి చేస్తున్నావ్, తల్లీ! చుట్టపా డెవడైనా వచ్చా డేమిటి?

[పొన్నమ్మ ఈ ప్రశ్న వేసిన తర్వాత ఒక క్షణానికి కోటమ్మ ప్రవేశిస్తుంది. ఆమె వయస్సు ఇంచు

మించు యాభై అయిదు సంవత్సరాలు. అభం శుభం తెలియని పల్లెటూరి యిల్లాలు.

కోటమ్మ [ప్రవేశిస్తూ]. చుట్టాలూ లేరు; పక్కాలూ లేరు. ఉలవల్లో తవుడు కలుపుతున్నా.

పొన్నమ్మ. ఏఁ? మా బాబాయి లేడూ?

కోటమ్మ. ఉహుఁ! పేట కెళ్ళాడు.

పొన్నమ్మ. మరి మా తమ్ముడో?

కోటమ్మ. ఆడు మంచాడైతే మాకిన్ని తిప్ప లెందుకొస్తాయ్! అయ్యనగారిక్కి బద్ధకంగా వుండి "అబ్బాయ్! పేట కెళ్ళి వాడ్లమ్ముకురారా!" అని మొన్ననగా పంపిస్తే అజా పజా లేడు. తెల్లారగట్టే ఆ గింజల్ని తోలుకెళ్ళిన బళ్ళు అవాళ రాత్రికే తిరిగొచ్చేశాయి. ఎళ్ళి ఎళ్ళగానే ఆ గింజలేవో బేరమిచ్చేశాడని బళ్లోళ్లు చెప్పారు. మరి ఆదేమయ్యాడో, ఆ దస్తేమైందో! ఇదుగో వస్తాడు, అదుగో వస్తాడని చూసి చూసి మా కళ్లు కాయలు కాసినా వాడి వత్తా లేదు. ఆడి సంగతి తెలిసుండీ ఆడినెందుకు పంపించానని, తన్ను తాను ఒక పది తిట్టుకుని మీ బాబాయి పీకటితో లేచి పేటకి పరుగెత్తాడు. సందేళకి తిరిగొస్తానన్నాడు. ఇంకా రానే లేదు. గొడ్లు యిళ్ళకొచ్చేయాళకు ఒక బస్సొస్తుందటగా! అది రానేలా?

పొన్నమ్మ. ఆఁ! అదింకా మండిందో, లేదో! ఏం బస్సులో, పాడు బస్సులు! [illegible] వచ్చాయోగాని, మన ఊరికే శని వట్టుకుంది. పనీ పోయింది; పాటా పోయింది. బస్సెక్కి బుడిగీ బుడిగీ బస్తీకి దౌడుతీస్తున్నారు. వడవాలా? పెట్టాలా?

ఇక్కడ గడపలో ఎక్కడం, అక్కడ బజారులో దిగడం. ఒక అర్ధరూపాయి మన్ది కాదనుకుంటే బుర్రున పోయి, బర్రున రావొచ్చయ్యె!

కోటమ్మ. ఔనే, కల్లాలా! ఈ మాయదారి బస్సులు మనకక్కడ దాపరించాయోగాని, ఊరొక అందాన లేదు.

పొన్నమ్మ. కాదటే, పిన్నామా? మొన్నొకనాడు ఏం జరిగిందనుకున్నావ్! మా రెండో పిల్లదానికి పురుడు పొయ్యడానికని ఏటవతలి కెడుతుంటే, ఆ మీసాల యెంకడు - పెద్దమాలపల్లి యెంకడు - వాడి పెళ్ళామొచ్చి, రింగు రంగా అంటూ పక్కని కూర్చుంది. ఏం చెయ్యను? మాట్టడ్డానికి మనవల్లా? ఇంకా దాని పుణ్యమాయిరి! పక్కనే కూర్చుందిగాని, వాళ్ళో కూర్చుంటేమాత్రం దాన్ని అడిగేవాళ్ళెవరు? పిసుక్క చచ్చి, నేనే కాస్త ఒకపక్కకి ఒత్తిగిలా! అదే మన మెక్కిన బల్లకట్టు మీదెక్కితే, దాన్ని కాళ్ళిరగగొట్టేవాళ్ల కాదూ?

కోటమ్మ. ఇది మాయ కలికాలం కాదటే కల్లాలా! ఒక కట్టడి ఎక్క దేడ్చిందిః కుడీ, యెడం ఎక్క దేడ్చింది? అమాటకొస్తే, చిన్నా పెద్దా అయినా చూస్తున్నారటే! మా అబ్బాయి మానానికి మా అబ్బాయి బాబుమాట యింటున్నాడూ? ఈయేడు వా డసలు మాసూల్లోకి యెళ్ళితేనా? "కళ్ళాం తొక్కించరా!!" అంటే చెవి నట్టించుకోలేదు. "కుప్ప దింపించరా!" అంటే గోడకి చెప్పినట్టే! ఏమిటో చినిమాలట! మాయదారి చినిమాలు!! ఈటిని మరిగాక ఆ డింటిపట్టు నుంటేనా!

పొన్నమ్మ. వాడికేమే పిన్నామా! ఎంత చెడ్డా వాడు మగబిడ్డ. కాని, ఈ ఆడముండల కేం తిప్పలొచ్చాయ్! కొత్త సినిమా

వచ్చిందని టముకొ్స్తే చాలు, - తంబలకి తంబలు తైక్కి-మంటున్నారు. ఇఖ, వాటిని చూచొచ్చిన కాడినుంచీ ఆ పాపట్లు పాపట్లు కావు, ఆ పమిటలు పమిటలు కావు. రోజు కొక రకం. నిన్న ఆ ఎత్తుపళ్ళ సుబ్బి కోడలిచేతిని చూస్తే, మోచేతిదాకా అన్నీ గాజులే. లంబాడీముండా, లంబాడీ యానమున్నూ !

కోటమ్మ. ఇంకా అది నయం కాదటే, కల్లాలా ? ఆ మెరకీధి సరిసి కూతురు

పొన్నమ్మ. చల్లనేళ ఆ పుట్టుకుంక పేరెందు కెత్తావే, పిన్నామా! పాపం చుట్టుకోడానికా ! అది ఆ బస్సు కండక్టర్ని - దుబ్బు జుట్టుతో గణాచారిలా వుంటాడే ! - వాణ్ణి ...

కోటమ్మ. ఎవడే ఆడు ?

పొన్నమ్మ. ఉన్నాడులే ఒకడు చింబోతులా ! - వాడి జిమ్మడ ! వాణ్ణి పగలుచూస్తే, రాత్రి కలలో కొస్తాడు - వాణ్ణి అది పెట్టుకుంది. మల్లెపువ్వు లేమిటి ? మిఠాయిపొట్లా లేమిటి ? - వాడు నడిచే బుట్టలు బుట్టలు కావు. అన్నీ తెచ్చి యింటినిండా పడేస్తున్నాడని వాణ్ణి ఇంటి అల్లుణ్ణి చేసుకున్నారు.

కోటమ్మ. ఛీ ! మద్దెపు ముండలు. మరి దాని మొగుడెలా వూరుకుంటున్నాడే ?

పొన్నమ్మ. వాడు గాజులు తొడిగించుకొన్న యదవ కాదంటే, పిన్నామా ! పెళ్ళాం ఏంకూళ్ళు కుడిస్తే వాడికేం ? దమ్మిడీ ఖర్చులేకుండా బస్సులెక్కి గడేకారిలా తిరుగుతున్నానని వాడి కులుకు వాడిది.

కోటమ్మ. అంత సన్నాసటే ఆడు !

పొన్నమ్మ. సన్నాసా! సన్నాసిన్నరా!! నేరీదిగా ఇలాంటి తప్పుడు పనులు జరుగుతుంటే, ఇదివరకైతే, ఊరుకునేవాళ్ళచే పిన్నామ్మా! నిలువునా తెగ్గోసి ఉప్పుపాతర్లో ఊరేసేవాళ్ళు కాదూ?

కోటమ్మ. ఇంతకీ ఈ తిప్పలన్నీ పెదనాగన్నగారి బూనయ్య తెచ్చిపెట్టాడు. ఏటిమీద ఒంతిన కట్టి, రోడ్డేస్తే, ఊరుకేదో ఒరుగుతుందని గడప గడపకి తిరిగి చందా లోగుజేసి చట్టు బండలయ్యాడు. అంతకుముందు ఆపేట ఎక్కడ మండిందో ఎవళ్ళకి తెలుసు? నామట్టుకు నేను ఇన్నేళ్ళొచ్చినా దాని ముక్కూ ముఖ మెరగను.

పొన్నమ్మ. అంతేనే, పిన్నామా! మనకి బస్తీలతో పనేమిటి? ఏటి కొకసారి వెళ్ళితే గింజా గిట్రా అమ్ముకోటాని కెళ్ళాలి. పెళ్ళో పబ్బమో వస్తే గుడ్డా గుడుసూ తెచ్చుకోడాని కెళ్ళాలి. అప్పుడైనా ఎవళ్లుబడితే వాళ్లు వెళ్ళేవాళ్లా? పెద్ద తలకాయ లెవరో ఒకరిద్దరు పొద్దున్నే చద్దన్నం తినెళ్ళితే, సందేళకి ఆ పనేమిటో చూచుకు చక్కా వచ్చేవాళ్ళు ఇప్పు డేముందీ? అడ్డమైనవాళ్లూ ఆసులో గొట్టం తిరిగినట్టు ఈసందుకీ ఆసందుకీ తిరుగుతున్నారు. ఎన్ని బస్సులు నడిచినా, నిలుచోటానికైనా సందుంటేనా!

కోటమ్మ. ఇంతకీ మాకొంపకి తిప్పలు తేవటానికే వొచ్చిపడ్డాయి ఈ పాడు బస్సులు! తన పనేమో, తానేమో, ఒకరిజోలీ సొంటీ లేకుండా దొరలా వుండే నా బిడ్డ ఇవొచ్చాక చప్పగా చెడిపోయాడు. వారానికి రెండు, మూడు సార్లయినా బస్తీ కెళ్ళి రాకపోతే....అడుగో! ఆ డొచ్చాడు. ఏరా, అబ్బాయ్! ఎన్ని

రోజులైంది మవ్వెళ్ళి! రేపటికి నాలుగు ! ఇదుగో తిరిగొస్తా నన్నబిడ్డ రానేలేదని మా మనస్సెంత పీకిందో నీకేం తెలుస్తుంది! ఇట్టాగైతే ఎట్టారా, బాబూ! ఏడీ, మీ బాబేడీ ?

[ఈ ఘట్టంలో ప్రవేశించిన చలపతి ఇరవైరెండు, ఇరవైమూడు ఏళ్లవాడు. మనిషిలో నాజూకుతనం లేకపోయినా, వేషంలో నాజూకుతనం కోసం చాలా ప్రయత్నం కనబడుతుంది. కుబుసంలాంటి ధోవతి; ఆ ధోవతికంటెకూడా సన్నని లాల్చీ. ఆ లాల్చీలోనుంచి చేతులులేని అల్లికబనియన్ తొంగి చూస్తూ వుంటుంది. వల్లెవాటుగా సన్నని జరీ ఉత్తరీయం. కాళ్లకు ఆకుచెప్పులు, చేతికి గడియారం, కళ్లకు సులోచనాలజోడు.

చలపతి. ఏమో, నాకేం తెలుసు ?

కోటమ్మ. నీయెంట రాలేదట్రా ?

చలపతి. నావెంట రావడ మేమిటి ?

కోటమ్మ. ని న్నెతుక్కుంటూ, పొదువెళ్ళె పెటకి రాలేదట్రా మీ బాబు ?

చలపతి. నన్నెతుక్కుంటూ రావడం దేనికి ? తనసొమ్ము పుచ్చుకుని దేశం తెగించి పారిపోతా ననుకున్నాడా ?

కోటమ్మ. చూడవే, పొన్నీ ! ఆడిమాటలు ! మొన్న పొద్దున్ననగా వొడ్లు తోలించుకెళ్ళి తమ బస్తీలో కూకుంటే కూకున్నాడు గాని....

చలపతి. అక్కడ ఆ రైసుమిల్లువాళ్లు డబ్బివ్వకపోతే నన్నేం చెయ్యమంటా రేమిటి ?

పొన్నమ్మ. అంత కోపం దేనికిరా తమ్ముడూ? ఇప్పుడు పిన్నామ ఏమందని?

కోటమ్మ. అక్కడ పైక మందకపోతే, అందలేదని.... తెల్లారి లేస్తే లక్ష తొంభై మంది వస్తూ పోతూవుంటారుగదా! ...ఎవళ్ళ చేతనైనా కాస్త కబురు చేస్తే, మేమెందుకు గుంజాటన పడతాం!

పొన్నమ్మ. నిజమే తమ్ముడూ! కాకిచేతైనా కాస్త కబురు చేస్తే కాదూ?

చలపతి. కబురెలా చెయ్యడం? ఏపూట కాపూట ఇదుగో మీపని చేసి పంపిస్తామని వాళ్ళంటూవుంటే!

కోటమ్మ. సర్లే, బాబూ! నువ్వు సుకంగా తిరిగొచ్చావ్! అదే పదేలు గాని, నిన్నెతుక్కుంటూ యెళ్ళిన మీ బాబు నువ్వు తగల్లేదని ఎంత గాభరా పడుతున్నాడో, ఏమో, కర్మం! పైకెంత బోకరించినా, వొట్టి బయస్తుడు. కాస్తకీ, కూస్తికీ కూడా గుండె బేజారౌతాడు. పందేళకి తప్పకుండా తిరిగొస్తానని చెప్పిపోయాడుగాని, నువ్వు కనబడలేదని ఇవాల్టి కిక రాడేమో. చివరి బస్సొచ్చేసిందా?

పొన్నమ్మ. వచ్చే వుండాలి. నువ్వొచ్చింది చివరి బస్సేగా, అబ్బాయ్?

చలపతి. ఊఁహూఁ. అది మరి కాసేపటికిగాని రాదు. నే నొచ్చింది దారిలో చెడిపోయి, గంటన్నర ఆలస్యమైంది.

పొన్నమ్మ. అంతే మరి! ఏదైనా సాగితే బండి. సాగకపోతే మొండి..

కోటమ్మ. సర్లేరా, బాబూ! రా! కాళ్ళ కడుక్కురా! బువ్వ పెడతా!

చలపతి. ఊఁహూఁ! నాకు ఆకలిగా లేదు

కోటమ్మ. అయ్యో కర్మ! ఆక ల్లేకపోవట మేమిట్రా? పెరుగోష్కైనా రెండు ముద్దలు....

చలపతి. వద్దు!

కోటమ్మ. మా నాయనవుగా! రెండు ముద్దలంటే రెండే ముద్దలు.

చలపతి [చిరాకుగా]. నా కాకలి లేదంటూంటే!

[బయటికి వెళ్ళబోతాడు.

కోటమ్మ. మళ్ళీ యిప్పుడు బయటి కెక్కడికిరా? కాసేపటికో, కూసేపటికో మీ బాబొస్తాడేమో! ఆయి నొచ్చేయాళకి నువ్వింటి కాడ లేకపోతే....

పొన్నమ్మ. ఔను, తమ్ముడూ! బాబాయి యిప్పు డొస్తాడేమోగా! నువ్విప్పు డెక్కడికి?

చలపతి. ఎక్కడికీ లేదు - ఇక్కడికే! ఇప్పుడే తిరిగొస్తా.

[తిరిగి కదులుతాడు.

కోటమ్మ. సరేగాని, ఆ దస్తు యెంట దేనికిరా, బాబూ! ఇంట్లో బద్రంచేసి పో!

చలపతి. దస్తేమిటి? వాళ్ళు డబ్బివ్వందే!

కోటమ్మ. ఆళ్ళ జిమ్మడ! ఇన్నిరోజు లట్టిపెట్టుకుని ఆళ్ళు డబ్బివ్వనేలా?

చలపతి. ఉఁహుఁ!

[వెళ్ళిపోతాడు.

కోటమ్మ. చూశావటే, పొన్నీ! వాడొచ్చిన యెడ మెక్కడ? యెళ్ళిన యెడ మెక్కడ? కూసేపైనా కొంపలో అడికి కాలు నిలిస్తేనా? ఈ మండిన ఒంతిన పడి, ఈ మాయదారి బస్సులు

ఏమంటూ వొచ్చాయో గాని నాబిడ్డ చప్పగా చెడిపోయాడు. ఏమేసిపెట్టినా సుబ్బరంగా పళ్లెం తుడుచుకు తినేవాడు. ఇప్పుడు ఎంత కమ్మగా కూరొండినా, ఆడికి రెండు ముద్దలైనా దిగందే! కూకున్నాడు కూకున్నట్టే లేచిచక్కాపోతున్నాడు. ఈపూట గలితే, అసలు అన్నమే వొద్దన్నాడు!

పొన్నమ్మ. ఆఁ! కాపీవోటళ్ళకి మరిగినాళ్ళకి మన కూరా నారా నచ్చుతుందంటే, పిన్నామా! ఇద్దెన్లవి, దోసెలని - వాటి పేర్లయినా - మండిన పేర్లు! - మనకి తెలవ్వు - అక్కాడేమిటో వర్రగా పెడతారట! మనవి పాతకాలపు వంటలు! మన లొట లొట పులుసులు వాళ్ళకేం నచ్చుతాయ్!

కోటమ్మ. ఏం తిళ్ళో పాడు తిళ్లు! ఇల్లాంటి తిళ్లు ఎన్ని తిన్నా అన్నమౌతుందటే, కల్లాలా!

పొన్నమ్మ. కాదనుకో! కాని, అడ్డమైనాళ్ళకీ ఇప్పుడు కాపీ వోటలు ఒకపెద్ద రంధైపోయిందిగా! బస్తీకి తిరిగేవాళ్ల సగం సినిమాలకైతే, సగం కాపీవోటళ్ళకి. ఈ పాడు వోటళ్ళమూలంగానేగా, ఊళ్లో పాలూ, పెరుగూ, మజ్జిగా కరువైపోయాయ్! నెయ్యిమాత్రం కావాలంటే దొరకుతున్నదాకి ఇప్పుడు పాడిచేసుకోవడం తాగడానికటే, పిన్నామా?— అమ్ముకుని మూటలు కట్టుకోడానికిగాని! తెల్లారకముందే వాడిక వాళ్ళొచ్చి, పాలూ, పెరుగూ, వెన్నా - అన్నీ బస్సులమీద ఎక్కించుకు పోతున్నారు.

కోటమ్మ. నిజమేనే. పొన్నీ! మొన్నొకనాడు చుట్టపాడొస్తే పాపుపేరు నెయ్యికోసమని పిడతెట్టి ఊరంతా తిప్పించినా.

ఎవ్వతీ పొయ్యనే లేదు. మీ రమ్మేదానికి కానీ, అర్ధణా ఎక్కు వేసుకు పొయ్యమన్నా, ఒక్కతైనా పబ్బం గడపలేదు.

పొన్నమ్మ. నీదంతా పిచ్చిగాని, ఇప్పు డసలు గిద్దెడు నెయ్యి బదులు పొయ్యమన్నా పోస్తున్నారటే, పిన్నామా ? ఒకపూట వాడిక తప్పిస్తే, వాడిగ్గా వొచ్చేవాళ్లు అలిగి బిగదీసుకు పోతారట! అందుకని అడిగితే మాట వోటుపోవడమేగాని ఒక్క బొట్టయినా రాల్చరు.

కోటమ్మ. అయ్యో! కాలాని కెన్ని కడగళ్లొచ్చాయే, కల్లాలా!

పొన్నమ్మ. పిల్లా జెల్లాని యిగర కట్టి, ఆ అమ్మకునే పాడినైనా ఒకతీరూ దారీగా అమ్మతున్నారటే, పిన్నామా! అన్నీ కల్తీలేగా! అంతా తొత్తడమేగా!

కోటమ్మ. ఔనే పొన్నీ! మొన్న యెవతో చెప్పింది. యెన్న తీశాక, బాన్లో యింత మజ్జిగపోసి, కవ్వంతో గిలకొడితే, ఆ మజ్జిగంతా యెన్నలో కెక్కి ఆటొస్తుందటగా!

పొన్నమ్మ. అదొక్కటేనటే, పిన్నామా! మైదాపిండి మెత్తగా ఉడకబెట్టి వెన్నలో కలిపేస్తున్నారు!

కోటమ్మ. అయ్యో! సోద్దెం! ఇలా పాపప్పసొమ్ము మూటకడితే, ఏం ముందుకొస్తారే, కల్లాలా! ఈ మండిన వంతెన పడి, ఈ మాయదారి బస్సు లొచ్చి, ఈ ముదనష్టపు బస్తీల కెక్కడం ఎక్కువైనాకేగాని, అంతకుముందు ఈ పాపా లెరగమే, పొన్నీ! ఎటొచ్చీ ఈ ఏటినద్దం, రెండేళ్ళనుంచేగా ఈ యిద్దూరాలన్నీ!

పొన్నమ్మ. నిజమేనే పిన్నామా! నాలుగేళ్ళనాడు మా రెండోపిల్ల పెళ్ళికి కాసీపెట్టి కూరకొన్నామూ? ఇరుగు పొరుగువాళ్ళే ఇన్ని గుమ్మడికాయలు, ఇన్ని వంకాయలు, ఇన్ని బెండకాయలు, ఎవళ్ళకి కాసినవి వాళ్ళు, అడక్కుండానే పంపించారు. అదే పోయినేడు మా మూడోపిల్ల పెళ్ళికి తోటకూరకాడకుద్దా అన్నీ బస్తీ కెళ్ళి కొనుక్కోవాల్సొచ్చింది!

కోటమ్మ. అంతేనే కల్లాలా! ఇదివరకంటే మంచొచ్చినా, చెడ్డొచ్చినా ఒకళ్ళ కొకళ్ళ ఆదుకునేవాళ్లు. ఇప్పు డేముంది? డబ్బుకు మరో డబ్బు ముడేసి, నగలూ, నాణాలూ....

పొన్నమ్మ [కాళ్ళ అలికిడి విని వీధిగుమ్మంవైపుకు ముఖంతిప్పి]. అడుగోనే, పిన్నామా, మా బాబాయి!

[అప్పయ్య ప్రవేశిస్తాడు. వయస్సు దాదాపు అరవై సంవత్సరాలు. అయినా, శరీరపటుత్వం కొంచెమైనా సడలనివాడు. పొలంలో వంగితే, పడుచువానికంటె ఏ కొంచెమో ఎక్కువగానే పాటుపడగలవాడు.

అప్పయ్య [లోపలికి అడుగుపెడుతూనే కోటమ్మతో]. ఏమే! వాడు పేటలో లేడు! ఏమైపోయినట్టు?

కోటమ్మ. ఇంటి కొచ్చాడు.

పొన్నమ్మ. ఇంతకు ముందేనే, బాబాయ్!

అప్పయ్య. దొర దిగాడన్నమాట! ఏడీ, మరి?

కోటమ్మ. వాకిట్లోవాడు వాకిట్లోనే ఊరిమీదికి పోయాడు. ఎంత బతిమిలాడినా తిండైనా తిన్లేదు!

అప్పయ్య. అప్పుడే ఇంటికి రావడమూ, ఊరిమీదికి పోవడమూ జరిగిందన్నమాట! ఆ దస్తు వెంటే పట్టుకుపోయాడా!

కోటమ్మ. వాళ్ళింకా డబ్బివ్వలేదటగా!

అప్పయ్య. డబ్బివ్వకపోవడ మేమిటి? సొమ్ము సంచులమీద పెట్టామని వాళ్ళు చెబితే!

పొన్నమ్మ. అబ్బే! లేదటే బాబాయ్! వాళ్ళు తెగ తిప్పి ఉత్తిచేతుల్తో పంపించారని అబ్బాయి అంటేనే!

అప్పయ్య. వీడింత దొంగవెధ వయ్యాడే ఒక్కమాటైనా నిజం లేదుగదా? బేరంపుచ్చుకోగానే, డబ్బిచ్చేశామని వాళ్ళు నాతో స్పష్టంగా చెప్పారు!

కోటమ్మ. అయ్యొ కర్మ! అయితే అడు డబ్బేం చేసినట్టు! కాస్తా, కూస్తా! పదేనొందల చిల్లర!

అప్పయ్య. వాడివొంటికి బాగా నీరుపట్టింది. కళ్ళు పసరెక్కి కొట్టుకుంటున్నాడు. తాశీలుకైనా డబ్బులేదని చెప్పి, వొడ్లు అమ్ముకు రారా అని పంపిస్తే, వాడు నన్నింత రొష్టు పెడతాడూ? ఎక్కడున్నాడో చూచి, సిగ పాయతీసి, వాణ్ణి ఈపూట సున్నంలోకి ఎముకలేకుండా నలగ బొడవకపోతే నాపేరు అప్పయ్య కాదు.

[మండువా చూరులోనుంచి కోలుపుకర్ర తీసుకుని, వీధిలోకి బయల్దేరబోతాడు.

కోటమ్మ [అడ్డువచ్చి]. సర్లే! నువ్వూరుకో! కన్నా మన్దే; యేలూ మన్దే. అణ్ణి పట్టుకు కొడితే పోయిం డబ్బొస్తుందా?

అప్పయ్య [కోటమ్మను తోసివేసి వెళ్లిపోతూ]. ఎప్పటికప్పుడు

నువ్వే వాణ్ణి చెడగొట్టింది. నువ్విచ్చిన అలుసు చూచుకునేగా వాడు మేకై కూర్చున్నాడు.

కోటమ్మ [నెత్తి కొట్టుకుంటూ]. ఇది నాకర్మ.

పొన్నమ్మ. అః! నీకు తెలవదులేవే, పిన్నామా! అపాటి భయం లేకపోతే మాటింటారటే!

కోటమ్మ. చాల్లే! చెప్పొచ్చావ్! కడుపుచించుకుంటే కాళ్లమీద పడుతుందని, ఆడి కాలో, చెయ్యో యిరిగితే ఎవళ్లకి తిప్పలు? మాక్కాదూ?

పొన్నమ్మ. అః! బాబాయిది బుసబుస పొంగుకాదూ?। ఎదో తామస మొచ్చి కేకలేస్తూ పోయాడు గాని, పెరిగొచ్చిన కొడుకుపై చెయ్యి చేసుకుంటాడటే, పిన్నామా!

కోటమ్మ. ఏమో కర్మ! మండిపడుతూ పోయాడు. పిచ్చి కోపంలో కొంపకేమి తిప్పలు తెస్తాడో, ఏమో! ఇంతకీ ఈ పీడంతా ఆ పెదనాగన్నగారి బూసయ్య....

భూషయ్య [ప్రవేశిస్తూ]. ఏమిటే, కోటమ్మక్కా! నా పేరెత్తు తున్నావ్!

[భూషయ్య వయస్సు ఇంచుమించు నలభై సంవత్స రాలు. మనిషిలో ఎంతో హుందాతనం కనబడుతూ వుంటుంది. తాతవలె, తండ్రివలె తానుకూడా తన హుందాతనంవల్లనే ఊరుకు పెత్తందారై, వయ స్సులో తనకంటె పెద్దవారినుంచికూడా మన్నన పొందుతున్నట్టివాడు.

కోటమ్మ. వొచ్చావ్, బాబూ, నువ్వు !—మాటలో మూటేసుకుని ! నువ్వే మాకొంపకి చిచ్చుపెట్టావ్ !

భూషయ్య [నవ్వుతూ]. అంత పాపం చేశానూ ?

కోటమ్మ. నీకిది నవ్వులాటగా వుందటరా, బూసయ్యా ?

భూషయ్య. ఇంతకీ ఏమిటమ్మా సంగతి ?

కోటమ్మ. ఏమిటా ? గింజలమ్ముకురారా అని పిల్లాడిని పేటకి పంపిస్తే. వాటినమ్మి ఆ డబ్బు మంగళం చేసుకొచ్చాడు. ఈ మాటినేసరికి మీ బావయ్యకి వొళ్లు మండుకొచ్చి కర్రుచ్చుకు కొడుకుమీది కెళ్లాడు.

భూషయ్య. ఆఁ ! మా బావయ్యకి అంత వొళ్లుతెలియని కోప మొచ్చిందీ ?

పొన్నమ్మ. ఎవళ్లకైనా పుట్టుకొస్తుంది రేచిక్క, ఇట్టాంటి పన్లు చూస్తే!

కోటమ్మ. అబ్బాయ్! నువ్వు కాస్తెళ్లి మీ బావయ్యకి సర్దిచెప్పి తీసుకురారా ! మంగళమైన సొమ్మేమో మంగళమైంది. ఆడి మీద చెయ్యిచేసుకుంటే పోయిం డబ్బొస్తుందా ?

భూషయ్య. ఇప్పుడు నీ కొడుకు కొచ్చిన భయమేమీ లేదు, కోటమ్మక్కా! వాడు మాయింట్లో భద్రంగా వున్నాడులే.

కోటమ్మ. ఆడు మీయింటి కొచ్చాడేమిటి ? ఎందుకురా, అబ్బాయ్ ?

భూషయ్య. ఎందుకొస్తే నేమిగాని, మధ్య నేనేమో చేశానంటా వేమిటి ?

కోటమ్మ. నువ్వు ఈ మండిన ఒంతినేయించి, ఈ మాయదారి రోడ్డుపోయించి, ఈ ముదనష్టపు బస్సులు నడిపించాకే కాదట్రా,

ఊళ్ళో కొంపకొంపకీ ఇన్ని కడగళ్ళొచ్చాయ్ ! అంతకుముందు ఈ యిడ్డూరా లెరుగున్నామూ ?

పొన్నమ్మ. అలా అడుగు, పిన్నామా ! బాగా అడుగు !

భూషయ్య. అయితే, పొన్నమ్మా ! నువ్వు పాడిమీద ఎంత సంపా యిస్తున్నావ్ ?

పొన్నమ్మ. ఆc ! ఈ యేడు మాకు పాడెక్కడిది ?

భూషయ్య. పోనీ, ఈ యేడు కాకపోతే నిరుడెంత మూటగట్టావ్ ?

పొన్నమ్మ. ఆc ! చాలా మూట గట్టాం ! వాటికిపోసిన తవుడుకి చాల్లేదు.

కోటమ్మ. అదేమిటే పొన్నీ ! పాడికుండమీద నాలుగు డబ్బులు కళ్ళబడితేనేగా ఆ నానుపేట చేయించి, మెళ్ళో పెట్టుకున్నావ్ !

భూషయ్య [నవ్వుతూ]. అలా అడుగు, కోటమ్మక్కా ! బాగా అడుగు !

పొన్నమ్మ. అడగడానికీ, కడగడానికీ నే నెవరి యింట్లోనైనా కన్నా మేశానా !

భూషయ్య. ఎవరింట్లో కన్నంవేస్తే ఎవ రూరుకుంటా రమ్మా ? పాడి అమ్ముకోబట్టి....

పొన్నమ్మ. అమ్ముకోక పందేరం పెడతా రేమిటి ? ఊరికే మా కెవ్వరేమీ పంచిపెట్టడం లేదే !

భూషయ్య. ఊరికే పంచిపెట్టమని నేనంటానా? వంతెన పడబట్టే, రోడ్డు పొయ్యబట్టే, నాలుగుడబ్బులు అందరికళ్లా పడుతున్నా యంటున్నాను. అందరూ కాస్త పచ్చపచ్చగా వున్నారంటు న్నాను. కొత్తగా చేతిలో నాలుగుడబ్బులు గురగుర లాడు

తుంటే, ఎంతటివాళ్లకైనా మతులుపోతాయ్! అంతమాత్రానికి నాలుగు డబ్బులొచ్చే దారి చూపించడమే తప్పా ?

కోటమ్మ. ఆఁ! మా లావు చూపించావులే దారి! అక్కడినుంచి ఒక కానీ ఇక్కడికొస్తే, ఇక్కడినుంచి రూపాయి అక్కడికి పోతున్నది. ఇంతేనా సంబరం! ఇవ్వాళ చూశావుగా! కాస్తా, కూస్తా! పదేనొందల చిల్లర! చల్లా పెరుగూ అమ్ముకుని కానీకానీకాడికి ముడేస్తే, ఎప్పటికి కాను పదేనొందలు!

పొన్నమ్మ. బాగా చెప్పావే, పిన్నామా!

భూషయ్య. నేను తిరగమన్నానటే, కోటమ్మక్కా, మీ అబ్బాయిని బస్తీ లెంట! నామాట విని, ఎక్కడైనా ఒక పిల్లని చూచి వాడికి తొందరగా ముడిపెట్టండి. గుదిబండ మెడని పడితే, ఇంటిని అతికివుంటాడు.

కోటమ్మ. ఆఁ! ఆడింత గాలిగా తిరుగుతుంటే ఆడికి పిల్ల నెవరిస్తారు?

పొన్నమ్మ. వాడికి పిల్లనిచ్చేవాళ్లే కరువటే, పిన్నామా? మా పెద్దమ్మాయిదగ్గిర ఎదిగినపిల్ల వుంది. నువ్వు "ఊఁ" అనాలేగాని, ఏడేలు కట్నంపోసి....

కోటమ్మ. కట్నాల కేమొచ్చెలే! అంత దూరం సంబంధం.

పొన్నమ్మ. ఎంతదూరమే, పిన్నామా! పది ఆమడలైనా లేదు. ఈ ఊరునుంచి ఆ ఊరుదాకా ఇప్పుడు బస్సులు నడుస్తూనే వున్నాయిగా! పొద్దున్నే ఇక్కడ బయల్దేరితే, పొద్దుగూకేళకు అక్కడ దిగొచ్చు.

[భూషయ్య నవ్వుతాడు.

కోటమ్మ. ఎందుకురా, బూసయ్యా, నీకంత నవ్వుగా వుంది?

భూషయ్య. ఆఁ! ఏం లేదు, కోటమ్మక్కా! ఈ ముదనష్టపు బస్సులు రాబట్టే గదా, ఎంత దూరవూరైనా దగ్గిరూరై పోయిందని నవ్వొచ్చింది.

పొన్నమ్మ. ఆఁ! మన పెత్తందారుగారి ఎకసక్కాలకేం గావి, అయిన సంబంధం! పిల్లవొంటిని ముప్పైవనవర్సుల నగకట్టు కూడా వుంది. ఏమంటావే, పిన్నామ్మా?

కోటమ్మ. ఆఁ! ఇప్పు డేం తొందర లేవే!

పొన్నమ్మ. వచ్చేనెల్లో రెండే లగ్గా లున్నాయట. అవి తప్పితే, మరి ఈయేటికి లగ్గమే లేదంటున్నారు. ఈపూట నే నసలు ఈమాట కదలేసిపోదామనే నగ మొచ్చా.

కోటమ్మ. సరే, చూద్దాం లేవే, పొన్నీ!

పొన్నమ్మ. చూద్దామంటే కాదు; తొరగా ఏదో ఒకమాట తేల్చాలి. నువ్వూ, మా బాబాయీ కూడాబలుక్కుని, నోరుతెరిచి అడిగినందుకు, నామాట దక్కించాలి. పొద్దోయింది. మరి నే నెళ్లొస్తా.

[వెడుతుంది.

భూషయ్య. అంతకట్నం పోస్తామంటే, ఆ సంబంధం వొద్దంటా వేమే, కోటమ్మక్కా!

కోటమ్మ. కట్నమొస్తే చాలట్రా? మంచీ పెబ్బరా లేదూ?

భూషయ్య. వాళ్ళకేఁ? పొన్నమ్మ పెద్దల్లుడికి ఈమధ్య బాగా కలిసొచ్చిందటగా!

కోటమ్మ. ఆఁ! ఎంత కొత్తభాగ్యమొస్తేనేరా, అబ్బాయ్! ఆడిగుణం మంచిది కాదు. ఆడు బోగం కొంపలకి తిరుగుతూ, పెళ్లాన్ని కాపరానికి తీసికెళ్లకుండా, రెండు, మూడేళ్లు ఈ పొన్నిని నానాగడ్డీ తినిపించలేదట్రా? ఈ మాయదారి సమ్మందం మా కెక్కడ దాపరించిందని కనబడ్డాళ్లందరికీ చెప్పుకుని ఆవు రావురని ఇది ఏడ్చేదికాదూ? ఇవ్వాళగత్తే, నా అల్లుడు ఏడేలు కట్నమిస్తాడంటూ - మాలావు! - సమ్మందం తెచ్చింది!

భూషయ్య. కట్నం అక్కరలేదనుకుంటే, మాపిల్లని చేసుకో!

కోటమ్మ. నీకేం తక్కువరా? - కట్నమివ్వక పోవటానికి!

భూషమ్మ. ఇవ్వలేక కాదుగాని, యివ్వను.

కోటమ్మ. నీ కూతురికి నువ్వేమీ పెట్టుకోవట్రా? అయితే, అది ఉసూరుమన్దూ?

భూషయ్య. నా కూతురికి నే నేమైనా పెట్టుకుంటానో, లేదో అది నా యిష్టం. ఇంత కట్నం, అంత కట్న మని ముందుగానే బేరాలు మాత్రం నాకు గిట్టవ్. బేరాలకు ఇదేం బర్రెగొడ్డా! కట్నం పేరుపెట్టి నేనొక చిల్లిగవ్వైనా యివ్వడమనేది కల్ల!

కోటమ్మ. కట్నంలేందే నీపిల్ల మాకు దేనికి? ఆడికి పదేలు పోస్తా మంటూ ఎన్నో సమ్మందా లొస్తున్నాయి. నిచ్చేపంలాంటి బిడ్డ! నిలువెత్తు డబ్బోసినా, ఆడంతటి అల్లుడు నీకు దొరుకుతాడూ?

భూషయ్య [ఈఘట్టంలో ధుమధుమలాడుతూ లోపలికివచ్చిన అప్పయ్యతో]. అప్పయ్యబావా! నిలొవెత్తు డబ్బు పోసినా దొరకని కొడుకుతో లేనిపోని పేచీలెందుకు....

అప్పయ్య. వాడా నా కొడుకు! ఇక వాడెవడో, నె నెవడో!

కోటమ్మ. చాల్లే! ఏం మాటలు! ఎవరైనా యింటే నవ్విపోతారు!

భూషయ్య. ఎందుకే, అప్పయ్యబావా, అంత కెంపరు!

అప్పయ్య. ఈపూట వాడిగీత బాగుంది! లేకపోతే, రక్తం కళ్ల జూచేవాణ్ణికాదూ? కర్రె త్తేసరికి నలుగురూ పోగై పట్టుకున్నారు గాని...

భూషయ్య [నవ్వుతూ]. నలుగురూ పోగయ్యేవరకు ఆగినాడివి నువ్వేం రక్తం కళ్లజూస్తావ్, అప్పయ్యబావా!

కోటమ్మ. నీయెక సకాలకు యేళాపాళా లేదట్రా, బూసయ్యా!

అప్పయ్య. ఆ వెధవని ఈపూట పాతేసేవాణ్ణికాదూ! చెట్టుకాడ పదిమంది వుండబట్టిగాని....

భూషయ్య. చలపతి చెట్టుకాడ వున్నాడటే, అప్పయ్యబావా? నేను తిరిగొచ్చేదాకా మాయింట్లోనుంచి కదలొద్దని చెప్పొస్తే వాడికి కాలు నిలవలే దన్నమాట!

కోటమ్మ. ఆ దొకచోట కాలు నిలిచేగున్నైతే మా కిన్ని తిప్పలెందు కొస్తాయిలే!

భూషయ్య. మాట్లాడితే తిప్పలు తిప్పలంటావ్, ఇప్పుడు ఏమంత ప్రమాదం వచ్చిపడింది, కోటమ్మక్కా!

కోటమ్మ. చూస్తూనేవున్నావుగా! ఇదేమిట్రా? కొంపకి తిప్పలు కావూ?

అప్పయ్య. శిస్తుకైనా శికానా లేకపోబట్టేగా ఈ తక్కువధరల్లో సగం పంట అమ్ముకుంది! "జాగ్రత్తరా, అబ్బాయ్!" అని

మరీమరీ చెప్పి పంపిస్తే, అంతా జలగడుక్కొచ్చాడూ ? పైగా, వాళ్లు డబ్బివ్వలేదని అబద్ధాలా !

భూషయ్య. అబ్బే! లేదే, అప్పయ్యబావా! వాడు మొత్తమంతా ఖర్చుపెట్టలేదు. ఏదో కొంచెం ఖొర్రి పడింది. చేబదులు చేసి దాన్ని పూడుద్దామనే ఈపూట నాదగ్గిరికి పరిగెత్తుకొచ్చాడు. బుద్ధిమంతుడిలా నాదగ్గిరికి రాబట్టి సరిపోయిందిగాని, అదే ఏ షాహుకారు సుబ్బయ్యలాంటి వాడిదగ్గిరికో వెళ్లితే రూపాయి చేతిలోపెట్టి రెండు రూపాయలకి ప్రోనోటు రాయించుకునేవాడు కాదూ ?

కోటమ్మ. నే ననుకుంటూనేవున్నారా, బూసయ్యా! చిన్న సన్నాసి ఏ యాబయ్యో, వందో ఖర్చుపెట్టుకుంటాడేమో గాని, ఆడు పదేహొంద లేంచేస్తాడు ! ఆడేం తాగుతాడా ? తలపోసుకుంటాడా ?

అప్పయ్య [మొత్తం సొమ్ము గల్లంతుకాలేదని విన్నంతగానే, కోపం కొంత చల్లారిపోగా]. ఖొర్రి పెట్టుకొచ్చాడూ? ఏపాటి ?

భూషయ్య. ఆఁ! ఎంతో నా, అప్పయ్య బావా! సాదరుకింద వాడు వాడుకున్న ఖాపతు ఏవో చిల్లరమల్లర అప్పులుంటే, వాటిని ఆపడానికి వీల్లేక, ఒక రెండువందలు వాటికింద జమకట్టాడట. ఈమాట తెలిస్తే నువ్వెక్కడ కోప్పడతావోననే నీయెదటపడ్డానికి వాడు జంకేది.

అప్పయ్య. అలాగేఁ!

కోటమ్మ. ఏదో చిన్న సన్నాసి! ఆపాటి వాడు వాడుకున్నాడేమోలే!

అప్పయ్య. వాడా చిన్న సన్నాసి! ఈమధ్య సీటుగోటులు తెగబలిసి పోతే! ఇ స్త్రీమడతలు తప్ప పనికిరావడంలేదు. తలకి వాసన నూనెలు కావాల్సొచ్చాయి. వీడు ఉద్యోగాలు చేస్తున్నాడా? ఊళ్లేలుతున్నాడా? వీడికి చేతికొక గడియారం దేనికి? నాకు అరవై యేళ్లొస్తున్నాయ్! ఇంకా కళ్లజోడుతో పనిపడలేదు. నాకురాని చత్వారం వీడి కొచ్చిందా? వీడికి కళ్లజోడు దేనికి? షోకు బలిసి, ఎంత నాజూకు తేలాడని! ఎండ తగ్గితే వొళ్లు ఎక్కడ కందిపోతుందోనని పొలంవైపు తొంగైనా చూస్తేనా!

భూషయ్య. అదీ ఒక చిన్నతనమే! ఏమైనా నువ్వంటే వాడికి భయభక్తులేనే, అప్పయ్య బావా! లేకపోతే, ఈపూట ఇంత గజగజ లాడ్డం దేనికి?

అప్పయ్య. వాడి భయభక్తు లేవో కనబడుతూనే వున్నాయ్! నమ్మి గింజలు తోలించి పంపిస్తే...

భూషయ్య. వాడు చేసింది తప్పేననుకో. కాని నువ్వు కానకుండా ఏ రాత్రివేళో కళ్లాంలోనుంచి ఒక పదిబస్తా లెత్తించివేస్తే నువ్వేం చేసేవాడివి? అలాంటి పాడు పనిచెయ్యనందుకు సంతోషించక...

కోటమ్మ. బొర్రసుబ్బయ్యగారి రెండోవాడు మొన్న మాసూలులో అంత పనీ చేశాడు. పాలేరుని కట్టుకువి, బాబుకి తెలియకుండా పందుమొడ్లు కోమటి మల్లయ్యకి పోశాట్ట!

భూషయ్య. ఆఁ! నేను చెప్పవచ్చిందీ అదే, బావా! ఊళ్లో సన్నాసుల కంటె మన చలపతి చాలా మెరుగాదూ? అలాంటి సనుగు

పను లేమీ చెయ్యకుండా తానింత వాడుకున్నానని పబ్లికుగా చెబుతున్నాడు. వాడి ఖర్చులేవో అయిటంవారీగా నాకు చెప్పాడు. కాస్త దుబారా అయినా, అంత చెడ్డ ఖర్చు లేమీ కావు. సినిమాలు, కాఫీహోటళ్లు, సోడాలు, సిగరెట్లు - ఇలాంటివే!

అప్పయ్య. సర్లే! ఏం తగలబడ్డాడోగాని, ఆ మిగతా సొమ్మైనా భద్రంగా వుందా?

భూషయ్య. ఆఁ! కాస్త యించుమించుగా.

అప్పయ్య. మళ్లీ అదేమిటి?

భూషయ్య. ఏదో బస్తీ అనగానే తలలుమార్చేవాళ్లు వుంటారుగా! పేటలో ఆ పార్కుపక్కని—నీకు తెలుసుగా, పెద్దబజారుదగ్గిరి శివాలయం - దానియెదట - ఎవళ్ళోవచ్చి ఫెయిరీలాండ్స్ అనో, వాళ్ళ తలకాయ లాండ్స్ అనో ఏదో పెట్టారు. అందరూ విరగ బడుతుంటే, ఏమిటోనని మన చలపతికూడా ఒకపూట లోపలికి వెళ్లాడట. కళ్లు జిగేల్‌మంటూ ఎలక్ట్రిక్ దీపాలుపెట్టి డ్యాన్సు లని, వాళ్ళ పిండాకూడని ముందు నలుగుర్నీ లోపలికి రాబడ తారు. ఆ తర్వాత బ్రంతు లెయ్యడమని, బాణా లిసరడమని ఏవేవో ఆటల్లోకి దించి, డబ్బు గుంజుతారు. మనవాడు వాళ్ళ మాయలోపడి...

అప్పయ్య [కోపంగా]. ఊఁ! చప్పగా గొరిగించుకొచ్చాడా?

కోటమ్మ. అయ్యో కర్మ!

భూషయ్య. వరసగా నాలుగుసార్లు పందెం పోయేసరికి మరొక దైతే వేడెక్కి మొత్తానికి మొత్తాన్నే పోగొట్టు కొచ్చేవాడే!

మనవాడు బుద్ధిమంతుడు గనక, చప్పున గుక్క తిప్పుకున్నాడు. వాడు ఓడింది - అబ్బే! ఎంతోనా? - ఒక్క మూడొందలు!

అప్పయ్య. వొళ్లు తెగబలిసి జూదంకూడా మొదలెట్టాడన్నమాట! ఇక తాగుడొక్కటే తక్కువ! వీడు నాకడుపున చెడబుట్టాడు! ఈ నీతిమాలినవాణ్ణి ఇక నా గడప తొక్కనివ్వను - అదేమైనా గాని!

భూషయ్య. ఎందుకే, అప్పయ్య బావా, అంత కెంపరు! తెలిసో, తెలియకో వాడు కాస్త దారితప్పాడే అనుకో! పెద్దవాళ్ళం మనం వాణ్ణి మళ్ళీ సరైనదారికి తెచ్చుకోవాలేగాని, కరిస్తే చప్పగా చెడిపోడూ?

అప్పయ్య. వాడిక ఎలా తగలబడితే నాకేఁ?—నీతీ నిజాయితీ లేకపోయింతర్వాత!

భూషయ్య. అదుగో! అక్కడే నువ్వు పప్పులో కాలేస్తున్నావ్, అప్పయ్య బావా! తనుచేసింది తప్పేనని వాడు నొచ్చుకుంటున్నాడు. వాడొచ్చి కళ్లనీళ్ళ పర్యంతమైతేనే నేను పని కట్టుకొచ్చాగాని, లేకపోతే జమీందారొచ్చినా ఈవేళప్పుడు యింట్లోనుంచి కదిలేవాణ్ణా? నువ్వు తొందరపడొద్దు.

అప్పయ్య. తొందరలేదు, గిందరలేదు. ఈపూటతో వాడికీ, నాకూ సరి!

కోటమ్మ. అఁ! ఏం మాటలవి? ఆ డింకా చిన్నసన్నాసి! ఈ మండిన ఒంటిన పడి, ఈ మాయదారిరోడ్డు ఏర్పడి, ఈ ముద నష్టపు బస్సులొచ్చాక ఆడు కాస్త గాలిగా తిరుగుతున్నాడు గాని, అంతకిముందు ఆడు ఏపక్కని పడుండేవాడో, ఏం చేసేవాడో అసలు అజుండేదీ?

అప్పయ్య. ఈమాటలు నాదగ్గిరిక చెప్పకండి. ఆరు నూరైనా, నూరు ఆరైనా ఇక వాడిదారి వాడు చూచుకోవాల్సిందే!

కోటమ్మ [నెత్తి కొట్టుకుంటూ]. ఇంతకీ నాకొచ్చి పడ్డాయి ఈ తిప్పలు !

భూషయ్య. నువ్వూరుకోవమ్మా! బావ ఏదో కెంపరులో వుండి అలా అంటున్నాడుగాని, కొడుకు నింట్లోనించి వెళ్లగొట్టేస్తాడనే ! మొదటిసంబంధం కొడుకు లిద్దరితో పంచుకున్న పదెకరాల్నీ రాత్రింబగళ్ళూ దేవులాడి పాతికెకరాలు చేసింది ఈ కొడుకు మీద మమకారంతో కాదూ ?

కోటమ్మ. నువ్వేమైనా అనుకోగాని, బూసయ్యా! నువ్వేరా నిచ్చేపం లాంటి నాబిడ్డ కీ తిప్పలు తెచ్చిపెట్టావ్ !

భూషయ్య [నవ్వుతూ]. ఔను, కోటమ్మక్కా ! ఈ మండిన వంతెన వేయించి, ఈ మాయదారి రోడ్డు పోయించి, ఈ ముద నష్టపు బస్సులు రప్పించి ...

అప్పయ్య. నవ్వులాట కాదురా అబ్బాయ్ ! ఊరు నుద్ధరిస్తానని బయల్దేరి, నువ్వే ఈ పీడలన్నీ తెచ్చి మాతలకు చుట్టావ్ !

భూషయ్య. అయితే, అప్పయ్యబావా ! నిన్నపొద్దున నువ్వు తూర్పు చెరువుగట్టున ఏమిటీ చేయిస్తున్నావ్ ?

అప్పయ్య. ఆఁ! ఏం లేదు. చెరువు నీళ్ళన్నీ పసరెక్కి పోయాయని, తూము తెరిపించి, కాల్వలోనుంచి కొత్తనీళ్ళు..

భూషయ్య. ఆఁ ! నేను చేయించిందీ అంతే! పాత పసరనీళ్ళని కొట్టేసినా, కొత్తనీళ్ళేంట వొందురాదూ? అలాగని పసరునీళ్ళే

తాగుతామా ? కొత్త నీళ్ళొంట వచ్చేవొండు విరిగి, మంచి నీళ్ళు తేరుకోడానికి కొన్నిరోజులు పట్టదూ ?

కోటమ్మ. పసరు నీళ్లేమిటి? వొండు నీళ్లేమిటి? ఏమిట్రా నీమాటలు, బూసయ్యా !

భూషయ్య. నీ కెలాగే విడమర్చి చెప్పడం, కోటమ్మక్కా ? సర్లే, నువ్వే చెప్పు - లోకం ఆరోజుకారోజు తెలివి మీరిపోతున్నదా? లేదా ?

కోటమ్మ. ఆఁ! తెలివి మీరిపోకేఁ ? ఈ బస్సులు, ఈ చినిమాలు, ఈ కాపీవోటళ్ళు....

భూషయ్య. అబ్బే ! తెలివి మీరడమంటే ఇదేకాదు. రకరకాలుగా ప్రపంచం ముందుకు సాగిపోతూ వుంది. మనంకూడా దానితో పాటు నడవాలి. లేకపోతే, అది మనపైగా నడిచిపోతుంది. అందుకని బస్తీలతో మనకి సంబంధం తప్పదు.

కోటమ్మ. ఇదివర కల్లా గడవలేదేమిటి? - బస్తీలకి పోకపోతే !

భూషయ్య. ఇదివరకటి దారి వేరు ; ఇప్పటి దారివేరు. కాలానితో పాటు మనమూ పోవాలి ; దానికి ఎదురీద లేము. సరే, అప్పయ్య బావా ! నేను వెళ్ళొస్తాగాని, నువ్వు కాస్త శమాయించుకో ! లేకపోతే, వాడు మరీ తెగబడి చప్పగా చెడిపోతాడు.

అప్పయ్య. పోనీ, ఇక వాడు ఏ ఏట్లోకలిస్తే నాకేఁ ?

కోటమ్మ. చూశావట్రా, బూసయ్యా, ఆ మాటలు !

భూషయ్య. అదుగో ! ఆ పెంపరే వద్దంటున్నాను. తెగేవరకు లాగడం మంచిదికాదు. బ్రహ్మయ్య, బ్రహ్మయ్యకొడుకు——

వీధికెక్కడం చూస్తూనే వున్నాంగా! తలలు బద్దలు గొట్టుకుని ఛార్జీలదాకా వెళ్లారు. తండ్రీ కొడుకులకైనాసరే తగువులు పెంచి, కొంపలు తియ్యడానికి ఎంతమంది టౌట్లు మన ఊళ్లో తయారయ్యారో నీకు నేను చెప్పాలటే?

అప్పయ్య. సర్లే! ఆకాడికొస్తే ఎవరి పసెంత వుందో తెలుస్తుంది!

కోటమ్మ. అయ్యో కర్మ! ఆ దెవడవి ఆడిమీద నువ్వు పగ పట్టడానికి! పెద్దాళ్ళకి మనకే యింత మద్రతనముంటే, చిన్నాడు ఆడికి ...

పొన్నమ్మ [హుటాహుటిగా ప్రవేశిస్తూ]. పిన్నామా! కోటమ్మ పిన్నామా!

కోటమ్మ. ఏమిటే పొన్నీ? ఏమిటి?

పొన్నమ్మ. వాడు లేడటే, పిన్నామా! ఆ చీపురుకళ్ళ శేషయ్య - వాడు...... [అప్పయ్యను చూచి] మా బాబాయి ఇక్కడే వున్నాడూ! బాబాయ్! నువ్వు అబ్బాయిని పట్టుకు కొట్టావని చెప్పి, నీమీద ఆ చీపురుకళ్ళ శేషయ్య కేసు పెట్టించబోతున్నాడటే!

కోటమ్మ. అరి! అడి జిమ్మడ!

పొన్నమ్మ. దెబ్బలు తగిలినట్టు దొంగ సర్టిపికెట్టు పుట్టిస్తానని రెండొందలో, మూడొందలో అబ్బాయిదగ్గిరనుంచి అప్పుడే వాడు వొడుక్కున్నాడట.

కోటమ్మ. అరి! ఈడి పెళ్లాంతాడు పుటుక్కున తెగ! ఈడు మా కెక్కడ పోగయ్యాడే!

భూషయ్య. నా నోట్లోమాట నోట్లో వుండగానే నే నన్నంత పనీ జరిగింది. చూశావా, అప్పయ్య బావా!

అప్పయ్య. అబ్బే! వాణ్ణి నేను కొట్టిం దెక్కడ?

భూషయ్య. కొట్టాలటే కేసు బనాయింపుకు! దీన్తో సరేనా! చీపురుకళ్ళ శేషయ్య అంటే సామాన్యుడా! రేపు పార్టిషన్ దావాకూడా పడేయిస్తాడు!

అప్పయ్య. అరవై ఏళ్ళొచ్చినై. నే నెన్నడు సాక్ష్యానికైనా బో నెక్కలేదు. ఇవ్వాళ వీడు నన్ను కోర్టు కీడుస్తాడూ?

కోటమ్మ. అది తలకాడ దీపమెట్ట! ఆ డెంత చేయిస్తున్నాడు!

భూషయ్య. ఔను! వా డెంతైనా చేయిస్తాడు! తంపులు పెట్టందే, తగవులు పెంచందే వాడి పొయ్యిలో పిల్లి ఎలా లేస్తుంది? వాడి కదే బ్రతుకయ్యో! ఇంతకీ, అప్పయ్య బావా, మొదటే నువ్వు నామాట వింటే, పంట అమ్ముకున్న పదిహేనొందలలో పోయిందేదో పోగా, ఆ వెయ్యి రూపాయలైనా దక్కేవా? ఇప్పుడు మరొక రెండొందలో, మూడొందలో బొక్క! ఇంకా మనం ఆలస్యం చేస్తే....

పొన్నమ్మ. మన పక్కూరు డాక్టరుగారి దగ్గిరికి అబ్బాయివి తీసి కెళ్ళటానికని ఆ శేషిగాడు ఒంటెద్దుబండి కట్టిస్తున్నాడటే, బాబాయ్!

కోటమ్మ. ఆడికి బిడ్డలు లేరూ! ఆడింట్లో పీనిగెళ్ళ!

అప్పయ్య. ఇందాక కుర్రవాడు మీ యింటి కొచ్చినప్పుడు వాడి దగ్గరి డబ్బు తీసుకుని నువ్వెందుకు భద్రం చెయ్యలేదురా, భూషయ్యా ?

భూషయ్య. నిజమేనే, అప్పయ్య బావా ! ఆపని చేస్తే బాగానే వుండేది. కాని, నాకు తోచి చావలేదు.

కోటమ్మ. అయిందేదో అయింది; ఆణ్ణి ఎట్టాగైనా కొంపకి చేర్చురా, బూసయ్యా ! నీకు పున్నెం వుంటుంది.

భూషయ్య. మరి, మా అప్పయ్య బావ కాస్త తగ్గుతాడా, లేదా ? లేకపోతే, మధ్య నా మాట పోతుంది.

కోటమ్మ. ఆఁ ! తగ్గ కేం చేస్తా డేమిటి ?

పొన్నమ్మ. ఎవరో ఒకరు తగ్గా లిప్పుడు. లేకపోతే, కొంప గుణ్ణాన పడిపోదూ ?

భూషయ్య. కాని, మా అప్పయ్య బావ "ఊఁ!" అనందే! పట్నాలని చూచి బాగుపడేదిపోయి మన కుర్రకారు చెడిపోతున్నా రనే ఒక హిందీ స్కూలైనా పెట్టించి, కాస్త ప్రపంచ జ్ఞానం కలిగించాలని నే ననుకుంటే, ఊళ్ళో పెద్ద తలకాయలు నలుగురూ కలిసొస్తేనా! "తుద కబ్బెరా తురక బాస" అన్నట్టు ఇప్పుడు హిందీ స్కూలొక్కటే తక్కువై పోయిందని నవ్వి నామాట సాగనిచ్చారుకాదు. సర్లే! అప్పయ్య బావా! ఏమంటావే? ఏవో రెండు మంచి మాటలు చెప్పి, మన చలపతి మనస్సు తిప్పి, ఇంటికి రమ్మన్నా !

అప్పయ్య. ఆఁ ! తగలబడమను!

భూషయ్య. మరి నే వెళ్లొస్తానే, కోటమ్మక్కా!

కోటమ్మ. నువ్వేగా ఈ తిప్పలన్నీ తెచ్చింది. ఎలాగో నువ్వే మళ్లీ కొత్త చక్కదొయ్యి! ఊరెంట తిరిగి, చందాలోగుజేసి చట్ట బండలై, ఈ వుండిన ఒంతిన కట్టించి, ఈ మాయదారి రోడ్డు వోయించి, ఈ ముదన[illegible]లు తెప్పించి...

తెర ]

